శ్రీకృష్ణాయ పరబ్రహ్మణే నమః.

అఖిలకలికల్మషాపహంబగు

# శ్రీమద్భాగవతము

ఆంధ్రవచనము.

అయిదవ భాగము. (1361-1632)

---

బ్రహ్మశ్రీ, కేతవరపు - వేంకటశాస్త్రిగారిచేఁ

ప్రణీతము.

శ్రీ దేవరాజసుధీమణిపరిశోధితము.



ఆనంద ముద్రణాలయ ముద్రితము.

ఆర్. వేంకటేశ్వర్ అండ్ కంపెనివారిచేఁ

ప్రకటితము.

1928.



B

# విషయసూచిక.

# పటముల పట్టిక.

---







శ్రీ ర స్తు.

శ్రీ శారదాంబాయై నమః.

# శ్రీమదాంధ్ర భాగవతము

## అష్టమ స్కంధము.

అనిన విని నరేంద్రుఁడు శుకయోగిం గాంచి యిట్లనియె. "ఓ గురువర్యా! స్వాయంభువమనువువంశమును బూర్తిగా నీవలన వింటిని. వివిధములగు వర్ణధర్మములను, నాశ్రమధర్మములను దెలిసికొంటిని. మరీచ్యాదు లగు ప్రజాపతుల సంతతిని గూర్చి వినియుంటిని. ఇఁకఁ దక్కినమనువులను, వారి చరిత్రములను వివరించి చెప్పుము. ఇంతియకాక యేయే మన్వంతరమున మహామహుఁడయిన శ్రీహరి యేయే యవతారములను దాల్చెనో, యేమేమి యద్భుతకృత్యముల నొనరించెనో, వేనిని విద్వాంసులు గానము చేయుచున్నారో, యాచరిత్రములనుగూడ వినిపింపుమా? వానిని విన మాకెంతయో వేడుక కలదు. ఓ బ్రహ్మర్షీ! విశ్వపాలకుఁడయినపరమేశ్వరుఁడు గతించిన మన్వంతరములం దేమియొనర్చెనో, రాఁబోవుదానియం దేమియొనర్చునో, ప్రస్తుతమున నేమి యొనర్చుచున్నాఁడో, వానినిగూడ విశదముగాఁ దెలియఁ జేయు" మని యడిగెను. ఆపుడమితేనింగాంచి శుకుం డిట్లనియె. "జేంద్రా! ఈకల్పమున స్వాయంభు

వాదులగు నాలుగురు మనువులు గతించిరి. వారిలో మొదటి మనువగు స్వాయంభువమనువుగూర్చియు, నతని వంశజులను గూర్చియు వివరించితిని. స్వాయంభువమనువునకు, నాకూతియు దేవహూతియు ననుకుమారికలు గలరని చెప్పియుంటిని. పరమేశ్వరుఁడు వారిలో నాకూతికి యజ్ఞుఁడను పేరితోను, దేవహూతికి గపిలుఁడను పేరితోను బుత్త్రుడై జన్మించె. అందుఁ గపిలుని చరిత్రమును వర్ణించితిని. యజ్ఞాఖ్యుఁడయినభగవంతుఁడేమిచేసెనో వర్ణించెదను. పూర్వము స్వాయంభువమనువు శబ్దాదివిషయములను రోసి, రాజ్యమును విడిచి భార్యయగు శతరూపతోఁగూడఁ దపమొనర్ప వనంబున కరిగె. అనంతర మతఁడు సునందానదియందుఁ స్నానములాడి భూమి నేక పాదముతో స్పృశించుచు ఘోర మగుతపంబును జేయుచు నిట్లు జపించెను. "ప్రళయమున జీవలోకంబు ప్రవృత్తినుండి మరలియుండ సర్వజ్ఞుఁడయినపరమేశ్వరుఁడు సమస్తమును సాక్షాత్కరించుకొనఁగలఁడు. కావున నీశ్వరుఁడు జీవలోకమును బ్రవర్తింపఁజేయఁజాలును, కాని జీవలోక మతని నట్లు చేయలేదు. దానికిఁ గారణము పరమేశ్వరునకుఁబలె జీవలోకమునకు స్వాత్మపరమాత్మల యాథాత్మ్యము తెలియక పోవుటయె. మఱియుఁ బరమేశ్వరుఁడు జీవలోకము నెఱుంగును. కాని జీవలోక మీశ్వరు నెఱుఁగదు. ఈ ప్రపంచమునఁ గల చేతనాచేతనములందెల్లఁ బరమాత్మ యంతరాత్మరూపమునఁ బ్రవేశించి నియమించుచుండును. అతఁడట్లు ప్రవేశింపనివస్తువు లోకమున లేదు. ఈ చేతనాచేతనములన్నియు నతనిసొమ్ము; మఱి యితరులకుఁ జెల్లనేరవు. పరమేశ్వరునిజ్ఞానము [illegible] జ్ఞానమువలె సంకో

చయిత నొందదు. తాదృశజ్ఞానముచే నతఁడు సర్వమును సాక్షా త్కరించుకొనును. కాని జీవులు తమజ్ఞానము కర్మసంకుచిత మగుటచేఁ బరమేశ్వరుని సాక్షాత్కరించుకొనఁజాలరు. కావున నిష్టప్రాప్తిని ననిష్టపరిహారమును జేయువాఁడును, స్వయం ప్రకాశుఁడును, భూతములకాధారుఁడును నగు పరమేశ్వరునిఁ దప్పక భజియింపవలయు. ఎవఁ డాద్యంతము లేనివాఁడో, యెవఁ డీలోకము లోపటను వెలుపటను నిండియుండునో, యెవ నివలన విశ్వమునకు సృష్టిస్థితిలయములు సంభవించుచున్నవో, యెవఁడు స్వరూపముచేతను స్వభావముచేతను నిర్వికారుఁడో, విశ్వశరీరుఁ డయినయాపరమేశ్వరుఁడు దేవమనుష్యాది నామము లచే నాహూతుఁడయి, చేతనాచేతనములకు నియంతయై,విశ్వ మునకు రక్షకుఁడై, కర్మాయత్తమగుపుట్టుక లేనివాఁడై; జగం బునకుఁ గారణభూతుఁడై, తన కంశభూత యగుప్రకృతిచే జగం బునకు జన్మాదులను గూర్చువాఁడైనను నిత్యాసంకుచితజ్ఞాన ముచే నాప్రకృతిని దొలంగించుకొని నిరీహుఁడయి ప్రవర్తించు చున్నాఁడు. మొదట జీవులు కర్మసాధ్యము లగుసుఖములనిమి త్తము కర్మకలాపము నాచరించుచుండిరి. అయినప్పటికిని బురు షుఁడు క్రమక్రమముగాఁ గర్మసాధ్యము లగుఫలములందు నిర పేక్షుఁ డగు. దానికిఁగారణము తమ యొనర్చు కర్మములవలన సుఖమునకు బదులుగా దుఃఖములు సంప్రాప్త మగుచుండుట చేతనే, షాడ్గుణ్యపూర్ణుఁ డయినపరమేశ్వరుఁ డంతరాత్మయైజీవు లను గర్మానుగుణముగాఁ బ్రేరణ సేయుచున్నను, స్వాత్మానంద ముచే సమగ్రుఁ డగుటంజేసి జీవుల కర్మఫలములం దాసక్తుం డుకాఁడు. అట్లె య[illegible]శ్రయించిన జీవులుగూడఁ గర్మఫలా

సక్తులై శ్రమచెందరు. జీవుల నిట్లు కర్మానుగుణముగాఁ బ్రేరణ చేయువాఁడును, నహంకారరహితుఁడును, సర్వజ్ఞుఁడును, నిరీహుఁడును, బరిపూర్ణుఁడును, నితరులకు లోఁబడనివాఁడును, దన భక్తులను దనతో సములనుగాఁ జేయువాఁడును, స్వస్వభావమందే వెలయువాఁడును, సకలధర్మములను బాలించువాఁడును నగు నీశ్వరుని శరణువేఁడెద" నని యిట్లు స్వాయంభువమనువు మంత్రాత్మక యగు నుపనిషత్తును జపించుచు నిశ్చలచిత్తుఁడై యుండె. అంత నాఁకటిచే వివశులయిన రాక్షసులును, యాతుధానులును, నతనిఁగాంచి చంపి తినవలెనని సమీపించిరి. అట్లు క్రూరకర్మ నిశ్చితు లయినయారక్కసులను సర్వగతుఁ డయిన హరి చూచి, యజ్ఞుఁ డను పేరితో నవతరించి యాములనెడి దేవతాగణములచేఁ బరివృతుఁ డై యారక్కసులఁ జక్కడంచి స్వయముగా నింద్రుఁడై స్వర్గమును బరిపాలించె. ఓరాజా! ప్రతి మన్వంతరకాలమందును, మనువులు, మనుపుత్త్రులు, దేవతలు, దేవేంద్రుఁడు, ఋషులు, హరియనువారలు తప్పక యుండవలయును. మొదటి మనువుకాలమున, మనువు స్వాయంభువుండు; మనుపుత్త్రులు ప్రియవ్రతాదులు; మరీచిప్రముఖులు సప్తర్షులు; యజ్ఞపుత్త్రులగు యామాదులు దేవగణంబులు. హరి యజ్ఞరూపముఁదాల్చి యింద్రుఁడయ్యె. ఇఁక రెండవమన్వంతరమును జెప్పెద. రెండవ మను వగ్నికుమారుఁ డయినస్వారోచిషుఁడు, ద్యుమంతుఁడు, సుషేణుఁడు మొదలగువా రతని పుత్త్రులు. అప్పుడు రోచనుఁడనువాఁ డింద్రుఁడయ్యె. తుషితాదులు దేవతలయిరి. ఊర్జస్తంబుఁడు మొదలగువారు సప్తర్షులైరి. అక్కాలమున వేదశిరుఁ డనునొక బ[illegible]యుండె. అతనిభార్య

తుషిత. పరమేశ్వరుఁ డామెకుఁ గుమారుఁడై పుట్టి విభువను ఖ్యాతిని గాంచె. ఎనుఁబదియెనిమిదివేల ఋషులు బ్రహ్మచారి యైన విభుని యాచారము ననుసరించిరి. ప్రియవ్రతుని కుమారుఁడగు నుత్తముఁడు మూఁడవ మనువయ్యె. సవనుఁడు సృంజయుఁడు మొదలగువా రతని తనయులు. వసిష్ఠుని కుమారులైన ప్రమదాదులు సప్తర్షులయిరి. సత్యాజిత్తనువాఁ డింద్రుఁడయ్యె. సత్యులు, దేవశ్రుతులు, భద్రులు ననువారు దేవగణములైరి. ధర్ముఁ డనువానికి సూనృత యనుభార్యయందుఁ బురుషోత్తముఁడు సత్యసేనుఁ డనునామముతో నుదయించి యింద్రునకు సహాయుఁడై యక్షరాక్షసులను భూతద్రోహ మొనర్చు భూతగణములను సంహరించెను. ఉత్తముని తమ్ముఁ డగుతామసుఁడు నాలవమను వయ్యె. వృషుఁడు, ఖ్యాతియు, నరుఁడు, కేతువు మొదలగువారు మనుసుతులైరి. సత్యకులు, హరులు, వీరులు ననువారు దేవగణంబు లయిరి. త్రిశిఖుఁ డనువాఁ డింద్రుఁడయ్యె. జ్యోతిర్వ్యోముఁడు మొదలగువారు సప్తర్షులైరి. ఆ తామసమన్వంతరమందే వైధృతులనువారు దేవతలై కాలవశము వలన నాశనోన్ముఖము లయిన వేదములను నిలువఁబెట్టిరి. అప్పుడు హరిమేధునకు హరిణియందు భగవంతుం డుదయించి హరి యనునామమున నొప్పుచు మొసలికిఁ జిక్కిన గజరాజును విడిపించి రక్షించెను. నావుడుఁ బరీక్షిత్తదివిని శుకుంజూచి "ఓ బాదరాయణీ! హరి మొసలిని ఖండించి గజరాజు నెట్లుగాచెనో తెలియఁజెప్పుము. గజేంద్రమోక్షణరూప మగుకథ మిక్కిలి పవిత్రమైనది. సకలకథలలో నది మిక్కిలి పుణ్యదాయక మయినది. అది హరిసత్కథలతో నిండియున్న దగుటచే శుభావహ

మైనదని చెప్పవచ్చును. అట్టిదానిని మాకుఁ దప్పక వినిపింపుము." అని యిట్లు ప్రాయోపవిష్టుం డయినరాజు శుకు నడుగఁగా నమ్మహాయోగి మిక్కిలి సంతసించి బ్రాహ్మణులందఱును వినుచుండ నిట్లు చెప్పఁదొడంగె. ఇది ప్రథమాధ్యాయము.

---

### గజేంద్రమోక్షణము ; త్రికూటవర్ణనము.

ఓరాజా ! త్రికూట మనుపర్వతశ్రేష్ఠ మొకటిగలదు. అది క్షీరసాగరముచేఁ బరివృతమై, శోభావంతమై పదివేలయోజనములపొడువున నొప్పుచుండును. దానికి మూఁడుశృంగములు గలవు. అందొకటి వెండిది. రెండవది యినుపది. మూఁడవది పసిఁడిది. అది యాశృంగములకాంతులచే నాసముద్రునిని దిక్కులను బ్రకాశింపఁజేయుచుండు. దానికి గైరికాది ధాతువులతోఁ దులఁదూఁగు మఱికొన్ని శృంగములుగూడఁ గలవు. అవిగూడ దశదిశలు భాసిలఁజేయుచుండును. మఱియునది పలువిధములగు లతలచేతను, వృక్షములచేతను, బొదరిండ్లచేతను విరాజిలుచుండు. అందు సెలయేళ్లు నిరర్గళముగాఁ బాఱి దాని నలుకెలంకులను బ్రతిధ్వనింపఁజేయుచుండు. పయోనిధితరంగములుప్పొంగుచువచ్చి దాని పాదభూములఁ గడిగి నిర్మలములుగాఁ జేయుచుండు. అప్పర్వతరాజము మూలమున నున్నమరకతరత్నములు తమకాంతిసంతతులచే నాప్రాంతభూములను నల్లగాఁ జేయుచుండు. సిద్ధులు, చారణులు, గంధర్వులు, విద్యాధరులు, పన్నగులు, కిన్నరులు, నచ్చరలు, మొదలగుదేవతలందఱా కొండచఱియలం దాడుకొనుచుందురు. ఆ [illegible]రాదులు గానములు

చేయ నాచప్పుళ్లకా కొండగుహలు ప్రతిధ్వనులిచ్చుచుండె: ఆ
ప్రతిధ్వను లచ్చటిసింహములు విని ప్రతిగర్జన చేయుచుండు. ఆగిరి
రాజము పలువిధము లగునడవిజంతువులకు నిలయము లయిన
లోయలచేఁ దనరారుచుండు. అందుఁ జిత్రము లగుతరువులకుఁ
దావులయిన దేవోద్యానములు గలవు. మధురముగా ధ్వని
చేయు పక్షులు పెక్కు లందు విహరించుచుండు. నిర్మలములగు
జలములు గల సరస్సులును నదులును రత్నము లనెడి యిసుక
గల తీరములచేతను, దేవస్త్రీలు జలకమాడుటవలనఁ గలిగిన
పరిమళముచేతను, వెలయుచుండు. పరిమళములను జలాణువు
లను వహించి మలయమారుత మచ్చటఁ బ్రసరించుచుండు.
ఆపర్వతపులోయలో ఋతుమంత మనెడివరుణుని యుద్యాన
వనము గలదు. అది సురస్త్రీలకుఁ గ్రీడాస్థానము. అందు పారి
జాతములును, బాటలములును, నశోకములును, సంపెంగలు,
మామిళ్లును, దియ్యమామిళ్లును, ద్రాక్షలును, బనసలును,
బోఁకలును, నారికేళములును, ఖర్జూరములును, జామచెట్లును,
నిప్పమ్రాఁకులును. దాళ్లును, మద్దిచెట్లును, జీకటిమ్రాఁకులును,
వేఁగిసలును, దెల్లమద్దులును, నుదుంబరములును, వటవృక్షము
లును, మోదుగులును, జందనములును, వేఁపచెట్లును, గాంచన
ములును, సరళములు, దేవదారులును, ననఁటులును, నేరేళ్లును,
రేఁగులును, నుసిరికలును, మారేళ్లును, వెలఁగలును, నిమ్మలును,
జీడిచెట్లును, సంతతమును పుష్పఫలసంతతులతో నలరుచుఁ జూచు
వారి మనంబుల రంజిల్లఁ జేయుచుండును. అందలి తటాకము
లందు బంగారుకమలములును, దెల్లనివియు, నల్లనివియు, నెఱ్ఱ
నివియు నగుకలువలును, దమశోభలచేఁ గనులపండువులొనర్చు



చుండును. అందు మదించినతుమ్మెదలును, మధురస్వరములు గల పక్షులును విహరించుచుండు. ఇంతియకాక యాసరస్సులందు హంసలును, గారండవములును, చక్రవాకములును, బెగ్గురు పక్షులును, నీటికోళ్లును, నందముగాఁగూయుచుఁ జెవులపండువు లొనరించు. మత్స్యములయుఁ దాఁబేళ్లయు సంచారములవలనఁ గదలిన పద్మముల పరాగము రాలి యా సరోజలమును గప్పి యుండు. మఱియు నా యుద్యానము కడిమిచెట్లకును, బొగడ చెట్లకును, మల్లెతీవియలకును, గోరంటలకును, నశోకములకును, దిరిసెనలకును, గిరిమల్లికలకును, మెట్టతామరలకును, నాగకేసర ములకును, సురపొన్నలకును, బెక్కేల? నానావిధవృక్షముల కును నిలయమై విరాజిలుచుండు. ఆ త్రికూటమునకు సమీప ముననుండు కాననమున నాఁడేనుఁగుమొత్తములతోఁ గూడి యొక కరిరాజు నివసించుచుండె అతఁ డొకప్పుడు తన పరివార ముతో విహారార్థము వెలువడి ముండ్లపొదలను, వెదురుఁబొద లను, లతాగుల్మాదులను, వృక్షములను దొండముతో భంజించు చుండె. అతని యుద్ధతినిజూచి సింహములును, గజములును, బులులును, వెఱ్ఱియేనుఁగులును, లేళ్లును, ఖడ్గమృగములును, మహాసర్పములును, గవయములును, నల్లచాఱలు గలదుప్పు లును, శరభములును, జమరులును, దోఁడేళ్లును, వరాహము లును, గాఱుదున్నలును, నేఁదుఁబందులును, గోపుచ్ఛములును, నక్కలును, మర్కటములును, మొదలగు మృగములు మిక్కిలి భయము చెంది నానాముఖములఁ బర్విడఁజొచ్చెను. కానికుందేళ్లు మొదలగుక్షుద్రజంతువులా కరిరాజు ననుగ్రహమువడసి భీతి వదలి చరింపకపోలేదు.ఆగజేంద్రుఁ డాఁడేనుఁగులతోడను, బాల



గజములతోడను గూడికొనియిట్లు విచ్చలవిడి సంచరించుచుఁదన గండములందలి మదధారలచేఁ దుమ్మెదల కోదములఁ దృప్తి నొందించుచు నా పర్వతమును దన యతిశయముచేఁ గంపింపఁ జేయుచునుండి బెట్టిదపుటెండచే సంతప్తుఁడై మిక్కిలి బడలి దప్పికొని జలమునిమిత్త మరయుచుండె. ఆసమయమునఁ బద్మ పరాగమును జలకణములను వహించిన మలయమారుతము వీతెంచెను. ఆ కరిరాజు దాని ననుభవించి యీ సమీపమందే జలాశయముండునని నిశ్చయించి మదవివశము లయిన నేత్రములు గలవాఁడయి, తన యూథము కొలిచి వచ్చుచుండ వేగముగా నాసరోవరమును డాసెను. ఇట్లు డాసి యతఁ డా జలాశయముం జొచ్చి బంగారుపద్మములపుప్పొడిచే గమగమవాసించునదై య మృతతుల్యమై యున్ననిర్మలోదకములో మునిఁగి తనతుండాగ్ర ముచే సరోజలమునుగొని తనపైఁ జల్లుకొనుచుఁ దృప్తితీఱ జల పానముఁ జేసెను. గృహస్థుఁడు సమస్తవస్తువులను సంపాదించి తెచ్చి దారసుతాదులను దనిపినట్లు గజరాజు తనతుండాగ్ర ముచే గ్రహింపఁబడిన జలబిందువులవలనఁ గరిపోతములను గరి ణులను దానమాడించుచుఁ, ద్రావించుచు, బృంహితమును జేయుచు, సంతుష్టచిత్తుఁడై విహరింపఁ దొడఁగెను. కాని భగవ న్మాయచే ముందువచ్చుచున్నయాపద నెఱుంగకపోయెను. అతఁ డిట్లు జలక్రీడ సలుపుచుండఁగా దైవచోదితమైన యొక పెద్ద మొసలి కడువడిఁ జనుదెంచి కోపముతో గజేంద్రునిపాదముల నొడిసిపట్టెను. ఆ కరిరా జాకస్మికముగా సంభవించిన యీ యాపదకుఁ బాలై తనపరాక్రమముచే నా మొసలినుండి విడి పించుకొనవలెనని యత్నించెను; కాని లాభము లేకపోయె.

ఆ కరివరము, తనకంటె నధికబలము గలయా మొసలి నిజబలను నంతయుఁ జూపుచుండఁ దానెట్లు విడిపించుకొనఁ గలుగును? అందువలన దుఃఖమునంది యున్నతమపతిని గాంచి మిక్కిలి విచారించి కరేణువులును దక్కినగజములును సాయపడి యతనిఁ దీరమును జేర్ప యత్నించెను; కాని సమర్థములు కాకపోయెను. ఆ గజయూథము చేయునదిలేక తీగమందుండి విచారము నొందుచుండెను. ఆ తటాకములో బలవంతము లగు నా కరిమకరములు హాహాకారిని బోరాటము సల్పుచుండెను. గజేంద్రుఁడు వెలుపటికి లాగుచుండెను. మకరి లోపటికి లాగుచుండెను. ఆ రెండు నిట్లు పరస్పరమును బోరుసలుపుచుండ వేయి వత్సరములు గతించె. సమానబలము గలయా కరిమకరముల పరస్పరాకర్షణములఁ గాంచి దేవత లమితాశ్చర్యము నొంద సాగిరి. వేయివత్సరంబులు గడచుచు నప్పటికిఁ గాలముచేతను మొసలిచేతను నాకర్షింపఁబడిన గజరాజు నుత్సాహశక్తియు, దేహబలంబును, నింద్రియబలంబును గ్రమముగాఁ దఱుఁగఁ జొచ్చెను. ఆ మకరి జలజంతు వగుటచేతను, జలము తనకు బలకరమగుటచేతను, నది మిక్కిలి యుత్సాహముగల్గి, శరీర బలముచేతను, నింద్రియబలముచేతను నున్నతి చెందుచుండె. అంత గజేంద్రునకుఁ బ్రాణముమీఁది యాశపోయె. కావుననే యతఁడు మిక్కిలి వివశుఁడై తన్ను విడిపించుకొన నసమర్థుఁడై చిరకాలము విచారించి మనంబున నిట్లు తలంచెను. "అకటా! నాకు బంధువులగుగజము లార్తుఁ డయిననన్ను విడిపింపలేక పోయెను. నేను నందులకు సమర్థుఁడనుగాను. ఇట్లుండ నాఁడేనుఁగు లెట్లు విడిపింపఁగలవు. దైవము ప్రతికూలమై యీ

మొసలి యనుపాశముచే బంధించుచుండ నది యెట్టివారికైనను విప్పఁ దరముకానిదే. కావున నేనింక నితరచింతవిడిచి యాదైవమునే శరణుఁజొచ్చెదను. మృత్యు వనుమహాసర్పమునకుఁ జిక్కి భయపడుచున్నవాని నెవఁడు రక్షింప సమర్థుఁడో, యెవ్వనికా మృత్యువు సైతము భయపడి పర్వెడునో యా పరమేశ్వరుని శరణుఁ బొందెదను: అతనినే ధ్యానించెదను' అనెను. ఇది రెండవయధ్యాయము.

---

## గజేంద్రుఁడు పరమేశ్వరుని ధ్యానించుట.

ఇట్లు గజరాజు నిశ్చయించుకొని మనస్సును నిశ్చలముగా హృదయమున నిల్పి పూర్వజన్మమున నేర్చుకొన్న యీశ్వర స్తోత్రము నిట్లు జపింప నారంభించెను. ఎవఁడు బ్రహ్మస్వరూపుఁడై చిదచిదాత్మక మగు లోకమునకు మొదటికారణమై బ్రహ్మాదులకుఁగూడ నధిపతి యై యొప్పునో యా పరమపురుషుని ధ్యానించెదను. ప్రళయమందుఁ జరాచర మగు ప్రపంచ మెవనియందు లీనమైయుండునో, సూక్ష్మములగు చిదచిత్తులతోఁ గూడిన యెవనివలన స్థూలరూప మగువిశ్వ మెుద యించెనో, యెవనిచే లోకము సృజింపఁబడి పాలిత మగుచున్నదో, యెవఁడు జీవునికంటెను బ్రకృతికంటెను బరుఁడో, యెవఁడు తనకధీన మగుసత్త్వాదులు గలవాఁడో, యా పరమేశ్వరుని శరణుసొచ్చెదను. ఎవఁ డెప్పుడును సంకోచము నొందని జ్ఞానముగలవాఁడై తనసంకల్పవశమునఁ దనయందే యొకప్పుడు ప్రకాశించి మఱియొకతఱిఁ దిరోహితమైయుండుటచేఁ గారణావస్థల రెండింటినిఁబొందు ప్రపంచమును జూచుచున్నాఁడో,

యెవఁడు సర్వమును దెలిసినవాఁడో, యెవఁడు ప్రకృతిపురుషుల కంటెఁ బరుఁడో, యా పరదేవత నన్నురక్షించుఁగాక. కాలవశమున సకలమునకు హేతువు లగుపృథివ్యాదితత్త్వములును వానివలనఁ గల్గిన లోకములును, వానిని బాలించెడి బ్రహ్మాదులును, నశింపఁగా, నిరతిశయసూక్ష్మదశను బొందిన తమస్సును నియమించి యెవఁడు ప్రకాశించునో యాభగవంతుఁడు నన్నుఁ బ్రోచుఁగాక. కంటికిఁ గానరాని వస్తువులనుగూడఁ జూడఁ జాలిన దేవతలును, యోగులును, దేనిని దెలిసికొనలేరో, పలు వేషములను బలునామములను దాల్చి వర్తించువర్తకుని స్వరూపమువలెఁ బెక్కులవతారములను బెక్కునామములను ధరించి వర్తించుటచే నేది దురవగాహమైయుండునో, యా పరమేశ్వరుని స్వరూపమును మావంటి స్వల్పజంతువు లెట్లు తెలిసికోఁ గలవు? నిత్య సుఖస్వరూపమగు నెవని స్వరూపమును బ్రత్యక్షము చేసికొనుటకు సకలసంగములను వదలి సాధువులు సకలభూతములకు హితులై యడవులకేఁగి దుష్కర మగుతపమును జేయుచున్నారో యాయీశ్వరుఁడు నాకు దిక్కగుఁగాక. ఎవఁడు తనకుఁ గర్మాధీనము లగుజన్మములుగాని, కర్మములుగాని, నామరూపములుగాని, ప్రాకృతగుణములుగాని వికారములుగాని లేకపోయినను లోకమున ధర్మము స్థాపించుటకును, సాధువుల రక్షించుటకును, దుష్టుల శిక్షించుటకు నప్పుడప్పుడు నిజసంకల్పముచేతనే వాని నవలంబించునో, యాపరమేశ్వరుఁడు నాకుదిక్కగుఁగాక. బ్రహ్మాదులకు సైత మీశ్వరుఁడును, లెక్కలేని శక్తులుగలవాఁడును, గర్మాయత్త మగుశరీరాదులు లేనివాఁడును, నాశ్చర్యమును గొలుపు జగద్వ్యాపారాదులుగలవాఁడును, లీలకై

పెక్కురూపములఁ దాల్చువాఁడు నగు పరబ్రహ్మమునకు నమస్కారములు. తనంతఁ దానే ప్రకాశించుచు,సర్వమునకు సాక్షియై ముల్లోకములందును నంతరాత్మరూపమునఁ బ్రవేశించి నియమించుచు, మఱి వాక్కుల కందక వర్తించు నీశ్వరునకు వందనము లాచరించెదను. వేఱు ప్రయోజనములేని నివృత్తిధర్మమును జేకొనుపండితులకుమాత్రమే పొందఁ దగినవాఁడై, మోక్షమున కధిపతియై, జ్ఞానానందములే స్వరూపముగాఁ గల భగవంతునకు నమస్కారములు. సాధుజనులకుఁ బ్రసన్నుఁడును, పాపులకు భయంకరుఁడును సంసారులకుఁ గానరానివాఁడును, సత్త్వాదిగుణముల కాధారుఁడును, నీచగుణములు లేనివాఁడును, వైషమ్యములేక జ్ఞానస్వరూపుఁ డై పరఁగువాఁడు నగుమహాత్మునకు నమస్కరించెదను. జీవుఁడే శరీరముగాఁ గలవాఁడై సర్వభూతముల కధిపతియై సర్వమును జూచుచు, నంతరాత్మరూపమున సమస్తమును నియమించుచుఁ గారణాంతరము లేనివాఁడై సకలమునకుఁ దానే కారణభూతుఁడై యొప్పు పరమపురుషునకు నతు లొనర్చెద. ఎవఁ డింద్రియములను, శబ్దాదివిషయములను, నేకకాలమునఁ జూచువాఁడో,యెవఁడు ధర్మముల నిలుకడకు హేతువై నీడవలె నొకమాఱయిన నెడఁబాసియుండని మాయచే సూచింపఁబడునో, యెవఁడు స్వయంప్రకాశుఁడో,సకలకారకములచే సాధ్యములగు పదార్థములే శరీరముగాఁ గల్గి యెవఁడు కారకాంతరముచే సాధ్యుఁడుకాఁడో, యెవఁడు మన్ను మొదలగు పదార్థములవలె స్వరూపముచే మార్పుచెందఁడో, పాంచరాత్రాదులగు నాగమములకును వేదములకు నెవఁడు నదులకు సముద్రమువలె గమ్య

స్థానమో, యెవఁడెల్లరకును ముఖ్యముగాఁ బొందదగినవాఁడో యెవ్వఁడు మోక్షమునకు హేతువో, యా పరంధామునకు నమస్కరించెదను. ఎవఁడు ప్రకృతి యనునరణియందు గుప్తముగానున్న జీవుఁ డనెడియగ్నిని ప్రళయకాలమునఁ దనయందు లయము గావించుకొనునో, జీవప్రకృతులును క్షోభఁజెందిన కాలమున నెవని సంకల్పము సృష్టి కభిముఖమై యుండునో, మోక్షము సిద్ధించినపిమ్మట శాస్త్రత్యాగము చేయువారి కెవఁడు స్వయముగాఁ బ్రకాశించునో, వానికి నమస్కరించెద. భక్తి గల నావంటి పశువుల కర్మబంధముల ఛేదించువాఁ డెవఁడో, ప్రకృతి కధీనుఁడు కాక దయాసముద్రుఁడై శబ్దాదివిషయములకు విముఖుఁడై యుండువాఁ డెవఁడో, తనకంశభూతుఁడై సకల యోగుల మనస్సునందును బ్రతీతుఁ డయినజీవున కంతరాత్మ రూపమున గోచరుఁ డగువాఁడెవఁడో, యా పరమాత్మకు వందనములు. దేహమందును, గొడుకులందును, మిత్రులందును, గృహమందును, బంధువులందును నాసక్తులయినవారికి దుష్ప్రాపుఁడును, శబ్దాదివిషయసంగములను విడిచినవాఁడును, ముక్తులగువారి మనస్సులందు వర్తించువాఁడును జ్ఞానస్వరూపుఁడును, సకలమును నియమించువాఁడును నగు నీశ్వరునకు నమస్కారములు. ధర్మము. అర్థము, కామము, మోక్షము నాఁబడు నాల్గు విధము లగుపురుషార్థముల గోరువారు నెవని భజించి యిష్టార్థములను బడయుచున్నారో, యెవఁడు కోరినకోర్కుల కంటె నధికముగా నిచ్చుచుఁ దుదకు ముక్తిగూడ నొసంగునో దయానిధి యగు నా పరమేశ్వరుఁడు నాకు ముక్తినొసంగుఁగాక. ప్రయోజనాపేక్ష లేని భక్తులు నిరతిశయ మగుముక్తిని సైత

ము గోరక యెవని మంగళచరిత్రములను బాడుచు, దానివలన జనితమగు నానందసముద్రమున మునుకలిడి సుఖించుచున్నారో యాభగవంతుఁడు నన్ను రక్షించుఁగాక. ఎవఁడు నియతుఁడై బ్రహ్మాదులకుఁగూడఁ బరుఁడై ప్రాకృతము లయిననేత్రములకుఁ గానరాక, కేవలము భక్తియోగముచేతనే పొందఁదగినవాఁడై యింద్రియముల కతీతుఁడై మిక్కిలి సూక్ష్మరూపుఁడై యుపాయాంతరములచే సాధ్యుఁడుగాక వేల్పులకెల్ల మొదటివాఁడై లోకములందంతటను బూర్ణుఁడై యుండునో యా పరమేశ్వరుని నుతించెదను. ఏ మహాత్ముని కలలును, నంశములును, నంశాంశములును, నామభేదమును, రూపభేదమును బొంది బ్రహ్మాదిదేవతలును, జరాచరాత్మకము లగులోకములును, వేదములును నగుచున్నవియో యా పరబ్రహ్మము నాకు గతియగుఁగాక. అగ్నిహోత్రము మంటలును, సూర్యుని కిరణములును, మాటిమాటికి నిర్గమించి మగుడ నచ్చటనే లీనములగుచున్నట్లు, బుద్ధియు, మనస్సును, నింద్రియములును, దేవాది శరీరసంఘములును, గుణపరిణామరూప మగు ప్రపంచము నెవనియం దుద్భవించి లీనములగుచున్నవియో యాభగవంతుఁడు దేవతలలో నొకండును గాఁడు, అసురుఁడును గాఁడు; మనుష్యుఁడును గాఁడు; పశుపక్ష్యాదులలో నేదియును గాఁడు; స్త్రీయును గాఁడు; పురుషుఁడును గాఁడు; నపుంసకుఁడును గాఁడు; ప్రాణియును గాఁడు. అతఁడు గుణరహితుఁడు, కర్మరహితుఁడు. అతఁడు జీవవర్గములలో నంతర్యామి తుఁడు కాఁడు. అతఁడు కేవలమును సద్గుణముల కాశ్రయుఁడై యున్నవాఁడు. అతఁడు సమస్తమున కాధారుఁడు. అట్టిభగవంతుఁడు ముక్తికిఁ బ్రతికూలము లయిన నాకర్మజాలమును నిరసించుఁ

గాక. ఇఁక నేనెంతమాత్రమును జీవింపను. అహంకార మమకారములతోఁగూడిన యీ గజ జన్మమెట్టి పురుషార్థమును సంపాదింపలేదు. కావున నీ జన్మమును విడిచి మరలఁ బుట్టుకకు రానీని మోక్షముఁ గోరుచున్నాను. ఆత్మలోకము నావరించు కర్మమునకు మోక్షమును గోరుచున్న నేను, విశ్వమును సృజించినవాఁడును, విశ్వ శరీరకుఁడును, విశ్వమునకు వేఱయినవాఁడును, సకలము నెఱింగినవాఁడును, విశ్వమున కంతరాత్మయై నియమించువాఁడును, గర్భాధీన మగుజన్మాదులు లేనివాఁడును, జ్ఞానాదిగుణముల కాలయమును, భక్తులకుఁ బొందఁదగినవాఁడు నగుపరమాత్మకు నతు లొనర్చెద. ఉపాసనాత్మక మగుజ్ఞానముచే భగవద్దర్శనమునకు విరోధియగుకర్మజాలమును దహించిన యోగులు నిర్మలమనస్సునం దెవనిఁ జూచుచున్నారో నే నాపరమేశ్వరునిఁ జూడ శక్తిగలవాఁడను గానందున నతనికి శక్తికొలఁది నమస్కరించెదను. నిరంకుశ మగు వ్యాపారము గలవాఁడై సృష్టిస్థితిలయము లనెడిశక్తిత్రయముతోఁగూడి భక్తులఁ బాలించుచు నపారమగుశక్తిగలవాఁడై యింద్రియముల జయింపనివారిచేఁ దెలియబడని మార్గము గలపరమాత్మకు వందనములు. ఎవనిమాయవలన సంచరించుచున్న దేహాత్మాభిమానముచే నేనాత్మస్వరూపమును దెలిసికోలేకున్నానో యూహింపఁ దరముకాని మహిమ గలయా భగవంతుని శరణుఁ జొచ్చెదను" అని యిట్లు గజేంద్రుఁడు భక్తియుతుఁడై హేయగుణరహితమగు భగవత్స్వరూపమును నుతింప నా నుతియందుఁ దమచిహ్నములుగాని తమ నామములుగాని లేనందున బ్రహ్మ శంకరుఁడు మొదలగువారతని రక్షింపరారైరి. గజరాజు వర్ణించిన యసాధారణగుణములు



1377. గజేంద్రునకు శ్రీమన్నారాయణుడు ప్రత్యక్షమై
మకరి శిరమును ఖండించుట.

కనయందుండుటచేత నిఖిలస్వరూపుఁ డయినహరి వచ్చి ప్రత్యక్షమయ్యె. ఓరాజా! ఆశ్రీహరి కరిరాజు మకరిచేఁ బీడితుఁ డగుచున్నట్టు తెలిసికొని యతఁ డొనర్చిన స్తవమును వీనులవిందుగా విని ఛందోమయుఁ డయినగరుత్మంతు నెక్కి చక్రమును దాల్చి దేవతలు పరివేష్టించి నుతించుచుండ గజేంద్రుఁ డున్న మడువును సమీపించెను. ఇట్లు సమీపింప మహాసత్త్వము గలమకరిచేఁ బీడితుఁ డయినగజరాజు గరుడు నధిరోహించి చక్రముదాల్చి యున్నహరి నాకసముపైఁ జూచి పద్మముతోఁ గూడిన తన తుండము నెత్తి 'ఓనారాయణా! ఓలోకగురూ! ఓభగవంతా!' యని యతి కష్టముతోఁ గేకలిడెను. అంత హరి యార్తుఁడైన కరిరాజును వీక్షించి దయాళుఁడై గరుత్మంతునుండి దిగి త్వరతో నతని చెంతకుఁ బోయి దేవతలు చూచుచుండఁ జక్రముచే మకరిశిరమును ఖండించి మడువునుండి యుద్ధరించి రక్షించెను. ఇది మూఁడవ యధ్యాయము.

---

## క్షీరసాగరమథనము; గజేంద్రుని పూర్వవృత్తాంతము.

ఆ సమయమున దేవతలును, ఋషులును, గంధర్వులును, బ్రహ్మయు,శంకరుఁడు మొదలగువారు శ్రీహరియొనర్చిన యద్భుత కర్మమును నుతించుచుఁ బుష్పవర్షమును గురియించిరి. దేవతలు దేవదుందుభుల మ్రోయించిరి. గంధర్వులు నాట్యమునల్పుచుఁ బాడిరి. ఋషులును జారణులును సిద్ధులును బురుషోత్తముని స్తుతించిరి. ఓ రాజా! ఆ మకరి హూహూనామకుఁ డగుగంధర్వుఁడు సుమా! అతఁడు దేవలముని శాపమువలన నీ మకరి రూపుఁ దాల్చెను; ప్రస్తుతమున శాపవిముక్తుఁడై యొప్పెఁ

రూపమును బొంది పవిత్రకీర్తియు, నాశంసహితుఁడు నగుహరికి నమస్కరించి కొనియాడఁదగిన భగవంతుని యశస్సును, గుణములను గానముచేసెను. ఆ గానమునకు సంతసించి హరి యతని ననుగ్రహింప నా గంధర్వుఁడు మరల నతనికిఁ బ్రదక్షిణనమస్కారములు గావించి బ్రహ్మాదులు చూచుచుండఁగనే శాపవిముక్తుఁడై తనలోకమున కేఁగెను. ఆగజేంద్రుఁడు శ్రీహరికరస్పర్శమువలన నజ్ఞానబంధనమునుండి విముక్తుఁడై పచ్చనివస్త్రమును నాల్గుభుజములును గలభగవంతునితో సమ మగురూపమును బొందెను. ఓమహీశా! ఆకరిరాజు పూర్వజన్మమునఁ బాండ్యదేశాధిపతి; ద్రవిడరాజులలో సత్తముఁడు శ్రేష్ఠుఁడు; ఇంద్రద్యుమ్నుఁ డనునామముగలవాఁడు అతఁడు విష్ణుభక్తిగలవాఁడై సంతతము హరిభజనము సల్పుచుండెఁ. అతఁడొకప్పుడు మౌనియై చిత్తము నిశ్చలముగాఁ జేసికొని హరి నారాధించుచుండెను. ఆ సమయమున విపులకీర్తి యగునగస్త్యుఁడు శిష్యగణములు గొల్చుచుండ నింద్రద్యుమ్నుని యాశ్రమమున కరుదెంచెను. అపుడు సమాధినిష్ఠుఁడై యుండుటచే నారాజేమియు మాటాడలేదు; పూజింపను లేదు; కూర్చుండుమనను లేదు. అందుల కమ్ముని కోపించి, "అయ్యారె! ఈయింద్రద్యుమ్నుఁడు దురాత్ముఁడు, బుద్ధిహీనుఁడు; ప్రస్తుతమున బ్రాహ్మణుల నవమానించిన పాపాత్ముఁడు; ఏనుఁగువలె మత్తుఁడై తన్ను నోరులను నెఱుంగనివాఁడు. కావున నికమీఁద వీఁడు గజమై వర్తించుఁగాక" యని శపించెను. ఇట్లు శపించి యగస్త్యుఁడు శిష్యులతోఁగూడ గదలిపోయెను. అనంతర మింద్రద్యుమ్నుఁ డా శాపమును బ్రారబ్ధకర్మమునుగా నిశ్చయించి దాని ననుభవించియె నశింపఁజేయవలెనని భావించి

పరమాత్మ స్మరణమును నశింపఁజేయు గజజన్మము నొందెను. అతఁడు గజరూపమున నున్నను బూర్వము విశేషముగా హరిని భజించియుండుటవలనఁ దత్ప్రభావముచేఁ దుదకుఁ బరమాత్మ స్మృతి సంభవించినది. ఓరాజా! నారాయణుఁడిట్లు గజరాజును విడిపించి యతఁడును బార్షదజనమును సేవించుచుండ గంధర్వులును, సిద్ధులును,సురలును, తా నొనర్చిన యద్భుతకార్యముల నుతించుచుండ గరుడునిపైఁ గూర్చుండి శ్రీలోకమున కేఁగెను. ఓ మహీపాలా! హరి ప్రభావమును దెలియఁజేయు గజేంద్ర మోక్షణకథను నీకోర్కెచొప్పున వివరించితిని.దీనిని విన్న జనులకు స్వర్గము గలుగును; యశస్సు లభించును; కలికల్మషము తొలఁగును; దుస్స్వప్నములు రావు. ఈ గజేంద్రమోక్షణకథ యిట్టిది; కనుక నే ప్రాతఃకాలమున లేచి పరిశుద్ధులై దుస్స్వప్న నాశనమునిమిత్తము దీనినిఁ బఠించుచుందురు. ఈ చరిత్రమం దిట్టిమహిమ మున్నదని భగవంతుఁడే సంతుష్టచిత్తముతో సర్వభూతములును వినుచుండ గజేంద్రునితో నిట్లనియె."ఓకరి రాజా! నన్నును, నిన్నును, నీసరోవరమును, నీ కాననమును, నీ పర్వతగుహలను, నీవెదురుఁబొదలను, నిందున్న మందారాది వృక్షములను, నాకును, బ్రహ్మకును, శివునకును నిలయము లయిన యీ పర్వతశిఖరములను, నాకుఁ బ్రియమయిన క్షీర సాగరమును, బ్రకాశమానమైన యీ శ్వేతద్వీపమును, నా శ్రీవత్సమును, కౌస్తుభమును, వనమాలను, కౌమోదకి యనెడి గదను, జక్రమును,పాంచజన్యమును, బక్షినాయకుఁ డయినగరు త్మంతుని, ననంతుని,నాకుఁ గలాభూతయై, యూహింపఁదరము కానంత సూక్ష్మరూపముగల్గి నన్నాశ్రయించుకొనియున్న లక్ష్మి

దేవిని, బ్రహ్మను, నారదుని, రుద్రుని, ప్రహ్లాదుని, నేఁదాల్చిన మత్స్య కూర్మాదు లగునవతారములను, నాయవతారములచేఁ జేసిన పుణ్యచరిత్రములను; సూర్యునిఁ, జంద్రుని, వహ్నిని,ఓంకారమును,సత్యమును, బ్రకృతిని, భక్తిలక్షణ మగుధర్మమును, జంద్రునకును గశ్యపునకును భార్యలగు దక్షతనయలను,గంగను, సరస్వతిని, యమునను,నలకనందను, నైరావతమును, ధ్రువునిఁ, బుణ్యశ్లోకు లగునసప్తర్షులను, ధార్మికు లగుమానవులను,నుదయకాలమున లేచి సమాహితచిత్తులై యేజనులు స్మరింతురో,నాకు శరీరభూతు లయినయా పుణ్యాత్ములందఱును సకలపాపములవలన విముక్తులై సుఖింతురు. ఎవరు ప్రాతఃకాలమున నీస్తోత్రముచే నన్నునుతింతురో వారు మరణకాలమున నాయందాసక్తులగుదురు''అనిపలికి హరి పాంచజన్యము నూఁది బ్రహ్మాదులను సంతసింపఁజేసి గరుడు నధిష్ఠించె. కావున నీచరిత్ర మంతెంతయో ప్రభావము గలదని నమ్ముఁడు. ఇది నాల్గవ యధ్యాయము.

---

దుర్వాసుశాపముచే సంపదతఱిఁగి దేవతలు హరిని స్తుతించుట.

ఓరాజా! పాపహరమైన గజేంద్రమోక్షణకథను నీకుఁ జెప్పితిని. ఇఁక రైవత మన్వంతరమును జెప్పెదను. తామసుని సోదరుఁ డయినరైవతుఁ డైదవమనువయ్యె. అర్జునుఁడు, బలి మొదలగువారు మనుపుత్త్రులు. విభువనువాఁ డింద్రుఁడయ్యె. భూతదయుఁడు మొదలగువారు దేవతలయిరి.హిరణ్యరోముఁడు మొదలగువారు సప్తర్షులైరి. శుభ్రుఁ డనువానికి వికుంఠ యనుభార్యయందు నారాయణుఁడు వైకుంఠుఁ డనునామముతో నవత

రించె. సురశ్రేష్ఠులు వైకుంఠులను నామముతో నుద్భవించిరి. అప్పుడు వైకుంఠుఁడు తనప్రియురాలైన లక్ష్మీదేవికిఁ బ్రియము సేయ నెంచి యామె కోర్కెఁ జొప్పునఁ జక్రవాళపర్వతము నుపరి భాగమునందు వైకుంఠనగరమును గట్టించె. అది సకలలోక జనులచేతను గొనియాడఁబడుచున్నది. ఆపరమేశ్వరుని ప్రభావ మును గుణములను నింతకుఁ బూర్వమే కొంతవఱకు వర్ణించి తిని. భూమి రేణువులనైనఁ బూర్తిగా లెక్కింపఁగలము; కాని యాభగవంతుని గుణముల లెక్కింపఁజాలము. చాక్షుషుఁ డను వాఁ డాఱవమను వయ్యె. పురువు, పురుషుఁడు, సుద్యుమ్నుఁడు మొదలగువారు మనుపుత్త్రులు. మంద్రద్రుమ డనువాఁ డింద్రు డయ్యె. ఆప్యాదులు దేవగణములైరి. హవిష్మంతుఁడు వీరకుఁడు మొదలగువారు సప్తర్షులైరి. అప్పుడు భగవంతుఁడు వైరాజు నకు సంభూతి యనుభార్యయందు నిజాంశముచే నుద్భవించి యజితుఁ డనునామమును దాల్చె. అతఁడు క్షీరసాగరమును మథించి యమృతమును సాధించి దేవతలకిచ్చెను. మఱియుఁ గూర్మరూపము దాల్చి సముద్రమున మునుఁగుచున్న మందర పర్వతమును మోచెను' అని చెప్పుచున్న శుకుంగాంచి రాజిట్ల నియె. "ఓమునీంద్రా ! భగవంతుఁడు క్షీరసాగరము నెందులకు మథించెను? కూర్మరూపమును దాల్చి యెవరికొఱకే హేతువుచే మందరపర్వతము మోచె? దేవత లమృతము నెట్లు పొందిరి? సముద్రమథనమువలన నమృతమేకాక మఱియు నేయేవస్తువు లుదయించినవి? అత్యద్భుతములైన భగవచ్చేష్టలను వర్ణిం చెడి భగవన్మహిమము నెంతవిన్నను జిరకాలము తాపత్ర యముచేఁ బీడితమగు నాచిత్తము తృప్తిచెందకున్నది" అని

యడిగిన నరేంద్రుని ప్రశ్నములను మిక్కిలి సన్మానించి శుకుఁడు హరిప్రభావము నిట్లు చెప్పఁదొడంగె. ఓ రాజా! పూర్వము దేవాసురులకు ఘోరయుద్ధము సంభవించె. అందు రాక్షసులు వాఁడియైన యాయుధములను దాల్చి దేవతలను బీడించి కూల వైచిరి. దేవతలలోఁ బెక్కండ్రు నిర్జీవులైరి. పూర్వమొకప్పుడు దేవేంద్రుఁ డైరావతము నెక్కి పోవుచుండఁ జూచి దుర్వాసుఁడు పుష్పమాల నొకదాని నిచ్చె. ఇంద్రుఁడు దాని గౌరవముతోఁ దీసికొని స్వీకరింపక యైరావతము కుంభమునకుఁ జుట్టె. అది పాదముచేఁ ద్రొక్కి చూర్ణము గావించె. అదిచూచి కోపించి "నీవు మూఁడులోకములతోఁ గూడ శోభాహీనుఁడ వగుదువు గాక" యని శపించె. పై రెండు కారణములవలనను ముల్లోకము లును శోభ దఱిఁగియుండె. యాగాది క్రియలు తొంటివలె వానికి శోభను గల్గింప లేవయ్యె. ఇంద్రాది దేవత లప్పుడు కూడికొని లోక ములకు శోభను గల్గించుటకును, యుద్ధమునఁ బడిన దేవతలను బ్రదికించుటకును దగిన యుపాయమును గూర్చి పలు తెఱంగుల నాలోచించిరి; కాని నిశ్చయింప లేకపోయిరి. అంత నింద్రాదు లంద ఱును మేరుశిఖరమున నున్న బ్రహ్మసభకుఁ బోయి నమస్కరించి యతనికి విన్నవించుకొనిరి. అంత బ్రహ్మ, కాంతిహీనులై బలముఁ దొలంగియున్న యింద్రాది దిక్పాలురను, మంగళహీనములగు మూఁడులోకములను, తేజముతోను బలముతోను గూడిన దైత్యులను జూచి మిక్కిలి విచారించి సమాహిత చిత్తముతోఁ బరమపురుషుని ధ్యానించి వికసితముఖుఁడై యింద్రాదులఁ గాంచి యిట్లనియె. "ఓ సురలారా! నేను, రుద్రుఁడు, మీరు, దైత్యులు, మనుష్యులు, పశుపక్ష్యాదులు, చెట్లు, స్వేదజ

ములు మోహముననుండియును ననియంతాంశముల లేశము లచేఁబొడమితేమా యాపరమపురుషుని శరణుఁజొత్తము. ఆలోచింప నతనికి వధ్యులు లేరు; రక్షింపఁదగినవారును లేరు; అందఱును సమానులే. అతనికిఁ గొందఱు ఉపేక్షింపఁదగినవారనియు, గొందఱు ఆదరింపఁదగినవారనియు నేర్పాటులేదు. అయినప్పటికి నతఁడు లోకములకు సృష్టిస్థితిలయాదులుగల్గింప నాయాకాలమందు సత్త్వాదిగుణముల మూఁడింటిని స్వీకరించుచుండును. ఆ మూఁడింటిలోను సత్త్వమును దాల్చి శ్రీహరి భూతములఁ బరిపాలించుచుండు. సత్త్వగుణప్రధానుఁ డగుహరి రక్షకుఁడై యుండుటచే సత్త్వప్రధాను లగు దేవతలకుఁ దప్పక జయముగల్గు. కావున మనము వేగముగాఁ బరిగి యతని నీడఁ జేరుదము. చేరినచో నతఁడు మనలఁ జేరఁదీసి సుఖింపఁజేయు. అతఁడు దేవతలందుఁ బ్రేమగలవాఁడై యుండుటచేమన కార్యము తప్పక నెఱవేఱును" అని యిట్లు పలికి బ్రహ్మ దేవతలు గొల్చివచ్చుచుండఁ దమస్సుకంటెఁ బరమైన యజితుని నిలయమునకుఁబోయి యెట్టివారికిని గానరాని స్వరూపముగలవాఁడును,నింతకుఁబూర్వమే యజితుఁ డనునవతారము దాల్చియున్నవాఁడును నగుపరమేశ్వరునకు నమస్కరించె. అనంతరము బ్రహ్మాదులు సమాహితచిత్తులై యింద్రియముల జయించి యుపనిషద్వాక్యములచే నజితు నిట్లు నుతింప నారంభించిరి. "ఓ దేవా! నీవు సకలదేవతలలో నుత్తముఁడవు. నీకు సమానుఁడుగాని నీకంటె నధికుఁడుగాని లోకమున లేఁడు. నీవు మనస్సునకును, వాక్కులకు నందనివాఁడవు. ఒకప్పుడు యోగులమనసునకు నీవు గోచరుఁడవయినను నింత శక్తిగలవాఁడ వని నిర్ణయింప నశక్యుఁడవు. నీమహిమము

ఊహింపఁ దరముగానిది. నీకుఁ గర్మాధీనమగు ప్రాకృతశరీరము లేదు. మావంటివారి హృదయకుహరములందు శయనించువాఁడవు. జీవుఁ డట్లు శయనించువాఁడైనను, నీవలె నుపాదానకారణము కాఁడు. నీకుఁ బ్రకృతికింబోలె మార్పులు లేవు. జీవుని స్వభావము వలె నీస్వభావము మాఱదు. నీ వనంతశక్తులు గలవాఁడవు. నీవు ప్రాణములను, మనస్సును, బుద్ధిని, జీవాత్మలను, సాక్షాత్కరించుకొనువాఁడవు. ఓ యీశా! నీవు శబ్దాదివిషయములను, వానిని గ్రహించు శ్రోత్రాదీంద్రియములను, బ్రకాశింపఁ జేయువాఁడవు. నీకు జాగరాద్యవస్థలు లేవు. కర్మాధీన మగుశరీరము నీకు లేదు. అజ్ఞానముగాని మిశ్రజ్ఞానముగాని నీకు సంభవింపవు. నీవాకసమువలె నన్నిచోట్లను వ్యాపించియున్నవాఁడవు. జ్ఞానాదులగు నాఱుగుణముల చేతను నిండినవాఁడవు. అట్టినిన్ను శరణుఁ బొందెదము. ఓ పరమేశా! సంసార మొక చక్రమువంటిది. అది మనోవ్యాపారమువలనఁ గల్గుచున్నది. అది నీమాయచేఁ ద్రిప్పఁబడుచున్నది. కర్మేంద్రియములును జ్ఞానేంద్రియములును బంచప్రాణములు నాఁబడు పదునేనంచులు గలది. అది యెప్పుడు శీఘ్రముగాఁ దిరుగుచుండును. దానికి సత్త్వము రజము తమము నాఁబడు మూఁడు నాభులు గలవు. భూమి, జలము, వహ్ని, వాయువు, గగనము, మనస్సు, బుద్ధి, యహంకారము ననెడి యెనిమిది నేములచే నది యొప్పుచుండును. అది మెఱుపువలె మిక్కిలి చంచలమైనది. ఆ మనోమయచక్రమున కెవఁ డాధారమో యట్టిపరమాత్మ వగునిన్ను శరణుసొచ్చెదము. ఏది కేవలము శుద్ధసత్త్వమయమై, ప్రకృతిమండలమునకుఁ బరమై సంసారులకుఁ గానరానిదై రాగాదిదోషములు లేనిదయి దరిలేనిదై వెలయు

చున్నదో, దేనిని బంఢితులు యోగమార్గముచే నుపాసించు చున్నారో, యాపరమపదమును నధిష్ఠించి యున్ననీ పాదపద్మముల నాశ్రయించెదము. మావంటివా రెవనిమాయ నతిక్రమింప లేరో, యెవనిమాయచే మోహితులై మావంటివారు సకల భూతములం దంతరాత్మరూపమున వెలయుచుఁ బరమపురుషార్థమైయున్న యెవని నెఱుఁగఁజాలరో, భూతములందు వర్తించు చున్నను నెవనికిఁ బ్రకృతిపురుషగతము లగుదోషము లంటవో, యెవఁడు దేవతలకుఁగూడ దేవుఁడో, యట్టిపరమాత్మునకు నమస్కారము లొనర్చెదము. ఓ పరమేశా! నీకుఁ బ్రియశరీర మైనసత్త్వగుణముచే సృజింపఁబడి దేవతలమును, ఋషులము నగు మేమే దురూహ మగు నీ చేష్టలను దెలిసికొనలేనప్పుడు కేవలము రజస్తమోగుణములచే సృజింపఁబడు రాక్షసాదు లెట్లు దెలిసికొనఁగలరు? జరాయుజము లనియు, నండజము లనియు, స్వేదజము లనియు, నుద్భిజ్జము లనియుఁ బిలువఁబడు నాల్గువిధము లగుభూతవర్గములకును దావైన యీ భూమి నిజసృష్టమై యెవనికిఁ బాదము లగుచున్నదో యా పరమపురుషుఁడా స్వతంత్రుఁడు మాకుఁ బ్రసన్నుఁ డగుఁగాక. మూఁడులోకములును, దల్లోకములవారును, లోకపాలురును, దేనివలన నుద్భవించి జీవించుచున్నారో, వర్ధిల్లుచున్నారో యాజలమే రేతస్సుగాఁగల్గి బ్రహ్మశబ్దవాచ్యుఁ డయినమహావిభూతి మాకుఁ బ్రసన్నుఁడగుఁ గాక, దేవతల కన్నమును, బలము నాయువును నొసంగుచు, వృక్షములకును, బ్రజలకును వృద్ధిగల్గించు చంద్రుఁ డెవనికి మన స్సని చెప్పుచున్నారో యా విరాట్పురుషుఁడు మాకుఁ బ్రసన్నుఁ డగుఁగాక. ఇంద్రాదిదేవతలకుఁ గ్రమముగా హవిర్భాగముల

నర్పించుచు, వేదపూర్వభాగమునఁ జెప్పఁబడిన యాగాదుల కొఱకు జన్మించి సకలదేహులలోపలను వర్తించుచు నందున్న సప్తధాతువుల నభివర్ధించుచున్నయగ్ని, యెవనికి ముఖమగు చున్నదో యావిరాట్పురుషుఁడు మాకుఁ బ్రసన్నుఁడగుఁగాక. అర్చిరాదిమార్గభూతుఁడైన వేదమయుఁడై బ్రహ్మోపాసనమునకు స్థానమై, ముక్తికి ద్వారమై, మోక్షమును సాధించు పుణ్యములనొ నర్పఁదగినవాఁడగుటచే ముక్తిసాధనుఁడై, యుదయముచేతను, నస్తమయముచేతను నాయువును క్షీణింపఁజేయువాఁడగుటచే మృత్యువై పరఁగు సూర్యుఁడెవనికి నేత్రమగుచున్నాఁడో యావిరాట్పురుషుఁడు మాకుఁ బ్రసన్నుఁడగుఁగాక. సకలచరాచరములకును, మనోబలమును, దేహబలమును, నింద్రియబలమును, గల్గించుచుఁ బంచవిధము లగువృత్తులతోఁ గూడినవాయువును బుద్ధ్యాదుల కధిష్ఠాతృదేవతల మగు మేము, సార్వభౌముని భృత్యులుంబోలె, ననుసరించుచుందుము. అట్టివాయు వెవనిప్రాణము వలన నుద్భూతమైనదో యావిరాట్పురుషుఁడు మాకుఁ బ్రసన్నుఁడగుఁగాక. ఎవని శ్రోత్రమువలన దిక్కు లుదయించినవో, దేహగతము లగురంధ్రము లెవనిహృదయమువలన సంభవించెనో, కర్మేంద్రియములకును, జ్ఞానేంద్రియములకును, మనస్సునకును, బంచప్రాణములకును, శరీరమునకును, నాశ్రయమైనయాకాశ మెవని నాభివలనఁ బుట్టెనో, యావిరాట్పురుషుఁడు మాకుఁ బ్రసన్నుఁడగుఁగాక. ఎవనిబలమువలన నింద్రుఁడును, బ్రసాదము వలన దేవతలును, గోపమువలన రుద్రుఁడును, సంతోషము వలన బ్రహ్మయు, శరీరగతరంధ్రములవలన ఛందస్సులును ఋషులును, గుహ్యేంద్రియమువలనఁ బ్రజాపతియు సంభవించిరో,

యీశుఁడు బ్రహ్మాదులకుఁ బ్రసన్నుఁ డగుఁగాక! ఎవనివక్షస్స్థలము
వలన సంపదయు, నీడవలనఁ బితరులును, స్తనమువలన ధర్మం
బును, పృష్ఠభాగమువలన నధర్మమును, శిరస్సువలన నాక
సమును, నవ్వువలన నచ్చరలును నుదయించిరో యావిరాట్టు
మాకుఁ బ్రసన్నుఁ డగుఁగాక. బ్రాహ్మణకులంబును, నింద్రి
యాతీతము లగు పదార్థములను దెలుపువేదంబును, నెవనిముఖ
మువలన నుదయించినవో, క్షత్త్రకులంబును బలంబు నెవని
బాహువులవలనఁ గల్గినవో, వైశ్యకులమును, నైపుణ్యము
నెవనితొడలవలనఁ బుట్టెనో, శూద్రకులమును శుశ్రూషా
వృత్తియు నెవనిపాదములవలన జనించెనో యా విరాట్పురు
షుఁడు మాకుఁ బ్రసన్నుఁ డగుఁగాక. ఎవని క్రిందిపెదవివలన
లోభము, మీఁదిపెదవివలనఁ బ్రీతియు, నాసికవలనఁ గాంతియుఁ
స్పర్శమువలనఁ బశువులకు హితమగు కామము, కనుబొమలవలన
మృత్యువు, కనుఱెప్పలవలనఁ గాలమును సంభవించెనో యా
మహాపురుషుఁడు మాకుఁ బ్రసన్నుఁ డగుఁగాక. పంచమహాభూత
ములును, గాలమును, బుణ్యాపాపకర్మములును, సత్త్వాదిగుణ
ములును, బ్రహ్మాండమును, దానియందున్న కార్యసర్గమును,
నే మహాత్ముని సంకల్పమువలనఁ గల్గుచున్నట్లు చెప్పుచున్నారో,
ఎవ్వనిస్వరూపము చేతనాచేతనములతో సజాతీయ మయినట్లు
లూహింపఁ దరముకానిదో, యేది కేవలము పండితులకు
మాత్రమే తెలియఁదగినదో యాభగవంతుఁడు మాకుఁ బ్రసన్నుఁ
డగుఁగాక. ఎవఁడు స్వాతంత్త్ర్యమై హద్దులేనిదై యున్న యానంద
మును సంతత మనుభవించుటచే సమస్తవాంఛితములను బొందిన
వాఁడో, మాయాగుణములకు లోఁబడని స్వభావసిద్ధమైన

మైశ్వర్యము గలవాఁడెవఁడో, యాపరమేశ్వరునకు నమస్కారములు. ఉక్తవిధము లగునసాధారణగుణములు గల్గిన యో దేవా! నీదివ్యమంగళవిగ్రహమును జూడఁదలంపు గల నీభక్తుల మగు మా కన్నులకు మందహాససుందర మగునీ ముఖపద్మము విందుగొల్పుఁగాక. ఓ పరమపురుషా! ధర్మము వినాశోన్ముఖ మయినకాలములందు స్వేచ్ఛచేతనే పెక్కు లవతారంబులు దాల్చి మానిమిత్తము దుష్కరము లగుకార్యముల నొనర్చుచున్నావు. అట్టి నీకు నీరూపము చూపుట యేపాటిదుర్ఘటకార్యము? ఇప్పుడు నన్ను స్తుతించినంతమాత్రమున నారూపము నెట్లుచూపుదు ననియడుగుదేని చెప్పెదము వినుము. మీవంటివారందఱును దమకుఁబ్రియము లయినవిషయలాభములకొఱకుఁ బ్రయత్నించి యనేకవిధము లగుదుఃఖములను జెందుచు నధిక కష్టము స్వల్పసుఖము గలపనుల నాచరించుచున్నారు. అవి యన్నియు నీ కర్పింపఁబడినచో వ్యర్థములు కావు. ధర్మవిరుద్ధమైనను లౌకికవిషయమైనను గర్మకలాపము నీయందుంచిన నది విఫలము కాదు. నీవాత్మకు నిరతిశయప్రియుఁడవై యుండ నట్టి నీకర్పితమైనది నిష్ఫల మెట్లగును? మఱియు స్వల్పకర్మమయినను నీకర్పితమయినది యనంతఫలము గల్గించు. కావున మాయొనరించిన స్తుతి స్వల్పమయినను నీసుందరరూపమునుజూప సమర్థమయి నదే! చెట్టుమొదట నీరుపోసినచో నదితచ్ఛాఖోపశాఖల నన్నింటిని దృప్తిపొందించునట్లు నిఖలదేవతలకును మూల మయిన నిన్నారాధించినచో నది యఖిలదేవతలను దనుపును; మఱియు సకలపురుషార్థములను సాధించును. ఓ దేవా! ప్రకృతి పురుషులకార్యములతోఁ బోల్ప వలనుపడని యద్భుతకార్యముల

నొనర్చుచు, ననంతుఁడవై హేయగుణములు లేనివాఁడవై సత్త్వాదిగుణములకు నియామకుఁడవై సత్త్వమును వర్ధించు కర్మమున కనుగుణముగాఁ బ్రవర్తించుచున్న నీ కిప్పుడు నమస్కారము లాచరించెదము. నిన్నుఁ బ్రసన్నునిఁగాఁ జేసికొనుటకింతకుఁ దప్ప వేఱొక యుపాయము లేదు.'' ఇది యైదవయధ్యాయము.

---

{విష్ణువు ప్రత్యక్షమగుట; సముద్రమును మథింప మందరపర్వతమును గొనిపోవుట.}

అని యిట్లు దేవతాగణములచే నుతింపఁబడి పరమేశ్వరుఁడు వేవురు సూర్యులతోఁ దుల్యమయినకాంతి గలవాఁడై వారికిఁ బ్రత్యక్షమయ్యె. అతని దేహకాంతిచే దేవతల కన్నులుమిఱుమిట్లుగొనుటంజేసి వారు తమ్మునుగాని భూమినిగాని, యాకసమునుగాని, దిక్కులనుగాని చూడలేకపోయిరి. అప్పుడు భగవంతుఁ డగు బ్రహ్మయు శంకరుండును నా పరమేశ్వరుని దేహమునుజూచిరి. ఆ యీశ్వరుని దేహ మింద్రనీలమణులవలె శ్యామలవర్ణము గలది. అతని కన్నులు దామరపూవులోపలి దళములవలె నెఱ్ఱనివై యుండె. అతఁడు దాల్చిన పట్టువస్త్రము తప్తకాంచనమువలెఁ బ్రకాశించుచుండె. అతని సకలావయవములును బ్రసన్నములై సుందరములై యుండె. అతని కనుబొమలు మిక్కిలి సుందరములై యుండె. మంచి రత్నములు దాపిన కిరీటము బాహుపురులు మొదలగు నలంకారములనతఁడు దాల్చియుండె. కర్ణకుండలముల కాంతులచే నినుమడింపఁబడిన చెక్కిళ్లకాంతి యతని ముఖపద్మమున కమిత

సౌందర్యమును గూర్చుచుండె. అతండు బంగారు మొలత్రాటిని, కడియములను, ముత్యాలహారములను, అందెలను, కౌస్తుభరత్నమును, శ్రీదేవిని, వనమాలను దాల్చి వెలయుచుండె. చక్రము మొదలగు నతని యాయుధములు పురుషాకృతులను దాల్చి యతని సేవించుచుండె. అట్టిపరమేశ్వరునిం జూచి బ్రహ్మ రుద్రుని తోడను, సకల సురులతోను సకలావయవములు భూమినిదాఁకు నట్లుగా మ్రొక్కి పరమపురుషు నిట్లు నుతింప నారంభించె. "ఓ దేవా! నీవు కర్మాధీనుఁడవు కాక యీ సృష్టిస్థితిలయములను లోనర్చుచున్నావు. సత్త్వాదు లగు ప్రకృతిగుణములకు శత్రువవు. నీవు దుఃఖరహిత మగు నానందమునకు సముద్రునివంటి వాఁడవు. అణుస్వరూపుఁ డగుజీవునికంటెను సూక్ష్మతరుఁడవై యాతనియం దంతరాత్మవై యొప్పుచున్నవాఁడవు. నీవు మహా ప్రభావము గలవాఁడవు. ఊహింపఁ బరముకాని తేజస్సు గల వాఁడవు. ఇట్టి నీకు నమస్కారము లాచరించెదను. ఓ పురుష శ్రేష్ఠా! శ్రేయస్సును గోరువారు నీరూపమును, వేదోక్తమును బాంచరాత్రాదులచే బోధితము నగుయోగముచే నారాధింతురు. ఈనీరూపమందు ముల్లోకములతోను గూడినమమ్మును జూచుచున్నాము. కావున విశ్వము నీకంటె వేఱుగానిదని నిశ్చయింపవచ్చు. ఈవిశ్వము మొదటికాలమందును, మధ్యకాల మందును, నంత్యకాలమందును, స్వతంత్రుఁడ వయిన నీయందే కానవచ్చుచున్నది. ఉపాదానకారణ మయిన మంటికంటె ఘటము వేఱుగానట్లుపాదానకారణము లయిననీకంటె నీ జగంబు వేఱయినది గానేరదు. అట్లగుటం జేసి జగత్తునకు సంభవించుచున్న యాద్యవస్థయు, మధ్యమావస్థయు, నంతిమా

వస్థయు నీవేకాని వేఱుకాదు. అట్లు జగంబున కభిన్నుండ వయ్యుఁ బ్రకృతి వికారములకంటెఁ జీవునికంటెను విలక్షణుండవై త్రిగుణదోషములు నుండవు. ఓదేవా! నిన్ను విడిచియుండ లేనిదై నీకు వశంగతమై యున్నమాయచే నీజగము నిర్మించి యం దంతరాత్మరూపమునఁ బ్రవేశించితివి. అట్లు ప్రవేశించి గుణ పరిణామమందు సైతమును జేతనాచేతనగతము లగునీచ గుణముల నొందక వర్తించు నిన్నుఁ బండితులు యోగపరిశుద్ధ మైనమనస్సుచే సాక్షాత్కారము గావింతురు. మఱియు మథించి కట్టెలందు దాఁగియున్న యగ్నిని వెలికిఁ గొనుచున్నట్లును, పితికి గోవులం దున్న పాలను గాంచునిగ్రహమునను, కృషి చేసి భూమియం దున్న యన్న మును సాధించువిధమునను, భూమిని త్రవ్వి జీవనభూతమగు జలమును దీసికొన్నట్లును, విద్వాంసు [illegible] చేతనాచేత నము లగుపదార్థములందున్న నిన్నును యోగపరిశుద్ధమైన మన స్సనెడిసాధనమువలనఁ బొందుచున్నారు. ఓలోకనాథా! ఓసర్వ నాథా! నిరతిశయపురుషార్థ మగునీరూపమును మిక్కిలి చిర కాలమునుండి కోరుచున్నాము. మాపూర్వపుణ్యవశమున నేఁటి కది మాకుఁ బ్రత్యక్షమైనది. కార్చిచ్చుచేఁ బరితాపము చెందు గజములు గంగాజలమునుబొంది సంతోషించునట్లు నీ యీరూప మును బొంది సుఖించుచున్నాము. ఓలోకనాథా! అట్టి నీవు మమ్ముఁ దయఁ జూచి దేని నపేక్షించి నీపాదమూలమును జేరితిమో యా ప్రయోజనమును మాకు సమకూర్పుము. విశ్వమునకు లోపటను వెలుపటను నిండియుండి సమస్తమును సాక్షాత్క రించుకొనెడి నీకింతకంటె నేమని విన్నవింపఁగలము? నేనును, శంకరుండును, దేవతలును, దక్షాది ప్రజాపతులును మొదల

లగు మే మందఱమును నగ్నివలన విస్ఫులింగములవలె నీవలన వేఱయితిమి. అట్టి మేమాత్మసుఖము నేమెఱుంగుదుము. కావున నీవే బ్రాహ్మణులకును, దేవతలకును, వేదములకును, సుఖము గల్గించునుపాయము నాలోచించి యుపదేశింపుము" అని యిట్లు బ్రహ్మాదులచే సన్నుతుఁడై పరమేశ్వరుఁడు వారి హృదయమును దెలిసికొని యింద్రియముల జయించి దోసిలికట్టి యెదుట నిల్చియున్న బ్రహ్మాదులఁ గాంచి తా నొక్కఁడే సురలకార్యమును నెఱవేర్పఁ జాలినను సముద్రమథనాదులచే విహరింప నెంచి మేఘగర్జనమువలె గంభీర మగుస్వరముతో ని ట్లనియె. "ఓ విరించీ! ఓశంకరా! ఓదేవతలారా! నావచనమును వినుఁడు. దానివలన మీకు శ్రేయస్సుగలుగును. మీకుఁ జా వెప్పటికిని సంభవింపదు. మీ రిప్పుడు వెంటనే పోయి మంచిమాటలాడి దైత్యులతోను దానవులతోను సంధి చేసికొనుఁడు. కాలవశమున వారు మీకు సఖులై యుండినచో మీ కభివృద్ధి తప్పక కలుగును. నెఱవేర్చుకొనవలసిన కార్య మున్నప్పుడు శత్రువులతోనైనను సంధి చేసికొనవలయు. అట్లు వారలతో సఖులై యుండియు మనస్సులలోఁ గ్రోధమును విడువక యహిమూషికముల వలె వధ్యఘాతుకభావముతో వర్తింపవలయును. అమృతమును సాధించుటకై మీరు శీఘ్రముగాఁ బ్రయత్నింపవలయును. ఆ యమృతమును ద్రావినవాఁడు మృత్యుగ్రస్తుఁడయ్యుఁ జావు లేనివాఁ డగును. అట్టి యమృతము మీ కున్నచో సమస్తము సమకూఱును. మీరు ముందుగా సమస్తము లగుగుల్మములను, దృణములను, లతలను, ఔషధులను, క్షాలసంద్రములో వైచి మందరపర్వతమును గవ్వముగాఁ జేసి వాసుకిని ద్రాటినిగాఁ

జేసి నాసాయమును బడసి జాగరూకులై మథింపుఁడు. దైత్యులు కేవలము గష్టమును జెందుదురు. మీరు ఫల మనుభవింతురు. ఓ సురలారా! దైత్యులు దేనిని గోరుదురో దానికెల్ల మీ రను మోదింపుఁడు.. మంచిమాటలచేఁ గార్యముసిద్ధించినట్లు కోపము చేతఁ గాదు. కావున మీ రిఁకఁ గోపము విడువవలయు. మీరు తరుచునపుడు ముందుగాఁ గాలకూటము పుట్టును. దానికి మీ రెంతమాత్రము భయపడకుఁడు. దానిని రుద్రుఁడు భక్షింపఁ గలఁడు. సముద్రమునం దుదయించిన వస్తువులలో నొకదానికిని మీ రాశపడరాదు; అపేక్షింపఁ గూడదు; ఒకప్పుడును గోపింపఁ గూడదు" అని యిట్లు బోధించి భగవంతుఁడైన పురుషోత్త ముఁడు వారు చూచుచుండఁగా నచ్చటనే యంతర్ధానముచెందె. అనంతరము బ్రహ్మయు శంకరుఁడును, భగవంతునకు నమస్క రించి తమతమ నిలయముల కరిగిరి. ఇంద్రాదిదేవతలు బలినిని సమీపించిరి. అంతఁ బుణ్యశ్లోకుఁడైనబలి సంధి విగ్రహాదుల నెఱిఁగినవాఁడు కావున యుద్ధమును గోరక వినతులై వచ్చు చున్న దేవతలను జూచి చంప నుద్యుక్తులైన తనవారిని వారిం చెను. సకలమును జయించి సకలలోకసంపదలను వశము గావిం చుకొని దైత్యులచే రక్షితుఁడై సభామధ్యమున నాసీనుఁడై యున్నబలిని సమీపించి దేవతలలో వరిష్ఠుఁ డయిన యింద్రుఁడు మృదుమధురము లైన వచనములతోఁ బురుషోత్తముఁడు చేసిన యుపదేశప్రకారముగాఁ దెలిపెను. ఆవచనము బలికి శంబరునకుఁ ద్రిపురాసురులకుఁ, దక్కిన దైత్య నాయకులకును హితముగాఁ దోఁచె. అంత దైత్యులును, సురలును, బరస్పర మును సమయ మేర్పఱుచుకొని సంధిచేసికొని యమృతము

నిమిత్తము మిక్కిలి ప్రయత్నము చేసిరి. అనంతరము దేవాను రులు మదాంధులై పరిఘలవంటి బాహువుల బలముచే మందర పర్వతమును పెల్లగించి సింహనాదములు చేయుచు దానిని సముద్రమును బొందింపఁ బ్రవృత్తులైరి. కాని కొంతదూర మేఁగునప్పటికి బలి యింద్రుఁడు మొదలగు వారందఱును వివశులై దాని మోయలేక మార్గమధ్యమున విడిచిపెట్టిరి. మిక్కిలి బరువు గలయా పర్వతము క్రిందఁబడునప్పుడు దేవాసురులు పెక్కండ్రు నుగ్గయిరి. అప్పుడు భగవంతుఁడు నలఁగిన యవయవములు గలవారై భగ్నమనోరథులై యున్న దేవదానవులను గాంచి యచ్చటికేఁగి గిరిక్రిందఁ బడి చచ్చినవారి నందఱను గడకంటిచూపులచేఁజూచి బ్రదికించె. భగవంతు ననుగ్రహమువలన వికలాంగు లగువారుగూడఁ బూర్ణాంగులై బాధారహితులైరి. అనంతరము పరమపురుషుఁడు వారందఱుఁ జూచుచుండఁగా సులభముగా నాపర్వతము నొక్కచేతితో నెత్తి గరుడునిపై నుంచి సురాసురులు గొలువ సముద్రమును సమీపించి యాపక్షిరాజు మూఁపునుండి యాగిరిని దింపిపోవ నతని కనుజ్ఞయొసఁగె. అప్పుడు పక్షిరాజు శీఘ్రగమనమున నెగిరిపోయెను. ఇది యాఱవయధ్యాయము.



సముద్రమున హాలాహలాదులు జనించుట.

అనంతరమున దేవాసురులు వాసుకి చెంతకేఁగి "నీ కమృతములోఁ బాలుపెట్టెద" మని చెప్పి యొప్పించి యతని నాపర్వతమునకుఁ జుట్టి సంతోషయుతులై యమృత మపేక్షించి సముద్రమును దరువ నారంభించిరి. ఓ రాజేంద్రా! శ్రీహరి




1395. క్షీరసాగర మథనము : ఉచ్చైశ్శ్రవాదులు పుట్టుట.

వాసుకిముఖము వైపు పట్టుకొనెను. దేవతలందఱు ప్రక్కనే పట్టుకొనిరి. ఆభగవంతుఁ డెందుల కట్లు పట్టుకొనెనో యెఱుంగక రాక్షసులు, "మేము స్వాధ్యాయసంపన్నులము. శాస్త్రములఁ జదివినవారము. పుట్టువుచేతను, జేసిన కర్మకలాపముచేతను బ్రసిద్ధులము. అట్టి మే మంగళకరమైన వాసుకితోఁక నెంతమాత్రమును గ్రహింప" మని పలికి, కార్యవిముఖులై యున్నఁగాంచి వాసుదేవుఁడు మందహాసముచేయుచు దేవతలతోఁగూడ ముఖభాగమును వదలి పుచ్ఛభాగమును జేకొనెను. దైత్యులు ముఖభాగమును గ్రహించిరి. కశ్యపనందనులైన దేవాసురు లిట్లు స్థానవిభాగమును జేసికొని యధిక ప్రయత్నముతో సముద్రమును దరువఁజొచ్చిరి. ఓ పాండవేయా! ఇట్లు మథించుచుండ మహాభారము గలయాకొండ నిరాధారమైనందున బలవంతు లగు దేవాసురులు పైకెత్తుచున్నప్పటికి నాఁగక జలములలో మునిఁగెను. సురాసురులు తమబలము బలీయమైన దైవముచే నశించుటంబట్టి సవిచారమనస్కులై తెలతెలపోయిన మొగంబులతో నూరక చూచుచుండిరి. అంత విఘ్నేశ్వరుఁ డొనర్చినవిఘ్నమును గాంచి సత్యసంకల్పుఁడు, నపారబలుండును, భగవంతుఁడు నగు నజితుఁడు మహాద్భుతమగు తాఁబేటిరూపము నొంది జలములలో మునుఁగుచున్న పర్వతముక్రింద నిలిచి పైకెత్తఁగా సురాసురులు దానిని గాంచి సంతసించి మగుడ మథింప నుద్యుక్తులైరి. ఓరాజా! ఆకూర్మమూర్తి లక్షయోజనముల విస్తీర్ణత గల్గి రెండవ జంబూద్వీపమో యన్నట్లు సొంపారుచున్న తన వీఁపుచే ధరించియుండుటం బట్టి యక్కొండ నిరపాయముగా నుండెను. సురవరులును,

దైత్య శ్రేష్ఠులును దమ బాహుబలముచేఁ గడువేగముగాఁ ద్రిప్పు చున్నయా పర్వతపుపరివర్తనము లమితబలుఁ డయిన యా కూర్మమూర్తి యొడలి దురదను దొలఁగింప ననుకూలముగా నుండెను; కాని రవంతేనియు బాధ గల్గింపలేకపోయె. జలమందుఁ దాఁబేటిరూపుననుండియే పరమేశ్వరుఁ డా యసురులలోఁ బ్రవేశించి వారికి బలవీర్యములను గల్గించుచు, నట్లె దేవరూపమునఁ దేవతల బలవీర్యాదులను వర్ధించుచు వాసుకిని నిద్రామత్తునిఁగాఁ జేయుచు, నాగిరి యుపరిభాగమున రెండవ గిరివలె నొప్పుచు నేకహస్తముచే దాని నాక్రమించుచు వెలయుచుండుటం జూచి బ్రహ్మాదు లతని మహిమను నుతించుచుఁ బూలవానఁ గురియించిరి. ఓరాజా ! భగవంతుఁ డిట్లు పర్వతమునకుఁ గ్రిందను మీఁదను, నాధారముగా నుండి తమయందును, వాసుకియందును బ్రవేశించి బలకరుఁడై యుండుటం జేసి దేవదానవులు మదించి తమ బలమునంతను వినియోగించి జలజంతువులకు క్షోభ గలుగునట్లు సముద్రమును వడివడిగాఁ దరుచుచుండిరి. అంతలో ముఖభాగము నవలంబించి యున్న రక్కసులు వాసుకి నేత్రములవలనను, సహస్రముఖముల వలనను, నిట్టూర్పు వాయువులవలనను బుట్టిన యగ్నిచేతను బొగచేతను దేహకాంతిని దొఱంగి దావాగ్నిచే దగ్ధములైన సరళవృక్షములవలె నుండిరి. ఆ యగ్నియుఁ బొగలును దేవతలకుఁగూడ సోఁకి వస్త్రములను గంధమాలలను, గవచములను, ముఖములను వివర్ణములఁగాఁ జేసి శరీరకాంతిని దఱిఁగింపఁ దొడంగెను; కాని యింద్రునకు వాహనము లయిన మేఘములు వర్షించు చుండుటచేతను, సముద్ర తరంగము

లలో దాఁగియున్న శీతలవాయువులు ప్రసరించుటచేతను నంతగా వారు బాధలనొందలేదు. దేవదానవులచే మథింపఁబడిన సముద్రమువలన నమృత ముదయింపనందున భగవంతుఁడగునజితుఁడు స్వయముగానే మథింపఁ దొడంగెను. ఆసమయమున హరి మేఘమువంటి దేహకాంతిగల్గి పచ్చని పట్టువస్త్రమును దాల్చి మెఱుపుఁదీవెలవలెఁ బొలుపాఱుకంఠాభరణములచే నొప్పుచుఁ గిరీటసహితమగుశిరస్సుచే నాకాశమును బ్రకాశింపఁ జేయుచు జ్వలించు చున్నవనమాలను ధరించి, యెఱ్ఱని నేత్రములు గలవాఁడై యలరుచుండెను. అతఁడు లోకముల కభయము నీయఁజాలిన తన భుజములతో సర్పమును బట్టికొని సముద్రమును మథించుచు రెండవపర్వతమువలెఁ బ్రకాశించెను. ఇట్లు మథించుచుండఁ బర్వతభ్రమణమువలనఁ జేఁపలు, మొసళ్లు, సర్పములు, దాఁబేళ్లు, తిమింగిలములు, తిములు, గజములు మొదలగు జలజంతువు లన్నియు మిక్కిలి క్షోభ చెందుచుండెను. ఇట్లు మథింపఁబడు సముద్రమునుండి ముందుగా హాలాహల మనెడి దుస్సహ మగువిష ముదయించె.అది సాటిలేనిదై భయంకర మగువేగము గలదై దిక్కులకును విదిక్కులకును, మీఁదికిని, క్రిందికిని వ్యాపించుచుండెను. దానింగాంచి సురాసురలును, ముల్లోకములందలి ప్రజలును, మిక్కిలి భయపడి దిక్కులేనివారై శంకరుని శరణువేడఁ బర్వెడిరి. ఇట్లు సురాసురాదులు త్యాగగాఁబోయి లోకముల యభివృద్ధి నిమిత్తము పార్వతితోఁగూడఁ గైలాసమునఁ గూర్చుండి మోక్షముకై తపమొనర్చుచున్నవాఁడును మునీశ్వరులకుఁ బూజనీయుఁడును నగు శంకరుని సమీపించి నమస్కరించి స్తోత్రము లొనర్పనారంభిం

చిరి. *"ఓశంకరా! నీవు దేవతలకుఁగూడ దేవుఁడవు. నీవు సర్వభూతములకు నంతరాత్మవు. నీవు సకలభూతములను సృజించువాఁడవు. అట్టి నీ పాదమూలములఁ జేరినమమ్ముఁ జేరఁదీయుము. ముల్లోకముల దహించి వచ్చుచున్న యీ విషము నడఁచి రక్షింపుము. †సకల లోకములకును నీ వొక్కఁడవే యీశ్వరుఁడవు. సంసారబంధము గల్గించుటకును మోక్షము గల్గించుటకును, నీవే ప్రధానుఁడవు. నీవు లోకములకు గురువవు. అట్టివాఁడ వగుటచేతనే బుద్ధిమంతులు నిన్నుఁ బూజించు

* ఇట రుద్రునిఁ బరమ కారణునిఁగాఁ జెప్పి భగవంతునియందుండు నసాధారణధర్మము లతనియందున్నట్లు వర్ణించుచున్నారు. అట్లుచేయుట భగవద్ధర్మములు రుద్రునియం దారోపితములగుటవలన ననియెఱుంగవలయును. లేదా రుద్రుఁడు భగవంతుని యావేశావతారమే కావున పరమేశ్వరబుద్ధిచే నట్లు వర్ణించుట సముచిత మని తెలియవలయు.

† ఈప్రకరణమునవిషభీతులగుటంబట్టిదేవతలు శంకరునే పరబ్రహ్మనుగా భావించి యిట్లునుతించుచుండిరి. కాని యతఁడు వాస్తవముగాఁ బరబ్రహ్మము కాఁడు. కావుననే శంకరుఁడు తన్నుఁ బరమేశ్వరునిఁగా నుతించుచున్నప్పటికిని దానుమాత్రము తన్నట్లుతలంపక పార్వతితో "ఆపన్నులగువారికి యథార్థజ్ఞానముండదు. కావుననే యాపన్నులగుసురలు పరమేశ్వరుఁడను గాని నన్నుఁ బరమేశ్వరునిఁగా భావించి నుతించుచున్నారు. వీరల యవివేకమును జూడుము" అని యీక్రిందివిధమునఁ జెప్పుచున్నాఁడు, "అహోబతభవాన్యేతత్ప్రజానాం పశ్యవైశసం। పుంసః కృపయతోభద్రేసర్వాత్మాప్రీయతేహరిః ప్రీతేహరౌ భగవతి ప్రీయేఽహం సచరాచరం॥ ఈచెప్పుటచే భూతదయకు సంతసించువాఁడును సర్వాంతరాత్మయుఁ దనకంటె నుత్కృష్టుఁడు నగుపరమేశ్వరుఁడున్నట్టు లీశ్వరుఁడే తలంచుచున్నాఁడు. కావున నీస్తుతి రుద్రశరీరకుఁడయిన పరబ్రహ్మమునకే చెందునని తెలియవలయు.

చున్నారు. ఓస్వప్రకాశా ! నీ కంశభూతమై త్రిగుణములుగల్గి యున్నమాయచే నీ ప్రపంచమునకు సృష్టిని, స్థితిని, లయమును బొందించుచు బ్రహ్మ యనియు, విష్ణువనియు, శివుఁడనియు నామములఁ జెందుచున్నావు. చిదచిద్రూపము లగుపదార్థములను సృజించు పరబ్రహ్మవు నీవే; చిదచిత్తులచేఁ బ్రకాశించుప్రపంచమవు నీవే; వాని కంతరాత్మవై యున్నవాఁడవును నీవే; శాస్త్రముచే సాధనీయుఁడవు నీవే; జగములకుఁ గారణభూతుఁడవునీవే; ఆత్మవు నీవే; కాలశరీరకుఁడవు నీవే; నిఖిలయాగములును నీవే; నిర్వికారుఁడవును సర్వాంతరాత్మవు నగుపరబ్రహ్మవు నీవే; సకలధర్మములచేతను బూజనీయుఁడవు నీవే ; అకారోకారములును మకారమును గలిసి యేర్పడిన యోంకారము భవద్విషయకమనియే చెప్పుదురు. ఓశంకరా! నీవు సకలదేవతాస్వరూపుఁడవు. అగ్ని నీకు ముఖమనియు, భూమి నీకుఁ బాదములనియు, గాలము గమనమనియు, దిక్కులు నీచెవులనియు, వరుణుఁడు నీ నాలుకయనియుఁ జెప్పుదురు. ఆకాశము నీపొక్కిలి; వాయువు నీ నిట్టూర్పులు; సూర్యుఁడు నీనేత్రములు; జలము నీ రేతస్సు; నీ యాత్మ యఖిలజీవాత్మలకును నాధారము. చంద్రుఁడు నీ మనస్సు; దివి నీశిరస్సు; సముద్రములు నీకుక్షి; పర్వతములు నీ యస్థిసమూహములు; ఓషధులును, లతలును, నీరోమములు; గాయత్ర్యాది ఛందస్సులు నీధాతువులు. ఓ వేదమయా! వేదోక్తమగు ప్రసిద్ధధర్మము నీహృదయము. తత్పురుషము, అఘోరము, సద్యోజాతము, వామదేవము, ఈశానము నాఁబడు నను వాకములైదును నీముఖవ్యాపారరూపములు. ఆయనువాకములే కదా ముప్పదియెనిమిది మంత్రవర్గము లయినవి. స్వయం

ప్రకాశమై శివ మను పేరు గలయాత్మతత్త్వమునీయవస్థానము. అధర్మసంభూతము లగులోభము దంభము మొదలగునవి నీ నీడలు; ప్రపంచసృష్టి నొనరించు సత్వరజస్తమములు నీనేత్రములు; గాయత్రి మొదలగు ఛందస్సులచేఁ బ్రచురమై పురాతన మయినవేదము సర్వజ్ఞుఁడవును, శాస్త్రప్రణేతవు నగు నీ యీక్షణము. ఓగిరీశా! ఓలోకపాలకా! స్వప్రకాశ మగు *నీస్వరూపమును బ్రహ్మకును, విష్ణువునకు నింద్రునకునుగూడ తెలిసికోఁదగియున్నది. దానియందు రజస్సు మొదలగు ప్రాకృత గుణములు లేవు. దేవమనుష్యాది భేదముగూడ నందులేదు. ఓదేవా! నీ విదివఱకు భూతద్రోహముచేసెడి మన్మథుని, దక్షయజ్ఞమును, దక్షునిఁ ద్రిపురాసురులను సంహరించితివి. అయినను నీచేష్టలు నిన్ను నుతించుటకుఁ జాలవు. ప్రళయకాలమున నీవు చేసిన ప్రపంచమును నీకంటి మంటలచేత భస్మముచేయుదువు. అట్టి యసాధారణకృత్యము నే నీవు గొప్పగానెంచవు. అట్లుండ నీ స్వకార్యములు నీమనమునకుగొప్పలనియెట్లుతోఁచును? వానిని సాధనముగా నుంచుకొని మా చేసిన నుతి నీకెట్లుసంతసింపఁజేయును? ఆత్మారాము లైనగురువులచే సంతతమును

---

* ఇందులకు మూలము. 'విరించవైకుంఠ సురేంద్రగమ్యమ్' అనియున్నది. దీని నాలోచింప శంకరుఁడువిష్ణువునకుఁగూడనమస్కరింపఁదగినవాఁడన్నట్లు తోఁచుచున్నది కాని యదిసరికాదు. మఱియెట్లనఁగా, ఈప్రకరణము రుద్రశరీరకుఁ డయినపరమేశ్వరుని నుతించుచున్నది. పరమేశ్వరస్వరూపము పరిచ్ఛేద్యముకాదు. పరమేశ్వరుఁడుగూడఁ దన స్వరూప మిట్టిదనిచెప్ప లేనట్లు గ్రంథములవలనఁ దెలియవచ్చుచున్నది. కాన విష్ణువు తనమహిమను తానే తెలిసికొనవలసియున్నదని యర్థమయిన ట్లిచ్చట గ్రహింపవలయు.

దమతము హృదయములందు స్మరింపఁబడు చున్న నీ సామర్థ్య మెఱుంగక కొందఱు పార్వతితోఁ జరించుటంజేసి కామివనియు, ఫలమునపేక్షించి తప మొనర్చుచున్నా వనియు, శ్మశానము నందుఁ జరించువాఁడ వనియు, క్రూరుఁడ వనియు, హింసా కృత్యముల నొనర్చువాఁడవనియు, నిందించుచున్నారు.నీచేష్టను దెలిసికొనలేనివా రందఱును సిగ్గులేనివారని చెప్పవచ్చును. ఇట్టి వాఁడ వగుటంబట్టి కార్యావస్థను, గారణావస్థనుబొందెడి చిద చిత్తులకంటె విలక్షణుఁడవై సర్వవ్యాపివై యున్న నీస్వరూప మును దెలిసికొనుటకే బ్రహ్మాదులు సమర్థులు కారని చెప్పవలసి యుండ నుతింప నెట్లు సమర్థు లగుదురు? బ్రహ్మాదు లశక్తులగు చున్నప్పుడు నీచే సృష్టింపఁబడిన బ్రహ్మాదులచే సృజింపఁబడిన మాబోంటివా రెట్లు శక్తు లగుదురు ? కావున మాశక్తికొలంది నీస్తోత్రమును జేయుచున్నాము. 'ఓయీ! మీరు నుడివిన సర్వ ధర్మములు పరమాత్మవికాని నావికావు. నేను పుణ్యాతిశయ మునఁ బొందఁబడినయధికారము గలజీవుఁడనుగాని మీరన్నట్లు పరమాత్మను కానే!' యందువేని చెప్పెదము వినుము. ఓపర మేశ్వరా ! నీవు పరమాత్మవైనను గాకపోయినను నీకంటెఁ బరతత్త్వ మున్నదో లేదో మాకుఁ దెలియకపోయినను నీవు లోకసుఖము నపేక్షించి పెక్కులు కర్మము లాచరించుచున్నా వని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. సర్వము పరమేశ్వరునకధీన మయియుండుటచేతను, నతఁడు లేకుండ నెవరికయినను స్వరూప స్వభావములు లేకుండుటంజేసియు, దదృష్టిచేతనే తద్ధర్మముల చేతనే సమస్తమును నుతింపవలయును గాన నిన్ను నట్లు నుతిం చితిమి. కావున మానుతిని చేకొని మాయభీష్టమునుదీర్పుము''

అని యిట్లు పరమాత్మ ధర్మములచే నుతింపఁబడుచుండు సర్వభూతహితుఁ డయినయీశ్వరుఁడు సంతసించి యా దేవతలకుఁ గాలకూటమువలన సంభవించిన దుఃఖమును దెలిసికొని తనప్రియురాలగుపార్వతి కిట్లనియె. "ప్రియురాలా! ఆహా! ఎంతకష్టము! ఎంతకష్టము! క్షీరసాగరమును దరుచుటవలన భయంకర మగు హాలాహలము పుట్టెను. దానివలన నీదేవతలకును, లోకములకును, గొప్పయాపద సంభవించినది. ఇప్పుడా ప్రజలకు సంప్రాప్తమయినదుఃఖమును జూడుము. దీనులై శరణాగతు లగువారిని రక్షించుటయే ప్రభువు లగువారికి ముఖ్యధర్మము, కావున జీవింపఁదలంపు గల వీరిని రక్షింపఁ దగినయుపాయము నాలోచింపవలయును. లోకమున సజ్జనులు క్షణభంగురములగు తమ ప్రాణములచేఁ బ్రాణులప్రాణముల రక్షించుచుందురు. దానివలన నెంతయో లాభము గలదు. భగవన్మాయచే భూతములు మోహితములై పరస్పరమును ద్వేషించుచుండును. అట్టివానియందు దయగల్గి వర్తించెడి పురుషునందు సర్వాంతరాత్మ యగుపరమపురుషుఁడు ప్రీతిఁ జెందును. జ్ఞానాది పరిపూర్ణుఁ డయినహరి ప్రీతుఁ డయినచో జరాచరసహితుఁడనగు నేను బ్రీతిఁ జెందెదను. కావున నేనీ విషమును భక్షించెదను. ప్రజల కింక సుఖము గల్గుఁగాక" అని యిట్లు లోకసుఖకరుఁ డయినరుద్రుఁడు విషభక్షణమున కభిముఖుఁ డయ్యె. తనభర్తప్రభావ మెఱుఁగును గాన పార్వతియు నందుల కనుమోదించె. అంత శంకరుఁ డంతటను వ్యాపించి వచ్చుచున్నవిషమును గరతలమునఁ జేర్చికొని దయతో భక్షించెను. ఓరాజా! జలకల్మష మయిన విషము తనబలము నీశ్వరునకుఁగూడ జూపకపోలేదు. ఆవిషము

తన వేఁడిమిచే నీశ్వరుని కంఠమును నల్లగాఁగ మలునట్లుచేసినది. అయిన నది రుద్రున కలంకారమే యయ్యె. అయారే! లోక మున సాధువులు స్వార్థమును త్యజించి లోకహితమునెంచి పరి తాపము చెందుదు రనుట కిదియొక నిదర్శనముగదా! అట్టి పరోపకారము సకలాత్ముఁ డయినపరమేశ్వరునికి సంతసము గల్గిం పక మానదు. ఆశ్రితుల యభీష్టము నెఱవేర్చు శంకరుఁడొనర్చిన యద్భుతకర్మమునకచ్చెరువడి బ్రహ్మయు, విష్ణువును, ఋషులును, దాక్షాయణియు మిక్కిలి స్తుతించిరి. ఈశ్వరుఁడు భక్షించు నపుడు జాఱిపడిన విషలేశములను, తేళ్లును, పాములును, విషౌ షధులును, మఱికొన్ని జంతువులును స్వీకరించెను. ఇది యేడవ యధ్యాయము.

---

## క్షీరసాగరమున నైరావతాదులు జనించుట.

శంకరుఁ డిట్లు విషమును భక్షించినందులకు దేవదానవులు మిక్కిలి సంతసించి వేగముగా సముద్రమున కరిగి తొంటియట్ల సముద్రమును బలముతోఁ దరుచుచుండఁగా మధేనువుదయించె. దేవతలకుఁ బ్రీతిఁ గల్గించు యాగములకుఁ బనికివచ్చు పాలు, పెరుఁగు, నేయి మొదలగు హోమద్రవ్యముల నిచ్చునుగదా యని యెంచి బ్రహ్మవాదు లగుఋషీశ్వరులు దానినిస్వీకరించిరి. అనంతరము చందురునివలెఁ దెల్లనిదగునుచ్చైశ్శ్రవ మనెడి గుఱ్ఱ ముద్భవించినది. దానిని బలి పుచ్చుకొనియె. ఇంద్రునకుఁ గూడ దానియందాసవుడమెను, కాని భగవంతుని యుప దేశముచొప్పున మనస్సుఁ ద్రిప్పికొనెను. పిమ్మటఁ దెల్లనికాంతుల నీనుచు శిఖరములఁబోలు నాలుగు దంతములచేతనుగైలాసము

శోభనాకర్షించుచు గజశ్రేష్ఠ మగునైరావతమం దుదయిం
చెను. దానివెంటనె తక్కిన దిగ్గజములును, వానివెనుక నెనిమిది
యాఁడేనుఁగులును జన్మ మందినవి. అనంతరము కౌస్తుభ
మనెడిరత్నము సంభవించె ఆ రత్నమును హరి గ్రహించి వక్ష
మున నలంకారముగాఁ దాల్చె. అటుపిమ్మట దేవలోకమున
కలంకారభూత మగు కల్పవృక్షము పుట్టెను. అది యెల్లప్పుడు
నర్థులుకోరిన వాంఛితములనెల్లఁ బూరింపఁజాలినది. పిమ్మట
బంగారునగలచే నందమైన మెడలతోను, సుందరము లగువస్త్ర
ములతోను నచ్చర లుదయించిరి. వారు మనోహరము లైన
గమనములచేతను, గడకంటిచూపులచేతను, సురలమనంబుల
నాకర్షించిరతిసుఖముగల్గింపఁజాలినవారు. వారివెనుకఁబరమేశ్వ
రునియందు లగ్నమగు మనస్సుగల్గి మెఱపుఁదీవియవలె నిజకాం
తులచే దిక్కుల వెల్గించుచు లక్ష్మీదేవి సముద్రమునుండి యావి
ర్భవించె. ఆమె సౌందర్యాతిశయమునకును లేఁబ్రాయమునకును,
దేహకాంతికిని, జిక్కినహృదయములు గలవారై దేవాసురు
లందఱు నామెయందుఁ గోర్కివహించిరి. ఆసమయమున నద్భుత
మై మిక్కిలి విలువ గలసింహాసనము నొకదాని నింద్రుఁడు
గొనివచ్చి యామె కర్పించెను. రమాదేవి దానిపైఁ గూర్చుం
డెను. గంగ, యమున, సరస్వతి మొదలగునదులు శరీరములఁ
దాల్చి స్వర్ణకుంభములతో నిర్మలజలమును దెచ్చిరి. భూమి
మూర్తిమతియై యభిషేకమునకుఁదగినయోషధులఁ గొనివచ్చె.
గోవులు పంచగవ్యము నొసంగినవి. వసంతుఁడు మూర్తిమంతుఁ
డై నానావిధ పుష్పముల సమర్పించె. ఋషులు మంత్రపూర్వక
ముగా గంగాదిజలములచే నభిషేకించిరి. గంధర్వులు మంగళ

ములను బాడిరి. స్త్రీలు నృత్యము గావించిరి. మేఘములు మూర్తిమంతములై మృదంగములు, దప్పెటలు, దుందుభులు, గోముఖములు, శంఖములు, వేణువులు, వీణలు మొదలగువానిం జేకొని తుములముగా వాయింపం దొడంగిరి. అనంతరము దిగ్గజములు పూర్ణకలశములం దాల్చి బ్రాహ్మణులు మంత్రము లుచ్చరించుచుండం బద్మహస్తయగు లక్ష్మిని దానమాడించినవి. స్నానమగు నప్పటికి సముద్రుఁడు పచ్చని పట్టువస్త్రములం దెచ్చియిచ్చెను. మకరందపానములచే మదించిన తుమ్మెదలు గలవైజయంతియను పుష్పమాలచే నమ్మహాదేవిని వరుణుం డలంకరించె. విశ్వకర్మ మనోహరము లగు భూషణములను, సరస్వతి ముత్యాలహారమును, బ్రహ్మ పద్మమును, నురగులు కుండలములను, దెచ్చియిచ్చిరి. ఇట్లలంకరింపంబడిన లక్ష్మీదేవి తన కభిమతుం డయిన పతిమెడలో ధ్వనిచేయు చున్నతుమ్మెదలు గల యుత్పలమాలను జేత ధరించి చెక్కిళ్లయందుం బ్రతిఫలించెడికుండలములచేతను, సిగ్గుతోంగూడిన మందహాసముచేతను, సుందర మగువదనమును, జందన కుంకుమముల పూంతలచే నొప్పుచు సమములై పరస్పర మొరసికొనుచు నున్న స్తనద్వయమును, కృశించిననడుమును గలదై, మధురములగు నూపురధ్వనులనల్ల డగడలు గొలుపుచు సంచారము చేయు చున్న హేమలతవలెం బ్రకాశించుచు నిట్టటు నడయాడుచుండెను. నిత్యమును, నిత్యము లగు కల్యాణగుణములు గలదియు, హేయగుణములు లేనిదియు, నగు నాశ్రయమును దనకు సంపాదింప నెంచి యందుల కై గంధర్వులందును, యక్షులందును, నమరులయందును, జారణులందును, దక్కినవారియందును వెదకెను గాని యామెకనుకూల మగు స్థానము లభింప

లేదు. ప్రతివానియందు నొక్కొకలోపము గానవచ్చుటచే నెవఁడును నామొమది కిష్టుఁడు గాఁడయ్యె. రుద్రుఁడు, దూర్వాసుఁడు మొదలగువారికిఁ దపోధనంబు గలదు. కాని వారు కోపమును జయింపలేకపోయిరి. గురువు,శుక్రుఁడు మొదలగువారికి జ్ఞానము గలదు; కాని వారి జ్ఞానము సంగరహితమైనది కాదు. బ్రహ్మ మిక్కిలి గొప్పవాఁడె. కాని యతఁడు తన కుమారికనే మోహించినవాఁడగుటంజేసి కామమును జయింపలేక పోయె. ఇంద్రాదు లైశ్వర్యము గలవారే. కాని యాయైశ్వర్యము పరుల యనుగ్రహమువలన సంపాదించుకొన్నది కాని స్వభావసిద్ధమైనది కాదు. అట్టివారు ప్రభువు లెట్లగుదురు. యమాదులు ధర్మశాలులే కాని వారియందు భూతదయ లేదు. కొందఱియందు వితరణగుణము గలదు; కాని యదియు కీర్తిహేతువు కాదు. కొందఱకుఁ జాలినంత పరాక్రమము గలదు కాని యది మఱికొందఱచేఁ బరిహృతమగును. ఆలోచింప భగవంతునికంటె నితరులెవ్వరును బ్రాకృత గుణవర్జితులు కారు. చిరాయువు గలవారికి మంగళ స్వభావము లేదు. మంగళ స్వభావముగలవారికిఁ జిరాయువలవడుట యరుదు. సుస్వభావంబును జిరాయువు నుభయమునుగలవారికి మంగళకరమగు వేషము లేదు. ఇట్టి సద్గుణములన్నియుఁ గల్గి సుమంగళవేషమున నొప్పువాఁడు పరమేశ్వరుఁడు కలఁడు. కాని యతఁ డవాప్తసకలకాముఁడగుటంజేసి నన్ను వరించునో వరింపఁడో" అని యిట్లు తలపోయుచు నసాధారణములును మంగళములును, నగు సకల గుణముల కాశ్రయుఁడై ప్రాకృతగుణములు లేక యపేక్షారహితుఁడై యఖిలమునకు నాశ్రయణీయుఁడై యున్నముకుందునిఁ బతిగా వరింపఁ దలంచి,

ఝుంకారము లొనర్చు మత్తమధుకరముల సమూహములు గల తన చేతిలోని పద్మమాలచే నతని మెడ నలంకరించి లజ్జామంద హాసములచేఁ బ్రకాశించు చూపులు ప్రసరింపఁజేసి యతనివక్షస్స్థలమును దనకునివాసముగా నొనర్చుకొనవలెనన్న యూహతో మాటాడక యతనియనుగ్రహమును బ్రతీక్షించుచుండెను. ముల్లోకములకుఁ దల్లియు నఖిలసంపదల కాధారయు నగుశ్రీదేవికి ముల్లోకములకుఁ దండ్రియగునారాయణుఁడు తన వక్షస్స్థలమును నివాసస్థానముగా నిచ్చెను. ఆ శ్రీదేవి యందుండి తన కడకంటిచూపులచేత నే లోకములను లోకాధిపతులను వర్ధింపజేయుచుండె. శ్రీదేవి హరివక్షము నధిరోహించుసమయమున శంఖములు పూరింపఁబడె. మృదంగములు, తప్పెటలు, దుందుభులు వాయింపఁబడె. గంధర్వులు పాడిరి. అచ్చరలును, దక్కిన దేవస్త్రీలు నాడిరి. బ్రహ్మయు, రుద్రుఁడు, మొదలగు వారందఱును బుష్పముల వర్షించుచు, భగవద్గుణములను దెలుపు సత్యములగు మంత్రములచేత నుతించిరి. దేవతలును, బ్రజాపతులును శ్రీదేవి కరుణాకటాక్షములకుఁ బాత్రులై సకల సద్గుణములును, సుస్వభావమును, గలవారై యానందము నొందిరి. దైత్యులును, దానవులును, లక్ష్మిచే నుపేక్షితులై దుర్బలులై, నిరుద్యోగులై మోహము నొందిరి. అనంతరము సురకధిదేవతయగు వారుణీకన్య కమలములవంటి నేత్రములు గలదై సముద్రములోనుండి నిర్గమించెను. దైత్యదానవులు వారియాజ్ఞచొప్పున నామెను బరిగ్రహించిరి. ఓ మహారాజా! దేవదానవులిట్లు విడువని పట్టుదలలతో నమృతము నపేక్షించి సముద్రమును మథించుచుండ నాశ్చర్యముగొలుపు నొకమహాపురుషుఁ

డుదయించె; అతని బాహుదండములు బలిసినవై దీర్ఘములై యుండె. అతని మెడ శంఖమును బోలుచుండె. అతని నేత్రము లెఱ్ఱగా నుండె. అతఁడు లేఁబ్రాయము గలవాఁడై యుండె. అతని వక్షమున వనమాల ప్రకాశించుచుండె. అతఁడనేకవిధము లగునలంకారములఁ దాల్చియుండె. అతని పచ్చని పట్టు పుట్టములు, ఉన్నత మగువక్షస్స్థలము, రత్నమయములై, మనోహరములై యున్న కుండలములు, నల్లని కుటిల కేశములు, జూపఱు హృదయముల నాకర్షించుచుండెను. అతఁడు సింహమువంటి పరాక్రమము గలవాఁడై మందహాసము చేయుచుఁ 'గంకణాలంకృతములగు చేతులతో నమృత భాండమును దాల్చియుండె. అతని పేరు ధన్వంతరి. అతఁడు విష్ణువు నంశాంశములవలన నవతరించినవాఁడు. అతఁడే యాయుర్వేదమును గనిపెట్టెను. అతఁడు యాగములందు దేవతలతోఁబాటు భాగము గలవాఁడు. ఇట్లు వచ్చిన ధన్వంతరిని, నమృతపూర్ణ మగుకలశమును జూచి రాక్షసు లందఱును మిక్కిలి సంతసించి శీఘ్రముగా దాని హరించుటయే కాక సముద్రమునఁ బొడమిన సమస్తవస్తువులనుగూడ దీసికొనిరి. దైత్యులు బలోత్కటులై యమృత కలశమును హరింప దేవత లేమియుఁ జేయఁజాలక విచారించుచు హరినిశరణు సొచ్చిరి. సేవకుల కోర్కుల నెఱవేర్చు నారాయణుఁ డా దేవతల దుఃఖమును జూచి దయగలవాఁడై "ఓసురలారా! మీరు విచారింపకుఁడు. నామాయచే నమృతమును సాధించి మీకిచ్చెదను" యని యిట్లు దేవతల నోదార్చుచు హరియచ్చటనే యంతర్ధానము చెందెను. ఆ సమయమున నమృతమందలి యభిలాషముచే దైత్యులు "నీవుకాదు, నీవుకాదు, నేనే ముం దమృత

మును ద్రావెదను" అని యిట్లు పరస్పరమును గలహించుకొను చుండిరి. వారిలో దుర్బలు లగువారు, "అమృతము నిమిత్తము మనవారుగూడ నెంతయు నర్హులు. సత్రయాగమందు యజమానులవలె నీయమృతమందందఱును సమానఫలమందవలెను. ఇదియే సనాతనధర్మ" మని పలుకుచు మచ్చరముతోడను వారినినిషేధించుచుండిరి; కాని వారు వారిమాటల సరకుగొనక యమృతకలశమును దీసికొని పోవుచుండిరి. అంతలో సకలోపాయముల నెఱింగిన విష్ణువు దేవాదిస్త్రీలందఱునునిరసింపఁజాలిన స్త్రీరూపమును దాల్చి జగముల మోహింపఁజేయు సౌందర్యము గలదగుటచే మోహినియను నామమును వహించె. ఆమె శరీరము నల్లఁగలువవలె శ్యామలమై చూడఁ దగియుండె. ఆమె యవయవములన్నియును,సుందరములై మనోహరములై యుండె. ఆమె చక్కని కర్ణములం దాభరణము లొప్పుచుండె. ఆమె చెక్కిళ్లు మిక్కిలి చక్కఁగానుండె. ఆమె నాసిక యున్నతమై మొగమును నందమిచ్చుచుండె. నవయౌవనముచే బలిసి వట్రువలై యున్న స్తనముల భారము నామె కృశోదరము మోయఁజాలకుండె. ముఖపరిమళము నపేక్షించి వచ్చు తుమ్మెదల ఝుంకారములకు భయపడి నేత్రములు మిక్కిలి చలించుచుండె. వికసించిన మల్లెపువ్వులదండ యామె కేశపాశమునుజుట్టి నెత్తావుల నీనుచుండె. సుందరమగు నామె మెడయం దాభరణములు వెలయుచుండె. శుభప్రదములగు నామె బాహువులందు బాహుపురులు ప్రకాశించుచుండె. ఆమె నితంబము శుభవస్త్రముచే నావృతమై ద్వీపమువలె విశాలమై యుండెను. దాని చుట్టును జుట్టికొనియున్న బంగారుమొలత్రాడు మిక్కిలి సుందర

ముగానుండె. ఆమె చరణములందూ నూపురములు మధురముగా ధ్వనిచేయుచుండె. లజ్జాసహితనుగు మందహాసముల చేతను, భ్రూవిక్షేపముల విలాసముల చేతను, సుందరములగు నామె కడకంటిచూపులు దానవుల మనస్సులందు మోహమును మాటిమాటికిని వర్ధింపఁజేయుచుండె. ఇది యెనిమిదవ యధ్యాయము.

---

మోహిని దైత్యులను వంచించి యమృతమును దేవతలకే పంచుట.

ఇట్టి సౌందర్యవిలాసముతోఁ దమచెంతకు వచ్చుచున్న మోహినీదేవినిఁ గాంచి దైత్యులు పరస్పరమును స్నేహమును విడిచి సుధాపాత్రము నొకనివలన వేఱొకఁడు హరించుచు నామెను సమీపించి "అయారే! యేమి సౌందర్యము! భళీ! యెట్టి దేహకాంతి! వహ్వారే! దీనియౌవన మెంత బాగుగానున్నది!!' యని యిట్లు తలంచుచుఁ గామపీడితులై యామెను వెంబడించి యిట్లనిరి. "ఓకంజాక్షీ! నీవెవ తెవు? ఎందుండివచ్చితివి? నీవేమి చేయఁదలంచి యిట్లువచ్చితివి? నీ వెవనిభార్యవు? నీవృత్తాంతమును దెలియఁజెప్పుమా! నీసౌందర్యము మా మనస్సులను గలంచి యాకర్షించుచున్నది! సురలుగాని దైత్యులుగాని సిద్ధులుగాని, గంధర్వులుగాని, చారణులుగాని, యోగీశ్వరులుగాని, యీసౌందర్యముగల నిన్ను వరింపలేదని యెఱుంగుదుము. ఆలోచింప వారు నిన్ను వరింపఁదగనే తగరు. అమరులే యనర్హులగుచుండ మానవు లెట్లర్హులగుదురు? కావున నీవెవరిభార్యవును గావు? ఓసుందరీ! దయాళువయినయీశ్వరుఁడు శరీరులమగు మామనస్సులకును, మాయింద్రియములకును సంతుష్టినిగల్గింప




1411. మోహినిరూపిణియైన భగవంతుఁడు దైత్యులను వంచించి దేవతల కమృతమును పంచి యిచ్చుట.

నిన్నును సృజించిపంపించెనుగాఁబోలు ! ఇదియే నిశ్చయము. ఓ మానినీ ! మే మీయమృతమునిమిత్తము గలహించుచుంటిమి? బద్ధవైరులమును జ్ఞాతులము నయినమాకు దీనిని లెస్సగాఁ బంచియిమ్ము. మేము కశ్యపుని సంతతివారము. కొందఱ మతని పుత్త్రులము. మఱికొందఱ మతని సోదరులము. మేము సత్కుల జాతులమయ్యు నీయమృతమునకై వివదించుచుంటిమి. ఈవివాదమునశించునట్లమృతమును బంచిపెట్టుము" అనియిట్లుప్రార్థించుచున్నదైత్యుల మొఱ నాలించి మోహినీదేవి మందహాసము గావించి కడకన్నులచే వారినిజూచుచు నిట్లనియె. "ఓదానవులారా ! మీరుపవిత్రమయిన కశ్యపసంతతివారు. నేనుగులటను. అట్టి మీరు నాయందు విశ్వాసముంచి "యిక్కార్యంబు నెఱవేర్పు" మనుట కచ్చెరువు చెందుచుంటిని. పండితు లగువారు స్త్రీల నెప్పుడును విశ్వసింపరుసుఁడీ ! ఓసురవైరులారా ! మావంటి కులటలస్నేహము తోఁడేళ్లస్నేహమువలె ననిత్యమైనది. అప్పటి కప్పుడే క్రొత్తమార్గములఁ బట్టుచుండును. కావున నన్ను మీరు నమ్ముటయుక్తముగాలే"దని పలుక నామోపరిహాస వాక్యములు విని దైత్యులు చంచలచిత్తులై గంభీరముగా నవ్వి యమృతపాత్రమును నొసంగిరి. మోహిని యాపాత్రమును జేకొని మందహాసముచేయుచు వారింజూచి "ఓ యసురలారా ! నాచేసిన పంపక మొకప్పుడు న్యాయ్యమైనను, నన్యాయ్యమైన మీ రంగీకరించినచో నీ సుధను బాగుగా విభజించెదను" అని పలికెను. దానవు లావాక్యమునువినితద్వాక్య నిశ్చయమును దెలియఁజాలక "నీయిష్టప్రకారము చేయు" మని పలికి యనుమోదించిరి. అనంతరముఖ్యవారామె యాజ్ఞచొప్పున

నుపవాసముచేసి స్నానముచేసికొని హవిస్సుచే నగ్నినిబూజించి బ్రాహ్మణులకును, భూతములకును, దదితరులకును, యథార్హముగా నానాదానములను జేసి వారివలన నాశీర్వచనములను గైకొని నూతనవస్త్రములఁ దాల్చి యలంకరించుకొని తూర్పునకుఁ జివరలుండున ట్లమర్పఁబడినదర్భలపైఁ గూర్చుండిరి. సురలు నట్లె చేసిరి. ధూపములచే సువాసితమై, పూలదండలచేతను దీపములచేతను నలంకృతమై, యున్న శాలయందు సురాసురులు ప్రాఙ్ముఖులై దర్భలయందుఁ గూర్చుండియుండఁగా నమృతకలశమును జేకొని మోహినీదేవి యాశాలను బ్రవేశించెను. ఆమె తొడలు వర్తులములై కరితుండములను బోలుచుండె. ఆమె నితంబము సుందరవస్త్రముచేఁ దనరారుచుండె. విశాలమైన కటిభారముచే నామెగమనము మందమగుచుండె. మదముచే నామె నేత్రములు తిరుగుపడుచుండె. ఆమె బంగారపు టందెలు మనోహరముగా ధ్వనిచేయుచుండె. అమె స్తనములు కుంభములఁబోలుచుండె. ఇట్లు శ్రీదేవివలె నొప్పారుచు, సుందరములయినకుండల కాంతులచేఁ గర్ణములును, నాసికయును, జెక్కిళ్లును, ముఖమును, బ్రకాశింపఁ పైఁటకొంగు జాఱుచుండఁ బరదేవతవలె నిరుపమానసౌందర్యముతో నందుఁ బ్రవేశించిన మోహినిని గాంచి యామె కడకంటి చూపులకుఁ జిక్కి దేవాసురులు మోహమును జెందిరి. అనంతరము మోహిని దైత్యులకమృత మొసంగుట పాములకుఁ బాలువోయుటవంటిదనియు, స్వభావముచేతనే దుష్టులయినవారి కమృత మొసంగిన లోకములు నిలుచుటకష్టమనియుఁ దలంచి దేవతలను, దైత్యులను, వేఱువేఱుగాఁ గూర్చుండఁబెట్టి మందహాసముచేతను, బ్రియ

వాక్యములచేతను, గడకంటి చూపులచేతను దైత్యులను వంచించి జరామరణములను హరించు నా యమృతమును దేవతలచేఁ ద్రావించె. దైత్యుల కొక యమృతబిందువైనను దక్కలేదు. అయినను వారు తొలుత మోహినియెదుటఁబలికినమాటలను దాఁటఁజాలక యామెయందు నమ్మకము గలవా రగుటచేతను స్త్రీతో వివదించుట నింద్యమని యెఱింగినవా రగుటచేతను నేమియుఁ బలుకకూరకుండిరి. మఱియుఁ దా మొకవేళ నిష్ఠురముగా నడిగినచో నామెస్నేహము చెడునని భయపడుచు నామె బహుమానవచనములకుసంతసించుచుఁ, గొంచెమేనియు విప్రియముపలుకలేకపోయిరి. రాహువనురక్కసుఁడొకఁడు దేవతావేషమును దాల్చి దేవతల పంక్తిలోఁ గూర్చుండి యమృతమును ద్రావెను. అది సూర్యచంద్రులు గనుఁగొని మోహినికిఁ గనుసన్న చేయ నామె నిశితధారలు గలచక్రముచే నమృతమును ద్రావుచున్న యారాహువుతలను ఖండించెను. వాని మొండెమున కమృతమంటకపోవుటచేఁ గ్రిందఁబడెను. వాని శిరస్సు సుధాసంస్పర్శమువలన నమరత్వమునొందెను. బ్రహ్మ యారాహువును గ్రహమునుగా నొనర్చె. గ్రహత్వమునుబొంది యు రాహువు పూర్వవైరమును విడువక పర్వదినములందు సూర్యచంద్రులను గ్రసించుచుండును. దేవతలంద అమృతమును ద్రావినతోడనే మోహిని దైత్యులు చూచుచుండఁగాఁ బురుషరూపమునొందెను. ఓరాజా! దైత్యులు దేవతలతోఁ బాటు క్షీరసాగర తీరమును జేరి మందరపర్వతముచే మథించి మిక్కిలి శ్రమలొంది యమృతమును సాధించినవారయినను దైవానుగ్రహమువలన సురలమృతమును సుఖముగాఁ ద్రావఁ

గల్గిరి. దైత్యులువిష్ణువునకుఁ బ్రతికూలురగుటంజేసి యమృతము నొందలేకపోయిరి. పృథగ్భావము నొందియుండుటచేఁ జెట్టు కొమ్మలకుఁ జేసిన జలసేచనము వ్యర్థమగును. అట్లె ప్రాణము చేతను, ధనముచేతను, మనస్సుచేతను, వాక్కులచేతను, తన దేహమునిమిత్తము, దారసుతాదులనిమిత్తముచేయఁబడినకర్మ, మహంకారము మమకారము మొదలగు వేఱువే ఱభిమాన ములు గలదగుటచే నిష్ఫలమగుచున్నది. చెట్టునకుఁ బ్రధాన మయినమూలమునను జలాదులచేఁ దడిపిన సఫలమగు. అట్లె సర్వ మున కంతరాత్మయై సర్వకారణుఁడై యున్న యీశ్వరునిమి త్తము ప్రాణాదులచేఁ జేయఁబడిన కర్మము సఫలమగును. కావున సమస్తము బ్రహ్మాత్మకమనియే నిశ్చయించి తదారాధన బుద్ధితోఁ జేసినదంతయు ఫలవంత మగునని యెఱుంగుము. ఇట్టి బుద్ధి లేకపోవుటచేతను, హరిభక్తికి విముఖు లగుటచేతను దాన వులు హరిని సంతసింపఁజేయలేక పోయిరి; తత్ఫల మగు నమృత మును జెందలేకపోయిరి. ఇది తొమ్మిదవయధ్యాయము.

---

## దేవదానవ యుద్ధము.

ఓ రాజా! భగవంతుఁ డీప్రకారముగా సుధారసమును సాధించి సురలచేఁ ద్రావించి గరుడునిపైఁగూర్చుండి సర్వభూత ములును జూచుచుండఁగనే యటనుండి వెడలిపోయెను. పిమ్మట దైత్యులు తమజ్ఞాతు లయినదేవతలకుఁ గల్గిన మహాఫలమును గాంచి సహింపలేక యాయుధములను దాల్చి సురలను జంప వెంబడించిరి. సురగణము లమృతపానముచే నతిబలులై నారా

యణు పాదపద్మముల నాశ్రయించినవారై తమ్మెదిరించివచ్చు చున్నరక్కసుల నెదుర్కొనిరి. ఆ సముద్రతీరమున దేవదానవులకు ఘోరయుద్ధము సంభవించె. దానిఁ దలంచుకొన్న దేహమునఁ బులకలు పొడముచును. జ్ఞాతు లయినయా దేవదానవులు పరస్పరమును గోపమును వహించి యొకరినొకరు దార్కొని ఖడ్గములచేతను, బాణములచేతను, నానావిధాయుధముల చేతను గొట్టుకొనిరి. ఆసమయమున శంఖములు, మద్దెలలు, దుందుభులు మొదలగు వాద్యవిశేషముల ధ్వనులును, గజముల బృంహితములును, గుఱ్ఱముల హేషలును, రథముల చప్పుళ్లును, బదాతుల సింహనాదములును గలిసి భూమ్యాకాశములను నిండించె. ఆరణమున రథికులు రథికులతోను, బదాతులు పదాతులతోను, గుఱ్ఱములు గుఱ్ఱములతోను, గజములు గజముల తోను దార్కొనిరి. దేవాసురులలోఁ గొందఱు లొట్టియల నెక్కిరి. కొందఱు గజములపైఁ గూర్చుండిరి. కొందఱు గాడిదల నారోహించిరి. కొంద ఱెలుఁగుబంట్ల నధిష్ఠించిరి. కొందఱు పెద్ద పులులను, కొందఱు సింహములను, గొందఱు గ్రద్దలను, గొంద ఱు రాఁబులుఁగులను, గొందఱు తోఁడేళ్లను, గొందఱు డేగలను, గొందఱు తిమింగిలములను, గొందఱు శరభమృగములను, గొందఱు గాఱుదున్నలను, గొందఱు ఖడ్గమృగములను, గొందఱు గోవ్రలను, గొంద ఱెడ్లను, గొందఱు గవయవములను, గొందఱు నక్కలను, గొంద ఱెలుకలను, గొందఱు తొండలను, గొందఱు గుక్కలను, గొందఱుమనుష్యులను, గొందఱు మేఁక లను, గొందఱు దుప్పులను, గొందఱు హంసలను, గొందఱు పందులను, మఱికొందఱు స్థలజల పక్షులను, నింకొకకొందఱు

వికృతాకారము గలజంతువులను నెక్కి యుభయసేనాముఖ ములను బ్రవేశించిరి. ఓ రాజా! చిత్రము లగుధ్వజపటముల వలనను. మిక్కిలి విలువగల్గి వజ్రదండములైన తెల్లనిగొడు గులచేతను, వజ్రదండములు గలవీవనలచేతను, వింజామరల చేతను, వాయువుచేఁ జలించుచున్న తలపాగలచేతను, ధ్వని చేయుచున్న కవచములచేతను, భూషణములచేతను, సూర్య కాంతిలోఁ దళతళమని మెఱయు శస్త్రములచేతను, వీరసమూ హములచేతను బ్రకాశించుచున్న దేవదానవుల సైన్యములు జలజంతువుల పంక్తులతోఁ గూడిన సముద్రములవలె నొం డొంటిఁ దార్కొనియె. దానవసేనలకెల్ల నధిపతి యగుబలి, మయనిర్మితమై, యుద్ధసాధనములతోఁ గూడినదై, పెద్దదై, యందఱకు నచ్చెరువు గొలుపుచు నిరూపమానమై, కామగమ నము గలదై, మిక్కిలి కాంతిగల దగుటచే దుర్నిరీక్ష్యమై, వైహాయస మను పేరుగల్గియున్న విమానము నెక్కి ఛత్రచామ రములు మొదలగు రాజచిహ్నములతోఁగూడి సకల సైన్యము లచే సేవింపఁబడుచుఁ బొడుపుఁగొండయందు దున్నచంద్రునివలెఁ బ్రకాశించుచుండె. సేనాధిపతు లయిననముచియు, శంబరుఁ డును, బాణుఁడును, విప్రచిత్తియు, నయోముఖుఁడును, ద్విమూ ర్ధుఁడును, గాలనాభుఁడును, బ్రహేతియు, హేతియు, నిల్వలుఁ డును, శకునియు, భూతసంత్రాసుఁడును, వజ్రదంష్ట్రుఁడును, విరో చనుఁడును, హయగ్రీవుఁడును, శంకుశిరుఁడును, గపిలుఁడును, మేఘదుందుభియు, దారకుఁడును, నుగ్రనేత్రుఁడును, శంభుఁ డును, నిశుంభుఁడును, జంభుఁడును, నుత్కలుండును, నరిష్టుఁ డును, నరిష్టనేమియు,ద్రిపురులును, బౌలోమకాలకేయులును,

నివాతకవచులును, మఱికొందఱు దానవశ్రేష్ఠులును, బలికి నలుదిక్కులనడుచుచు సేవించుచుండిరి. ఈ రాక్షసవీరు లందఱు నమృతము నిమిత్తము మిక్కిలి శ్రమచెందియుఁ దద్భాగమును బొందలేకపోవుటచే నతికోపమును వహించియింతకుఁబూర్వము దేవతల మర్దించినవారే కావున నిప్పుడు నట్లే చేయవచ్చునని తలంచి సింహనాదములఁ జేయుచు, శంఖములను బూరించుచుఁ బైకిఁ గవయుచుండిరి. ఉద్ధతులై తమపైకి విజృంభించుచున్న శత్రువులంగాంచి యింద్రుఁడు సెలయేళ్లతోఁ గూడిన యుదయాద్రిని సూర్యునివలె దిగ్గజమైనయైరావతమునెక్కి యాకాశమునఁ బ్రకాశించెను. ఆసమయమున నానావిధములగు నాయుధములఁదాల్చి పలురకము లగుధ్వజములు ప్రకాశింప, వాయువు, వహ్ని, వరుణుఁడు మొదలగులోకపాలకు లందఱును దమతమ సైన్యములతో నింద్రునికిఁ జుట్టును నడుచుచుండిరి. ఇట్లు ప్రోవుపడి యుభయపక్షముల వీరులును బరస్పరము నాక్షేపించుకొనుచు, నొకరినొకరు పిలుచుకొనుచు, రణముఖమును బ్రవేశించి ద్వంద్వయుద్ధముచేయ మొదలిడిరి. అందు బలితో నింద్రుఁడును, దారకునితోఁ గుమారస్వామియు, హేతితో వరుణుఁడును, బ్రహేతితో మిత్రుఁడును, గాలనాభునితో యముఁడును, మయునితో విశ్వకర్మయు, శంబరునితో త్వష్టయు, విరోచనునితో సవితయు, నముచితోఁ బరాజితుఁడును, వృషపర్వునితో నశ్వి దేవతలును, బాణాసురుఁడు మొదలగు బలిపుత్రులు నూర్గురతోను సూర్యుఁడును, రాహువుతో జంద్రుఁడును, బులోమునితో వాయువును, శుంభనిశుంభులతో బలవతి యగుభద్రకాళియు, జంభునితో వృషాకపియు, మహిషా

సురునితో విభావసువును, వాతాపితోను నిల్వలునితోను బ్రహ్మపుత్రులును, దుర్మర్షునితోఁ గామదేవుఁడును, నుత్కలునితో బ్రాహ్మీ మొదలగు సప్తమాతృకలును, శుక్రునితో బృహస్పతియు, నరకునితో శనైశ్చరుఁడును, నివాతకవచులతో మరుత్తులును, గాలకేయులతో వసువులును, పౌలోములతో విశ్వేదేవులును, క్రోధవశు లనెడిరక్కసులతో రుద్రులును, నెదుర్కొని యుద్ధ మొనర్చుచు సమీపించి జయేచ్ఛ గలవారై తీవ్రము లయిన బాణములచేతను, ఖడ్గములచేతను, దోమరములచేతను, భిండివాలములచేతను, జక్రములచేతను, గదలచేతను, బట్టిసములచేతను, శక్తులచేతను, గొడ్డవులచేతను, గండ్రగొడ్డండ్లచేతను, నిస్త్రింశములచేతను, బల్లెములచేతను, బరిఘములచేతను, ముద్గరములచేతను, గొట్టికొని శిరస్సును ఛేదించుకొనిరి. ఏనుఁగులును, గుఱ్ఱములును, బదాతులును, రథములును, సారథులును బెక్కువిధములుగా ఖండింపఁబడిరి. భిన్నము లయినబాహువులును నుగ్గైన తొడలును, దెగిన కంఠంబులును, శిథిలము లయినపాదములును, శకలము లయినధ్వజములును, జీర్ణము లయిన యమ్ములపొదులును, జినిఁగిన కవచములును, రాలిపడిన యలంకారములును గల్గి యుద్ధభూమి భయంకరముగా నుండె. దేవదానవవీరుల పదఘాతములచేతను, రథచక్రములచేతను బూర్ణిత మైనసమరరంగమునుండి పరాగము మొదట దట్టముగా లేచి దిక్కులను, నాకాశమును, సూర్యునిఁ గప్పివుచ్చెను. కాని యనంతరమందే యాభూమి రక్తధారలచేఁ దడియుటంబట్టి యా ధూళులు నివర్తించినవి. శిరోవిహీనము లయినమొండె

ములు చేతులతో నాయుధములు దాల్చి యా యుద్ధభూమి యందు భటులవలె సంచరించుచు జూపఱ కాశ్చర్యముపుట్టించు చుండెను. ఆసమయమున బలి ఘోరముగాఁ బోరుచు నింద్రునిఁ బదిబాణములచేతను, మూఁడుశరములచే నైరావతమును, నాలుగమ్ములచే నాల్గు గుఱ్ఱములను, నొకబాణముచే మాతలిని నొప్పించెను. విలువిద్యయందు నేర్పు గలయింద్రుఁడు తనపైకి వచ్చుచున్నయాబాణములను జూచి మందహాసము చేయుచు వాడిశరములఁ బ్రయోగించి మార్గమధ్యమందే ముక్కలు గావించెను. ధనుర్విద్యయందా యింద్రునకుఁ గల నేర్పు పెంపునుజూచి బలి సహింపఁజాలక భయంకర మగుశక్తిని బ్రయోగించెను. మహోల్కవలెఁ బ్రకాశించుచుఁ దనపైకి నడ వచ్చుచుండ నింద్రుండు దాని క్షణములోనే తునిమివైచెను. అనంతరము బలి క్రుద్ధుండై శూలమును, బిమ్మటఁ బ్రాసమును, దరువాతఁ దోమరమును బ్రయోగించెను; కాని వానినన్నింటిని నింద్రుండు త్రుంచివైచెను. అంత బలి యంతర్ధానము చెంది తనమాయలను సృజించెను. తోడనే సురసైన్యములపైఁ బర్వతములును, కార్చిచ్చుచేఁ గాలుచున్నవృక్షములును, వాఁడియైన శిఖరములు గలశిలలును బడి చూర్ణము గావించుచున్నట్లు తోఁపించెను. ఆ యుద్ధభూమియందుఁ గ్రూరసర్పములును దందశూకములును, తేళ్లును, సింహములును, బెద్దపులులును, వరాహములును, గజములునుసంచరించి దేవతల బాధింపఁజొచ్చెను. వందలకొలఁది రాక్షసులును, రాక్షసస్త్రీలును శూలహస్తలై వస్త్రవిహీనలై నలుదిక్కుల నిండి "చంపు. పొడువు" అని పలుకుచు, దేవసైన్యముపైఁ గవిసిరి. మేఘము గంభీరము

గాను, గర్ణకఠోరముగాను ధ్వనిచేయుచు నాకసమున నిట్టటు సంచరించుచు నిప్పులను వర్షింపఁజొచ్చె. బలిచే సృజింపఁబడిన వాయుసహిత మగు నగ్ని ప్రళయాగ్నివలె భయంకరముగాఁ జూపట్టుచు దేవ సైన్యమును దహింపఁ దొడఁగెను. ఆ సమయమున నాల్గు దిక్కులనుండియు గట్టుల నతిక్రమించి వాయూద్ధూతము లయినతరంగములచేతను సుళ్లచేతను, భయంకరమై పొంగి పొరలివచ్చు చున్నసముద్రములు దేవతలకుఁ గానవచ్చె. ఇట్లు బలి పలువిధములును, భయంకరములును, నగు మాయలను సృజింప సురసైనికులు మిక్కిలి దుఃఖించిరి. దేవేంద్రాదులామాయల నడఁగింపఁజాలక విష్ణువును ధ్యానింప జగత్కర్త యగునాపరమేశ్వరుఁడు గరుడునిమూఁపుపైఁ బాదములుంచి పచ్చని పట్టువస్త్రములను ధరించి పద్మములవంటి లోచనములు గలవాఁడై శ్రీవత్సముచేతను,మిక్కిలివిలువ గలకిరీటముచేతను, గుండలములచేతను, బ్రకాశించుచు, నెనిమిదివిధములగు నాయుధములను ధరించి వెంటనే సాక్షాత్కరించెను. మెలఁకువ వచ్చినపిమ్మట స్వప్నములవలెను, హరిస్మరణము గల్గినతర్వాత సకలవిపత్తులవలెను, భగవంతుఁడు సాక్షాత్కరించిన తోడనే యతని తేజోమహిమచే బలి సృజించిన మాయాజాలమంతయును నశించెను. యుద్ధభూమి కరుదెంచిన విష్ణువును గాంచి సింహవాహనుఁడైన కాలనేమి భయంకర మగుశూలము నొకదానినిగొని గిరగిరఁద్రిప్పి విష్ణువుపైకిఁ బ్రయోగించె. అది పోయి గరుడుని మూఁపుపైఁ బడెను. త్రిలోకాధిపతి యైనవిష్ణువాశూలమును లీలగాఁ గొని వాహనముతోఁ గూడ నా రక్కసునిఁ జక్కడఁచెను. వాని మరణమును జూచి మాల్యవంతుఁడు

తీవ్ర మయినగదను దాల్చి హరికి వాహన మయినపక్షీంద్రునిఁ బొడిచి సింహనాదము చేసెను. అట్లు మహాధ్వనిచేయుచున్న శత్రువును మాల్యవంతునిఁ జూచి హరి సహింపలేక వాని శిర మును జక్రముచే ఖండించెను. ఇది పదవయధ్యాయము.

---

## సురాసుర యుద్ధము.

అనంతరమునఁ బరమపురుషుఁ డయినవిష్ణువుదయనలన రాక్షసమాయలనుగడచి యింద్రాదిదేవతలు పూర్వముతమతో ద్వంద్వయుద్ధమునకుఁ దారసిల్లిన దైత్యులతో మగుడ యుద్ధ మునకు సమకట్టి వారల నానావిధములఁ బీడించిరి. అందు దేవేంద్రుఁడు మిక్కిలికోపించి తన్నెదురుకొన్నబలిని వజ్రాయు ధముచేఁ జంప యత్నింప నదిచూచి ప్రజలు హాహాకారములు చేయఁ దొడంగిరి. అప్పుడింద్రుఁడు మిక్కిలి కోపియై యుద్ధాభి లాషగల్గి యుద్ధభూమియందు మహాగర్వముతో సంచరించు చున్నబలింజూచి తిరస్కరించుచు నిట్లుపలికెను. "ఓరీమూఢా! నానావేషములచేఁ గన్ను దెఱవని యజ్ఞులను మోసపుచ్చి వారి ధనంబు హరించునట్లు నీచందమున సకలమాయాధిపతులమగు మమ్ము నీమాయలచే జయింపనెంచితివి. నీమాయలకుఁ జిక్కు వారముకాము. ఓ తెలివిమాలినవాఁడా! ఇంతకుముం దనుభ వించు పదవులకంటె నున్నతపదవులను, నింతకుమున్ను మీరున్నలోకములకంటె నుత్తమలోకములను బొందఁదలంచు చున్నారు. వానిని మీరపహరింప సమకట్టు చున్నదొంగలు. అట్టి తుచ్ఛు లగుమిమ్మిప్పుడే చంపెదను. ఓమందబుద్ధీ! ఇదిగో

నూఱంచులు గలయీవజ్రాయుధముచే నిప్పుడే చెడుమాయలు పన్నునట్టి నీశిరంబును ఖండించెదను. పాఱిపోక నీజ్ఞాతులతోఁ గూడి నీపౌరుషము చూపుము" అని పలుకుచున్న యింద్రుని వాక్యములువిని బలి యిట్లనియె. "ఓసురేంద్రా! పల గర్వించెదవు? పూర్వము చేసికొనినకర్మమే కాలచోదితమై మన కీజన్మమున వరుసగా జయమును నపజయమును సుఖదుఃఖములును గలిగించుచుండును. అట్టికర్మము గలవీరుల కవి కాలక్రమమున సంభవించుచుండును. నీవిప్పు డొకవేళ యశమును జయమును బొందినను నీ కవి సర్వదా నిలిచియుండవు. నాపూర్వకర్మము మంచిదైనచో నీకిప్పుడు సంభవించినజయాదులునాకే సంభవించును. ఇంతమాత్రమున సంతసించుట కే మున్నది? లోకమునఁ బండితులగువారు కర్మవశమున సంభవించెడి సుఖదుఃఖముల ననుభవించు జనులను గాంచి సంతసింపరు; దుఃఖింపరు. ఇట్లుండఁ నీ వది యెఱుంగక జయాపజయములను గూర్చి సంతసించుచు విచారించుచు నున్నావు. నీవవివేకులలో మొదటివాఁడవు. కీర్తికిని జయమునకును, దేహమే సాధనమనితలంచినచో సాధువులు మిక్కిలి విచారింతురు. అట్టియవివేకులగుమిమ్మును మీవలె మేము నిందావాక్యములు పలుకము" అనియిట్లాయింద్రునాక్షేపములచేత నే కాక వీరశ్రేష్ఠుఁడయినబలి కర్ణాంతమువఱకు నాకర్షింపఁబడిన బాణములచేతను నతనిఁగొట్టెను. యథార్థవాది యగుబలిచేఁ దిరస్కృతుఁ డయినయింద్రుఁడా యాక్షేపము నంకుశఘాతమును గజమువలె సహింపలేక శత్రువులఁ జంపునదియు, వ్యర్థముకానిదియు నగు తన వజ్రాయుధము నతనిపైఁ బ్రయోగించెను. బలి యాదెబ్బఁదిని తెక్కలు

దెగిన పర్వతమువలె వాహనముతోఁగూడ నేలఁగూలెను. అంత జంభాసురుఁడు యుద్ధభూమిపైఁ బడిన తనమిత్రుని బలినిగాంచి యతనిస్నేహమును బురస్కరించుకొని యింద్రునెదుర్కొనెను. సింహవాహనారూఢుఁ డయినజంభుఁ డిట్లు దేవేంద్రుని సమీపించి యతిరయమున గదనుదీసికొని గిరగిరఁద్రిప్పి యతని కంఠముపైఁ గొట్టెను. అట్లేయైరావతమునుగూడ నొప్పించెను. ఆగజమాగదాఘాతమునోర్వలేక వివశత్వమునొందిమోఁకాళ్లఁబడి మిక్కిలి దుఃఖమును జెందెను. ఆసమయమున సారథియగు మాతలి వేయుగుఱ్ఱములఁ బూన్చినరథమును గొనిరాఁగా నింద్రుఁడాగజమును విడిచి రథమధిరోహించెను. మాతలి తన ప్రభువునకుఁ జేసినయుపకారమును మెచ్చుకొనుచు జంభుఁడు ప్రకాశించు చున్నశూలము నొకదానిఁగైకొని మందహాసము చేయుచు నింద్రసారథిని బొడిచెను. కాని యతఁ డంతతోఁ జలింపక ధైర్యమవలంబించి యాపోటును లక్ష్యముచేయలేదు. మరల నారక్కసుఁ డాయుధమును దీసికొనునంతలో నింద్రుఁడు వజ్రముచే వాని శిరస్సును ఛేదించెను. ఇంద్రునిచే జంభుఁడు చచ్చెనన్నవార్త నారదునివలన విని వాని జ్ఞాతులయిననముచియు, బలుఁడును పాకుఁడును నతిరయమునఁబఱతెంచి యింద్రుని సమీపించి పరుషవచనములచే వాని మర్మస్థానములను ఛేదించుచు, మేఘములు జలధారలచేఁ బర్వతములనువలెబాణవర్షముచే వానిఁగప్పివుచ్చిరి. అందు శరసంధానమందుమిక్కిలి నేర్పు గలబలాసురుఁడు దేవేంద్రుని నొకబాణముచేతను నతని గుఱ్ఱముల వేయింటిని వేయుబాణములచేతను, నొక్కమాఱు నొప్పించెను. అప్పుడే పాకాసురుఁడు చూచువా రాశ్చర్యము

చెందునట్లు బాణముల సంధించుచు విడుచుచు, నవలీల రెండు వందల శరములచే మాతలిని, రథమును దట్టముగాఁ గొట్టెను. ఓరాజా; ఆసమయమునఁ బాకాసురుని ధనుర్విద్యాకౌశలమున కచ్చెరువొందనివారు లేరు. మూఁడవవాఁ డగునముచి బంగారు పిడులుగల పదునేనుమహాశరములచే నింద్రుని నొప్పించి వర్షాకాల మేఘమువలె గంభీరముగా నఱచెను. ఈవిధమున నా రాక్షసవీరులు వర్షాకాలమందు సూర్యుని మేఘములవలె రథసారథులతోఁగూడ నింద్రుని శరవర్షముచేఁ గానరాకుండఁ జేసిరి. తమ ప్రభువయినయింద్రునిఁ గానక సురగణములు మిక్కిలి వివశత్వమునొందిదిక్కులేనివారయిసముద్రమధ్యమున నావ పగిలిపోవుటచే మిక్కిలిభీతిచెంది తమ రక్షణకై విలపించు వర్తకులవలెఁ గడుంగడు వాపోవఁజొచ్చిరి. అంతఁ గొంతవడి కింద్రుఁ డాశరపంజరమును భేదించుకొని తన యశ్వములతోను రథముతోను, సారథితోను, ధ్వజముతోను బైకివచ్చి నిశావసానమందు సూర్యునివలె నిజతేజముచే భూమ్యాకాశములను దిక్కులను బ్రకాశింపఁజేయఁ జొచ్చెను. రాక్షసవీరులచేఁ బీడింపఁబడుచున్నతనసేననుగాంచి మిక్కిలికోపించి యింద్రుఁ డా శత్రువుల దండింప వజ్రాయుధమును గైకొని బలపాకాసురుల శిరముల నొక్కమాఱె ఛేదించెను. అదిచూచి వారి జ్ఞాతులు మిక్కిలి భయమందిరికాని మహాబలుఁ డగునముచిమాత్ర మెంతమాత్రమును జంకక తనజ్ఞాతుల మరణమువలనఁ గల్గిన శోకమునకును, గోపమునకును నధీనుఁడై యింద్రు నెట్లయినను జంపవలెనని నిశ్చయించి ఘంటలతోను, బంగారునగలతోను, వెలయుచున్నలోహమయ మగుశూలమును స్వీకరించి "ఓరీ!

యింద్రా! దీనిచేఁ జచ్చితి” వని సింహనాదము చేయుచు ప్రయో
గించెను. ఆకాశమునుండి మహోల్కవలె భయంకరమై వచ్చు
శూలమును గాంచి యింద్రుఁడు బాణపరంపరచే వేయిముక్క
లుగాఁజేయుటయే కాక క్రోధోద్దీపితుఁడై వజ్రాయుధమును వాని
శిరస్సును ఛేదింపఁ బ్రయోగించెను. వజ్ర మిట్లు దేవేంద్రుని
యావచ్ఛక్తిచేతను బ్రయుక్తమైనను, నింతకుఁ బూర్వ మతి
బలుఁడయినవృత్రునిఁ జంపినదైనను నది నముచిచర్మమునైనను
భేదింపకపోయెను. ఆ యశక్తతనుఁ జూచి యచ్చటి వారందఱు
నచ్చెరువడిరి. తన వజ్ర మతనియెడ వ్యర్థమైనందుల కింద్రుఁడు
మిక్కిలి భీతుఁడయి “అకటా! దైవయోగముచే నా యాయు
ధము భూతలోక మాశ్చర్యము చెందునట్లు వ్యర్థమైనదేమి?
తమభారముచేఁ బ్రజాక్షయము చేయు పర్వతముల ఱెక్కల నేది
ఛేదించెనో, యేది త్వష్టృప్రజాపతి తపోతిశయమునఁ గల్గినవృత్రు
నవలీల జయింపఁగల్గెనో, యేది యితరాయుధములచే జయిం
పఁబడని బలిని, జంభుని, బలునిఁ, బాకుని నిర్జింపఁగల్గెనో, యట్టి
వజ్రాయుధము నాచేఁ బ్రయుక్తమయ్యు నల్పుఁ డయిననము
చిని జయింపక లేకపోయెను. బ్రహ్మతేజమునకు నిధియైనదధీచి
మహాముని సామర్థ్యమేయైన నిది యిప్పుడు నిష్కారణముగా
సామాన్యదండమువంటిదయ్యె. ఇట్టిదాని నేఁ బరిగ్రహింపను”
అని యిట్లు తనలో విచారించుచున్నసమయమున “ఓయీ
యింద్రా! యీ రాక్షసుఁడు తడి గలయాయుధములచేఁ జావఁడు.
తడిలేని యాయుధములచేతను జావఁడు. అట్లు చావకుండుట
కితనికిఁ బూర్వము వరమిచ్చియున్నాను. నీవజ్రము శుష్కమైనం
దున వీనిఁ జంపలేకపోయెను. వీని మరణము నిమిత్తముపాయాం

తగ మాలోచింపనలయు" నని వినవచ్చిన యశరీరవాక్కు విని సమాహితచిత్తుఁడై తాదృశవస్తు వేదియో యని చింతించి చింతించితుదకట్టివస్తువునురుఁగుగాక వేఱొకటిగాదని నిశ్చయించి దానిని దెచ్చి వజ్రమునకుఁ బులిమి దానిచే నముచిని సంహరించెను. ఇట్లతి ప్రయత్నముచే నముచి సంహారమును గావించిన యింద్రునిఁ గాంచి మునులు మిక్కిలి నుతించి పుష్పమాలికలచే నలంకరించిరి. గంధర్వశ్రేష్ఠులయినవిశ్వావసుపరావసులుగానము చేసిరి. దేవతలు దుందుభుల మ్రోయించిరి. దేవతాస్త్రీలు నాట్యముచేసిరి. ఆయింద్రుఁడు బలి పాకాదులను జయించినట్లే వాయువు వరుణుఁడు మొదలగువారందఱును భయంకరములగునాయుధములఁ దాల్చి తమ్ముఁ దార్కొన్న దానవులను, సింహములు మృగములవలె, సంహరింపఁ జొచ్చిరి. ఆసమయమున ఘోరముగా జరుగుచున్న దానవనాశనమును గాంచి దానిని వారింపనెంచి నారదుని బంపెను. నారదుఁ డప్పుడు సత్వరమున వచ్చి దేవతలంజూచి" ఓ సురలారా ! నారాయణ పాదాశ్రయు లయిన మీరమృతమును ద్రావఁబాలు భాగ్యము నందితిరి. దాన ముల్లోకములును లక్ష్మీసంపన్నము లయి వఱలు చున్నవి. మీ కీకలహముతో నేమి ప్రయోజనము ? మరలుఁడు మరలుఁడు" అని పల్కిన నారదుని పలుకులు మన్నించి యింద్రాదిదేవతలు కోపము నడంచుకొని తమతమ సేవక బృందములు గొలువ స్వర్గపురమున కరిగిరి. నారదుని దయ వలనఁ జావకుండ మిగిలిన దైత్యులుకూడ వజ్రప్రహారము దిని నేల మూర్ఛిల్లి యున్నబలిని దీసికొని యస్తాచలంబునకుఁ బోయిరి. అంత దైత్యగురు వగుశుక్రుఁడు తన మృతసంజీవినీ

విద్యచే యుద్ధమునఁ బడినదైత్యులలోఁ బెక్కండ్రను బ్రది
కించెను. అనంతర మతఁడు మూర్ఛిల్లిన బలియొద్ద కేఁగి
స్పృశింప నతఁడును లేచి కూర్చుండెను. ఓరాజా! బలి దుస్సహ
మగు పరాజయము నొందినను, జయాపజయంబులును, సుఖ
దుఃఖంబులు మొదలగునవి కర్మాధీనములయి వచ్చుచుండు
ననెడి జ్ఞానము గలవాఁడగుటంజేసి దానికై సుంతేనియు విచా
రము నొందలేదు. ఇది పదునొకండవ యధ్యాయము.

---

### శంకరుఁడు మోహినీరూపమునుఁజూచి మోహితుఁడై వెంబడించుట.

ఓరాజా! శ్రీహరి మోహినీరూపముఁ దాల్చి దానవుల
మోసపుచ్చి సురగణములచే నమృతము ద్రావించినట్లు శంక
రుఁడు విని పార్వతీసహితుఁడై వృషభము నెక్కి భూతగణ
ములు గొల్చివచ్చుచుండఁగా బయలువెడలి విష్ణువుచెంత కేఁగి
యతని గౌరవమును బడసి సుఖాసనమున నాసీనుఁడై హరికిఁ
బ్రతిపూజ లర్పించి మందహాసము చేయుచు నిట్లనియె. "ఓపర
మేశ్వరా! నీవు బ్రహ్మాదిదేవతలకుఁగూడ దేవుఁడవు. సకల జగ
ములందును వ్యాపించినవాఁడవు. జగత్తులే శరీరముగాఁ గల
వాఁడవు. చేతనాచేతనాత్మకము లగుపదార్థములకు నీ
వాత్మవు. నీవు సమస్తమునకును గారణభూతుఁడవు. "ఓదేవా!
సూక్ష్మ చిదచిద్విశిష్టుఁడగు నీవలన నీజగము పుట్టుచున్నది. నీవల
ననే, దీనికి నాశము గలుగుచున్నది. నీవలననే యిది వర్ధిల్లు
చున్నది. ఈవిశ్వముకంటె విలక్షణుఁ డయిన ప్రత్యగాత్మ నీకు
శరీర మగుచున్నది. ప్రకృతియు నీకు శరీర మగుచున్నది.

ప్రకృతిపురుషశరీరకుఁడ వయ్యుఁ దద్గతము లగువికారములను బొందనివాఁడవు. నీ కుత్పత్తివినాశాదులు లేవు. స్వరూపము చేతను స్వభావముచేతను గలుగు మార్పులు నీకు లేవు. ఒకప్పుడు సంకోచమునొందని యపరిచ్ఛిన్న జ్ఞానమున కాధారుఁడవు, నీవు స్వరూపము చేతను, గుణముల చేతను మిక్కిలి గొప్పవాఁడవు. నీవిట్లు జగములకుఁ గారణభూతుఁడ వగుటం జేసియే ముముక్షువు లగుమును లిహలోకసుఖములను, బరలోకసుఖములను గోరక యితర ప్రయోజనమును దేని నపేక్షింపక నీపాదపద్మములను గొల్చుచున్నారు.* "ఓపరమేశా! నీవు పరమాత్మవు. నీవు స్వరూపగుణములచే గొప్పవాఁడవు. నీవు

* ఇందులకుమూలము:- శ్లో॥ త్వం బ్రహ్మపూర్ణమమృతంవిగుణంవిశోక। మానందమాత్ర మవికార మనన్య దన్యత్। విశ్వస్య హేతు రుదయస్థితి సంయమానామాత్మేశ్వరశ్చ తద పేక్షతయా న పేక్షః॥ అనియున్నది. ఇందుఁబూర్ణపదముచే "పూర్ణం పురుషేణసర్వ"మ్మనెడి శ్రుతియు, విగుణపదముచే "అస్థూలమనణ్వహ్రస్వ"మ్మనెడిశ్రుతియు, విశోకమనుపదముచే "ఏషఆత్మాఽపహతపాప్మా"యనుశ్రుతియు, ఆనందపదముచే "విజ్ఞానమానంద"మ్మనెడిశ్రుతియు, అవికారపదముచే "నిష్క్రియం నిష్కల"మ్మనుశ్రుతియును, "అనన్యత్" అనుపదముచే "ఐతదాత్మ్యమిదం సర్వం తత్సత్యం స ఆత్మా, అయమాత్మాబ్రహ్మ తత్త్వమసి, సర్వంఖల్విదంబ్రహ్మ" అనుశ్రుతియు, "అన్యత్" అనుపదముచే "యఆత్మని తిష్ఠన్, యః పృథివ్యాంతిష్ఠ" న్నిత్యాదిశ్రుతియు, "విశ్వస్య హేతుః" అనుపదముచే "సదేవసోమ్యే దమగ్ర ఆసీత్, అనేన జీవేనాత్మ నాను ప్రవిశ్య। సమూలాస్సోమ్యేమా స్సర్వాః ప్రజాస్సదాయతనాస్సత్ప్రతిష్ఠా" యనుశ్రుతియు, "ఆత్మేశ్వరః" అనుపదముచే, "పతిం విశ్వస్యాత్మేశ్వరం నతత్సమశ్చాభ్యధిక శ్చదృశ్యతే స్వే మహిమ్ని ప్రతిష్ఠితః" అను శ్రుతియు స్మరింపఁబడుచున్నవి.

సర్వవ్యాపివి. నీకు స్థౌల్యాదిగుణములు లేవు. నీకుదోషాదులు లేవు. కేవల మానందమే స్వరూపముగాఁ గలవాఁడవు. నీకెట్టి మార్పులును లేవు. సకలము శరీరముగాఁ గలవాఁడవగుటచేతను, సమస్తమునకుఁ గారణభూతుఁడవగుటచేతను, ప్రకృతిపురుషాత్మకమగుజగముకంటె వేఱయినవాఁడవు కావు. ప్రపంచమునకు సృష్టిస్థితిలయములు గల్గించువాఁడవు. నీకు నీవే యధిపతివి. నీకెట్టికోర్కెయు లేదు. ఓమహనీయా! నామరూపముల విభజింపఁదరము కానంత సూక్ష్మరూపములుగలచిదచిత్తులు శరీరముగాఁ గల నీవొక్కఁడవే! కార్యరూపమై చిదచిద్రూపమైనయీ జగమునకును గారణమైననీకును భేదము చెప్పనచ్చును. కారణావస్థయందునుగార్యావస్థయందునునున్న బంగార మొక్కటియే కదా! కార్యమయినబంగారునకును గారణమైనబంగారునకును భేదములేనట్లె కార్యమైనజగమునకును గారణమైన నీకును భేదము లేదు. ఇట్లు కార్యకారణరూపుఁడ వయిన నీయందు వస్తుభేదము కల్పింపఁబడుచున్నది. అది యజ్ఞానకృతమని వేఱ చెప్పనలయునా? కాని గుణపరిణామాత్మక మయిన యీ ప్రపంచము ప్రకృతిపురుషవిలక్షణుఁడ వయిననీకు శరీరభూతమయినది. గావున నీస్వరూపము దానికంటె భిన్నమైనదే, ఓ యీశా! కొందఱు వేదాంతులు నిన్ను బ్రహ్మమునుగాఁ జెప్పుచున్నారు. మీమాంసకులు నిన్ను ధర్మమునుగాఁ దలంచుచున్నారు. సాంఖ్యులు నిన్నుఁ బ్రకృతిపురుషులకంటె వేఱయినవానిఁగాఁ దలంచుచున్నారు. కొందఱు నిన్ను నవశక్తులతోఁ గూడినవానిఁగాఁ జెప్పుచున్నారు. కొందఱు నిన్ను వికారరహితుఁడును, స్వతంత్రుఁడును నగుమహాపురుషునిఁగాఁ దలంచు

చున్నారు. ఓపరమేశ్వరా ! నేను బ్రహ్మ మరీచ్యాదిఋషులు మొదలగు మేమందఱము నీమాయచే జ్ఞానమునకు దూరమయి నీచే నిర్మితమగువిశ్వమును యథార్థముగాఁ దెలిసికొనలేనప్పుడు నీయనంతగుణములనుస్వరూపము నెట్లు తెలిసికొనఁగలము. మేమే దానితత్త్వము నెఱుంగఁజాలనపుడు జ్ఞానసంకోచము నొం దించు పాపకర్మముల నాచరింపఁ గుతూహలు లైనదైత్యులు, మానవులు మొదలగువా రెట్లు తెలిసికొనఁగలరు ? అటువంటి నీవు చరాచరాత్మక మగువస్తువును వాయువువలె నాకా శమువలె సకలమునం దంతరాత్మరూపముగా వ్యాపించి జ్ఞాన స్వరూపుఁడవై యీ జగమునకు సృష్టిస్థితిలయములను, భూత హితమును, లోకమునకు బంధమోక్షములను గల్పించుచులీలా రసమనుభవించుచున్నావు. కల్యాణగుణములచే లీలారస మను భవించుచున్ననీ వరాహాద్యవతారములను బెక్కింటినిజూచితిని. కాని దైత్యుల మోహింపఁజేసి సురలచే నమృతముద్రావించిన నీ మోహిన్యవతారమును జూడలేదు. ఆరూపమును జూడఁ దలంచివచ్చితిని. దానిఁ గనుఁగొననామనం బువ్విళ్లూరుచున్నది'' అని యిట్లు ప్రార్థించు చున్నరుద్రునివచనములు విని విష్ణు వుకానొకభావముచే గంభీరముగా నవ్వి యతని కిట్లనియె. ''ఓశంకరా! అమృతకలశమును దానవు లపహరింపఁగా మదో న్మత్తులైనదైత్యుల మోహింపఁజేసి దేవకార్యము నెఱవేర్పఁ జాలినది స్త్రీవేషము దక్క వేఱొక్కటి గాదని యాలోచించి దైత్యుల వేడుకకొఱ కారూపమును దాల్చితిని. నీ వా రూప మును జూడఁ గుతూహలపడి వచ్చితివి ; కావునఁ గాముకజను లకుబహూకరింపఁదగినదియు, నెట్టివారికయిన మన్మథోద్రేకముఁ

గల్గింపఁజాలినదియు నగునా మోహినీరూపమును జూపెద" నని పలుకుచు నతఁ డచ్చటనే యంతర్ధానము చెందెను. శంకరుడు పార్వతితోఁగూడ నచ్చటనేయుండి తన నేత్రములనునలుదిక్కులకు బ్రసరింపఁజేసి చూచుచుండెను. అంతశంకరునకిఁబూవులతో, నెఱ్ఱని చివుళ్లతో వెలయు తరువులు గలయుద్యానవనములోఁ దనకు సమీపమున విహరించు నొక స్త్రీలలామము గాన వచ్చెను. ఆసుందరి సలీలముగా బంతి యాడుకొనుచుండె. ఆమె పిఱుఁదులందుఁ దళతళలాడు వస్త్రముపై బంగారు మొలత్రాడు ప్రకాశించుచుండె. కందుక క్రీడావశమున నిట్టట్టు తిరుగాడుచు సత్వరముగా నూపిరి విడుచుచుఁదీసికొనుచుండుటచే నామె స్తనములును, వానిమీఁదఁ బ్రకాశించు హారములును, గంపించుచుండెను. విహరించుచున్నప్పుడామెపాదములు చలించుచున్నచిగుళ్లవలె రంగు లీనుచుండెను. నలుదిక్కులందు నెగిరి పడుచు నతిచంచల మయిన బంతిని జూచుచుండుటచే మిక్కిలి చపలము లయిననల్లగ్రుడ్లు గలవిశాలనేత్రముల చేతను, గర్ణకుండలములచేఁ బ్రకాశించు చెక్కిళ్లచేతను నల్లని ముంగురులచేతను, నామె మొగము మిక్కిలి యందమై యుండె. గమన వేగముచే జాఱుచున్న కట్టుపుట్టమును గేశ పాశమును నామె యందమగు తన యెడమచేతిచే బంధించుచుండెను. ఆమె రెండవచేతితో బంతిని నేలఁగొట్టుచుఁ దన కపటవృత్తిచే జగమును మోహింపఁ జేయుచుండె. రుద్రుఁడా యువతినిజూచి తదీయ కందుక క్రీడావిలాసములచేతను, సిగ్గుచేఁ బ్రకటితముగాని మందహాసముతో గూడఁ బ్రసరింపఁజేయఁ బడిన కడకంటిచూపులచేతను, హృతచిత్తుఁడై స్వయముగా

నామెను చూచి చూడఁబడుచుండుటచేఁ బరవశ మగునాత్మ గలవాఁడై తన్నును, దనచెంత నున్న పార్వతిని, దనతో వచ్చిన ప్రమథగణములను మఱచిపోయె. ఇట్లుండ నామోహిని దూరముగాఁ బోయిన బంతిని గొనివచ్చుటకై రయంబునఁ బోవుచుండ వాయుప్రసారమువలన మొలత్రాటితోఁగూడఁ గట్టుపుట్టము జాఱి నేలఁబడెను. అంత రుద్రుఁడు దిగంబరయై సుందరములగు కడకంటిచూపులు గల్గి చూచువారి చిత్తములహరించుచు సిగ్గుచే నవయవములను సంకోచింపఁజేసి తన్నుఁ దాఁ జూచుకొనుచు నున్న యా యువతినిజూచి వివేకహీనుఁడై యామె విలాసములకుఁజిక్కి మిక్కిలి మదనబాధనొందుచుఁ బార్వతిచూచుచుండఁగనే యతిరయమున నామెచెంత కేఁగెను. తన చెంతకు వచ్చుచున్న రుద్రునిఁగాంచి యామోహిని వస్త్రవిహీనురాలై యుండుటచే మిక్కిలి సిగ్గుపడి నవ్వుకొనుచుఁ జెట్లలోని కరుగుచుండె. రుద్రుఁడదిచూచి చంచలము లగు నింద్రియములుగలవాఁడై కామునికిఁ జిక్కియాఁడేనుఁగనుమగ యేనుఁగుంబోలె నామె ననుసరించి పోఁజొచ్చెను. ఇట్లు పోయి రుద్రుఁడతిరయమున నా కాంతను సమీపించి యామె యిష్టపడకున్నను దదీయ కేశపాశమును బట్టికొని తన చెంతకు లాగికొని చేతులు సాఁచి గట్టిగాఁ గౌఁగిలించుకొనెను. కరిచేఁగరిణివలె రుద్రునిచే నాలింగతయై విడివడిన కేశపాశము గలదై యున్నయామోహిని యతని కౌఁగిలింతనుండి తప్పించికొని పఱువెత్తుచుండెను. ఆమె ననుసరించి శివుండును బఱువెత్తఁ జొచ్చె. మత్తకుంజరము కుంజరినివలె నా కాంతను వెంబడించి రుద్రుఁడు పోవుచుండ నమోఘ మగునతని రేతస్సుభూమి

పైఁ బడెను. అట్లు రేతస్సు పడినచోట్లు సువర్ణక్షేత్రములును, రజతక్షేత్రములు నయ్యెం. మఱియు నతని రేతస్సు పడిననదులం దతఁడు తప్పక సన్నిహితుఁడై యుండును. ఆతని నుపాసించు ఋషులుకూడ నచ్చటనే నివసింపఁజొచ్చిరి. ఓరాజా! రేతస్స్ఖలన మయినతోడనే రుద్రుఁడు భగవన్మాయాభూత యగునా కాంతచే మోహితుఁడగుటను దెలిసికొని తనకుఁ దానే సిగ్గుపడుచుఁ గామమును ద్రోసిపుచ్చెను. పిమ్మట శంకరుఁడు జగద్గురుఁడయినపరమేశ్వరునిమహిమను దెలిసికొని యా స్త్రీరూపమును నామె చేష్టలును మహాశ్చర్యకరములని మనమునఁ దలపోయఁ జొచ్చెను. భగవంతుఁడగువాసుదేవుఁ డెప్పటియట్లు పురుషరూపమును దాల్చి నిర్వికారుఁడై త్రపావిహీనుఁడై యున్నరుద్రునిఁ జూచి వేగముగాఁ దన మాయను దెలిసికొనుటకు సంతసించి యిట్లనియె. "సురశ్రేష్ఠా! నీవు నిశ్చయముగాఁ గామాది వికారముల విడిచినవాఁడవే. అయినను నామాయ యెట్టివారికిఁ గూడ దుస్తరమగుటచే నీవు మోహమును జెందితివి. ఆలోచింప నా మాయ కధీనుఁడగువాఁడెవఁడు చంచలేంద్రియులగువారికి దుస్తరములగు కామక్రోధాదిభావముల నీవలె నవలీల నతిక్రమింపఁ గలఁడు? కాలము శరీరముగాఁ గలదియు సృష్ట్యాదుల భాగముల స్వీకరించునదియు, నగునామాయ యింక నిన్ను మోహింపఁజేయ లేదు!" అని యిట్లుపల్కు వాసుదేవు ననుగ్రహమునుగాంచి రుద్రుఁడతనికినమస్కరించి యతనియనుమతివడసి తన ప్రమథగణములను గలిసికొని పార్వతీసహితుఁడై కైలాసమున కరిగెను. ఓరాజేంద్రా! అనంతరము శంకరుఁడు శరీరార్థభూత యగుపార్వతితో మునిశ్రేష్ఠులందఱును వినుచుండ ని

ట్లనియె. ఓపార్వతీ! కర్తాయత్త మగుజననాదులులేని పరమ పురుషుని మాయామహిమమును జూచితివిగదా! సకల విద్యలకు నధిపతి నగునేనే మోహమును జెందితిని. సామాన్యులగు మానవులు దానవులు మొదలగువారు మోహమును జెందుదు రని వేఱ చెప్పవలయునా! ఓ సుందరీ! వేలకొలఁదివత్సరముల పర్యంతమును దపమును చేసి యంతమున దానినుండిమఱలిన నన్నుఁజూచి "నీ వుపాసించిన పరవస్తువే"దని యడిగితివి. ఎవనిని గాలము నైతమువశము కావించుకొనలేదో, యెవఁడుసమస్తము నొక్కమాఱుగాఁ దెలిసికొన సమర్థుఁడో, యాపరమపురుషుని నేను సర్వకాలములయందునుపాసించుచున్నాను" అనిపార్వతికిఁ జెప్పె నని చెప్పి రాజునకు మునీంద్రుఁడు వెండియు నిట్లనియె. "ఓ నరేంద్రా! ఎవఁడు కూర్మరూపమును దాల్చి క్షీరసాగరమథనకాలమున మహాపర్వత మగుమందరమును మోచి యమృతమును సురలకిచ్చెనో యాపరమేశ్వరుని విక్రమమును నీకుఁ దెలియఁజేసితిని. ఈచరిత్రమునుజదువువారును విన్నవారును, జేసెడు ప్రయత్నములన్నియుఁ దప్పక సఫలము లగును. భగవంతుని సద్గుణములను వెల్లడించు నీ చరిత్రము భయంకరము లగునాధ్యాత్మికాదితాపములను హరింపఁ గలుగును. సముద్రమును మథించి తీసిన యమృతము దైత్యులపహరింప మోహినీరూపమున వారిని మోహింపఁజేసి దానిఁ గైకొని తన భక్తులకోర్కులఁ బూరించువాఁడును, సంసారుల కగమ్యుఁడు నగుభగవంతునకు నమస్కరించెద." ఇది పండ్రెండవయధ్యాయము.

-----

శ్రీశుకుఁడు తక్కిన మన్వంతరముల వివరించుట.

ఓ రాజేంద్రా! ఇఁకఁ దక్కిన మన్వంతరముల విశేషములఁ జెప్పెదనాలింపుము. ప్రస్తుతకాలమున వైవస్వతమనువు వర్తించుచున్నాఁడు. అతనిపేరు శ్రాద్ధదేవుఁడు. అతఁడు వివస్వంతుని కుమారుఁడు. అతఁడు సప్తమ మనువయ్యె. అతని కిక్ష్వాకుఁడును నభగుఁడును, ధృష్టుఁడును, శర్యాతియు, నరిష్యంతుఁడును, నాభాగుఁడును, దిష్టుఁడును, కరూషకుఁడును, బృషధ్రుఁడును వసుమంతుఁడు ననుకుమారులు గలరు. ఈసప్తమమన్వంతరమున నాదిత్యులును, వసువులును, విశ్వేదేవులును దేవతలైరి. పురందరుఁ డనువాఁ డింద్రుఁడయ్యె. కశ్యపుఁడు, నత్రియు, వసిష్ఠుఁడును, విశ్వామిత్రుఁడును, గౌతముఁడును, జమదగ్నియు, భరద్వాజుఁడును సప్తర్షు లయిరి. ఈ మన్వంతరముననే భగవంతుఁ డదితి కశ్యపులకుఁ గుమారుఁడై యుదయించి వామనుఁ డను నామమును దాల్చి ప్రఖ్యాతిఁగాంచెను. అతఁ డాదిత్యుల కందఱకును దమ్ముఁడు. ఓరాజా! ఏడుమన్వంతరముల విశేషములను సంగ్రహముగా నీకు వినిపించితిని. విష్ణువు నంశావతారములచే వెలయు తక్కిన మన్వంతరములనుగూడ వర్ణించెదను వినుము. వివస్వంతునకు ఛాయాదేవి యనియు, సంజ్ఞాదేవి యనియు నిద్దఱు భార్యలు గలరని వెనుకనే చెప్పితిని. వారు విశ్వకర్మ కుమారికలు. అతనికి బడబయను మూఁడవభార్య గలదని కొందఱు చెప్పుచున్నారు. సంజ్ఞయే బడబారూపమును దాల్చెనని కొందఱందురు. వారిలో సంజ్ఞాదేవికి యముఁడు యమున శ్రాద్ధదేవుఁడు ననెడి ముగ్గురుకుమారులును, తపతి యనుకన్యకయుఁ గలిగిరి. ఆ తపతిని సంవరణుఁడు వరించెను. మూఁడవది యగు

బడబ కశ్వికుమారు లుదయించిరి. ఎనిమిదవ మన్వంతరమున సూర్యపుత్త్రుఁ డగుసావర్ణి మనువయ్యెను. నిర్మోహుఁడు విరజస్కుఁడు మొదలగువారు మనుపుత్త్రులు. అప్పుడు సుతపస్కులు మొదలగువారు దేవగణములగుదురు. బలిచక్రవర్తి యిందుఁడయి వారిఁ బాలించు. ఓరాజా! ఆబలి మహాయశస్కుఁడు. అతఁడు పదత్రయపరిమిత మగుభూమిని యాచించు చున్న విష్ణువున కొసంగి యతని యనుగ్రహమువలన నింద్రపదవిని ముక్తిని జెందును. మొదట విష్ణు వతని బంధించినను బిమ్మట నతని ననుగ్రహించి స్వర్గలోకముకంటె నధిక మగుపాతాళమున కధిపతినిగాఁ జేసెను. అతఁ డిప్పు డిందునివలె నచట సుఖము లొందుచున్నాఁడు. ఆమన్వంతరమున గాలవుఁడు, దీప్తిమంతుఁడు, పరశురాముఁడు, ద్రోణపుత్త్రుఁ డగునశ్వత్థామ, కృపాచార్యుఁడు, ఋశ్యశృంగుఁడు నాతండ్రి యగువ్యాసభగవానుఁడు తమ యోగప్రభావమువలన సప్తర్షు లగుదురు. ప్రస్తుతమున గాలవాదులు తమతమ యాశ్రమములందే వర్తించుచున్నారు. అప్పుడు భగవంతుఁడు దేవగుహ్యుఁ డనునతనికి సరస్వతి యనునామెయందుఁ గుమారుఁడయి యవతరించి సార్వభౌముఁ డనెడిపేరు వహించి తనశక్తిచేఁ బురందరునివలన నింద్రపదవిని దీసికొని బలి కర్పించును. వరుణపుత్త్రుఁ డయినదక్షసావర్ణి తొమ్మిదవ మను వగుధృతకేతువు, దీప్తకేతువు మొదలగువారు మనుపుత్త్రు లగుదురు. దాత, మరీచి, గర్గుఁడు మొదలగువారు దేవగణములగుదురు. శ్రుతుఁడనువాఁ డిందుఁ డగు. ద్యుతిమంతుఁడు మొదలగువారు సప్తర్షులగుదురు. అప్పు డాయుష్మంతున కంబుధార యనుభార్యయందు విష్ణువు ఋషభుఁ డనునామముతో

నవతరించి ముల్లోకములను నిరపాయముగా రక్షించుచు నింద్రునిచే నేలించును. ఉపశ్లోకుని తనయుం డగు బ్రహ్మసావర్ణి పదవ మనువయ్యెడు. భూరిషేణుండు మొదలగువారు మనుపుత్త్రు లగుదురు. హవిష్మంతుండు, సుకృతి, సత్యుండు, జటామూర్తి మొదలగువారు సప్తర్షులగుదురు. సువాసనుండు, విబుద్ధుండు మొదలగువారు దేవగణములగుదురు. శంభుం డనువాం డింద్రుం డగు. అప్పుడు విష్ణువు విశ్వజితుం డనువానికిం దద్భార్య యగు విషూచియందు స్వాంశముచే నవతరించి యింద్రునికి సఖుండయి యుండును. ప్రశస్తమనస్కుం డయినధర్మసావర్ణి యేకాదశమనువగును. సత్యధర్ముండు మొదలగువారు పదిమంది మనుపుత్త్రులగుదురు. విహంగములు, కామగములు నిర్వాణులు, రుచులు, సురగణములయ్యెదరు. ధ్రువుం డనువాం డాగణములకింద్రుం డగు. అరుణుండు మొదలగువారు సప్తర్షులయ్యెదరు. అప్పుడు శ్రీహరి యార్యకుం డనువాని భార్య యగు వైధృతియం దవతరించి ధర్మసేతు వను నామమును వహించి మూండులోకములను రక్షించును. ఓరాజా! రుద్రసావర్ణి యనువాండు పండ్రెండవ మనువగును. దేవవంతుండు, ఉపదేవుండు, దేవశ్రేష్ఠుండు మొదలగువారు మనుపుత్త్రు లయ్యెదరు. ఆ మన్వంతరమున ఋతుధాముం డనువాం డింద్రుం డగును. హరితాదులు దేవగణములగుదురు. ఆగ్నీధ్రుండు తపోమూర్తి మొదలగువారు సప్తర్షు లయ్యెదరు. అప్పుడు పరమేశ్వరుండు సత్యసహునిభార్య యగుసూనృతికిం గుమారుండై స్వధాముం డను పేరితో నామన్వంతరమును రక్షించును. దేవసావర్ణి యనువాండు పదుమూండవ మనువగును. చిత్రసేనుండు మొదలగువారు మనుపుత్త్రు లయ్యెదరు. సుకర్ములు

సుత్రాములు ననువారు దేవగణము లయ్యెదరు. దివస్పతి యను వాఁ డిందుఁడగు. నిర్మోకుఁడు, తత్త్వదర్శుఁడు మొదలగువారు సప్తర్షు లయ్యెదరు. అప్పుడు శ్రీహరి దేవహోత్రునిభార్య యగు బృహతికిఁ గుమారుఁడై యోగీశ్వరుఁ డనునామమును వహించి యింద్రునకుఁ దోడ్పడును. ఇంద్రసావర్ణి యనువాఁడు పదునాల్గవ మనువగు. ఉరువు, గంభీరుఁడు, వసువు మొదలగువారు మనుపుత్రులగుదురు. పవిత్రులనువారును, చాక్షుషులనువారును దేవగణములగుదురు. శుచియనువాఁడిందుఁడగును. అగ్ని, బాహువు, శుచి, శుక్రుఁడు మాగధుఁడు మొదలగువారు సప్తర్షులయ్యెదరు. అప్పుడు హరి సత్రాయణుఁడనువాని భార్యయగు వితానకుద్భవించి బృహద్భాను వనెడిపేరు వహించి యజ్ఞాది కర్మములను విస్తరింపఁజేయును. ఓమహారాజా! భూతకాలమందును వర్తమానకాలమందును రాఁబోవు కాలమందును వర్తించు మనువులు పదునల్వురు. వారి చరిత్రములను సంగ్రహముగా వివరించితిని. కృతత్రేతాదియుగములు నాలుగును వేయుమాఱులు పరివర్తించినచోఁ బదునాల్గు మన్వంతరములు గతించును. ఈ మన్వంతరము నొక్కమాఱు పరివర్తించినచో దైనందిన కల్ప మగును" ఇది పదుమూఁడవయధ్యాయము.

---

—రాజు ప్రత్యేకముగా మన్వంతరముల కార్యములనడుగుట.—

అని చెప్పుచున్న మునీంద్రునిఁజూచి నరేంద్రుఁడు "ఓ మునీంద్రా! మన్వంతరకాలములందును మనువులును, దత్పుత్రులును మునులును మొదలగువా రెవనిచే నీకార్యము నొనర్ప

నయుక్తులైరి? వారినిగూర్చి తెలియఁ జేయు"మని పలుక న మ్మునీంద్రుఁ డితని కిట్లనియె. ఓరాజేంద్రా! మనువులును, మనుపుత్త్రులును, మునులును, నింద్రుఁడును, సురగణములును, నాయా మన్వంతరములకాలమున నాయాయవతారములఁ బొందిన పరమేశ్వరునిచే శాసింపఁబడు చుందురు. అట్లు నియుక్తులయి మన్వాదులు జగత్పోషణమును జేయుచుందురు. ఎట్లు చేయుదురందువేని, చెప్పెదను. ఆ మన్వాదులలో మునులు మన్వంతరముతుదను బాఠకులు లేకపోవుటచేఁ జెడిపోయిన వేదగణములను వానివలనఁ నేర్పడు సనాతన ధర్మములను దమ తపః ప్రభావమువలనఁ దెలిసికొందురు. మనువులు తమతమ కాలములందు శ్రీహరి యనుమతిని బడసి మునుల యుపదేశము చొప్పున ధర్మమును నాలుగుపాదములను నడపించు చుందురు. మనుపుత్త్రులు మనువులు స్థాపించిన ధర్మమును మన్వంతరావసానమువఱకును, దమ పుత్త్రపౌత్త్రాదిక్రమము చేత నాయా వర్ణాశ్రమములకుఁ దగునట్లుగాఁ బ్రవర్తింపఁజేయుదురు దేవగణములు పంచమహాయజ్ఞములందును భోక్తలగుఋషులతోను, బితృదేవతలతోను, యజ్ఞభాగముల ననుభవించుచుందురు. పరమేశ్వరుఁడు తనసామర్థ్యముచే సంపాదించి యిచ్చినముజ్జగముల శ్రీలననుభవించుచు, నింద్రుఁడు యథేష్టముగా వర్షమును గురియించిలోకములఁబరిపాలించును. పరమేశ్వరుఁడుయజ్ఞాద్యవతారములను గపిలాద్యవతారములను దాలిచి జ్ఞానమును యుగానుసారముగా నుపదేశించును. మఱియునతఁడు మరీచ్యాది రూపములనొందిసృష్టినొనరించుచు, రాజమూర్తియై దుష్టులను సంహరించుచు, సృష్ట్యాదుల కుపయుక్తము లగుగుణముల నవ

లంబించి కాలరూపమున సమస్తజంతువుల లయమొందించుచు నామరూపముల వహించిన మాయచే మోహితులయి జ్ఞానముచే నేకాకారులయినయాత్మలందు దేవమనుష్యాదిభేదమును భాటించు జనులకుఁ గానరాక కేవలము నుతింపఁదగినవాఁడునై ప్రవర్తించుచుండును. కల్పయాథాత్మ్యమును దెలిసినపండితులు దైనందిన కల్పప్రమాణము పదునాల్గు మన్వంతరముల కాలమని చెప్పుచున్నారు. ఇది పదునాల్గవయధ్యాయము.

---

### వామనావతార కథా ప్రారంభము.

అని చెప్పుచున్న శుకుంజూచి రా జిట్లనియె "ఓ మునీంద్రా! విష్ణువున కెట్టికోర్కియును లేదు. అతఁ డవాప్తసమస్తకాముఁడు; తాను సమస్తమునకును బ్రభువు. అట్టిహరి దీనునివలె బలిచెంత కేఁగి మూఁడడుగులభూమి నెందులకు యాచించెను? యాచించి పుచ్చుకొనియు బలిని బంధించుటకుఁ గారణమేమి? పరిపూర్ణుఁ డయినవిష్ణువు యాచించుటయు నిరపరాధుఁ డయినబలిని బంధించుటయునాకాశ్చర్యమును గొలుపుచున్నవి. ఆవృత్తాంతములను విన నామనస్సు కుతూహలపడుచున్నది. దయచేసి చెప్పుము" అని యడుగుచున్న రాజునకు శుకుఁ డిట్లనియె. "ఓరాజేంద్రా! దేవాసురయుద్ధమున బలి యింద్రునకోడి ప్రాణహీనుఁడై శుక్రాదుల దయవలన జీవించి యుదారమనస్కుఁడై వలయు నంత ధన మర్పించుచుఁద్రికరణశుద్ధిగా వారిని సేవించెను. తమ్ము సేవించుచు స్వర్గమును జయింపవలెనన్న తలంపు గలవాఁడయి యున్న బలిభక్తికి సంతసించి బ్రాహ్మణులు మంత్రపూర్వకముగా నభిషేకించి యతనిచే విశ్వజిత్తనెడి యాగమును జేయిం

చిరి. విశ్వజిద్యాగమందలి హవిస్సుచే సంతృప్తిఁగాంచిన యగ్ని వలనఁ గనకమయ మయినపరికరముతోఁ గూడినరథంబును, నింద్రుని తురంగములవంటి తురంగములును, సింహధ్వజంబును గాంచనపరికరముతో బద్ధ మగువిల్లును, నక్షయ తూణీరము లును, దివ్యమగుకవచమును ,సంభవింపఁగా, బలి వానిని స్వీక రించెను.అప్పుడు పితామహుఁడయిన ప్రహ్లాదుఁడు బలికి వాఁడని పద్మమాలనొసంగెను.గురు వయినశుక్రుఁ డతనికిఁ బ్రశస్త మగు శంఖము నిచ్చెను. పిమ్మట బలి శుక్రాదులదయవలన సంపాదిత మైనయుద్ధపరికరమును జేకొని బ్రాహ్మణులకును, గురువులకును నమస్కరించి వారివలన నాశీర్వాదములను జెంది, ప్రహ్లాదుని యనుమతివడసి దివ్యరథంబుపైఁ గూర్చుండి ప్రహ్లాదుఁడొసఁగిన పద్మమాలను ధరించి కవచమును దొడిగి ఖడ్గమును, విలునమ్ము లను నమ్ములపొదులను దాల్చి యుద్ధసన్నద్ధుఁ డై బాహువు లందు బాహుపురులును, గర్ణములందు బంగారు మకరకుండల ములును బ్రకాశింప వనమందుఁ బ్రజ్వలించు నగ్నివలె విలసిం పఁ జొచ్చెను. అప్పుడు బలి యైశ్వర్యము చేతను, బలము చేతను, శ్రీచేతను దనతో సమానులయి చూపులచే నాకాశమును, దిక్కులను నపహరించుచున్నట్లు గానవచ్చు చున్న దైత్యనాయ కులచేఁ బరివేష్టితుఁడై గొప్ప దానవసైన్యమును నడిపించుకొని భూమ్యాకాశములను జలింపఁజేయుచు, సకల సంపదలతో నుల్లసిత మగుస్వర్గపురమును ముట్టడించెను. మధురముగా ధ్వనిచేయుచున్న పక్షి మిథునములచేతను, గాన మొనర్చుచున్న మత్తమధుకరములచేతను, జిగుళ్లను ఫలసంపదలను బుష్ప సంపదలను బొల్చెడి శాఖాసముదయములు గలవృక్షపరంపర

చేతను, బ్రకాశించు నందనవనము నాపురమున మిక్కిలివిరాజిలు చుండెను. ఆ నందనవనమందు నిర్మలజలముతో నిండిన పద్మాకరములు పెక్కులుగలవు. అవి యన్నియు హంసలకును సారస పక్షులకును జక్రవాకములకును గన్నెలేడిపిట్టలకును నిలయము లయి, సురలకును, సురస్త్రీలకును గ్రీడాస్థానములై చూపఱ చిత్తములను హరించుచుండెను. ఆ పురమునకుఁ ద్రివిక్రమదేవుని కాలిబొట్టనవ్రేలివలన నుదయించినగంగానది కందకమై వెలయు చుండెను. మఱియు నది యుపరిభాగమున నిర్మితము లగు యుద్ధస్థానములు గలదై, సువర్ణమయమగుటచే నగ్నివలె మెఱ యుచు నున్న యున్నతప్రాకారముచేఁ బరివేష్టితమై, శత్రువుల కసాధ్యమయి యుండెను. విశ్వకర్మ తననేర్పునంతను జూపి దానిని నిర్మించెను. దాని పురద్వారములు సువర్ణమయములగు తలుపులతోను, స్ఫటికములతోఁ గట్టిన గోపురములతోను బ్రకా శించుచుండెను. అందలి వీథులు విశాలములయి మనోహరము లయియుండె. అది సభాభవనములచేతను నంగణములచేతను, నుపమార్గములచేతను రాణించుచుండె. దానియందుఁ గల చతుష్పథములు వజ్రములచేతను, బవడములచేతను నిర్మితము లయినయరుఁగులచే వెలయుచుండెను. అం దెచ్చటఁజూచినను విమానములు సంచరించుచుండెను. అచ్చటిస్త్రీలు మార్పు చెందని యౌవనమును, సౌందర్యమును, గలవారయి శుభ్రవస్త్ర ములను దాల్చి శిఖలతోఁ బొల్చు నగ్నిహోత్రములవలెఁ బ్రకా శించుచుండిరి. ఆ సురస్త్రీలు కేశపాశములకుఁ జుట్టిన పుష్పమాలి కల పరిమళమును దాల్చి మలయమారుతము గవాక్షద్వారముల నుండి యగరు ధూపములతోఁగూడ వెలువడి యందుఁ బ్రస

రించుచుండెను. అందున్న యచ్చరలు శుభ్రవస్త్రములచేఁ బరి
చ్ఛిన్నము లయినమార్గములందు సంచరించు చుండిరి. ఆపురము
ముత్యాల వితానములచేతను, మణిమయములయి పలువిధము
లయి యున్నధ్వజములచేతను, గనులపండువు చేయుచుండె.
అందెచ్చటఁ జూచినను మయూరముల కేకలును, పావురముల
నినాదములును, దుమ్మెదల ఝుంకారములును, వినవచ్చుచుండెను.
దేవతాస్త్రీలపాటలు మిక్కిలి మధురములై వినువారి కానం
దము గొలుపుచుండె. మద్దెలలను వాయించుచు శంఖములను
బూరించుచు, దుందుభులను మ్రోయించుచు, వీణెలను మీటు
చు, వేణువుల ధ్వనిచేయుచుఁ, దాళాది నినాదములకనుయుక్తము
గా నాట్యముచేయుచు, నెల్లచోట్లను మృదుమధురముగాఁ
బాడు చున్నగంధర్వులపాటలు మిక్కిలి మనోహరము లయి
యుండెను. ఆలోచింప నాపురము సంగీతాధిష్ఠాత్రియగు దేవతకు
నిలయమైనట్లు తోఁపక మానదు. ఆ పురము దురాత్ములకును,
మూర్ఖులకును, నహంకారులకును, వంచకులకును, నధర్మపరులకును
భూతద్రోహకులకును, గాములకును బొందఁ దరముకానిది. బలి
యట్టిపురమును బ్రవేశించి తన సైన్యములచే నరికట్టి దేవతా
స్త్రీలు భయమందునట్లు, శుక్రుఁడు తనకొసంగిన శంఖమును
బూరించెను. ఇంద్రుఁ డదివిని యదరిపడి బలియొనర్చిన మహా
ప్రయత్నమును దెలిసికొని దేవగణములతోఁ గూడికొని బృహ
స్పతి చెంతకుఁబోయి యి ట్లనియె. "ఓ గురువర్యా! పూర్వము
నాచేఁ బరాజితుఁడయినబలి యిప్పుడు యుద్ధసన్నద్ధుఁడై యిచ్చ
టికి వచ్చెను. అతని పరాక్రమ మిప్పట్టున నెట్టివారికిని దుస్సహ
మని తోఁచెడిని. ఇట్టి బలి నెవఁడైన నే యుపాయముచేత

నైనను జయింపలేఁడని నిశ్చయింపవచ్చును. ఈబలి లోకములను దిక్కుల నొక్కట్టున మ్రింగువానివలెను, ప్రళయాగ్నివలె దీవ్రము లగుచూపులచే నాకాశమును దహించువానివలెను బ్రకాశించుచున్నాఁడు. ఇట్టి యింద్రియబలమును, నిట్టియుత్సాహమును, నిట్టిదేహబలమును, నిట్టి పరాక్రమమును నా శత్రువగు బలి కెట్లు లభించెను ? వాని పరాక్రమాదు లిట్లసాధ్యములయి యుండుటకుఁ గారణమేమి ?" అని యడిగిన యింద్రునకు గురు విట్లనియె. "ఓ దేవేంద్రా ! శత్రువున కిట్టియభ్యుదయము గలుగుటకుఁ గారణమేమియో తెలియవచ్చె. బ్రహ్మవాదు లయినశుక్రాదులు తమశిష్యుఁ డయినబలికి నిట్టియభ్యుదయమును గల్గించిరి. పరమేశ్వరుఁ డయిన శ్రీహరి తప్ప నీవంటి యితరులుగాని నీవుగాని యతనియెదుట నిలువఁజాలరు. కావున నిప్పట్టున నీవును, దేవతలును నీ లోకమునువిడిచి స్థలాంతరమునకుఁ బోయి శత్రుపరాజయకాల మెపుడు వచ్చునో ప్రతీక్షించి యుండుఁడు. బ్రాహ్మణప్రభావమువలన నితఁడు క్రమక్రమముగా నధిక మగుచున్న మహాపరాక్రమము గలవాఁడయ్యె. అట్టి యితఁడు బ్రాహ్మణుల నవమానించుటవలనఁ దప్పక నశించును. ఆ కాల మేతెంచునంతవఱకును నిరీక్షించియుండుఁడు" అని కార్యజ్ఞుఁ డయినబృహస్పతి లెస్సగా నాలోచించి చెప్పిన హితవాక్యములను విని కామరూపు లగు దేవతలు స్వర్గమునువిడిచి మాయమైరి. అందువలన బలి నిరాటంకముగా స్వర్గసింహాసనమునఁ గూర్చుండి లోకత్రయమును తన వశము గావించుకొనెను. అంత శిష్యవత్సలు లయిన శుక్రాదులు విశ్వజిద్యాగము జేసినబలి కింద్రపదవి స్థిరముగానుండు

నట్టు చేయ నెంచి యతనిచే నూఱశ్వమేధములను జేయించిరి. అనంతరము బలి యశ్వమేధశతమును జేయుటవలనఁ గల్గిన ప్రభావముచేఁ దన విమలకీర్తిని ముల్లోకములందును వ్యాపింపఁ జేయుచుఁ జంద్రునివలెఁ బ్రకాశించుచుండెఁ. మఱియు దీర్ఘ సంకల్పుఁ డయినయా బలి బ్రాహ్మణుల దయవలనఁ బొందఁబడిన సంపదల ననుభవించుచుఁ దన్నుఁ గృతార్థునిఁగాఁ దలంచుచుం డెను. ఇది పదునేనవయధ్యాయము.

---

అదితి తనకుమారులను గూర్చి చింతించి విష్ణువు నారాధించుట. అతఁ డామె గర్భమున వామనుఁ డయి పుట్టుట.

అంత దేవతలకుఁ దల్లి యగునదితి తన పుత్త్రులగునింద్రాదు లదృశ్యులయినట్టును, దైత్యు లమరావతి నపహరించినట్టును విని, గతిలేనిదానివలె మిక్కిలి పరితపించుచుండెను, ఇట్లుండ నొక ప్పుడు కశ్యపుఁడు సమాధిని విడిచి యదితియాశ్రమమునకు వచ్చెను. అతఁడు వచ్చునప్పటి కాయాశ్రమము మిక్కిలికాంతి హీనమై వెలవెలపోవుచుండెను. కశ్యపుఁడు దానిఁగనిపెట్టి మనం బున సందేహించుచుఁ దన ప్రియురాలి చెంతకేఁగి యామెవలనఁ బూజలనంది యుచితాసనమునఁ గూర్చుండి దీనవదనయై యున్న యామెంగాంచి యిట్లనియె. "ఓ శుభురాలా! బ్రాహ్మణులకును, గోవులకును, ధర్మమునకును, మృత్యువున కధీనులయి వర్తించు జనమునకును నమంగళములు సంభవింపలేదు గదా! ఓ గృహ స్థురాలా! యోగాభ్యాసము లేనివారికిఁగూడ ధర్మము, నర్థ మును,గామమును సమకూర్పఁజాలినగృహముల కమంగళములు

సంప్రాప్తింపలేదుగదా? కుటుంబాసక్తురాల వగునీయింటి కతిథులు వచ్చి నీపూజల నందక వెడలిపోయిరా యేమి? ఆలోచింపనతిథు లేగృహమునకువచ్చి సలిలమునైనం గైకొనకుండ వెడలి పోవుదురో, యా గృహము కేవలము నక్కలకు నివాసభూతమగు బిలమువంటిది. ఓ సతీమణీ! ఆహవనీయాదు లగునగ్నులను నీయధీనముచేసి నేను సమాధి కరిగితిని. నావియోగభరమును సహింపంజాలక భయాకులవై యున్ననీవు వేళదప్పకుండ హవిస్సుచే నా యగ్నుల నుపాసింపలేదా యేమి? అట్లు చేయనిచో మిక్కిలి విచారింపపలసినదే! ఆ యగ్నులు సకల వాంఛితములను నెఱవేర్పంజాలినవి. వానిం బూజించియే గృహస్థులు పుణ్యలోకముల నందుచున్నారు. బ్రాహ్మణులును, వహ్నియు సకల దేవస్వరూపుండయినవిష్ణువునకు ముఖమేయని నిశ్చయింప వచ్చును. అట్టియగ్నుల నారాధింపకపోవుట పెద్దనష్టమును గల్గింపక మానునా? ఓ ధీరులారా! నీ పుత్త్రులందఱును సుఖులై యున్నారా? చిన్నవోయిననీముఖమును లక్షింపనేదోయమంగళము సంప్రాప్తమైనట్లు తెలుపుచున్నది. అందుచే శంకించుచు నిట్లడుగుచున్నాను. వేగముగా నీ విచారకారణ మెఱింగింపుము." అని యడుగు చున్నభర్తను గాంచి యదితి యిట్లనియె. "ఓ నాథా! బ్రాహ్మణులకును, గోవులకును శుభముగలదు; ధర్మమునకేమియు భంగముగలుగలేదు. తక్కిన లోకులకు సుఖము లేకపోలేదు. మన గృహస్థాశ్రమముధర్మార్థకామములకు నిలయమై వెలయుచున్నదని నిశ్చయముగాం జెప్పంగలను. ఓ వల్లభా! సంతతమును మీపాదపద్మముల ధ్యానించుచు నే నగ్నులను వ్రేల్చు చున్నాను. అతిథుల సత్కరించుచున్నాను. నావలనం

బూజలు గైకొను తలంపుతో వచ్చినభిక్షువులను బూజించు చున్నాను. భృత్యులను బోషించుచున్నాను. నాకిట్టిసామర్థ్యము గలుగుట భగవంతుఁడ వగునీ యనుగ్రహమువలననే సుమీ! ఓ ప్రాణనాథా! ప్రజాపతి వయిననీకు ధర్మపత్నినై నీ వలన సకలధర్మముల నభ్యసించు చున్ననా కభీష్ట మగుధర్మమేది నెఱవేఱదు? సమస్తధర్మములు సమకూరుచున్నవి. ఓ మరీచి నందనా! సత్త్వగుణప్రధాను లగు దేవతలును రజస్తమో గుణ ప్రధాను లయినదైత్యులును నీ మనస్సువలనను, శరీరమువలనను జన్మించిరి. ఆ నీపుత్రులందఱయందును నీవు సమబుద్ధివై వర్తింతువు. అయినను సమర్థుఁడ వగునీవు నీ భక్తులందుఁ బక్షపాతము వహించుట న్యాయ్యము. కావున నీభక్తురాల నగునా శ్రేయస్సు వర్ధిలున ట్లాలోచింపుము. శత్రువులగుదైత్యులు స్వర్గలోకమును హరించుటచే నిలువ నీడలేక నాకుమారులు దేశముల పాలయిరి. దయయుంచి వారిని బాలింపుము, నీపత్ని నగుటచే నాకిదివఱకు దుఃఖములు సంభవింపలేదు; కాని నాకిప్పుడు ప్రాప్తమైనది. దైత్యులు నన్ను నా నిలయమునుండి తఱిమిదుఃఖ సాగరమున ముంచివైచిరి. నా ప్రభుత్వమును, నాసంపదలను, నా నివాసదేశమును లాగికొనిరి. ఓ సజ్జనవర్యా! నా కుమారు లేయుపాయముచేఁ దొంటి యభ్యుదయమును బొందుదురో దాని నొనర్పుము. నన్ను దయఁ జూడుము" అనియిట్లు కడుంగడుఁ బ్రార్థించుచున్నయదితిని గాంచి మందహాసము సేయుచు ని ట్లనియె. "ఓ సాధ్వీ! పుత్రాదులందలి స్నేహపాశముచే బంధించు విష్ణువు మాయాబలము నతిక్రమింపఁ గలుగుట మహా కష్టము గదా! అయారే! ఏమి యాశ్చర్యము? పంచభూతపరిణామాత్మక

మగు దేహమెక్కడ? ప్రకృతికంటె విలక్షణ మగునాత్మ యెక్కడ! ఈ దారపుత్త్రాదు లెవ్వరికి సంబంధించినవారు? వీరు దేహమునకు సంబంధించినవారా? లేక యాత్మకు సంబంధించినవారా! ఆలోచింప నాత్మకును బుత్త్రాదులకును దేహమూలకముగా సంబంధము కలదు; గాని సాక్షాత్సంబంధము లేదు. ఈ దేహము పంచభూతాత్మక మగుటచేతను, వృద్ధిక్షయములు గలదగుటచేతను, నిత్యము కానిదగుట చేతను, దీనికి సంబంధించిన పుత్త్రాదులును నిత్యులు కారు. అట్టి పుత్త్రాదులందు స్నేహము చూపుట కేవల మజ్ఞానమూలకము కాని వేఱుకాదు. కావున నీ పుత్త్రులందు మోహమును విడువు'' మని యిట్లు కశ్యపుఁడు మొదట తత్త్వోపదేశము చేసెను. కాని దానికామె సంతుష్టి చెందలేదు. అది తెలిసికొని యమ్మునియామెకు వెండియు నిట్లనియె. "ఓ సుందరీ! విష్ణువు తన్నారాధించు వారికి హితమొనర్చువాఁడు; సకలభూతముల హృదయకుహరములందును నివసించువాఁడు. శ్రేయస్కాములగువారిచే యాచింపఁబడి వారి వాంఛితముల నెఱవేర్చువాఁడు. ఇంతేకాదు. అతఁ డడిగినదానికంటె నధికముగా నిచ్చువాఁడు. అట్టి వాసుదేవుని నీవు భక్తితో నారాధింతువేని దీనవత్సలుఁడగు నతఁడు తప్పక నీ కోర్కుల నెఱవేర్చును. అతనిసేవ యితర దేవతాసేవవలె నెప్పుడును విఫలముకాదు'' అని చెప్పిన పతినిగాంచి యదితి యిట్లనియె. "ఓ నాథా! జగత్పతి యగుభగవంతు నేయుపాయముచే భజింపవలయును? ఎట్లు భజించినచో సత్యసంకల్పుఁ డగుపరమేశ్వరుఁడు నా మనోరథంబు నెఱవేర్చును పుత్త్రులతోఁగూడఁ బలుపాట్లు పడుచున్న నాకు దేనిచే భగవం

తుఁడు సాక్షాత్కరించునో యాయుపాయము నుపదేశింపు"మని పలుక నాకశ్యపుఁడిట్లనియె. "ప్రియురాలా! పూర్వము నేనుసంతానము గల్గించు వ్రతమునుగుఱించి బ్రహ్మనడుగ నతఁడుదయార్ద్రహృదయుఁడై పయోనామకమగు వ్రతముపదేశించెను. అదితప్పక విష్ణువును సంతసింపఁజేయఁగలదు. నీ కావ్రతము నెఱింగించెద. ఫాల్గునశుక్లపక్షమునఁ బ్రతిపద మొదలు పండ్రెండుదినము లాచరింపవలయును. నీవు నిశ్చల మగుభక్తితోఁ గూడికొని యీ వ్రతముచే నరవిందాక్షుని విష్ణువు నారాధింపుము. చంద్రకళ గల్గిన యమావాస్య లభ్యమైనచో నవు డడవిపంది త్రవ్విన మట్టినిగొనివచ్చి "ఓ భూదేవీ! నీవధిక ప్రభావము గలదానవు. నిన్ను యథాస్థానమును జేర్పఁదలంచిన వరాహమూర్తిచేఁ బాతాళమునుండి యుద్ధరింపఁబడితివి. అట్టి నీకు నమస్కారము. నాపాపములను దొలఁగింపుము" అను మంత్రమునుబఠించుచు నామృత్తికను దేహమునఁ బూసికొని స్నానము చేయవలయు. అనంతరము సంధ్యావందనాదికృత్యములను నెఱవేర్చుకొని నిశ్చలచిత్తుఁడై ముగ్గులచే నలంకృత మయినభూమియందును, సూర్యునియందును, జలమందును, వహ్నియందును, గురువునందును హరిని భావించి పూజింపవలయును. ఆసమయమున "ఓన్నమోభగవతే వాసుదేవాయ" యనుమంత్రము నుచ్చరించు చుండవలయును. "ఓవాసుదేవా! నీవు సకలమునకు నాధారమవు. నీవు నిజతేజముచే నంతటను వెలుఁగువాఁడవు. నీవెరులకుఁ గానరాక యే సమస్తవస్తువులకును సాక్షివగుచున్నావు. నీ వందఱిలోను మహాపురుషుఁడవు. అట్టి నీకు నమస్కారములు. ఓమహాపురుషా! నీ

* వీచక్షున్సు మొదలగు నింద్రియములకుఁ గానరావు. మిక్కిలి సూక్ష్మరూపుఁడయిన జీవున కంతరాత్మవై ప్రవేశింపఁ దగియుం డుటచే నతనికంటెను మిక్కిలి సూక్ష్ముఁడ వగుచున్నావు. నీవు ప్రకృతిపురుషులు శరీరముగాఁ గలవాఁడవు. చతుర్వింశతి తత్త్వ ములుగూడ నీకు శరీర మగుచున్నవి. ఇంతియ కాదు. చతుర్వింశతి తత్త్వరూపమునఁ గార్యావస్థఁ జెందిన సత్త్వాదిగుణములకు హేతు భూతుఁడవు. ఇట్లు కార్య కారణ రూపములగు ప్రకృతి పురుషులు శరీరముగాఁ గలవాఁడ వగుటయేకాక వానికంత రాత్మవై కారణుఁడవై యున్న నీకు నమస్కారములు. ఓ పర మేశ్వరా! †శబ్దరూప మగు ప్రపంచ మపూర్వమగువృషభమును

---

* ఇందులకు మూలము "అవ్యక్తాయ" అని యున్నది. దీనిచే " శ్రు॥ యత్తదదృశ్య మగ్రాహ్య మగోత్ర మవర్ణమచక్షుశ్శ్రోత్రం త దపాణి పాదం నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మం తదవ్యయం యద్భూతయోనిం పరిపశ్యంతి ధీరాః" అను నుపనిషదర్థము సంగ్రహింపఁ బడుచున్నది.

† దీనికి మూలము 'నమోద్విశీర్ష్ణే త్రిపదే చతుశ్శృంగాయ తంతవే। సప్త హస్తాయ యజ్ఞాయ త్రయీవిద్యాత్మనే నమః॥ దీనిచే శ్రు॥ చత్వారి శృంగా త్రయో అస్యపాదా ద్వే శీర్షే సప్తహస్తాసో అస్య। త్రిధా బద్ధోవృషభో రోరవీతి మహాదేవో మర్త్యాగ్ం ఆవివేశ॥ అను మంత్రార్థము ప్రకటిత మగు చున్నది. ఈ మంత్రమందు శబ్దాత్మకప్రపంచము లోకవిజాతీయ వృషభము గా నిరూపింపఁ బడుచున్నది. అదెట్లన--మహాక్ దేవః=శబ్దస్వరూపుండగు దేవుఁడు, త్రిధా=మూఁడువిధములుగా, బద్ధః=ఉత్పత్తిఁజెంది, అనఁగా వక్ష స్థలమందును, గంఠమందును, శిరస్సునందును మాత్రమే శబ్దజాలముపుట్టుచుం డును గాన నిట్లుచెప్పఁబడియె. వృషభః=లోకవిజాతీయమగు వృషభరూప మునొంది, మర్త్యాక్=నశ్వరములును బరమాత్మకు శరీరభూతములును నగుదేవ మనుష్యాది పదార్థములను, ఆవివేశ=తెలుపుడు చేయుటకయివర్తించెను. అనఁగా

భోలుచున్నది. సామాన్య వృషభమునకు రెండు కొమ్ములును, నాలుగు కాళ్లును, నొక తలయు నుండును. కాని యీశబ్ద వృషభమునకు నామము, క్రియ, నిపాతము, ఉపసర్గము నాఁబడు నాలుగు శృంగములును, భూతము, భవిష్యత్తు, వర్తమానము నాఁబడు మూఁడు పాదములును, ప్రవృత్తినిమిత్తము తదాశ్రయము నాఁబడు రెండు శిరస్సులును; నేడు విభక్తులనెడి యేడు చేతులును గలవు. అట్టి శబ్దప్రపంచము నీకు శరీరభూతమగుటచే రెండు శిరస్సులతోను మూడుపాదములతోను నాలుగుశృంగములతోను, నేడు హస్తములతోను వెలయుచు యజ్ఞాదిక్రియాఫలమును విస్తరింపఁజేయుచు వేదముచే బోధితమగురూపముగలవాఁడవై యజ్ఞరూపుఁడవయియున్న నీకువందనములాచరించెదను

---

దేవ మనుష్యాదులను దెలియఁబఱిచెనని భావము. అస్య=శబ్దాత్మకమగునీ వృషభమునకు, చత్వారి=నామము, క్రియ, నిపాతము ఉపసర్గము నాఁబడు నాలుగు, శృంగాః=కొమ్ములును, అస్య=దీనికి, త్రయః=భూతభవిష్యద్వర్తమానము లనెడి మూఁడు, పాదాః=కాళ్లు, ద్వే=ప్రవృత్తినిమిత్తము, తదాశ్రయము నాఁబడు రెండు, శీర్షే=తలలు, అస్య=దీనికి, సప్త=ప్రథమాదివిభక్తులగు నేడును, హస్తాసః=చేతులగుచున్నవి. ఈ శబ్దజాలరూపమగు వేదము పరమాత్మను బోధించుచున్నదని ఫలితార్థము. వెనుకఁ గార్యకారణాత్మకమగువస్తురూపప్రపంచమంతయును బరమాత్మకు శరీరభూతమనిచెప్పి యీశ్లోకముచే నామరూపప్రపంచము భగవంతునిరూపమును బోధించుచు నతనికపృథగ్భూత విశేషమయియున్నదని తెలియఁబఱిచెను. నామాత్మకప్రపంచమంతయు వేదమే యగుటచేతను, అది పరమాత్మకపృథక్సిద్ధవిశేషణమగు రూపప్రపంచమును జెప్పుచుండుటచేతను, అట్టి విశేషణములను దెల్పు శబ్దములకు విశేష్యమందుఁ బర్యవసన్నము లగుట నైజమగుటచేతను నిగమాగమాది శబ్దజాతమంతయుఁ బరమాత్మను బోధింప సమర్థమైనదని స్పష్టమగుచున్నది.

ఓ మహాదేవా ! రుద్రశరీరకుఁడవయి భవుఁడవనియు నంబి కాపతివనియు, శివుఁడవనియు, విద్యాధిపతివనియు; భూతపతి వనియుఁ, బిలువఁబడుచు విశ్వమును నశింపఁజేయుచున్న నీ కభి వాదము గావించెద. మఱియుఁ జతుర్ముఖ శరీరకుఁడవయి సృష్టి నొనరించుచు సమస్తప్రాణుల కంతరాత్మవై, జగద్రా పుఁడవై, యోగైశ్వర్యమును నిర్వహించుచు; యోగమునకుఁ గారణుఁడ వయిననీకు నమస్కారములు. ఓ యీశ్వరా ! నీవు బ్రహ్మరుద్రాదులకుఁగూడ గారణభూతుఁడవు. నీవు స్వీయతేజ ముచేఁ బ్రకాశించుచు బ్రహ్మాదులను బ్రకాశింపఁజేయుచున్నాఁ డవు. నరనారాయణరూపమున నవతరించి లోకము నాపదల నుండి కాచుచున్నావు. నీ వాశ్రితుల కష్టముల నపహరించు వాఁడవు. ఇంద్రనీలమువలె శ్యామలకాంతితో నొప్పువాఁడవు. పచ్చని పట్టువస్త్రములతోను, నెప్పుడును విడిచియుండని లక్ష్మి తోను వెలయుచున్నవాఁడవు. ఇట్టి మహనీయుఁడ వగునీకు వందనము లర్పించెదను. ఓ పరమపురుషా ! నీ వాశ్రితులకుఁ బూర్తిగా వరముల నొసంగి వరదశ్రేష్ఠుఁడ వనిపించుకొను చున్నాఁడవు. కావుననే భక్తులందఱును శ్రేయస్సు నభిలషించి నీ పాదపద్మములఁ గొల్చుచున్నారు. లక్ష్మియును, బ్రహ్మాదులును నెవనిపాదపద్మముల యామోదమునకు వశులయి నిత్యము నను సరించుచున్నవారో యా వాసుదేవుఁడు నాకుఁ బ్రసన్నుఁడగుఁ గాక' యనెడి మంత్రములచేతను, నావాహనముచేతను హరిని దమ సన్నిధినిఁ జేర్చుకొని పాద్యమొసఁగి యాసనమిచ్చి యర్ఘ్య మర్పించి గంధముచేతను, బుష్పములచేతను, మధుపర్కాదుల చేతను బూజించి పాలచే స్నానముచేయించి శ్రద్ధాయుక్తుఁడై

వస్త్రమును, యజ్ఞోపవీతమును, నాభరణములను, సమర్పింప వలయును. ద్వాదశాక్షరవిద్యను బఠించుచు నిట్లు సకలోపచార ముల నొనర్చి నేతితోను బెల్లముతోను గూడిన పాయసాన్న మును శ్రీహరికి నివేదింపవలయును. మూలవిద్యను బఠించుచు హోమముచేయవలెను. పిమ్మట నివేదితమగు నా పాయసమును స్వయముగా భక్షింపవలెను. లేనిచో నొక బ్రాహ్మణున కర్పింప వలయును. పరమేశ్వరున కాచమన మొసంగి తాంబూలమర్పించి ద్వాదశాక్షర మంత్రమును నూటయెనిమిదిపర్యాయములు జపించి స్తోత్రములను బఠించి నుతింపవలయును. తరువాత నా భగవంతునకుఁ బ్రదక్షిణము చేసి దండప్రణామములర్పించి నిర్మా ల్యమును దీసికొని శిరమునఁ దాల్చి, యనంతర ముద్వాసనము చేయవలయు. పిమ్మట నిరువురు బ్రాహ్మణులను బాయసముచే భుజింపఁజేసి వారిని యథోచితముగాఁ బూజించి వారియనుమతి చొప్పున నా శేషమును బంధువులతోఁగూడ భుజించి స్త్రీసంగ రహితుఁడై యారాత్రిపుచ్చి వేకువనే మేల్కొని స్నానముచేసి శుచియై సమాహితచిత్తుఁడై వెనుకటియట్లు పూజింపవలెను. పాలనుమాత్రమే యాహారముగాఁగొనుచు నీవ్రతము నాచ రింపవలెను. పూర్వమువలె హోమము చేసి బ్రాహ్మణుల భుజింపఁ జేయవలెను. ఓ సుందరీ! వ్రతి యిట్లు ప్రతిదినమందును విష్ణు పూజను, బ్రాహ్మణ భోజనమును, హోమమును జేయుచు, మూఁడు పూఁటలును స్నానమొనరించి బ్రహ్మచర్యము పూని క్రింద శయనించుచు, శుక్లపక్ష ప్రతిపత్తు మొదలు త్రయోదశివఱకును నీ పయోవ్రత మాచరింపవలయును. ఆసమ యమున వ్రతి వాను దేవపరాయణుఁడై యసద్వాక్యముల నుచ్చ

రింపరాదు. భోగముల ననుభవింపరాదు. సకలభూతములకును హింసచేయఁజనదు. పదుమూఁడవదినమున యథావిధిగా మంత్రకోవిదు లగుబ్రాహ్మణులు మంత్రము లుచ్చరించుచుండఁగాఁ బంచామృతములచేతను విష్ణువును స్నానముచేయింపవలెను. ధనలోభము, నొందక సకలోపచారములతోను విష్ణువును బూజించి విష్ణుదేవతాక మగుచరువును సిద్ధముచేసి నిశ్చలచిత్తుఁడై పురుషసూక్తముచే హోమముచేసి షడ్రసోపేతమగు నైవేద్యము నర్పింపవలెను. జ్ఞానసంపన్నుఁడయిన తన గురువునకు విప్రులకును, వస్త్రములను, నాభరణములను, గోవులను నొసంగి సంతసింపఁ జేయవలెను. ఆ గురు ద్విజతోషణము హరిని సంతసింపఁ జేయుటవంటిదే; కాన తప్పక యాచరింపవలయును. ఓ ప్రియురాలా! ప్రతి గురువునకును, తక్కిన బ్రాహ్మణులకును, సంతృప్తిగా భోజనమిడవలయును. ఋత్విక్కులకును, గురువునకును యథార్హముగా దక్షిణలొసంగి పిమ్మట సర్వవర్ణములవారిని భోజనాదులచేఁ దనివి నొందింపవలయును. దీనులును, గ్రుడ్డివారును, గృపణులును దనివి సన భుజించినచో విష్ణువు తప్పక సంతసించును. ఇట్లు చేసి తానుబందుగులతోను, విద్వాంసులతోను భుజింపవలయును. పూజాదినములందు గానము చేయింపవలయును. హరికథలను వినిపింపవలయును. ఇట్లు భగవంతు నారాధింపవలెను. పయోవ్రతమని దీనిపేరు. ఇది పరమేశ్వరుని సంతసింపఁజేసినట్లు వేఱొకటి చేయలేదు. బ్రహ్మ పూర్వమీవ్రతమును నాకుపదేశించెను. దానిని నీకు విధిసహితముగా నుపదేశించితిని. ఓ పుణ్యాత్మురాలా! నిర్మలమగునంతఃకరణము గలదానవై నీ వీవ్రతముచే హరిని బూజింపుము. ఈ పయోవ్రతము సకల

యజ్ఞములతోను, సకలవ్రతములతోను సమానమైనది. అన్ని విధములచేత నొనర్పఁబడు తపస్సారమునకును, సకలదానములకును, నిది తుల్యమైనది. పరమేశ్వరుని సంతసింపఁజేయుటకు దీనితో నీడైనది లేదు. విష్ణువును సంతసింపఁజేయునట్టి నియమములుమాత్రమే యత్యుత్తమములు. కావున నీవు మిక్కిలి ప్రయత్నముచేసి శ్రద్ధాయుతురాలవై యీ వ్రతము నాచరింపుము. పరమేశ్వరుఁడు నీవ్రతమునకు సంతసించి వలయు వరంబుల నిచ్చును. ఇది పదాఱవయధ్యాయము.

---

## వామనమూర్తి యవతరించుట; బ్రహ్మాదులతని నుతించుట.

అని యిట్లు తన భర్త యగుకశ్యపుఁ డుపదేశింపఁగా నదితి మిక్కిలి సంతసించి నిశ్చలచిత్తురాలై పండ్రెండుదినంబు లా వ్రతము నాచరించెను. ఆమె బుద్ధియనెడి సారథిసాయమున మనస్సు నింద్రియంబు లనెడి దుష్టతురంగములను జయించి యితరాసక్తముకాని బుద్ధిచే మనస్సును సర్వాంతరాత్మయును, షాడ్గుణ్యపూర్ణుఁడును నగువాసుదేవునియందు స్థిరముగా నిలిపి సర్వదా యమ్మహాపురుషుని ధ్యానించుచు నావ్రతమును యథావిధి సమాప్తినొందించెను.అంత నాదిపురుషుఁడగువాసుదేవుఁడు పీతాంబరమును దాల్చి శంఖము, చక్రము, గద మొదలగు సాధనములఁ జేకొని యామెకుఁ బ్రత్యక్షమయ్యె. అట్లు సాక్షాత్కరించిన వాసుదేవునిఁగాంచి యాసాధ్వి త్వరగా లేచి నిలువఁబడి ప్రేమాతిశయముచేఁ దడఁబడుచుఁ గన్నులనుండి యానందబాష్పములు స్రవింప, దేహమంతయుఁ బులకరింప భగవంతుని

దర్శనమువలన గల్గిన నిరతిశయానందముచే దేహము కంప మెత్త నతనికి దండప్రణామములాచరించి దోసిలివట్టి యూరక నిల్చియుండె; కాని నుతింప సమర్థురాలు కాకపోయె. ఓ రాజేంద్రా! ఆ యదితి యట్లు కొంతసేపుండి క్రమక్రమముగా నింద్రియములను స్వాధీనము గావించుకొని యజ్ఞస్వరూపుఁడయిన రమాపతిని ఱెప్పవాల్పకుండఁ జూచుచు బ్రీతిపూర్వకముగా హరి నిట్లునుతించెను. "ఓ పరమేశ్వరా! నీవు యజ్ఞాధిపతివి; నీవు యజ్ఞభోక్తవు; నీ వాశ్రయించినవారి నెప్పుడునువిడుచువాఁడవుకావు. గంగాదిరూపమగుతీర్థము పాదమందుఁ గలవాఁడవు. పవిత్రమగు కీర్తి గలవాఁడవు. శ్రవణములకు మంగళకరమగు నామధేయము గలవాఁడవు. ఓ దేవా! ఆపన్నులయి నిన్ను శరణుచెందిన లోకులదుఃఖములఁ దొలఁగింప సమకట్టిన మహాత్ముఁడవు నీవే? నీవు మావంటి దీనులకు నాథుఁడవు. కావున దయయుంచి మాకు సుఖము నొసంగుము. ఓ మహాపురుషా! నీవువిశ్వస్వరూపుఁడవు. ప్రపంచమునకు సృష్టిస్థితిలయములఁగల్గింపఁ గారణభూతుఁడవు నీవే? లీలకయి నానావిధములుగాఁ బరిణమించు సత్త్వాదిగుణములను జేకొని సృష్ట్యాదికార్యముల నొనర్చువాఁడవగుటచే నీవు విశ్వాకారుణుఁడవయినను వికారముల నొందవు. నీ వనంతకల్యాణములచే నిరతిశయుఁడవు. మార్పుచెందని స్వరూపమును, గుణములునుగలవాఁడవగుటచేఁ బ్రకృతిపురుషసంబంధము సదా గలవాఁడ వయినను దద్గతదోషములు నిన్నుఁ బొందలేవు. సంతత మభ్యుదయముగలదై కల్యాణగుణములకు నిలయమై యవిచ్ఛిన్నానందమైయున్న నీస్వరూపమును జూపి జీవుల యజ్ఞానమును దొలఁగించువాఁడవు. ఆశ్రి

తుల కష్టముల నపహరించువాఁడవు. అట్టి యనంతశక్తి యగు నీకు నమస్కారము లాచరించెదను. ఓ మహాత్మా! నిన్ను సంతసింపఁజేసిన నరులకు నీదయవలనఁ జిరాయువును, బలపరాక్రమాదులతోఁ గూడిన శరీరమును, సకలసంపదలును, స్వర్గాదులును, సమస్తములయిన యోగసిద్ధులును, ధర్మార్థకామములును, సందేహరహిత మగుజ్ఞానమును గల్గుచుండునని చెప్పవలసినపుడు శత్రుజయాదులు గల్గునని వేఱచెప్పవలయునా" యని యిట్లదితి నుతింపఁగా సకలభూతములకు నంతరాత్మయై విలసిల్లు నా వాసుదేవుఁడు సంతసించి యామె కిట్లనియె. "ఓ దేవమాతా! నీవు చిరకాలమునుండి కోరుచున్న నీ కోర్కిని దెలిసికొంటిని. నీ కుమారులు శత్రుపీడితులయి సంపదలను గృహములను విడిచి దేశాంతరములకుఁ బోయి పలుబాధలు పడుచున్నారనియు, వారి యైశ్వర్యము వారికి మరల సంప్రాప్తము కావలయుననియుఁ గోరుచున్నావు. నీ పుత్త్రు లారక్కసులను యుద్ధములో జయించి తమ రాజ్యము తీసికోఁజాలినంత సామర్థ్యము వారికి గలుగు నిమిత్తమే నన్నుపాసించితివి. తొంటియట్లు నీవు నీ పుత్త్రులతో నొకచోటఁ గూడియుండవలెనని యభిలషించుచున్నావు. అది యంతయు నాకుఁ దెలిసినది. నీ కుమారులగు నింద్రాదులచేఁ జచ్చిన తమ భర్తలసన్నిధిని జేరి విలపించు దురదృష్టవంతురాండ్రగు దైత్యస్త్రీలను నీవు చూడఁగలవు. ఇంద్రాదులు మగుడఁ దమ సంపదలను దమకీర్తులను సంపాదించుకొని స్వర్గపురమును జేరి తొంటియట్లు క్రీడించుచుండఁ జూచి సంతసించు భాగ్యము నీకు స్వల్పకాలములోనే లభించును. ఓ దేవీ! యోజింపనా దైత్యుల కిప్పుడు కాలమనుకూలమైయున్నది.

మహాశక్తిమంతు లగుశుక్రాదులచే సంరక్షితులై యున్నారు. వారి నిప్పుడు మనము జయించుట కష్టము. యుద్ధమునఁ బరాక్రమము చూపుట నిష్ఫలము. అది సుఖదాయకము కానేరదు. అయినను నీ వొనరించిన వ్రతమునకు మిక్కిలి సంతసించి నే నందులకుఁ దగినయుపాయము వేఱొకటి యోజించెదను. నా యారాధన మెప్పుడును విఫలముగాదు. నా యారాధకుని శ్రద్ధాభక్తుల కనుగుణ మగుఫలము లభింపకమానదు. నీవు పుత్త్రరక్షకై చేసిన పయోవ్రతమునకు మిక్కిలిసంతసించితిని. కశ్యపబ్రహ్మ తపఃఫలముగా నేను నా యంశముచే నీకుఁ బుత్త్రుఁడనయి యవతరించి నీ కుమారులను రక్షించెదను. ఓ శుభురాలా! నీవు నిష్కల్మషుఁ డయినకశ్యపు ననువర్తించియుండుము. నిజతేజముచేఁ బ్రకాశించుచున్న నన్ను నీ భర్తవలన గర్భమందు ధరింపఁగలవు. ఈవృత్తాంతము మిక్కిలి రహస్యముగా నుంపవలయు; పరుల కెవ్వరికిని దెలియనీకుము. అట్లు గుప్తముగా నుంచితివేని శీఘ్రకాలములోనే ఫలమొందఁగలవు" అని యిట్లు వాసుదేవుఁడు పలికి యచ్చటనే యంతర్ధానముచెందెను. దర్శనమునకే దుర్లభుఁ డయినభగవంతునిఁ గుమారునిఁగాఁ బడయుభాగ్యము తనకు లభించినందుల కదితి మిక్కిలి సంతసించి శ్రద్ధాభక్తులతో భర్తను గొల్చుచు ననుసరించు చుండెను. అంత విఫలముగాని దివ్యజ్ఞానము గలకశ్యపుఁడు నారాయణు నంశము తనయందుఁ జొచ్చియున్నట్లు సమాధియోగముచేఁ దెలిసికొని తపస్సుచేఁ జిరకాలమునుండి సంపాదితమయినదియు దారుణమైన యగ్నివలెఁ బ్రకాశించుచున్నదియునగు తనవీర్యము నదితియందుంచెను. సనాతనుఁ డయినహరి యిట్లదితిగర్భ

మందుఁ బ్రవేశించి వర్ధిల్లు చున్నసంగతిఁ దెలిసికొని బ్రహ్మ, యసాధారణగుణములను దెలియఁజేయు నామములచే నా విష్ణువు నిట్లు నుతింపఁజొచ్చెను. లోకముల నాక్రమింపఁజాలిన పాదన్యాసములుగల యో పరమేశ్వరా ! సర్వోత్కర్షను బొంది వర్తింపుము. నీవు సాధువులయిన బ్రాహ్మణులకు దేవుఁడవయి రక్షించుచున్నావు. నీవు సృష్టిస్థితిలయముల నొనర్ప లీలకయి రజము, మొదలగు గుణములను దాల్చుచున్నావు. ఓ దేవా! లోకముల రక్షించునిమిత్తము పూర్వమం దిట్లె పృశ్నియను సాధ్వీమణిగర్భమున నివసించినవాఁడవు. నీవు వేదములకు నిల యభూతుఁడ వగుచున్నావు. లోకత్రయరూప మగుపద్మము నాభియందుఁ దాల్చినవాఁడవు. నీవు పరమాకాశమునందు వర్తించువాఁడవు. జీవులకంతరాత్మవై వెలయుచున్నావు. అంత టను వ్యాపించు స్వభావము గలవాఁడవు. నీవు విశ్వమున కాది యందును, మధ్యమందు, నంతమందును గారణభూతుఁడ వగు చున్నావు. పండితులు నిన్ననంతశక్తిగల పరమ పురుషునిఁగాఁ జెప్పుచున్నారు. కాలశరీరకుఁడవయిన నీవీ విశ్వమును మహాప్ర వాహము తనయందుఁ బడిన గడ్డిపోచనుంబోలెఁ జిమ్మివేయుచు న్నది.ఓ మహనీయా! నీవు స్థావరజంగమములను, బ్రజాపతులను బుట్టించినవాఁడవు. నీట మునుఁగుచున్నవానికిఁ బడవవలెఁ గష్ట ముల పాలగుచున్న దేవతలకు నీ వాశ్రయుఁ డగుచున్నావు. ఆ దేవతలకార్యమును సాధించుటకే యి ట్లవతరించుచున్నాఁ డవు. అట్టి నీకు నమస్కారము లాచరించెదను. నీ విఁక నా దేవ తల నెప్పటియట్లు స్వర్గనివాసులనుగాఁ జేయుము'' ఇది పదునే డవయధ్యాయము.

---

### వామనుఁ డుదయించుట

అని యిట్లు చతుర్ముఖుఁడు తన యద్భుతకార్యములను, దన ప్రభావమును నుతించుచుండఁగాఁ బరమపురుషుఁడు కర్మాధీన మగు జననమరణములు లేనివాఁడైనను, దేవకార్యము నెఱవేర్ప నదితియం దావిర్భవించెను. అతని నాలుగుచేతులందును క్రమముగా శంఖము, చక్రము, గద, పద్మము వెలయుచుండెను. అతని దేహకాంతి నిర్మలమైన నీలమేఘమును బోలుచుండెను. అతని ముఖపద్మము మకరకుండలముల కాంతులచే రాజిలుచుండెను. వక్షస్స్థలమున శ్రీవత్సమను లాంఛన మొప్పుచుండెను. అతని ముంజేతులందు బంగారుమురుగులును, భుజములందుఁ గేయూరములును, దలయందుఁ గిరీటంబును, మొలయందు బంగారు త్రాడును, మెడయందు ముత్యముల హారములును, గాళ్లయందందెలును విలసిల్లుచుండెను. అతఁడు దాల్చినవనమాలయందలి తేనెను గ్రోలుటకు మూఁగిన తుమ్మెదరొదములు ఝుమ్ము ఝుమ్మని నినాదము చేయుచుండెను. అతఁడు దాల్చిన కౌస్తుభరత్నము మిక్కిలి యందముగులుకుచుండెను. అతని దేహకాంతిచేఁ గశ్యపుని గృహమునందున్న చీకట్లన్నియుఁ దొలఁగింపఁబడుచుండె. ఇట్టి మహామహిమతో శ్రీహరి యావిర్భవించు కాలమున దిక్కులు నిర్మలములయ్యె. జలాశయములు ప్రసన్నములయ్యె. ప్రజలు సంతుష్టులయిరి. ఆఱుబుతువులును దత్తత్ఫలాదిసంపదలతోఁ దులఁదూఁగుచుండె. దివియునంతరిక్షంబును, భూమియు, నగ్నియు, దేవతలును, బ్రాహ్మణులును, బర్వతములును, మిక్కిలి సంతోషము గలవయ్యె. సకల నక్షత్రములును, గ్రహములు ప్రదక్షిణమొనర్చుచుండ శ్రవణనక్షత్రయుతమైన

భాద్రపదశుక్లద్వాదశినాఁ డభిజిన్ముహూర్తమున సూర్యుఁడు గగనమధ్యము నధిష్ఠించియుండఁగాఁ బరమపురుషుఁ డుద యించె. ఓ రాజా! భగవంతుఁడు జన్మించిన ద్వాదశి విజయ యను నామమునఁ బిలువఁబడుచున్నది. అతని జన్మదివసమున శంఖములను బూరించిరి. దుందుభులును మృదంగములును, బణవములునువిచిత్రములగు వాదిత్రములునువాయింపఁబడెను. మిక్కిలి సంతసముతో నచ్చరలాడిరి. గంధర్వులు గానముచేసిరి. మునీశ్వరులు సంతసించిరి. దేవతలును, మనువులును, పితృదేవ తలును, నానందముచెందిరి. సిద్ధులును, విద్యాధరులును, కింపు రుషులును, కిన్నరులును, జారణులును, యక్షులును, రక్షస్సు లును, గరుడులును, భుజగులును, మిగిలిన దేవానుచరులును, బరమేశ్వరుని నుతించుచు, నతనిఁ గీర్తించుచు, నాడుచుఁ బాడుచు దమ యామోదమును వెల్లడించిరి. సురవరులు సంతసముతోఁ గశ్యపు నాశ్రమముపైఁ బుష్పవర్షమును గురియించిరి. అదితి తన గర్భమునుండి యుదయించిన పరమపురుషునిఁగాంచి విస్మితు రాలయి చూచుచు నధికానందము చెందుచుండెను. అంత శ్రీహరి యాశ్చర్యశక్తిచే శిశురూపమును దాల్చెను. అది చూచి బ్రహ్మ "జయ, జయ" యని పల్కుచు సంతసము వెలిపుచ్చెను. మొదట నాయుధములతోను, భూషణములతోను నవతరించిన యా పరమపురుషుఁ డచ్చటివారు చూచుచుండఁగనే వటుని చందమునఁ బొట్టి వడుగురూపమును ధరింప సంతుష్టిఁజెందిన మునులందఱును గశ్యపునిచే నా శిశువునకు జాతకర్మాదులఁ జేయించిరి. అనంతరము కశ్యపుఁ డతనికుపనయనముగావించెను. ఆ వామనునకు సూర్యుఁడు సావిత్రి నుపదేశించెను. బృహస్పతి

బ్రహ్మసూత్రమును, కశ్యపుఁడు మేఖలను, భూమి కృష్ణాజినమును, వనస్పతి యగుచంద్రుఁడు దండమును, దల్లియగు నదితి కౌపీనమును, దివి గొడుగును, బ్రహ్మ కమండలువును, సప్తర్షులు దర్భలను, సరస్వతి యక్షమాలను, గుబేరుఁడు భిక్షాపాత్రమును, పార్వతి భిక్షయును నొసంగెను. ఇట్లు బ్రహ్మచారిలక్షణములతోఁ గూడిన యావటువు బ్రహ్మర్షి గణములతో నిండిన యాసభను మిక్కిలి ప్రకాశింపఁజేసెను. అప్పుడు కశ్యపుఁ డుపనయనాగ్నికి బర్హిస్సుచేఁ బరిస్తరణలు వేసి ప్రజ్వలింపఁజేసి లెస్సగాఁబూజించి హోమము చేసెను. ఉపనయనసంస్కార మైనపిమ్మట వామనుఁడు శుక్రాదుల సాయమున నశ్వమేధయాగములను జేయుచున్న బలిచక్రవర్తి కీర్తిని విని, సంపూర్ణబలవంతుఁడై యడుగడుగునను భూమిని గంపింపఁజేయుచు, నతని యాగవాటికకు వెళ్లెను. నర్మదాతీరమున భృగువత్సక మను క్షేత్రమునందు బలిచే యాగమును చేయించుచున్న శుక్రాదులు సూర్యునివలెఁ బ్రకాశించుచుఁ దమచెంత కరుదెంచుచున్న యావామనునిఁ జూచిరి. క్రమక్రమముగాఁ దమసమీపమున కరుదెంచుచున్న వామనుని తేజముచే శుక్రాదులును, బలియు, నపహృతకాంతులై "ఆవచ్చువాఁడు సూర్యుఁడా? లేక యగ్నిహోత్రుఁడా? లేక యీయాగమునుజూడ వేడుకతో వచ్చుసనత్కుమారుఁడా?" యనిసందేహించుచుండ సదండ మగుగొడుగును, జలపూర్ణ మగుకమండలువును దాల్చి యాయశ్వమేధవాటికను బ్రవేశించెను. మౌంజిని, మేఖలను, గృష్ణాజినమును యజ్ఞోపవీతమును, జటలను దాల్చి కపట బ్రహ్మచారివేషమున నరుదెంచిన శ్రీహరిని గాంచి యతని తేజమునఁ దిరోహితు లయినశుక్రాదులు శిష్యసహితులై యాసన

ములనుండి లేచి గౌరవించిరి. రూపమునకుఁ దగిన యవయవములు గలుగుటచే మనోహరుఁడై చూడఁ దగియున్న యా వామనునిఁజూచిఁబలిచక్రవర్తి యెదురేఁగి యుచితాసనమర్పించి కుశలమడిగి యతని పాదములు గడిగి ముక్తసంగులగుయోగీశ్వరుల హృదయములందు వసించు భగవంతుని యథావిధిగాఁ బూజించెను. ఎవనిపాదమునఁ బుట్టినగంగను పరమభక్తితో దమతమ శిరంబులఁదాల్చి బ్రహ్మ శంకరుఁడు మొదలగువారు పవిత్రులైరో యాపరమేశ్వరుని పాదజలమును దీసి భక్తిఁతో దనశిరంబునఁ జల్లికొని బలి పరమానందముచెంది కృతకృత్యునిఁగా నెంచుకొనుచు నతనిఁ గాంచి యిట్లనియె. "ఓవిప్రవర్యా! నీకు నమస్కారములు. నీవు మిక్కిలి యుచితకాలమున నిచ్చటికరుదెంచినందుల కానందించుచున్నాము. నీకు మేము కింకరులము. నీకేమిచేయవలయును ? శ్రేష్ఠమగు శరీరముతోఁ బొల్చుచున్న నీవు మూర్తిమంతమగు బ్రహ్మర్షుల తపంబోయనఁబొల్చుచున్నావు. ఓ మహానీయా ! నీవు మాగృహామునకు వచ్చుటచే మా పితృదేవతలు సంతసమందిరి. మాకులము పవిత్రమయ్యె. నాచేయు యజ్ఞము సఫలమయ్యె. నాయగ్నిహోత్రములు లెస్సగాఁ బూజితములయ్యె. నీపాదారవిందములఁ గడిగినజలమును శిరంబునఁ దాల్చుటచే నిష్పాపుఁడనయితిని.పవిత్రములగునీపాదముల తాఁకుడువలన నీభూమి మాశరీరములతోఁ గూడఁ బవిత్రమయినది. ఓ విప్రకుమారా? నీ వేదో కోర్కెతో వచ్చినట్లు తోఁచుచున్నది.అది యేమేదో సంశయింపక యడుగుము,దానినేఁ దప్పక యిచ్చెదను; పుచ్చికొనుము. నీకు భూమి కావలయునా, గోవులు కావలయునా? బంగారము కావలయునా? సకలవస్తు

వులతోఁ దులఁదూగు గృహములు కావలయునా ? మృదు లాన్నము కావలయునా? కన్యక కావలయునా? వీనిలో నీకేమి కావలయు ? ఇంతేకాదు. గుఱ్ఱములనుగాని గజములనుగాని రథములనుగాని,సస్యసంపదలుగలగ్రామమునుగాని యడిగెదవేని తప్పక యిచ్చెదను. నీకు వలయుదాని నడిగి పుచ్చుకొని నన్ను సంతసింపఁజేయుము" అనెను. ఇది పదునెనిమిదవయధ్యాయము.

---

వామనుఁడు మూఁడడుగుల నేల దాన మడుగుట; శుక్రుఁడు వామనుని స్వరూపమును దెలిపి దానము వలదని యుపదేశించుట.

అని యిట్లు బలిచక్రవర్తి పలికినవాక్యము సత్యమై ధర్మయుక్తమై యున్నందులకు మిక్కిలి సంతసించి భగవంతుఁడగు వామనుఁ డతనిఁబొగడి యిట్లనియె. "ఓ దానవేంద్రా ! నీవు పలికినవాక్యము మిక్కిలి యుక్తముగానున్నది. పరలోకసాధనము లగుధర్మములనిర్ణయింప సమర్థుఁడును,శాంతుఁడును నగు ప్రహ్లాదుఁడు నీకుఁ దాత. అతనికులమునఁ బుట్టినందులకుఁదగిన వచనమును బలికితివి. నీ పలుకు ధర్మయుతమై కీర్తికరమైయున్నది. ఈనీకులమందుఁ గృపణుఁ డగుపురుషుఁ డొకఁడును బుట్ట లేదు. ఇఁకఁ బుట్టఁబోఁడు. ప్రకృతకాలమున లేఁడు. బ్రాహ్మణున కిచ్చెదనని వాగ్దానముచేసి యీయని దుర్బలుఁడు నీవంశమున జన్మింపఁదగఁడు. ఓనరనాథా ! ఆకాశమునఁ జంద్రునివలె దేని యందుఁ బ్రహ్లాదుఁ డుదయించి నిర్మల యశస్సుతో విరాజిలు చున్నాఁడో యా నీకులమందు దానావసరమున యాచించు యాచకునకును, సమరసమయమునఁదన్నెదుర్కొను వీరునకును,

వెన్నిచ్చి పర్విడునట్టి పిఱికిపంద సంభవింప లేదు. సంభవింపఁబోదు. నీవంశమునఁ బొడమిన హిరణ్యాక్షుఁడు మహావీరుఁడుగదా! అతఁడు గదను దాల్చి దిగ్విజయము చేయుచుఁ దనతో సమఁడగు వీరునికై భూమండలమంతటను దిరుగులాడెను; కాని యొకఁడైన నతని నెదుర్కొనఁ గలిగెనా! విష్ణువు వరాహరూపియై భూమి నుద్ధరించుచున్న సమయమునఁ దన్నెదుర్కొన్న యాహిరణ్యాక్షు నతికష్టముచే జయించి తన్నుఁ గృతకృత్యునిఁగా దలంచెను. విష్ణువునకుఁగూడ నాశ్చర్యముఁ గల్గించు నతని పరాక్రమము మహత్తరమైనదనుటకు సందియమున్నదా? తన సోదరుని మరణమును విని హిరణ్యకశిపుఁడు కోపోద్దీపితుఁడై భ్రాతృహంతయగు శ్రీహరిని జంప నతని పురమున కేగెను. శూలమును దాల్చి ప్రళయకాలయమునివలెఁ దనపైకి వచ్చుచున్న హిరణ్యకశిపునిఁ గాంచి కాలజ్ఞుఁడును మాయావియు నగుహరి తనలో నాలోచించుకొని "నే నెచ్చటికిఁ బర్విడినను మృత్యుదాయకుఁడగు వీఁడు నన్ను వెంబడింపక మానఁడు. కావున నేను వెలుపటను గానరాకుండ నుంటకై వీని హృదయకుహరమును బ్రవేశించుట మంచి" దని తలంచి తన నిమిత్తము సంచరించుచున్న శత్రువగు హిరణ్యకశిపుని శరీరమును జొచ్చి "హృదయమును జొచ్చినచో నన్నుఁ దెలిసికొను" నని చింతించి సూక్ష్మశరీరుఁడై భయపడుచు నిట్టూర్పు వాయువులో లీనతఁ జెంది యుండె. విష్ణువునంతవానికిసైతము భయముగల్గించు హిరణ్యకశిపుని శౌర్యము వర్ణనీయము గదా! అప్పుడా దైత్యేంద్రుఁడు వైకుంఠము జనశూన్యమై యుండుటంజూచి కోపోద్దీపితుఁడై "నేనే జయించితి" నని పెద్దపెట్టున సింహనాదము చేసెను.

అనంతర మతఁడు భూమిని, స్వర్గమును, దిక్కులను, నంతరిక్షమును, పాతాళాది లోకములను, సముద్రములను గాలించి చూచినను విష్ణు వగపడక పోవుటచేఁ దనలో నిట్లు తలపోయ నారంభించె. "అయ్యారే! నా సోదరునిఁ జంపిన హరినిమిత్త మీజగమునంతను వెదకితిని; కాని వాఁడు గనఁబడలేదు. ఇందెచ్చటను లేనప్పుడెక్కడి కేఁగియుండును? తప్పక చచ్చియుండును. కోప మజ్ఞానమువలనఁ బొడమి దేహాత్మాభిమానముచే వర్ధింపఁబడును. అట్టి కోపము దేహము నశించినతోడనే నశించును. ఆ కోపమువలనఁ గల్గువైరముగూడ దేహులకు మరణపర్యంతమే కాని పిమ్మట నుండదు. నాకు హరితోఁ గల వైరానుబంధమతఁడు నశించినతోనే నశించిన"దనిపలికి యూరకుండెను. ఓబలిచక్రవర్తీ! నీపూర్వులచరిత్ర మెంతఘనమైనదో చూడుము. నీతండ్రి యగువిరోచనుఁడు తండ్రి తాతల ప్రవర్తనను దెలిసికొన్నవాఁడు. అతఁడు విష్ణుభక్తిగలవాఁడు. అతఁడు ద్విజరూపధారులయిన దేవతలను బ్రేమించి యాచించినవారికిఁ దనయాయువు నొసంగెను. అతని కుమారుఁడ వగునీవు నీ పూర్వులచేతను గృహస్థులగు శుక్రాదులచేతను, మహాకీర్తిమంతు లగుశూరులచేతను నడపఁబడిన ధర్మములనన్నింటి నాచరించుచున్నావు. దాతలలో మొదటివాఁడగు నిన్నొకటి యాచించుచున్నాను. ఓదైత్యేంద్రా! నాయడుగుతో మూఁడడుగుల భూమిని నా కొసంగుము. ఇంతకంటె నధికము వలదు. నీవు జగదీశ్వరుఁడవయినను, పెద్ద దాతవైనను నా కోరఁదగిన దింతయె. తన కుపయుక్తమగు పదార్థమునుమాత్రమే యాచించికొనినచో బండితుఁడు ప్రతిగ్రహమువలనఁ బాపమునొందఁడు. దయయుంచి నావరము నెఱవే




1467. వామనరూపియైన భగవంతుఁడు బలి యజ్ఞవాటమున
మూఁడడుగులు యాచించుట

ర్పుము" అని వామనమూర్తి పలుక విని బలి యిట్లనియె. "ఓ విప్రకుమారా! నీ వచనము వృద్ధసమ్మతమైనది. కాని నీవు బాలుఁడవు. అజ్ఞుఁడవు. స్వార్థమును గూర్చి యించుకేనియుఁ దెలియనివాఁడవు. కానిచో సకలలోకములకు నాథుఁడనై జంబూద్వీపము వంటి ద్వీపమునైన సంతోషపూర్వకముగా నిచ్చుదాతనై యున్న నన్ను మధురవచనములచే సంతసింపఁజేసియు మూఁడడుగుల భూమినిమాత్రమే కోరుదువా? ఓ బాలుఁడా! నన్ను యాచించినవాఁడు వేఱొకని యాచింపఁగూడదు. కావున యథేష్టముగా నీజీవనమునకుఁ జాలినంతభూమి నడిగి స్వీకరింపుము" అని పలుక విని బలికి వామనుఁడిట్లనియె. "ఓరాజా! మూఁడులోకములందుఁ గల శ్రేష్ఠము లగు దేశములన్నియైనను పేరాస గలవారిని సంతసింపఁజేయఁజాలవు. మూఁడడుగుల భూమిచే సంతోషములేనివానికి నవఖండయుతమైన జంబూద్వీపము చేతనైనను గలుగదు. ఆ జంబూద్వీపము లభించిన పిమ్మట సప్తద్వీపములును గావలయునని కోర్కి గలుగుచుండును. పృథువు మొదలగు రాజులకు సప్తద్వీపాధిపత్యము లభించినను సంతృప్తిగలుగలేదని పెద్దలవలన వినుచున్నాను. కావుననాశకు మేరలేదు. పేరాస గలవానికిసుఖ ముండదు. దైవానుగ్రహము వలనఁ బ్రాప్త మగుదానిచేఁ దృప్తిచెంది పండితుఁడు సుఖియగును. ఇంద్రియములజయింపలేని యజ్ఞుఁడుముజ్జగములుతనకు లభించినను దనివిచెందక దుఃఖియగును. అర్థకామములయందలి యతృప్తి పురుషునకు సంసారబంధముగల్గించును. దైవలబ్ధమగుదానివలనఁ గల్గుతృప్తిముక్తికి హేతువగును. దైవలబ్ధమగుదానితో సంతృప్తుఁడయినవిప్రుని తేజము వర్ధిల్లును. అసంతుష్టు

డగు వాని తేజము జలముచే నగ్నివలె నశించును. కావున నో దైత్యేంద్రా! మూఁడడుగులభూమిమాత్రమే నాకుఁ గావలయును. అంతతో నేఁ గృతకృత్యుఁడ నగుదును. ప్రయోజనమునకుఁ దగినంతమాత్రమే ధనముండిన సుఖకరమగును. అంతకు మించియుండిన దుఃఖము గల్గించును" అని యిట్లు పలుకఁగా విని, నవ్వి "ఓ విప్రకుమారా! నీ వాంఛితము నిచ్చెదను. స్వీకరింపు" మనిపలికి వామనునికి భూమి దారవోయుటకై జలపాత్రమును దీసికొనెను. అంతఁ గాలజ్ఞుఁ డయినశుక్రుఁడు బలిచక్రవర్తి మనోనిశ్చయమును దెలిసికొని యిట్లనియె. "ఓ రాజా! ఇతఁడునీవనుకొన్నట్లు బ్రహ్మచారి కాఁడు. ఇతఁడు కేవలము భగవంతుఁడగు విష్ణుమూర్తి. ఆ విష్ణువు కశ్యపునివలననదితికిఁ గుమారుఁడై పుట్టి దేవతలకార్యము సాధింప నిచ్చటికి వచ్చినాఁడు. నీవు ముందువచ్చు ననర్థము నాలోచింపకుండ నితనికి భూమి నిత్తునని ప్రతిజ్ఞ చేసితివి. అది మంచిదయినట్లు తోఁపదు. దైత్యులకు గొప్ప యన్యాయము సంభవింపనున్నది. ఇతఁడు నిజసంకల్పముచే బ్రహ్మచారిరూపముఁ దాల్చిన విష్ణువే కాని నీవనుకొనునట్లు సామాన్యబ్రహ్మచారి కాఁడు; ఇతఁడు నీ యైశ్వర్యమును, రాజ్యమును, దేజంబును, గీర్తిని హరించి యింద్రుని కీఁదలంచి యున్నాఁడు. ఇతఁడు విశ్వరూపమును దాల్చి మూఁడులోకములను మూఁడడుగులచే నాక్రమించును. అదినాకిష్టమేయుందువేనినీసర్వస్వమును విష్ణువున కర్పించి యెట్లుగా వర్తింతువు? ఎట్లయినను నీవు చేసిన ప్రతిజ్ఞను బూర్తిచేయలేవు. ఇతఁ డొకపాదముచే భూమిని, రెండవపాదముచే స్వర్గమును నాక్రమించి మూఁడవ పాదమునకు భూమి నిమ్మని యడుగును. నీ వెట్లీయఁ గలుగు

దువు ? ఈయనిచో నీ ప్రతిన యెట్లు నెఱవేఱును? నీవు చేసిన ప్రతిజ్ఞను నెఱవేర్పలేకపోవుటచే నీ కెవ్విధముచేతనైనను నరకము తప్పదు. అట్టి సమయమున నీ వీతనివరముదీర్చి కష్టముల పాలగుట యనుచితము. యాచకుల కోర్కులీడేర్చుటవలన మహాత్తరమైన కీర్తి సంభవించునని యందు వేని వినుము. నీవచనము సత్యమే. కానితన జీవనోపాధికి భంగము గల్గించుదానము ప్రశస్తమైనది కాదని పెద్దలందురు. లోకములో ముందుఁ దనజీవనోపాధిని స్థిరపఱుచుకొని పిమ్మట దానాదులను జేయవలెను. అప్పుడు చేసిన దానము, యజ్ఞము, తపస్సు మొదలగునవి ధర్మసమ్మతములు; కాని తన జీవనవృత్తిని నశింపఁజేసికొని చేసెడి దానాదు లట్లు కావు. విద్వాంసుఁడు తన విత్తమును, ధర్మమునకును, గీర్తికిని నర్థమునకును, దనభోగమునకును, దన కుమారాదులకును నైదువిధములుగాఁ బంచి యిహమందును బరమందును సుఖమును గాంచును. కావున నీవు నట్లుచేయుటయే సముచితము, కాని కీర్తికని నీసర్వస్వము నితనికి దారవోసి పిమ్మటఁ బలుబాధలనుభవించుట యుక్తముకాదు. 'ఇచ్చెదనని ప్రతిజ్ఞ చేసి యిప్పు డీయననుట యసత్యముకాదా? అసత్యము పలుకుటకంటెఁ బాపమున్నదా ?' యని యందువేని సత్యమన నెట్టిదో యసత్య మన నెట్టిదో పూర్వమునఁ బెద్దలు వ్యవస్థచేసిరి. దాని వివరించెదను, వినుము. మన పూర్వులు సామాన్యముగా చేసెదనని చెప్పినమాట పాటించుట సత్యమనియు, దానికి విరుద్ధమగునదియసత్యమనియువ్యవస్థచేసిపిమ్మట దానికి విశేషవిహితముగా నిట్లు చెప్పిరి. వృక్షమునకుఁబుష్పఫలము లెట్టివో దేహమునకుసత్యమట్టిది. వృక్షముజీవింపనిచోఁ

బుష్పాదులుండవు. అట్లె దేహములేనిచో సత్యము సంపాదించుట యసంభవము. దేహమున కసత్యము మొదలువంటిది. కావున నసత్యమాడియైన దేహమును నిలువఁబెట్టుటయవసరము. మూలము తెగినచో వృక్ష మెండును. పిమ్మటఁబడిపోవును.సమయమువచ్చినప్పు డనృతమాడనిచో దేహమునిస్సంశయముగా నశించును. మఱియు నీవు సర్వస్వము నిచ్చెద ననుటకు సూచకముగాఁ బలికిన వచనమునకుఁ బరిపూర్ణముగా నిత్తునని యర్థముగాదు.ఏదోకొంచెమిచ్చెదనని యర్థమనిమార్చితివేని యతనికీయఁగా మిగిలినదానిచే నీవు జీవింపఁగలవు.యాచకునకు సర్వస్వము నిచ్చెదనని చెప్పి పిమ్మట నిచ్చుటకు సమర్థుఁడుకానిచోఁ గొంచెమేయిచ్చి యతని సంతసింపఁజేయవలెను.అట్లుచేసినచోఁ దన ప్రతిజ్ఞపూర్ణ మైనట్లె చెప్పవచ్చును. యాచకుఁడుతన్నడిగినప్పుడు కలవాఁడయ్యు నేమియు లేదనిచెప్పుట యసత్య మనిపించుకొనును గానియిదియట్టిదికాదు.తనకుండియు లేదనువాఁడే దుష్కీర్తియు జీవన్మృతుండునగును.కానితన దేహరక్షణముకై ప్రతిజ్ఞాతవస్తువులోఁ గొంత మిగుల్చుకొన్నవాఁడు కాఁడు.స్త్రీలనుబ్రోత్సాహించి వశీకారము చేసికొనుటయందును, బరిహాసములందును, వివాహములందును, జీవనోపాధి నిల్పుకొనుటయందును, బ్రాణాపాయము తటస్థించినప్పుడును, గోబ్రాహ్మణుల నిమిత్తమును, హింసయందును, నసత్యమాడినను నది నింద్యమనిపించుకొనదు. కావున నీ జీవికవిషయమై నీ వసత్యముపలికినను దప్పులేదు. అటుచేయుము " అనెను. ఇది పందొమ్మిదవ యధ్యాయము.

---

—●●◆బలి దానమును తప్పక యిత్తునని శుక్రునకుఁ జెప్పుట.◆●●—

అని యిట్లు శుక్రుఁడుపలుకఁగాయజమానుఁ డయినబలి విని యోజించుచుఁ గొంచెము సేపూరకుండి సావధానమనస్కుఁడై గురువునుగాంచియిట్లనియె. "ఓగురువర్యా!నీవు పలికినదంతయు సత్యము. అర్థమునకును, గామమునకును, గీర్తికిని, వృత్తికినిబరస్పరము బాధ గలుగకుండఁ బ్రవర్తించుట గృహస్థులకుముఖ్యధర్మము.కాని ప్రహ్లాదవంశమునఁ బొడమిన నేను ధనాశకు లోనై "తప్పక యిచ్చెదనని ప్రతిజ్ఞ చేసి యిప్పుడీద్విజునినిరాకరించి యెట్లు నీచవర్తనుఁడనగుదును? ఆలోచింప నసత్యము కంటె నెక్కుడగు నధర్మము వేఱొకటిలేదు. మేరువు మొదలగు మహాపర్వతములను, నిధులను, సముద్రములను,వేయేల? సకలమును సులభముగా జయింపఁగలుగుదును. కాని యసత్యమాడువాని నొక్కనిమాత్రము భరింపలే"నని భూదేవియే స్వయముగాఁ బలికినదట ! నే నసత్యమును బలికి యధముఁడనుగా లేను.ఇంతే కాదు. నేనునరకమునకుభయపడను.బీదతనమునకు జంకను. దుఃఖమునకు వెనుదీయను. రాజ్యభ్రష్టుఁడ నగుటకు విచారింపను.చావునకు భీతిల్లను. కాని యీబ్రాహ్మణుని వంచించుటకు భయపడుదును. ఈలోకమునఁ జేసిన భూదానాదులు చచ్చినపిమ్మటఁ దత్కర్తను విడిచినచో నట్టి దానాదులతోనేమి ప్రయోజనము? ఆ చేసినదానమువిప్రుని సంతసింపఁజేయఁజాలనిచో నది కేవలము వ్యర్థమేకదా! గురువరా! దధీచి, శిబి మొదలగువారు భూతములకు హితమొనర్పఁదలంచి విడువఁ దరము కాని ప్రాణములనే యర్పించియుండఁగా నీధనరాజ్యాదు లే పాటివి? ఓబ్రాహ్మణశ్రేష్ఠా ! యుద్ధమున నెదురులేనివారును,నా

ప్రపితామహాదులు నగుదైత్యేంద్రులీభూమిని నిరాటంకముగాఁ బాలించిరి. కాలము వారిభోగములను హరింపఁగలిగెను; కాని వారి కీర్తులను నశింపఁజేయలేక పోయెను. సమరమున దేహమును విడిచినవారు పెక్కురుకలరు. కాని సత్పాత్రమందు శ్రద్ధతో సర్వధనమునువినియోగించినవా రెవ్వరు నిదివఱకు లేరు. కావున నట్టిఘనకార్యము నేఁదప్పక యాచరించెదను. యాచకుల కోర్కులను బూరించుటవలన దుఃఖములు సంభవించునని. యందువేని వివేకవంతుఁడును దయాళుఁడునగువానికే యవి శుభదాయకము లగునవలసినప్పుడు మీవంటి బ్రహ్మవిదుల కట్లగునని వేఱ చెప్పవలయునా! కావున నీ విప్రబాలుని కోర్కెదీర్చెదను. ఓగురువరా ! ఈ వచ్చినవాఁడు. నా శత్రువగు విష్ణువు కాని సామాన్యపు బ్రహ్మచారి కాఁడని యంటివి. విష్ణువే యాచకుఁడై నాదగ్గఱకువచ్చినచో నాయదృష్టముకొనియాడఁదగినదని చెప్పవచ్చును. యాగాదుల నొనర్పమిక్కిలినేర్పుగల మీవంటి మహాత్ము లధిక మగునాదరముతో నెననిఁగూర్చి యాగములను గ్రతువులను చేయుచున్నారో యావిష్ణువు వటువేషమును దాల్చి నాకిప్పుడు ప్రత్యక్షమయ్యె. ఇతఁడు నాకు వరదుఁడయినను సరియె;శత్రువయినను సరియె;ఇతఁడు కోరినభూమిని దప్పక యొసంగెదను. ఓ మునీంద్రా! మూఁడవయడుగునకుఁ జోటొసంగలేక పోవుటచే నన్నితఁడు బంధించునని చెప్పితిరి. నాకుఁగలసమస్తము నొసంగి నిరపరాధుఁడనై యున్ననన్నీతఁ డన్యాయముగా బంధించినను బ్రాహ్మణవేషధారి యగునితని నేనెంతమాత్రమును హింసింపను. నేనిందులకు భయపడను. ఈ విష్ణువు పవిత్రమగు కీర్తిగలవాఁడైనచో నా సర్వస్వమును బుచ్చుకొనిననుబంధించి

తనకీర్తిని నశింపఁజేసికొనక నాతో యుద్ధమొనరించి నన్నుఁజంపి యీ భూమిని దీసికొనుట యుక్తము. నన్నుఁ జంపశక్తిలేనిచో నాచేఁజచ్చినను మంచిదే.''అని యిట్లుదానముచేయనిశ్చయించుకొని తన వాక్యమును శ్రద్ధతో వినక తిరస్కరించెనన్న కోపముచే శుక్రుఁడు దైవచోదితుఁడై సత్యసంధుఁడును, ధైర్యవంతుఁడును నగుబలి నిట్లు శపించెను.'' ఓదైత్యేంద్రా ! నీవు పండితాభిమానముకలవాఁడవు.కాని వాస్తవముగా బుద్ధిహీనుఁడవు. నాయుపదేశమును వినక నీసర్వస్వము నశించుటకు సిద్ధముగానున్నను దెలిసికొని రక్షింపఁ బాటుపడనివాఁడవు. నాశాసనము నతిక్రమించి వర్తించుచున్నావు. కాన నీఁక శీఘ్రకాలములోనే త్రిలోకాధిపత్యము నీకు లేకుండఁబోవుఁగాక.''అనియిట్లు శుక్రుఁడు శపించినను బలి యెంతమాత్రమును జంకక సత్యమునుండి తొలఁగక దృఢసంకల్పుఁడై వామనునిఁ బూజించి భూమినిధారవోయనిశ్చయించె.ఆసమయమునఁబలిభార్యయగు వింధ్యావళి ముత్యములహారములు మొదలగు నాభరణములను దాల్చి జలములతో నిండియున్న యొక బంగారుపాత్రను దీసికొని వచ్చెను. అప్పుడు తనభార్య జలమును బోయుచుండఁగా బలి సంతసముతో భగవంతుఁ డగువామనుని పాదములు గడిగి జగత్పావనము లగు నాయుదకములనుశిరసావహించెను. ఇట్లొండతన్ని చెప్పినను వినక ధైర్యము పూని దానము చేసిన బలిసాహసమునకచ్చెరువంది దేవతలును, గంధర్వులును, విద్యాధరులును, సిద్ధులును, జారణులును నాకసమునుండి సంతసముతో బలిపైఁ బుష్పవర్షమును గురియించిరి. వేలకొలఁది దుందుభులను మ్రోయించిరి. గంధర్వులుఁ గింపురుషులుఁ గిన్నరులను,

"బలి యితరులకు దుష్కరమగుదానిని జేసెను. ఇతఁడు మిక్కిలి తన పలికినవాక్యమును దప్పకుండ విష్ణువునకు ముల్లోకముల నొసంగెను." అని నుతింపఁజొచ్చిరి. ఇట్లందఱును బలిని నుతించుచుండ వామనుఁడు "నీవాంఛితమును స్వీకరింపు"మని పలికిన బలివాక్యమును మన్నించి భూమిని, నాకాశమును, దిక్కులను, స్వర్గమును, బాతాళాదులను, సముద్రములను, బశుపక్ష్యాదులను, నరులను, దేవతలను, మునులను, నాక్రమించునంత పెద్దదిగాఁ దనశరీరమును బెంచెను. అప్పుడు బలి ఋత్విక్కులతోను, నాచార్యునితోను, సభ్యులతోను, మహావిభూతి యగువామనుని శరీరమునందు గుణత్రయాత్మకమగు సకలప్రపంచమును గాంచెను. అందుఁ బాదతలములందు రసాతలమును, బాదములందు భూమిని, నతని పిక్కలందుఁ బర్వతములను, మోఁకాళ్లయందుఁ బక్షులను, దొడలందు వాయుగణములను, వస్త్రమందు, సంధ్యలను, గుహ్యమందుఁ బ్రజాపతులను, జఘనమందుఁ దాను ప్రధానుఁడుగాఁ గల రాక్షసగణములను, బొక్కిటియం దంతరిక్షమును, కుక్షియందు సప్తసముద్రములను, వక్షస్స్థలమందు నక్షత్రపంక్తులను, హృదయమున ధర్మరాజును, స్తనములందు సత్యము నర్థసత్యమును, మనస్సునందుఁ జంద్రుని, ఱొమ్మునందుఁ బద్మహస్త యగులక్ష్మిని, గంఠమున సామవేదము మొదలగు శబ్దములను, భుజములందు దేవేంద్రుఁడు మొదలగు సురలను, గర్ణములందు దిక్కులను, శిరస్సునందు దివిని, గేశములందు మేఘములను, నాసికయందు వాయువును, నేత్రములందు సూర్యుని, ముఖమం దగ్నిని, వాక్కునందు వేదమును, నాలుకయందు వరుణుని, గనుబొమలందు విధినిషేధశాస్త్రములను, గనురెప్పలందు



1474. త్రివిక్రమావతారము.

రేయుంబవళ్లను, నుదుటియందుఁ గోపమును, గ్రింది పెదవియందు లోభమును,ద్వగింద్రియమునఁ గాముని, రేతస్సునజలమును, పృష్ఠభాగమున నధర్మమును, బాదన్యాసములందుయజ్ఞములను, నీడయందు మృత్యువును, నవ్వునందు మాయను, రోమములందోషధులను, నాడులందు నదులను, గోళ్లయందు శిలలను,బుద్ధియందు బ్రహ్మను, నింద్రియములందు ఋషిగణములను, దేవగణములను, శరీరమందుఁ జరాచరాత్మక మగు ప్రపంచమును, వేఱువేఱుగాఁ బరికించిచూచెను. ఇట్లు చరాచరభువనము నాభగవంతునందుఁగాంచి దైత్యులందఱును దుఃఖించిరి. అంతట సుదర్శనమను పేరు గలచక్రమును, దుస్సహ మగు కాంతితోను మేఘగర్జనమువంటి ధ్వనితోను వెలయుచున్న శార్ఙ్గమను చాపమును, జలదమువలె ఘోషించు పాంచజన్య మనెడిశంఖమును మిక్కిలి బలముగల కౌమోదకియనుగదయు,విద్యాధరమనియు, నందకమనియు, నామములు గల ఖడ్గమును, జంద్రునివంటి యాకారము గలడాలును దఱుఁగని బాణపుంజములు గలయమ్ములపొదులును, సునందుఁడు మొదలగు పార్షదులును, లోకపాలురును, భగవంతుని సమీపించి తమతమస్థానముల నిలిచిరి. ప్రకాశించు కిరీటముచేతను,నంగదములచేతను,మకరకుండలములచేతను, శ్రీవత్సముచేతను, కౌస్తుభముచేతను, బంగారు మొలత్రాటిచేతను, బచ్చనిపట్టువస్త్రముచేతను, దుమ్మెదగుంపుగల వనమాలచేతను, ద్రివిక్రమరూపుఁ డగునభగవంతుఁడు మిక్కిలి ప్రకాశించెను. పిమ్మటఁ బరమేశ్వరుఁ డొక పాదముచే బలిచక్రవర్తి భూప్రదేశమును, శరీరముచే నాకాశమును, బాహువులచే దిక్కులను, రెండవ పదముచే స్వర్గలోకమును, నాక్రమిం

చెను. మూఁడవపాదమునకా బలిసంబంధినియగుభూమి యణుమాత్రమైనను లేదు. ఆభగవంతుని రెండవపాదము స్వర్గలోకముకంటె మీఁదుగానున్న మహర్లోకమును, జనలోకమును, దపోలోకమును, సత్యలోకమును గూడ నాక్రమించియుండఁగా బలిచక్రవర్తి కిఁక స్థల మెట్లు మిగిలియుండును? ఇది యిరువదవ యధ్యాయము.

---

{త్రివిక్రముఁడు బలినిబంధించుట; ఎదిరించిన బలి యనుచరులను విష్ణుభృత్యులు తఱుముట.}

ఓ రాజేంద్రా! సత్యలోకమును బొందిన త్రివిక్రముని పాదమునుజూచి దాని గోటికాంతులచేఁ దిరస్కృత మగు దేహచ్ఛాయగల బ్రహ్మ యాదరయుక్తుఁడై పూజించెను. అనంతరము మరీచి మొదలగు బ్రహ్మర్షులును, బ్రహ్మనిష్ఠులైన సనకాది యోగులును భక్తియుతులై యా త్రివిక్రమదేవుపాదము నర్చించిరి. ఇతియుఁ గాదు. వేదములు, ఉపవేదములు, మీమాంస, న్యాయము, ఇతిహాసములు, పురాణములు, వేదాంగములగు వ్యాకరణాదులు, పాంచరాత్రాదులు మొదలగువాని యభిమాని దేవతలును, యోగమనెడివాయువుచే మండుచున్న జ్ఞానాగ్నిచేఁ గర్మజాలమును భస్మము గావించుకొన్నవారును, పరమేశ్వరుని పాదముల ధ్యానించుటవలనఁ గర్మాధీనముగాని సత్యలోకమును బొంది యందు నివసించియున్న తక్కినవారు నా త్రివిక్రముని పాదమునకు నమస్కరించిరి. అంత విమలకీర్తి యగు బ్రహ్మ తన జన్మమునకుఁ గారణమైన విష్ణుపాదము తనలోకముదాఁక వచ్చియుండుట కానందించి యర్ఘ్యపాద్యాదులచేఁ బూజించి భక్తి

యుతుఁడై నుతించెను.ఓనరేంద్రా! అప్పుడు బ్రహ్మ తన కమండలు జలముచేఁద్రివిక్రముని చరణమును గడుగఁగా నాయుదకము పాదస్పర్శమునఁబవిత్రమై గంగానదియయ్యెను. అది భగవంతుని కీర్తివలె నిర్మలమై ధ్రువమండలమునఁబడి పిమ్మటఁ గ్రిందికిఁ బ్రవహించుచు లోకత్రయమునుబవిత్రీకరించుచున్నది. అనంతరము భగవంతుఁడు తన మహాకాయమును దగ్గించితొంటిరూపును బొందియుండఁగా లోకపాలురతోఁగూడ బ్రహ్మాదులతని సమీపించి,జలమును, బరిమళించుచున్న పూజాద్రవ్యమును, బుష్పమాలలను, దివ్యచందనమును, ధూపమును, దీపమును, లాజలను, అక్షతలను, ఫలములను, సమర్పించిరి.కొందఱతని నుతించిరి.కొందఱతని శౌర్యాతిశయమును సూచించుచు జయశబ్దములను బలికిరి. కొందఱాడిరి. కొందఱు మృదంగాదులను మేళగించి పాడిరి. కొందఱుశంఖములను బూరించిరి. కొందఱు దుందుభులను మ్రోయించిరి. భల్లూకములకుఁ బ్రభువయినజాంబవంతుఁడు త్వరగా వచ్చి భేరిని మ్రోయించుచు భగవంతుని విజయము నన్నిదిక్కులందును జాటెను. అంత దైత్యులు మూఁడడుగులనిమిషచేఁ గృత్రిమమున సమస్త భూమి హరింపఁబడుటఁజూచి విచారించి తమలోఁ దామిట్లను కొనిరి "ఓ మిత్రులారా! ఈ వామనుఁడు బ్రాహ్మణుఁడు కాఁడు. మాయావి యైనవిష్ణువు; దేవతల కార్యమును నెఱవేర్చుటకీరూపమున వచ్చియున్నాఁడు. వీఁడు బ్రహ్మచారియై యాచకుఁడై యీయజ్ఞశాలకు వచ్చి కపటముచే మన ప్రభువు సర్వసంపదలను వశము గావించుకొనెను. మన ప్రభువు సతతము సత్యసంధుఁ డగుటచేతను, విశేషించి యజ్ఞదీక్షితుఁ

డగుటచేతను, బ్రాహ్మణభక్తి గలవాఁడగుటచేతను దయావంతుఁ డగుటచేతను, నసత్యమును భాషింపలేకపోయెను. ఇట్టి సత్యవంతుఁడైన మనభర్తయెడ వీఁడు కపటియై వర్తించెను. కావున వీని నిప్పుడు వధించుటయే యుత్తమకార్యము. అదియే మన ప్రభువునకు మనము చేయవలసినపని” అని కూడఁ బలికికొని బలి యనుచరు లగురక్కసులు, శూలములు పట్టిసములు మొదలగునాయుధములఁ దాల్చి కోపమున మండిపడుచుఁ దమప్రభువు నానతినొందకయే వామనునిఁ జంపఁ బరువెత్తిరి. అట్లు యుద్ధమునకు వచ్చుచున్న దైత్యులను గాంచి సునందాదు లగు విష్ణుపార్షదులు త్వరగా యుద్ధసాధనముల ధరించి యడ్డుగాఁ బోయి గేలిచేయుచు వారిని వారించిరి. అంతతో నూరకుండక నందుఁడును, సునందుఁడును జయ విజయులును, ప్రబలుఁడును, నుద్బలుఁడును, గుముదుఁడును, గుముదాక్షుఁడును, విష్వక్సేనుఁడును, గరుత్మంతుఁడును, జయంతుఁడును, శ్రుతదేవుఁడును, బుష్పదంతుఁడును, సాత్వతుఁడును మొదలగు వారందఱును బదివేలయేనుఁగుల బలముతో నొప్పారుచున్న దైత్యసైనికులను గొట్టి తఱిమివేసిరి. విష్ణుపార్షదులచేఁ జంపఁబడుచున్న దైత్యసైన్యములనుజూచి బలి తనగురు వగుశుక్రుని శాపమును స్మరించుకొని యది యుద్ధమునకుఁ దగిన సమయము కాదని నిశ్చయించి,కోపాగ్నిచే మిక్కిలి రగులుచున్న తనవీరుల కిట్లనియె. “ఓ విప్రచిత్తీ! ఓ రాహూ! ఓ హేతీ! నా వచనము వినుఁడు. యుద్ధమునుండి మరలుఁడు. మన కిప్పుడు కాల మనుకూలముగా లేదు. ఓ దైత్యులారా ! కాలరూపుఁ డైన భగవంతుఁడు సర్వభూతములకు నధిపతి. ఆ ప్రభువు దుఃఖము

గల్గింప సమకట్టియుండఁగా సుఖము నిమిత్తము పురుషుఁ డెంత ప్రయత్నించి పౌరుషము చూపినను వ్యర్థమేకాని ఫలము లేదు. ఆలోచింపఁ గాలమునకు వశులయిన పురుషుల పరాక్రమాదు లెట్లు ఫలవంతము లగును? ఆకాలము నెవరు దాఁటఁగలరు? పూర్వము మనకు సుఖముగల్గించి దేవతలకు దుఃఖ మొసంగిన భగవంతుఁడిపుడు మనకు దుఃఖమును దేవతలకు సుఖమును గల్గింప నిశ్చయించియున్నాఁడు. కావున మానవుఁడు బలము చేతఁగాని,బుద్ధిచేఁగాని, మంత్రాలోచనములచేఁ గాని, యౌష ధాదులచేఁగాని, సామాదు లగుసుపాయములచేఁ గాని కాల రూపుఁ డయిన భగవంతుని నతిక్రమింప సమర్థుఁడు కానే రఁడు. పూర్వము దైవానుకూలురయిన మీచే నీ యింద్రాదు లనేక పర్యాయములు సులభముగా జయింపఁబడిరి. అట్టివా రిప్పుడు యుద్ధమున మిమ్ము జయించి సింహనాదమును జేయు చున్నారు. కాలము మన కనుకూలముగా నుండినప్పుడు వీరలను జయింపనచ్చును. మీ రిపుడు యుద్ధము చేయక యా కాలము నకు వేచియుండుఁడు" అని యి ట్లుపదేశించుచున్న తమ ప్రభువు వచనములు విని దైత్యవీరులును, దానవ వీరులును, మా ఱుమాట వలుకక విష్ణుసైనికుల దెబ్బలకుఁ దాళఁజాలక పాతా ళమును బ్రవేశించిరి.అంత గరుత్మంతుఁడు భగవంతుని యభి ప్రాయమును గ్రహించి వచ్చి వారుణపాశములచే బలిని బంధిం చెను. సర్వశక్తి యగువిష్ణువు బలిని గట్టివైచునపుడు సకల దిక్కులందును, భూమియందును, నాకాశమందును, హాహాకా రములు విశేషముగాఁ బ్రబలినవి. అనంతరము వారుణపాశ ములచే బద్ధుఁడైనను, సకల సంపదలను గోల్పోయినను, ధైర్య

మును వివేకమును విడువక మహాయశుఁడై పొల్చుచున్న బలిని గాంచి వామనుఁ డిట్లనియె. "ఓ రాక్షసేంద్రా ! నీవు నాకు మూఁడడుగుల భూమి నిచ్చెద నంటివి. నీచేఁ బరిపాలితమగు భూమియంతయు రెండడుగులకే సరిపోయినది.మూఁడవయడుగు భూమి నా కీవలసియున్నది. ఇమ్ము. సూర్యకిరణము లెంతదూరము ప్రసరించునో, చంద్రుఁడు నక్షత్రములతోఁ గూడ నెంత దూరము కానవచ్చుచున్నాఁడో. పర్జన్యుఁడును వహ్నియు నెంతదూరముదనుక వ్యాపించియున్నారో; యంతవఱకే కదా నీ భూమి? ఈ భూలోకమంతయు నొక యడుగుతోఁ గొల్చితిని. దిక్కులును గగనమును నా శరీరముచే నాక్రమింపఁబడినవి. నీవు చూచుచుండఁగనే రెండవ యడుగుచే స్వర్గలోకమును గొల్చితిని. ఎట్లాలోచించినను మూఁడవయడుగునకుఁ జోటులేదు. ఇచ్చెదనని ప్రతిజ్ఞచేసి యీయనివానికి నరక నివాసము తప్పదు. నీ గురువగు శుక్రాచార్యునిచేఁగూడ నది యామోదింపఁబడినది. కావున నీ విఁక నరకమును బ్రవేశింపుము. యాచకున కిచ్చెద నన్నదాని నీయఁజాలనిచో నా పురుషుని మనోరథము తఱుచుగా వ్యర్థమైనది. వానికి స్వర్గమెప్పుడును లభింపదు. అధోలోకమునఁ బడవలసినదే. మఱియు నీవు నాకిచ్చెదనని ప్రతిజ్ఞచేసి యీయఁజాలక నన్ను వంచించితివి. ఇట్లగుటచే నీవసత్యమాడితివి.అందులకు ఫలముగా నరకమును గొన్ని సంవత్సరము లనుభవింపుము" అనెను. ఇది యిఱువదొకటవ యధ్యాయము.

{ బలి మూఁడవ యడుగునకుఁ దనశిరస్సును జూపుట, ప్రహ్లాదాదులు బలిని రక్షింపుమని త్రివిక్రముని వేఁడఁగా నద్దేవుఁడు బలిని సుతలమున కధిపతిగాఁ జేయుట. }

ఇట్లు భగవంతుఁడు నిందించుచున్నను, మనస్సును జలింపఁ జేయుచున్నను బలి సుంతేనియుఁ జలింపక జంకక వామనునిఁ గాంచి గంభీరవచనములతో ని ట్లనియె. "ఓ పరమపురుషా! నాపలికినవచన మెప్పుడు నన్నృతముగాదు. నావచనమును సత్యముగా నే కావించెదను. నిన్ను వంచించుటకు నేనట్లన లేదు. మూఁడవయడుగు నా శిరంబుననుంపుము. ఓ ద్విజబాలకా! నరకమునకు భయపడను; రాజ్యముపోవుటకు విచారింపను; వారుణపాశములతోఁ గట్టినందులకు వగవను: గొప్పయపాయమునకు జంకను; ధన వ్యయమునకు వెనుదీయను; నీతో విరోధముసంభవించినదని భీతిల్లను; కాని యసత్యమాడుటకు భయపడుదును. తల్లిదండ్రులుగాని సోదరుఁడుగాని మిత్రుఁడుగాని చేయని దండనమును యోగ్యతముఁడగు వేఱొక పురుషుఁడు చేసినచోఁ బురుషుల కది విచారకరముగాక కీర్తికరమగునని నామతము. ఓ మహాత్మా! శౌర్యము,వీర్యము,ధనసంపదలు మొదలగువాని వలన జనించిన గర్వముచే నంధులమై యుండిన మాగర్వమును దొలఁగించి కన్నుల నొసంగితివి. ఇట్టి హితమును గల్గించుటచే నీవు మాకు గురువవు. పూర్వము పెక్కురు దైత్యులు నీతో నుగ్రవిరోధమును బూని కేవలము యోగీశ్వరులు వొందెడు నుత్తమపదమును జెందిరి. నేను వారివలెఁగాక విచిత్ర చేష్టితములు గలనీచే నిగ్రహింపఁబడి వారుణపాశములచే బద్ధుఁడనైనను లజ్జింపను;దుఃఖింపను; నీతోడి విరోధమును,నీవు చేసిన

బంధనమును నాకు విస్తారమగుకీర్తిని గల్గించుచుండ విచారింపవలసిన పని యేమి? ఓమహాత్మా! నాతాత యగు ప్రహ్లాదుఁడు నీ భక్తులలో నుత్తముఁడని వాసిగాంచెను. అతఁడు తన తండ్రి యగు హిరణ్యకశిపునిచే నిరంతరము బాధితుఁడయ్యు సుంతే నియుజంకక నిన్నే యన్నివిధములఁ జుట్టమునుగా భావించుకొనెను. మఱియుఁ బ్రహ్లాదుఁడు తనలో "నంత్యకాలమున నాత్మను విడుచుచున్న యీ దేహము రణశీలుఁడయిన మానవున కేమిపురుషార్థము సంపాదించును? ఈ దాయాదులతో నేమి ఫలము? దొంగలవంటి యీ స్వజనులతో నేమిపని ? సంసారమునకు హేతుభూతయయినభార్య యేమిపురుషార్థమిచ్చును? ఈమందిరము లెందులకుఁ బనికివచ్చును? ఆయువును నశింపఁజేయుటకు దప్ప, నీ వెందులకు బనికిరావు" అని నిశ్చయించి యపరిమిత జ్ఞానమును సంపాదించి భక్తశ్రేష్ఠుఁడై సంసారమునకు భయమందుచుఁ దనదైత్యకులమునునశింపఁజేయుచున్నవుని న్నే నమ్ముకొని సంసారాది భయముల నివర్తించునదియుఁ బురుషార్థరూపము నగు నీపాదపద్మముల శరణు పొందెను. అట్లె నేనును దైవవశమువలన రాజ్యలక్ష్మిని గోల్పోయి నాకు శత్రువగు నీ పాదపద్మముల సన్నిధిని జేరితిని. దేనివలనఁబురుషుఁడుమోహితుఁడై జ్ఞానమును బోఁగొట్టికొని యమునిసన్నిధిని బొందియు జీవితము చంచలమైనదని తెలియఁజాలఁడో, యా రాజ్యలక్ష్మి నన్నువిడిచి పోయినందులకు మిగుల నానందించుచుంటిని" అని యిట్లు బలి పలుకుచుండఁగా భగవద్భక్తుఁడగు ప్రహ్లాదుఁడు పున్నమచందురునివలెఁ దన కాంతుల వ్యాపింపఁజేయుచు నచ్చటికి వచ్చె. కాంతిచే విరాజితుఁడై పద్మదళములను బోలినకన్నులు గల

వాఁడై నిర్మలమగు నల్లని దేహచ్ఛాయతోను, దీర్ఘములగు బాహువులతోను, సుందర మగునాకారముతోను బొల్చుచు వచ్చియున్న ప్రహ్లాదునిఁగాంచి బలి సిగ్గున మొగమువంచికొని బాష్పపూరితము లగుకన్నులు గలవాఁడై వారుణపాశములచే బద్ధుఁడగుటంజేసి వెనుకటివలెఁ బూజాదుల నర్పింప నేరక శిరస్సు వంచి నమస్కరించెను. అంతఁ బ్రహ్లాదుఁడు భాగవతుల కధిపతియై సునందాదు లగుపార్షదులచే సేవితుఁడై యున్న వామనునిఁ గాంచి శరీరము పులకలచెతను, గన్నులానందబాష్పముల చేతను నిండుచుండ సమీపించి దండప్రణామములాచరించి యిట్లనియె. "ఓ పరమపురుషా! ఈ బలి విశ్వజిద్యాగముచే నిన్నుఁ బూజింప నానందించి నీవే యితనికింద్రపదవినొసంగితివి. దానిని నీవు మరలఁ బుచ్చుకొంటివి. పురుషులను మోహబద్ధులనుగాఁ జేయఁజాలిన యీసంపదలనుండి యితనిఁ దొలఁగించుట మిక్కిలి యుచితకృత్యము. ఆలోచింప విద్వాంసుఁడైనను సంపదలవలన మోహితుఁడై యాత్మస్వరూపము మఱచి చెడును. ఓ నారాయణా! ఇతని సంపద్విహీనునిఁగాఁ జేయుట యితని ననుగ్రహించుటయే కాని వేఱుగాదు. ఇట్టి యుపకర్తవును, జగదీశ్వరుఁడవును, సర్వజ్ఞుఁడవును నగు నీకు నమస్కారములు" అని యిట్లు దోసిలిగట్టి ప్రహ్లాదుఁడు భక్తియుతుఁడై పలుకుచుండ బ్రహ్మ మెల్లమెల్లన సమీపించి వామనునితో నేదియో చెప్పనుద్యుక్తుఁడయ్యెను. అంత బలి ధర్మపత్ని యగువింధ్యావళి పాశబద్ధుఁడైన తన భర్తనుజూచి మిక్కిలి భయమొంది దోసిలిగట్టి కన్నీటిని స్రవింపఁజేయుచు వామనమూర్తి కిట్లనియె. "ఓ పరమాత్మా! నీ వీవిశ్వమునంతటిని క్రీడార్థము సృజించుకొంటివి. నీవాడికొను

టకు సాధనభూత మగునీ జగమందుఁ గొందఱు మందబుద్ధులు తాము ప్రభువులని యభిమానము వహించుచుందురు. వారు లజ్జాహీనులై "మేము స్వతంత్రుల" మనియు వాదించు చుందురు.అంతియుకాని వారికి స్వాధీన మగువస్తు వేక్కటియైనను లేదు. ఇట్టివారు, జగమును సృజించువాఁడవును, పాలించు వాఁడవును, సంహరించువాఁడవును నగు నీ కేమి సమర్పింపఁ గలుగుదురు? ఇట్లుండ 'లోకత్రయము నిచ్చితిని. మూఁడవపాద మునకు నా దేహము నర్పించి నావాక్యమును సత్యముగావించు కొందు' నని నాభర్త లోకత్రయము తన దేహము తన కధీన మైయున్నట్లు వచించెను.అది తెలివిమాలిన పని. ఇతఁడు మంద బుద్ధి యగుటచే నట్లు పలికెను. కావున క్షమించి యితనిఁ బాశ విముక్తునిఁ జేయు"మని ప్రార్థించెను.అంత బ్రహ్మ వామనునిఁ జూచి "ఓ జగత్కర్తా! నీవు సమస్తభూతములకు నంతరాత్మవై పాలిం చువాఁడవు. నీవు సృష్టిసంహారములను జేయు నాకును రుద్రున కును గూడ దేవుఁడవు. ఓ జగన్మయా! నీ వీ బలి సర్వస్వమును దీసికొంటివి. ఇఁక నితని విడువుము. ఇతఁడు దండనార్హుఁడు కాఁడు. ఈ యుదారుఁడు సమస్త భూమండలమును, దన విక్ర మముచే సంపాదింపఁబడిన యింద్రాదిలోకములను దన దేహ మును నిశ్చల మనస్సుతో నీకర్పించెను.తనకున్న సమస్తమును నీకధీనముగావించిన యీ బలి దండనార్హుఁ డెట్లగును? ఇంతియ కాదు. లోకములోఁ బురుషుఁడు నిశ్చలబుద్ధియైసలిలముచేతను, దూర్వాంకురములచేతను నిన్నుఁ బూజించి యుత్తమగతిని బొందుచుండఁగా స్థిరబుద్ధితో, ముల్లోకములను గూడ నీకర్పిం చిన యీబలి యుత్తమపదవిని బొందుటకు మాఱుగా దండనము

నొంద నెట్లర్హుఁడగును? కావున నీక నితనిఁ బాశవిముక్తునిఁ జేయుము." అని పల్కిన బ్రహ్మకు నారాయణుం డి ట్లనియె. "ఓ కమలాసనా! నేనెవరి ననుగ్రహింపఁ దలతునో వాని సంపదలను ముందుగా నపహరింతును. అట్లు చేయనిచో ధన మదము పురుషుని వివేకరహితునిఁగాఁ జేయుటచే వాఁడు లోకమును నన్నును దిరస్కరించును. అట్లు తిరస్కరించుటచేతను నితరములగు కర్మములచేతను నీ లోకమున నానాయోనులందును బుట్టుచు, జీవుఁడు కర్మాధీనుఁడై యొకానొక సుకృతవిశేషము వలనఁ బురుషుఁడై పుట్టును. జన్మముచేఁగాని, కర్మముచేఁగాని, ప్రాయముచేఁగాని, సౌందర్యముచేఁగాని, విద్యచేఁగాని, యైశ్వర్యముచేఁగాని, ధనాదులచేఁగాని గర్వమెవనికిఁ గల్గదో యట్లు కలుగకపోవుట నా యనుగ్రహముచేత నే యని తెలిసికొనుము. 'యిట్లయిన ధ్రువాదుల కైశ్వర్య మేలయిచ్చితివి?' యని యందువేని చెప్పెదను వినుము. గర్వమునకు, నవివేకమునకు నిమిత్తములగు జన్మాదులు సకల శ్రేయస్సులకును బ్రతికూలములైనను నా భక్తుఁడు వానియం దెప్పుడును మోహము చెందఁడు. కావున నాభక్తుల కైశ్వర్య మొసంగినను నది యనర్థకారి కానేరదు. ఈబలి దైత్యులలోను, దానవులలోను శ్రేష్ఠుఁడు. ఇతఁడు మహాకీర్తిమంతుఁడు. ఇతఁడు దుర్జయ మగు నామాయను జయించెను. ఇతఁ డెట్టిసమయములందైనను మోహమును జెందఁడు. ఇతఁడు ధనమును గోల్పోయినను, రాజ్యభ్రష్టుఁడైనను, శత్రువులచే నిందితుఁడైనను, జ్ఞాతులచే విడువఁబడినను, నాపదను బొందినను, శుక్రునిచే శపింపఁబడినను దన మనోనిశ్చయమును వదలక సత్యవాక్యమును బరిపాలించెను. నేను నామాయలచే ననేకవిధములఁ

గలఁత వెట్టినను దన ధర్మమును విడువఁడాయెను. ఇట్టివాఁడు లోకమున వేఱొకఁడుండఁడు. ఇతఁడు దేహావసానమున దేవతలకునైనను దుర్లభ మగునాలోకమును బొందును. ఈజన్మమందుఁ గూడ సావర్ణి మన్వంతరమున నా యనుగ్రహముచే నింద్రుఁడగును. అంతకాలము వఱకు నీవు విశ్వకర్మ నిర్మించిన సుతల లోకమున కధిపతివై పాలించుచుండుము. నాదయవలన నీకచ్చట మనఃపీడగాని, రోగముగాని, ప్రమాదముగాని, శీతోష్ణాదుల వలన సంభవించు తిరస్కారముగాని యుపద్రవముగాని యెంత మాత్రమును సంభవింపవు" అని యిట్లు బ్రహ్మతోఁ బలికి బలిం జూచి "ఓదైత్యేంద్రా! ఓమహారాజా! నీకు శుభమగుఁగాక. నీవు నీదాయాదులతోఁగూడ సురలకు సైతము ప్రార్థింపఁదగిన సుతలమున కరుగుము. దానిఁ బాలించు నిన్ను నింద్రాది దేవతలైనను దిరస్కరింపఁజాలరు. తక్కినవారి సంగతి చెప్పనేల? దైత్యులందఱును, నీశాసనమును మన్నించి వర్తించుచుందురు. అటు వర్తింపనివారిని నాచక్రమే తప్పక చంపును. ఇంతియ కాదు. నిన్నును, నీయనుచరులను, నీభోగోపకరణములను సర్వదా సకలోపద్రవములనుండిసంగరక్షించుచుందురు. ఆ నీలోకమున నే నెల్లప్పుడును నీద్వారమును రక్షించుచు నీకుఁ గాన వచ్చుచుందును. అచ్చటి దైత్యుల సహవాసముచే నీ కొకప్పుడాసురధర్మములు సంభవించుచున్నను నా ప్రభావమువలన నిన్నవి చెందక నశించును. ఇది యిరువది రెండవ యధ్యాయము.

---

## ప్రహ్లాదునితో బలిసుతలమున కేఁగుట

అని యిట్లు పరమపురుషుఁడు పలుకఁగా నిఖిల సజ్జనహితుఁడును, మహానుభావుఁడును, నగుబలి చేతులుజోడించి కన్నుల నుండి యానందబాష్పములుస్రవించుచుండఁగాభక్తియుతుఁడై గద్గదవాక్కులతో నా పరమేశ్వరుని కిట్లనియె. "ఓమహాత్మా! సత్వగుణప్రధాను లగులోకపాలురు సైతము పూర్వమెప్పుడును బొందని నీ యనుగ్రహము నీచరాక్షసుఁడనగు నాయందుంచితివి ఆలోచింప నీకొర్చిన నమస్కారము నీభక్తుల కోర్కులను దీర్ప సమర్థమైన దని నిశ్చయముగాఁ జెప్పవచ్చు" నని పలికి బలి హరికి నమస్కరించి బ్రహ్మకు మ్రొక్కిపాశములవలన విముక్తుఁడై సంతుష్టుఁడై తన యనుచరులతోఁగూడ సుతలమును బ్రవేశించెను. ఓ పరీక్షిన్నరేంద్రా! ఇట్లు భగవంతుఁడు వామనరూపమునొంది బలివలన స్వర్గలోకముఁ బుచ్చుకొని యింద్రున కిచ్చి యతనిచే సకలజగంబు నేలించుచు నదితి కోర్కులను దీరించెను. అనంతరము ప్రహ్లాదుఁడు పరమపురుషు ననుగ్రహమును బొంది బంధవిముక్తుఁడై వంశవర్ధనుఁడై నతెన మనుమనిఁజూచి సంతుష్టుఁడై భక్తి పరవశుఁడగుచు విష్ణువున కిట్లనియె."ఓజగదీశా! నీవు మాయెడఁ జూపిన యనుగ్రహమును బ్రహ్మగాని లక్ష్మిగాని శంకరుఁడుకాని పొందియుండలేదు.తక్కిన యింద్రాదులసంగతి చెప్పనేల? క్రూరస్వభావము గలవారమైనను మమ్మును దుఃఖములనుండి కాపాడుచున్న నీయనుగ్రహము నెంతయు వర్ణింపఁ దగును. బ్రహ్మాదులతోఁగూడి నుతింపఁ ...నీవనుచులమగు మమ్మురక్షించుట కేవలమునీయనుగ్రహము

వలన నేకాని వేఱుకాదు. ఓ శ్రేయస్కరా! నీపాద పద్మము లందలి మకరందమును సేవించుటచేత బ్రహ్మాదులు సృష్ట్యాద్యధికారములఁ బొందియున్నారు. కుబుద్ధులమగు మేము నీపాదపద్మపరాగమును సేవింపకపోయిన నీ కరుణాకటాక్షములకుఁ బాత్రులమగుచున్నాము. ఆలోచింప బ్రహ్మాదులకంటె మాయందే కధికానుగ్రహ మున్నదని చెప్పవచ్చునుగదా! ఓ దేవా! నీచేష్టితము కర్మాధీనుఁడగు ప్రాకృత జనునివంటిది కాదు. నీ నిగ్రహానుగ్రహములు మిక్కిలి చిత్రములుగా నుండును. అపరిమిత మగుసంకల్పజ్ఞానముచే ననాయాసముగా జగమునుసృజించువాఁడవును, సృష్టికిఁబనికివచ్చు కల్యాణగుణములు గలవాఁడవును, సమస్తచిదచిత్తులకు నంతరాత్మవును, నందఱియందు సమబుద్ధిగలవాఁడవును నగునీవు భక్తప్రియుఁడ వన్నంతమాత్రమున విషమదృష్టి గలవాఁడవు కావు. నీస్వభావము కల్పతరువును బోలియున్నది.కల్పవృక్ష మాశ్రయించినవారికిని, నాశ్రయింపనివారికిని సమముగానే కోర్కులను బూరించును. అట్లె నీవును జేయుచుందువు'' అని యిట్లు పల్కిన ప్రహ్లాదునకు భగవంతుఁ డిట్లనియె. ''ఓవత్సా! ప్రహ్లాదా! నీకు భద్రమగుఁగాక. నీవు సుతలమున కరుగుము. అచ్చట నీవు నీపౌత్రుఁడగు బలితోఁగూడిన జ్ఞాతులకందఱకును మోదము కలిగింపుము. ఆ సుతలమున నీవు గదాపాణినగు నన్నెల్లపుడును సందర్శించుచుందువు. ఆదర్శనమువలనఁ గల్గిన యానందముచే సంసారహేతువగు కర్మబంధనములనెల్లఁ దొలఁగించుకొనఁగలవు' అని పలుకఁగా విమలమతి యగు ప్రహ్లాదుఁడు భగవదాజ్ఞ నంగీకరించి మనుమనితోఁ గూడి చేతులు జోడించి భగవంతునకుఁ

ప్రదక్షిణనమస్కారములను జేసి యతని సెలవు గైకొని సమస్త దైత్యసేనలకు నధిపతియై సుతెలమును బ్రవేశించెను. ఓరాజా! అనంతరము నారాయణుఁడు సభలో ఋత్విజులనడుమ నాసీనుఁడయియున్న శుక్రునిఁ జూచి "ఓ విప్రశ్రేష్ఠా! నీ శిష్యుఁడగు బలి యజమానుఁడై చేయుచున్న యజ్ఞకర్మము విచ్ఛేదము గాకుండ వేదోక్తప్రకారముగానడిపి సమాప్తముచేయు" మని పలికెను. "ఓ దేవా! కర్మప్రవర్తకుఁడవును యజ్ఞఫలప్రదుఁడవును నగు నిన్ను బలి త్రికరణశుద్ధిగా భయభక్తులతోఁ బూజించి సంతసింపఁజేయ నతనియజ్ఞకర్మమున కిఁకలోపమేది? మఱియు మంత్రమునఁగాని, తంత్రమునఁగాని దేశకాలవస్తువులందుఁగాని యేదేని లోపమున్నయెడల నదియంతయు నీనామస్మరణమువలనఁ దీఱును గదా! బలి నీ యనుగ్రహమునకుఁ బాత్రుఁ డగుటచే నెట్లాలోచించినను యజ్ఞకర్మమునకు లోపము లేదు. అయినప్పటికిని నీ శాసనమును జేసెదను. నీ యాజ్ఞను దలఁదాల్చుట పురుషులకుఁ బరమశ్రేయస్సుగదా?" అని పలికి శుక్రుఁడు విప్రులతోఁగూడి బలి యజ్ఞమును సమాప్తము గావించెను. ఓ రాజేంద్రా! శ్రీహరి యిట్లు వామనరూపముఁ దాల్చి పరులచే నపహృత మగుస్వర్గమును బలిని యాచించి పుచ్చుకొని తన సోదరుఁడగు నింద్రున కిచ్చెను. ఇప్పుడు ప్రజాపతులకునెల్ల నధిపతియగుబ్రహ్మ, దేవర్షులతోను, మనువులతోను దక్షుఁడు భృగువు మొదలగు మహామునులతోను, సనత్కుమారునితోను, శంకరునితోను గూడియదితికశ్యపుల ప్రీతినిమిత్తము లోకపాలాదిసహితమగులోకములకెల్ల వామనునిఁ బ్రభువునుగాఁ జేసెను. కేవలము లోకములకును సకలదేవతలకును, ధర్మము

నకును,దపస్సునకును, లక్ష్మికిని,సమస్త శుభములకును,వ్రతముల కును, స్వర్గమునకును, మోక్షమునకును, సర్వభూతములకును, క్షేమములవడునిమిత్తము వామనునిఁ బతిగాఁ జేసెను.ఓరాజా! ఆసమయమున సమస్తభూతములును మిక్కిలి సంతోషించినవి. పిమ్మట నింద్రుఁడు బ్రహ్మయానతిచొప్పున వామనమూర్తిని విమానముపైఁ గూర్చుండనిచ్చి లోకపాలురతోఁగూడ స్వర్గ మునకుఁ దీసికొని పోయెను. ఇంద్రుఁ డుపేంద్రుని బాహుబల ముచే రక్షింపఁబడుచున్న ముల్లోకములను బొంది తదాధిపత్య మును వహించి నిర్భయుఁడై.యేలుచు సకల సంపన్నుఁడై మోద మును సుఖమును జెందెను. ఓ రాజా ! అనంతరము బ్రహ్మయు, శంకరుఁడును, సనకాదులును, భృగ్వాది మహామునులును, పితృదేవతలును, సిద్ధులును, దక్కిన భూతములును, విమానా రూఢులై వామనమూర్తి పరమాద్భుతచరిత్రమును గానము చేయుచు, నదితిని నుతించుచుఁ దమతమనెలవుల కేఁగిరి. ఓకురు నందనా ! నా బుద్ధికి గోచర మగునంతవఱకు, వినువారి పాప ములను దూలించు వామనచరిత్రమును నీకు వినిపించితిని. ఆ వామనుని గుణములకు మేర లేదు.భూమి రేణువులను లెక్కిం చుటవలెనే యాతనిగుణముల లెక్కించుట యసాధ్యము. ఇంక ముందయిన నాపరమపురుషునిగుణముల లెక్కింపఁజాలినవాఁడు పుట్టఁబోఁ డని మంత్రద్రష్ట లగువసిష్ఠాదులు వక్కాణించిరి. అద్భుత కర్ముఁడయిన వామనుని చరిత్రమును భక్తితో విన్న వారును, పఠించినవారునుదప్పక ముక్తినొందుదురు. దైవత కర్మ మునుగాని, పైతృక కర్మమునుగాని, మనుష్య సంబంధి కర్మము గాని యాచరించునప్పుడే వామనచరిత్రము కీర్తింపఁబడినచో

నా క్రియాకలాప మెట్టిలోపమును జెందక ఫలవంత మగునని పండితులు చెప్పియున్నారు. ఇదియిరువదిమూఁడవయధ్యాయము.

---

మత్స్యావతారకథాప్రారంభము.

అని చెప్పిన శుకయోగిని జూచి నరేంద్రుఁ డిట్లనియె. "ఓమునీంద్రా! వామనచరిత్ర వినుటవలన నా మనస్సుమిక్కిలిసంతసించినది. శ్రీహరి మత్స్యావతారమెత్తి చేసిన యద్భుత కృత్యములను వినుటకు నామనస్సు కుతూహలపడుచున్నది.ఆ యీశ్వరుఁడు జీవునివలెఁ దమోగుణప్రధానమును, గ్రోధముగలదియు, లోకనిందితమును నగు మత్స్యరూపము నెందులకు ధరించెను. ఉత్తమశ్లోకుఁడయినభగవంతునిచరితమువినువారలయుఁజదువువారలయు సమస్తపాపములనుదొలఁగించునది. కావున మత్స్యావతారచరిత్రమును బూర్ణముగా వివరించి చెప్పుము" అని యడిగిన నరేంద్రునివచనము విని మిక్కిలి సంతసించి విష్ణువు మత్స్యరూపముఁ దాల్చి చేసిన చేష్టలను వివరింప నారంభించె. "ఓ రాజేంద్రా! గోవులను, విప్రులను, సురలను, సాధువులను, వేదములను, ధర్మ మర్యాదలను రక్షింపఁదలంచి భగవంతుఁడు మత్స్యాద్యవతారములనుధరించుచున్నాఁడు. ఆపరమేశ్వరుఁడు సత్వాది ప్రాకృతగుణములుగాక కేవలము కల్యాణగుణములు మాత్రమే గలవాఁడగుటచేఁ బెద్దవియుఁ జిన్నవియునగుభూతములందు సర్వదా వాయువువలె వ్యాపించుచున్నను, నాయాభూతముల యుచ్చత్వ నీచత్వములు అతనికి సంభవింపవు. గతించిన కల్పావసానమున బ్రహ్మసృష్టివ్యాపారమువిడిచి నిద్రించుటచేఁ బ్రళయము సంభవించెను. ఆప్రళయమందు మూఁడులోకము

లును, సముద్రమునమునింగినవి. బ్రహ్మ నిద్రాసక్తుఁడై శయినింపఁ దలంచియున్నసమయమున వేదము లతనిముఖమునుండి నిర్గమించెను. వానిఁ గాంచి సమీపమున నున్న హయగ్రీవుఁ డను రాక్షసుఁ డపహరించెను. ఆ దానవేంద్రుని దుష్టకృత్యమును జూచి వానిఁ జంపి యావేదముల బ్రహ్మ కర్పించునిమిత్తము భగవంతుఁడు మత్స్యరూపమును ధరించెను. ఆ వృత్తాంతముఁ నే వివరించి చెప్పెదను వినుము. గతించిన కల్పమునందే సత్యవ్రతుఁడగురాజర్షి యుండెను. అతని పేరు సత్యవ్రతుఁడు. అతఁడు క్షమాదు లగుగుణములు గలవాఁడు. అతఁడు నారాయణుని మనమున నిల్పికొని జలమునుమాత్రమే త్రావుచు ఘోరమగు తప మాచరించెను. ఆ సత్యవ్రతుఁ డనురాజర్షియే భగవదనుగ్రహమును బడసి యీ మహాకల్పమున వైవస్వతుఁడను పేరితో మనువయ్యె. ఆ సత్యవ్రతుఁ డొకనాఁడు మాలానదియందు జలతర్పణము చేయుచుండఁగా నతని దోసిటిలోని కొకచేఁపపిల్ల వచ్చెను. దాని నతఁడు జలములోఁ బడవేయుచుండెను. అంత నది యీ రాజర్షిని గాంచి "ఓ దీనవత్సలా ! దీనియం దనేకము లగు పెద్ద చేఁపలుగలవు. అందుఁ బెద్దవి మావంటి చిన్న చేఁపలను దినుచుందును. వానికిభయపడి నిన్ను శరణుసొచ్చితిని. దీనమ నగు నాయందు దయయుంచి రక్షింపక మగుడ నీ జలములలోఁ బాఱవై చెదవేమి?" అని యిట్లు దీనాతిదీనముగాఁ బ్రార్థింపఁజొచ్చెను. సత్యవ్రతుఁడదివిని దానిని సామాన్యమగు చేఁపనుగాఁ దలంచెను; కాని తన్నను గ్రహింపఁ బ్రేమతో మత్స్యరూపమును దాల్చి వచ్చిన భగవంతునిఁగా నెఱుంగక పోయెను. అయిన నతఁడు దాని రక్షింపనిశ్చయించెను. అతఁడు దాని దీనవాక్యములువిని దయాళు



1493. శ్రీమత్స్యావతారము.

వయి తన కమండలువుజలములో నుంచి తనయాశ్రమమునకు గొనిపోయెను. అంత నాచేప యొక్క రాత్రియందే కమండలువునకు సరిపడఁ బెరిఁగి యవకాశము లేకపోవుటచే విచారించి సత్యవ్రతునిఁ గాంచి "ఓమహాత్మా! యీ కమండలువు నాకు మిక్కిలి యిఱుకటముగా నున్నది. దీనిలో నివసింపఁజాలను. నేను సుఖముగా నివసింపఁజాలినంత విశాలమగు స్థలమున నుంపుము" అని పలుకవిని సత్యవ్రతుఁడు కమండలువులోనున్న చేఁపను దీసినిర్లోదకముగల* పెద్ద చెఱువు వెనములో నుంచెను. అదిముహూర్తకాలములోనే దానికి సరిపడఁబెరిగి "ఓరాజా! నిన్ను శరణుఁ జొచ్చితిని గనుక నన్నింతకంటెవిశాలమగుస్థలమందుంచి రక్షింపుము. ఈకటాహము నా సుఖజీవనమునకుఁ జాలకున్నది" యని వేఁడికొనఁగా దానిఁ గరుణించి సత్యవ్రతుఁడు జలపూర్ణమైన యొక సరోవరమున నుంచెను. ముహూర్తకాలములోనే యా చేఁప దానికిసరిపడఁబెరిఁగి "ఓరాజా! ఈసరోజలము నాకుసుఖము గల్గింపఁ జాలినదికాదు. కావున నన్నుఁ గొనిపోయి యింతకంటెఁ బెద్దదియు నక్షయజలముగలదియునగు నొక మడువునందుంపుము. అట్లయిన నన్ను రక్షించినవాఁడ వగుదువు." అని వేఁడ నతఁ డట్లొనర్చెను; కాని యామడువును జాలనందున నతఁడు దాని నొక సముద్రమునఁ జేర్చెను. ఆ సమయమున నది యతనింజూచి "ఓ వీరా! ఈ సముద్రమునందు భయంకరము లగుమకరము లెన్నియో గలవు. అవి మిక్కిలి బలముగలవి. అవి నన్ను భక్షింపక విడుచునా? ఇంతకాలమును రక్షించి యిప్పు డిట్లుచేయుట యుచితమా? కావున నన్నీ

* ఔదంచనోదకే—అని మూలము.

సముద్రమునఁ ద్రోయకుము'' అనిపల్కెను. సత్యవ్రతుఁడాచేఁప మృదువాక్యమును విని మత్స్యరూపముచే మోహితుఁడై యిట్లనియె. "ఓయీ! ఈమత్స్యరూపముచే నన్నుమోహింపఁ జేయుచున్న నీ వెవఁడవు ? ఇటువంటి ప్రభావము గల చేఁప నిదివఱ కెన్నఁడును జూచియుండలేదు; వినియుండుటయును లేదు. ఏ జలచరమైన నొకదినకాలములో నూఱుయోజనముల దేహమును బెంపఁగలదా! కావున నీవు కేవలము జలచరమవు కావు. నీవు దేవుఁడవు. ఆలోచింప నీవు బ్రహ్మాది దేవతలలో నొకఁడవు కావు. నీవు నిర్వికారుఁడవయిన నారాయణమూర్తివి. భూతములననుగ్రహించి రక్షించుటకై నీ విట్టి మత్స్యరూపమును ధరించితివి. ఓ పురుషోత్తమా! నీవు జగమ్ములసృష్టి స్థితి లయములకుఁ గారణుఁడవు. నీభక్తులమును, శరణాగతులము నగుమాకు నాయకుఁడవు. నీవు సకలమున కంతరాత్మవై వెలయుచున్న వాఁడవు. అట్టి నీకు నమస్కారము. నీవు లీలచేఁ బెక్కవతారముల నెత్తితివి. అవియన్నియు భూతముల కభివృద్ధిని గల్గించునవియె. అయిన నీ వేప్రయోజనమును సాధింప నీయవతారముఁ దాల్చితివో తెలియఁజెప్పుము. ఓకమలాక్షా! స్వతంత్రాభిమానము గల యితరులపాదసేవవలె నీపాదసేవ యెప్పుడును వ్యర్థముకాదు. నీవు సకలభూతములకును బ్రియుఁడవు. సమస్తమునకు హితకరుఁడవు. మఱియు నంతరాత్మవు. అట్టి నీభజన మెట్లు వృథయగును? కావున నీ సేవకులమగు మాకద్భుతమగు నీ మత్స్యరూపమునఁ బ్రత్యక్షమైతివి'' అనిపల్కిన సత్యవ్రతునికి మత్స్యరూపుఁ డయినభగవంతుం డిట్లనియె. "ఓరాజా! కల్పాంతమున సముద్రములు ముల్లోకములను ముంచి

వైచును. అప్పు డందువిహరించుచు నాభక్తులఁ గాపాడి వారికిఁ బ్రీతిఁగల్గింప నీరూపమును జేకొంటిని. అట్టి ప్రళయము వచ్చుట కిఁక నెంతోకాలము పట్టదు. నేటి కేడవదినమందే లోకము లన్నియు సముద్రమున నడఁగియుండును. ఇట్లు *ప్రళయకాల సముద్రమున సర్వము మునిఁగియున్న సమయమున నాయాజ్ఞచే నొకవిశాలమగు పడవ నీ చెంతకు వచ్చును. అప్పుడు నీవు నానా విధములగు బీజములను, నోషధులను, నా నావపైనుంచి సప్త

---

* ఇటఁ బ్రళయమనఁగా మహాప్రళయమని యర్థమా! లేక దైనందిన ప్రళయమని యర్థమా! ఇది మహాప్రళయమనుటకు వీలులేదు. అట్లయినచో బ్రహ్మలోకముగూడ నశింపవలయును. పృథివ్యాద్యదులు మిగిలియుండుటకును వలను పడదు. కాన 'యావద్బ్రహ్మనిశా' అని చెప్పుటచే బ్రహ్మలోకమును బ్రహ్మయు మిగిలియున్నట్లు తెలియవచ్చుటచే నిది మహాప్రళయ మనవలను పడదు. పోనిమ్ము. దీనిని దైనందినప్రళయ మనవచ్చునన నదియు వలనుపడదు. అట్లన్నచో ప్రళయకాలసంబంధులగు ననావృష్ట్యాదులు లేకుండఁగనే యాకస్మికముగా నేటి కేడవదినమునఁ ద్రైలోక్యము సముద్రమున మునుఁగునని మత్స్యమూర్తి చెప్పిన వచన మనుపపన్నమగును. ఏమన దైనందిన ప్రళయమునఁ బ్రళయకాల సృష్ట్యాదులుండి క్రమక్రమముగా లోకములు మునుఁగును; కాని యాకస్మికముగా మునుఁగవు. ఇదియునుంగాక ప్రథమస్కంధమున "రూపం సంజగృహేమాత్స్యం చాక్షుషాంతరసంప్లవే। నావ్యారోప్యమహీమయ్యా మపాద్వైవస్వతంమనుం" అని చెప్పఁబడియున్నది. మహాప్రళయమునఁగా దైనందిన ప్రళయమునఁగాని భూమ్యాదులుండుట యసంభవము కావున "నావ్యారోప్యమహీమయ్యా" మనునది విరోధించును. మఱియు "త్వంతావ దోషధీస్సర్వాః" అనునిర్దేశముగూడ సరిపడదు. ఆ రెండువిధములగు ప్రళయములందును నోషధ్యాదులును జంతువులును నుండుటయెట్లు? పోనిమ్ము, "ఇది వాస్తవిక ప్రళయముకాదు. సత్యవ్రతునికి వైరాగ్యము గల్గించి జ్ఞానోపదేశము

ర్షులతోను, సకల జంతువులతోను గూడి యీ పెద్దనావలోఁ గూర్చుండి నిర్భయముగా విహరింపఁగలవు. అప్పుడు సూర్యకాంతి లేకపోవుటచేఁ జీఁకట్లు క్రమ్మినను సప్తర్షుల దేహకాంతిచేఁ దొలఁగింపఁబడుచుండును. ప్రళయకాలవాయు వా నావను మిక్కిలి యెగురఁగొట్టుచుండు. అయినను భయపడకుము. అట్టి సమయమున నే నీరూపముతో నీచెంతకువత్తును. నీవొక పెద్దపాముతో నానావను నాకొమ్మునకుఁ గట్టుము. మీరున్న యీనావను నడుపుచు నే నా ప్రళయార్ణవమందు బ్రహ్మ నిద్రనుండి లేచునంత వఱకును విహరించుచుందును. పరబ్రహ్మమని చెప్పఁబడు నామహిమను నీకు దయాపూర్వకముగా నుపదేశింతును. దాని నీవు

---

చేయ భగవంతుఁ డాకస్మికముగాఁ గల్పించిన ప్రళయమని యందు మేని యదియు వలనుపడదు. ఏమన "కాలేనాగతనిద్రస్య ధాతుశ్శిశయిషోర్బలీ । ముఖతో నిస్సృతా న్వేదాన్" అని చెప్పియుండుటచే సత్యవ్రతునికి జ్ఞానోపదేశార్థము భగవంతుఁ డీ ప్రళయమును గల్పించెనన్నచో బ్రహ్మ నిద్రించుటయు, వేదములతనిముఖమునుండి నిర్గమించుటయు, వానిని హయగ్రీవుఁడు హరించుటయు నెట్లు సరిపడును ? కావున సత్యవ్రతునికై కల్పించిన యాకస్మికప్రళయమనుటయు వలనుపడదు. అందుచే నిట గతించిన దైనందిన కల్పమున నవసానమందు సంభవించు ప్రళయమని చెప్పవలయును. ప్రళయకాల లక్షణము లగు ననావృష్ట్యాదు లున్నట్లు చెప్పక పోయినను నర్థమును బట్టి యున్నవని యనుకొనవలయును. ఇది దైనందిన కల్పవిశేషమని చెప్పుటచే నందుఁ బృథివ్యాదులుండుటయు, బీజములు సత్త్వములు, గల్గియుండుటయు సంభవించుచున్నది. ఆదైనందిన కల్పవిశేషమందు బ్రహ్మకు నిద్రసంభవించుటచే వేదనిస్సరణము, దదపహరణము మొదలగునవి సంఘటింపవచ్చును. కావుననిది దైనందిన ప్రళయముకాని మహాప్రళయముకాని కాదనియు దైనందినకల్పావసానమునఁ బ్రవర్తిల్లు ప్రళయవిశేష మనియు నెఱుంగునది.

పూ_ర్తిగాఁ దెలిసికొందువు" అనిపలికి శ్రీహరి యచ్చటనే యంత ర్ధానముచెందెను. సత్యవ్రతుఁడు భగవంతుఁడు చూపిన కాల మునుగూర్చి వేచియుండెను. అతఁడు తూర్పునకుఁ జివరలుండు నట్లుగాఁ బఱవఁబడిన దర్భలపై నుత్తరాభిముఖుఁడై కూర్చుండి మత్స్యమూ_ర్తిపాదముల హృదయమున ధ్యానించుచుండెను. ఇట్లుండ మహామేఘము లాకసమును గప్పి ఘోరముగా వర్షించెను. ఆయుదకముచే సముద్రము వర్ధిల్లి హద్దుదాఁటి భూమిని ముంప నారంభించెను. సత్యవ్రతుఁడు భగవంతుని ధ్యానించుచున్న సమయమున నొక మహానావ పేతెంచెను. అది చూచి యతఁడు బీజములను, నోషధులను దాననుంచి సప్తర్షులతోఁ గూడి నావపైఁ గూర్చుండెను. అంత ఋషులు సత్యవ్రతునిఁ జూచి "ఓరాజా! సంతతమును గేశవుని ధ్యానించుచుండుము. ఈముప్పునుండి తప్పించి మనలనతఁడు సుఖింపఁజేయును" అనిరి. అతఁ డట్లు స్మరించుచుండెను. అంత నామహార్ణవమందు భగవంతుఁడు లక్షయోజనముల పొడవై సువర్ణమయమై యొక కొమ్ముగల్గి యాశ్చర్యము గొలుపు మత్స్యరూపమునఁ బ్రత్యక్షమయ్యె. సత్యవ్రతుఁడు శ్రీహరి చెప్పినట్టుగానొక మహాసర్పముచే నానావను మత్స్యమూ_ర్తి కొమ్మునకుఁ గట్టి సంతుష్టచిత్తుఁడయి యతని నిట్లు నుతింప నారంభించెను. "ఓదేవా! అనాది యగుదేహాత్మాభిమానరూపమగునజ్ఞానముచే స్వాత్మపరమాత్మతత్త్వమును బోఁగొట్టుకొని తాపత్రయపీడితు లగు జనులీ సంసారమున నిక్షిమి_త్తముగా జనించిన నీకృపకుఁ బాత్రులయి నిన్నాశ్రయించి ము_క్తులగుచున్నారు. వారికి ము_క్తినిచ్చువాఁడవును ము_క్తి సాధనుఁడవును నీవేకదా! అట్టి నీవు మాకుఁ

త్రాప్యుఁడవయి గురువవై యున్నావు. మఱియు జననమరణా దులు గలజీవులు దేహాత్మాభిమానులై స్వకీయములగు పుణ్యా పాపకర్మముల కధీనులై శబ్దాదివిషయ సుఖములను సంపా దింపఁ దలంపుఁగొని దుఃఖజనకము లగుకర్మముల నాచరించు చున్నారు.అయినను వారు నిన్ను సేవించి తన్మహిమవలన దేహా త్మాభిమాన బుద్ధిని విడుచుచున్నారు. నీవు హితోపదేష్టవును, అజ్ఞాననివర్తకుఁడవును; కాన మాయందు దయయుంచి మాయభిమానగ్రంథిని వదలింపుము. అగ్ని సంపర్కమువలన బంగారు మలమును విడిచి స్వవర్ణమును బొందినట్లు ముముక్షు వగు పురుషుఁ డెవ్వని సేవచేఁ బుణ్యాపుణ్యరూపమగు కర్మజాల మును విడిచి స్వస్వరూపమును బొందుచున్నాఁడో యట్టియీశ్వ రుఁడ వగు నీవు మాకు గురువ వగుదువు గాక. మాగురువులకుఁ గూడ గురువ వగుటచే నీవే మాకుఁ బ్రధానగురుఁడవు. పురుషు లకు మోక్షముగల్గించిన నీవేకల్గింపవలెను.కానియితరులతరము గాదు. నీసేవకు విముఖుఁ డయినపురుషునికి సకలదేవత లేకీ భవించి గురుత్వమును వహించియున్నైనను నీ యనుగ్రహము యొక్క పదివేల వంతులలో నొకదానినైనను జేయఁజాలరు. అట్టి యసమర్థుల నాశ్రయించిన నేమిలాభము? ముక్తిప్రదుఁ డవును,సర్వాంతరాత్మవును నగునిను శరణుఁబొందెదము. మంచి నేత్రములు గలవాఁడు గ్రుడ్డివానికిఁ దోడై మార్గదర్శియైనట్లు సూర్యప్రకాశమువలె స్వభావసిద్ధజ్ఞానము గలనీవు స్వాత్మ రక్షణోపాయజ్ఞానము లేని బ్రహ్మాదులకు తోడై గురువవయి వర్తించు చున్నావు. ప్రకాశవస్తువులకుఁ గూడఁ బ్రకాశ కత్వశక్తిని గల్గించు నీవు ముక్త్యుపాయమును దెలిసికొనవలె

ననియున్న మాకు గురువవై వర్తింతువుగాక. జనన మరణాది భాజనమైన సంసారి గురువననెడి యభిమానము గలవాఁడై దేని నవలంబించి విడువఁదరము కాని సంసారము నొందునో యట్టి యసన్మార్గమగు నర్థకామాదుల నుపదేశించును. నీవట్లు కాక యేది యెప్పటికిని నాశనమొందదో, యేది కేవలానంద మునకు హేతుభూతమో, యేది వ్యర్థముగాదో, యేది పురుషు నికి సుఖముగా ముక్తి నొసంగఁజాలునో, యట్టి స్వపర యాథాత్మ్యజ్ఞానము నుపదేశింతువు. ఓ దేవా! నీవు సకలము నకును హితుఁడవు. అందఱప్రేమకు నిలయుఁడవు. నీవు సమస్త మున కంతరాత్మవై నియమించువాఁడవు. నీవు హితముప దేశించువాఁడవు; జ్ఞానమును, నభీష్టముల నొసంగువాఁడవు. నీవిటువంటివాఁడ వైనను లోకులు తమ హృదయకమలమున వసించునిన్నుఁ దెలిసికొనఁజాలరు. శబ్దాదివిషయములం దాసక్తు లయినవారు నిన్నెట్లు తెలిసికొనఁగలరు? దేవా! దేవదేవుఁ డవును, శ్రేష్ఠుఁడవును, నగునిన్నును జ్ఞానోపదేశము నొందు నిమిత్తము శరణుసొచ్చితిని. కాన నో భగవంతా; పరమపురు షార్థమును బ్రకటించు వచనములచే విప్ప శక్యము కానిదై నా హృదయమందున్న దేహాత్మాభిమానాదులను నశింపఁ జేయుము. నీస్వరూపము దెలుపుము" అని పలుకుచున్న రాజుపలు కులు విని యాదిపురుషుఁ డగు మత్స్యమూర్తి సంతసించి యాసముద్రమున విహరించుచునే ప్రకృతివిలక్షణ మగునాత్మ జ్ఞానమును, భక్తియోగమును, దనచే రచింపఁబడినమత్స్యపురాణ సంహితను, నాత్మ రహస్యములను వివరించి సత్యవ్రతున కుప దేశించె. ఆసత్యవ్రతుఁడునుమునులతోఁ గూడ భగవంతునివలనఁ

ప్రకృతిపురుషులతత్త్వమును, బరమాత్మజ్ఞానమును నుప దేశింప నిస్సందేహముగా విని తెలిసికొనెను. అనంతరము హరి ప్రళయావసానమున నిద్రనుండి లేచిన బ్రహ్మకుఁ దాను హయ గ్రీవునిఁజంపి పుచ్చుకొన్న వేదముల నర్పించెను. ఆసత్యవ్రతుఁడు శాస్త్రజన్యజ్ఞానముచేతను, దజ్జన్యజ్ఞానముచేతను, నొప్పుచు విష్ణుప్రసాదమువలన నీకల్పమున వైవస్వతమనువయ్యె. ఓ రాజేంద్రా! రాజర్షి యగుసత్యవ్రతునికి, మాయామత్స్యరూపి యగునారాయణునకును బ్రవర్తిల్లిన సంవాదరూప మగుచరి త్రమును విన్నవారు సంసారబంధనములవలన విడివడుదురు. హరి మత్స్యావతారచరిత్రము నెవఁడు ప్రతిదినమును గీర్తిం చునో వానికిఁదలంచినంతమాత్రముననే కోర్కులు సిద్ధించును. అనంతరమున నతఁడు పరమపదవిని జెందును. ఎవఁడు ప్రళయ కాల సముద్రమున విహరించుచు నిద్రించిన బ్రహ్మనుండి వేద ముల నపహరించిన హయగ్రీవుని సంహరించివానిని దెచ్చి బ్రహ్మ కిచ్చెనో, యెవఁడు సత్యవ్రతాదులకుఁ బురాణసంహితను దత్త్వము నుపదేశించెనో, సకలకారణుఁడయిన యామాయా మత్స్యమూర్తికి నమస్కరించెదను, ఇది యిరువదినాల్గవ యధ్యాయము.

ఇది శ్రీమత్కేతవరపు వేంకటశాస్త్రి ప్రణీతమైన
యాంధ్ర వచన భాగవతమున అష్టమస్కంధము
సమాప్తము.

---

శ్రీకృష్ణార్పణ మస్తు.



శ్రీ ర స్తు.

శ్రీశారదాంబాయై నమః.

# శ్రీమదాంధ్రభాగవతము

## నవమస్కంధము.

“ఓ మునీంద్రా! మన్వంతరములనెల్ల నీవు వివరించితివి. ఆయా మన్వంతరములందు భగవంతుఁ డవలంబించిన యవతారములను, నాయవతారములఁ జేసినకార్యములను వర్ణించి చెప్పితివి. విని యానందించితిని. ద్రవిడదేశాధిపతి యగుసత్యవ్రతుఁ డనునొకరాజర్షి కలఁడనియు, నతఁడు గతించిన కల్పమందుఁ బరమపురుషుని సేవించి జ్ఞానము సంపాదించెననియు, నతఁడే వైవస్వతమను వయ్యెననియు, నిక్ష్వాకువు మొదలగువారతనిసుతులనియుఁజెప్పితివి. ఓసర్వజ్ఞా! ఆ యిక్ష్వాకు ప్రభృతుల చరిత్రములను, దదీయవంశజుల చరిత్రములను వేఱువేఱుగావర్ణించిచెప్పుము. మాకువినవలెనని వేడుకయగుచున్నది. మఱియు నావైవస్వతువంశమున నెవరెవరు జన్మించిరి? ఇప్పుడున్నవా రెవ్వరు? ముందు జన్మించువా రెవ్వరు? వారలకీర్తి దుష్కీర్తు లెట్టివి? వారల పరాక్రమాదిగుణము లెట్టివి? వానిని మాకుఁ బూర్తిగా వివరింపుమా” యని యిట్లు పరీక్షిన్నరేంద్రుండు బ్రహ్మవాదు లగుమునులమధ్యమునఁ గూర్చుండి

యున్న శుకు నడుగఁగా సకలధర్మముల నెఱిఁగిన శుకుం డతని కిట్లనియె, "ఓరాజా! వైవస్వతమనువు వంశమును వర్ణించెదను. కాని దాని సంపూర్ణముగా విస్తరించి చెప్పఁదరము కాదు. నూఱేండ్లయినను జాలవు. పెద్దవియుఁ జిన్నవియునగు భూతముల కంతరాత్మయు,స్థూల చిదచిత్తులు శరీరముగాఁ గలవాఁడును నగుపరమేశ్వరుఁడు కల్పాంతమున నీ విశ్వమునంతటిని దనయం దిమిడ్చికొని యుండెను. అతని నాభివలన స్వర్ణమయ మగుపద్మ ముదయించెను. ఓ మహారాజా! అందుండి చతుర్ముఖుం డుదయించె; అతనిమనస్సువలన మరీచిసంభవించె; అతనికిఁ గశ్యపుఁడుగలిగె; అతనికి దక్షపుత్త్రి యగునదితియందు వివస్వంతుఁ డనుకుమారుఁ డుదయించె. ఓరాజేంద్రా! అతనికి సంజ్ఞాదేవియందు వైవస్వతమను వుద్భవించె. మంచి మనస్సుగలయా వైవస్వతునికి శ్రద్ధ యనుభార్యయందుఁ బదుగురు పుత్త్రులు పుట్టిరి. వారు క్రమముగా నిక్ష్వాకుఁడు, శర్యాతి, నృగుఁడు, దిష్టుఁడు, ధృష్టుఁడు, కరూశకుఁడు, నరిష్యంతుఁడు, పృషధ్రుఁడు, నభగుఁడు,కవి, యనునామములచేఁ బిలువఁబడిరి.

ఇళోపాఖ్యానము.

వైవస్వతమనువునకుఁ బుత్త్రసంతానము కలుగక పూర్వ మతఁడు వసిష్ఠునిఁజేరి తనయపుత్త్రత్వమును దెలుపవిని యతఁడు కరుణించి తానాచార్యుఁడై యామనువుచే మిత్రావరుణ మను నిష్టిని జేయించెను. యాగసమయమున మనుపత్ని యగు శ్రద్ధ కేవలము పాలనుమాత్రమే యాహారము చేసికొని, నియమమవలంబించినదై హోతను సమీపించి నమస్కరించి తనకుఁ గన్యక కలుగునట్లుచేయవలెననియాచించెను. ఆప్రార్థనమతఁడంగీ

కరించెను. పిమ్మట నధ్వర్యునిచేఁ బ్రేరితుఁడై హోత మనస్సును నిశ్చలముగాఁ జేసికొని మనుపత్ని ప్రార్థనమును మనస్సులో నుంచికొని వషట్కారము నుచ్చరించుచు, హవిస్సును గ్రహించి హోమముచేసెను. హోత యిట్లు విరుద్ధముగా హోమము చేయుటంబట్టి యజమానుని సంకల్పమునకు విపరీతముగా, ఇళ యనుకన్యక పుట్టెను. తాను గోరినట్లు పుత్త్రుఁడుగాక పుత్త్రిక పుట్టుటను గని మిక్కిలి సంతసింపక వైవస్వతమనువు గురువగు వసిష్ఠునిఁజూచి యిట్లనియె. “ఓ మునీంద్రా! మీరు బ్రహ్మ వాదులు. మీరుపూనికొని చేసినకర్మములు సంకల్పించుకొన్న ఫలము నిచ్చి తీఱవలెను. అట్లుగాక విపరీతఫలము నిచ్చినచో నది మిక్కిలి విచారకరము. మఱియు మంత్రశక్తి వ్యత్యాసము నుజెందరాదు. మీరు మంత్రములను వాని యర్థములను, వాని నియోగములను జక్కఁగా నెఱుఁగుదురు. మీమనస్సులు నిశ్చలములు.తపస్సుచేసి పాపములను దొలఁగించుకొన్న మహాత్ములరు. పండితులనోట నసత్యము వెలువడఁ గూడనట్లు మీరు మంత్రపూర్వకముగాఁ జేసిన క్రియవలన విపరీతఫలము గలుగఁ గూడదు.ఇట్లుండ నాసంకల్పమునకుఁ బ్రతికూలముగాఁ గూఁతు రెట్లు పుట్టినది?” అనిపల్కిన మనువచనముల విని* మాప్రపితామహుఁ డయినవసిష్ఠుఁడు హోత చేసినవ్యత్యాసము నెఱిఁగి మనువుం గాంచియిట్లనియె. “ఓయీ! నీహోత నీసంకల్పము నకు విపరీతముగాఁ దలంచుటచేత నిట్టి ఫలవైషమ్యము సంభ

---

*శుకునకు వసిష్ఠుఁడు ప్రపితామహుఁ డగును. ఎట్లన,వసిష్ఠునకు శక్తిగలిగెను.అతనికిఁ బరాశరుఁడు, అతనికి వ్యాసుఁడు, అతనికి శుకుఁడు; కావున నతనికిఁ దాత తాతయయ్యెను.

వించినది. అయిన నాతపోబలముచే నీకూఁతునకుఁ బురుషత్వము లభించునట్లు చేసెద" నని ప్రతిజ్ఞ చేసెను. అనంతరను మహాకీర్తి యగువసిష్ఠుఁడు పరమపురుషుని నుతింప నద్దేవుఁడు ప్రత్యక్షమై యతనికిఁ గావలసిన వరమునిచ్చిపోయెను. అందుచే నిళాకన్యక సుద్యుమ్నుఁడనుపురుషుఁడయ్యెను. ఓమహారాజా! ఆ సుద్యుమ్నుఁ డొకనాఁడు కొందఱు మంత్రులును. బరిచారకులును,పరివేష్టించియుండ. సింధుదేశసంబంధియగు నున్నతాశ్వము నెక్కి సుందరమగు చాపమును, నచ్చెరువు గొలుపు బాణములను దాల్చి, కవచమునుదొడిగి మృగములను వేఁటాడు వేడుకతో నుత్తరదిక్కునకేఁగెను. అట్లతఁడు పోయిపోయి మేరువునకుఁ గ్రిందిభాగముననున్న యొకవనమును బ్రవేశించెను. ఆవనమందు శంకరుఁడు సర్వకాలములందును బార్వతితోఁ గ్రీడించుచుండును.శత్రుహంత యగుసుద్యుమ్నుఁ డందుఁ బ్రవేశింపఁగానే స్త్రీరూప మొందెను.అతఁ డెక్కినగుఱ్ఱ మాఁడుగుఱ్ఱమయ్యె. అతనియనుచరులును స్త్రీలయిరి. వారు పగస్పరమును జూచికొని స్త్రీరూపమునొందుటకు విచారించిరి" అనినవిని రాజిట్లనియె."మునీంద్రా!ఆ ప్రదేశమున కట్టిమహిమ యుండుటకుఁ గారణమేమి? దాని కామహిమ నెవ్వరొసంగిరి ? మాకు విన వలెననియున్నది. కావున వివరించి చెప్పు" మనఁగా శుకుం డిట్లనియె "ఓరాజా! ఈశ్వరుఁ డా యిలావృతమందున్న యావనమునఁ బార్వతితోఁ గ్రీడించుచుండఁ దపోనిష్ఠులగుమునులు గొందఱు దమకాంతులచే దిక్కులను బ్రకాశింపఁయుజేచునచ్చటికరుదెంచిరి. దిగంబరయై శంకరునితొడపయిఁగూర్చుండి యున్నపార్వతి వారింజూచి మిక్కిలి సిగ్గుపడి దిగ్గనలేచి వస్త్ర

మును ధరించెను. అప్పుడు ఋషులును వారు సంభోగింపఁ దలంపుతో నున్నవారని తెలిసికొని వెనుకకు మరలి బదరికావనమునకుఁ బోయిరి. అంత రుద్రుఁడు తన ప్రియురాలికిఁ బ్రియము చేయ దలంచి 'పురుషుఁ డీవనము సొచ్చెనేని స్త్రీ యగుఁగాక" యని పలికెను. అప్పటినుండియుఁ బురుషు లావనమునకుఁ బోవమానిరి. ఆ ప్రదేశవృత్తాంత మిది. ఇఁక సుద్యుమ్నివృత్తాంతము వినుము. ఆ రాజట్లు స్త్రీయై స్త్రీరూప మొందిన యనుచరులతోఁ గూడ నావనములందుఁ జరించుచుండెను. ఒకనాఁడామె చెలికత్తెలతోఁ గూడఁ దనయాశ్రమము చెంత విహరించుచుండు స్త్రీరత్నమగు నామెను జూచి చంద్రునికుమారుఁ డగు బుధుఁడు మోహించెను. ఆమెయు బుధుని మోహించినది. వారిరువురును దంపతులయిరి. అట్లు సుఖించుచుండ వారికిఁ బురూరవుఁ డనుపుత్రుఁడు పుట్టెను. అనంతర మొకనాఁడు సుద్యుమ్నుఁడు తన స్థితికి వగచుచుఁ దనకులగురువగు వసిష్ఠుని స్మరించుకొనెను. వసిష్ఠుఁ డతనికిఁ బ్రత్యక్షమయి యతనిరూపమునుజూచి జాలిపడి మగుడ నతనికిఁ బురుషత్వము సంపాదింపవలె నని నిశ్చయించి శంకరుని నుతించెను. ఆమునీంద్రునకు శంకరుఁడు ప్రసన్నుండై తనశాసనమును మునికోర్కెని, సఫలముగాఁ జేయఁ దలంచి "నీ తపోమహిమచే సుద్యుమ్నుఁ డొకనెల పురుషరూపమును, నొకనెల స్త్రీరూపమును దాల్చి భూమిని బరిపాలించుఁ గాత" మని పలికెను. దానికి వారు సమ్మతించిరి. పిమ్మట సుద్యుమ్నుఁడు తనగురువు ననుగ్రహముచేఁ దనకిష్టమగు పురుషత్వమును బొంది రాజ్య పాలనము చేయఁదొడంగెను; కాని ప్రజలకు సంతుష్టి లేకపోయెను. ఆరాజునకుఁ బురూరవుఁడు కాక యుత్క

లుఁడు, విమలుఁడు నాఁబడుముగ్వురుకొడుకులునుగలరు. వారు ధర్మవత్సలులై దక్షిణదేశములకుఁ బ్రభువులైరి. సుద్యుమ్నునకు ముసలితనము రాఁగానే భూమండలమునకుఁ బురూరవుని రాజుఁగాఁ జేసి జితేంద్రియుఁడై తపమొనరింప వనమున కేఁగెను. ఇది మొదటియధ్యాయము.

---

## పృషధ్రాదుల చరితము.

సుద్యుమ్నుఁడు వనమున కేఁగినపిమ్మట వైవస్వతమనువు యమునాతీరమును జేరి పుత్రసంతాన మపేక్షించి నూఱువత్సరములు తపస్సుచేసి యనంతరము స్వయముగా విష్ణువు నారాధించెను. ఆదేవు ననుగ్రహమున నతఁడు దనతో సమానులగు పదుగురు సుతులను బడసెను. వారలే యిక్ష్వాకుఁడు మొదలగువారు. వారిలోఁ బృషధ్రుని,దండ్రి గోపాలనమునకు నియమించె. అతఁడందుల కంగీకరించి వీరాసన మనువ్రత మవలంబించి రాత్రిసమయమునఁ గత్తిచేఁబూని సంచరించుచుఁ బులుల బారిఁబడకుండ గోవులనురక్షించుచుండెను. ఒకనాఁటిరాత్రి మేఘము లాకసమును గ్రమ్మి వర్షించుచుండ నొకపులివచ్చిగోశాలను బ్రవేశించెను. దానిఁజూచి శయనించియున్నగోవులు భయపడి లేచి యాశాలయందిట్టటు పర్విడఁజొచ్చెను. అయినను బలిష్ఠమగు శార్దూలమొకగోవును బట్టుకొన నదియఱవనారంభించెను. పృషధ్రుఁడది విని దానిసమీపమునకుఁబోయెను. ఆకసమునమబ్బుక్రమ్మిచుక్కలైనఁ గనఁబడకపోవుటచే నాసమయము గాఢాంధకారముచే నావృతమై యుండెను. అందుచే నతఁడా చీకటిలోఁ బోల్పలేక భ్రాంతిచెంది ఖడ్గముతోఁ బులితలకు మాఱుగా

నొక కపిలగోవు శిరమునుఖండించెను. ఆక త్తికొనసమీపమున నున్న పులి చెవికిఁ దగిలినందున నది తెగిపడెను. దానికిఁ బులి భయము చెంది ర క్తముచే మార్గమును దడుపుచుగోశాలనుండి నిష్క్రమించెను. శత్రుహంత యగుపృషధ్రుఁడు పులి చచ్చెనని నిశ్చయించుకొనెను. తెల్లవాఱినతోడనే పులికి బదులుగా గోవును జంపినట్లు తెలిసికొని మిగుల దుఃఖించెను. వసిష్ఠుఁ డది యెఱిఁగి ప్రమాదవశమున నేరముచేసెననియోజింపక పృషధ్రునిఁ జూచి "ఓదుష్టా! నీవు క్షత్రియుఁడవై యుండఁదగదు. ఈపాప కార్యముచే శూద్రుఁడవగు"మనిశపించె. పృషధ్రుఁడాగురుశాప మును గృతాంజలియై స్వీకరించి యింద్రియముల జయించి భగ వంతు నుపాసించెను. అనంతర మతఁడు కొన్ని దినములంగోనే సర్వమున కంతరాత్మయు, దోషరహితుఁడు నగుపర బ్రహ్మమందు ఫలాపేక్షలేని భక్తినిజూపి సర్వభూతములందును దయగలిగి సుఖదుఃఖములను సమముగాఁ జూచుకొనుచు నిహలోక సుఖ ములందుఁ గోర్కెని విడిచి, స్వర్గాదిసుఖములనుకూడ నాదరిం పక రాగద్వేషాదులనుమనస్సునుండిపాఱఁదోలి యింద్రియముల జయించి దేహమున కనుబంధులగు దారసుతాదులను వదలిదైవ యత్నమువలన లభించునాహారముచే దేహమును బోషించు కొనుచుఁ బరమాత్మయందు మనస్సునుంచినిరతిశయానందరూప మగుజ్ఞానముచేతనే తనివిచెందుచు, నిశ్చలుఁడై వెఱ్ఱివానివలె వర్తించుచు, గ్రుడ్డివానివలె వస్తువులనుజూడక, చెవిటివానివలెగిది శబ్దమునువినక, భూమిపైఁజరించెను. ప్రారబ్ధకర్మమున్నంతకాల మిట్లతఁడు చరించుచు నవసానమున నొకప్పుడడవికిఁబోయి దావాగ్నిని జూచి ప్రవేశించి దహింపఁబడి పరబ్రహ్మమును

బొందెను. కడపటివాఁ డగుకవి విషయసుఖములం దభిలాష విడిచి రాజ్యమును బంధువులను గృహమునుద్యజించి స్వభావసిద్ధమగు కాంతులతోఁ బొల్చు పరమపురుషునిఁ జిత్తమున నిడికొని చిన్నతనములోనే పరమపదమును జెందెను. కరూశకునకు ముగ్గురు కొమరు లుండిరి. వా రుత్తరదేశములకుఁ బ్రభువులై బ్రాహ్మణులఁ బ్రేమించుచు ధర్మయుక్తులై ప్రజాపాలన మొనరించిరి. ధృష్టునికిఁ గొందఱు పుత్త్రులుదయించిరి. కాని వారు క్షత్త్రధర్మములవిడిచి భగవంతు నుపాసించి తదనుగ్రహమున బ్రాహ్మణులైరి. నృగునకు సుమతియను పుత్త్రుఁడు పుట్టె. అతనికి భూతజ్యోతి యుదయించె. అతనికివసువును, వానికిఁ బ్రతీకుఁడును, నతని కోఘవంతుఁ డనుకొమరుండును, ఓఘవతి యను కూఁతురును బుట్టిరి. ఆకన్యను సుదర్శనుఁడు వివాహమాడెను. నరిష్యంతుఁడను మనుసుతునకుఁ జిత్రసేనుఁడుదయించెను. వానికిఋక్షుఁడును, వానికి మీఢ్వుఁఢుఁను, వానికిఁ గూర్చుఁడును, వాని కింద్రసేనుఁడును జన్మించిరి. ఆయింద్రసేనునకు వీతిహోత్రుఁడు సంభవించె. అతనికి సత్యశ్రవుఁడుగలిగె. అతనికురుశ్రవుఁ డుద్భవించె. అతనికి దేవత్తుఁ డుద్భవించె. అతనికి భగవంతుఁడగు నగ్నిదేవుఁడే కుమారుఁడై యుదయించె. వాఁడె కానీనుఁ డను ఋషి యయ్యె. వానికి జాతూకర్ణ్యుఁ డనియు నామాంతరము గలదు. అతనివలననే యాగ్నివేశ్యగోత్ర మని వాడఁబడు బ్రాహ్మణకులము ప్రభవించె. నరిష్యంతాదుల వంశచరిత్రములను జెప్పితిని. ఇఁక దిష్టునివంశమును వినుము. దిష్టునకు నాభాగుఁ డనుకుమారుఁడు కలఁడు. అతఁడు వైశ్యకులమునకు విహితములగు గోరక్షణాదివ్యాపారములను జేయుచు వైశ్యుఁ

డయ్యెను. ఆనాభాగునకు హలంధనుఁడును, వానికి వత్స ప్రీతియు, వత్సప్రీతికిఁ బ్రాంశువు, ప్రాంశువునకుఁ బ్రమితియు, బ్రమితికి ఖమిత్త్రుఁడు, ఖమిత్త్రునకు జక్షుషుఁడు, చక్షుషునకు వివింశతియు నుద్భవించిరి. ఆవివింశతికి రంభుఁడు, వానికి ధార్మికుఁ డయిన ఖనినేత్త్రుఁడు, వానికిఁ గరంధముఁడును, కరంధమునకు అవీక్షిత్తును, నతనికి మరుత్తుఁడును జన్మించిరి. ఆ మరుత్తుఁడు భూచక్రమునంతను బాలించి చక్రవర్తియనిపించుకొనియె. అతఁడు యోగీశ్వరుఁడును, అంగిరసునిసుతుఁడును నగుసంవర్తు నాచార్యునిఁగా వరించి పెక్కుయజ్ఞములొనర్చెను. మరుత్తునివలె యజ్ఞముచేసినవాఁడు లోకమున వేఱొకఁడు లేఁడు. అతనియజ్ఞమున నుపకరణములన్నియు సువర్ణమయములె. అతఁడు సోమరసముచే నింద్రుని, దక్షిణలచే బ్రాహ్మణులను మిక్కిలి సంతసింపఁజేసెను. ఆ యజ్ఞమున దేవతలు భోజనపాత్రములం దన్నాను లవడ్డించిరి. విశ్వేదేవు లను దేవగణములే సభాసదులైరి. ఆ యజ్ఞవైభవము నేమని చెప్పను! ఆమరుత్తునకు దముఁడు, దమునకు రాజవర్ధనుఁడు, వానికి సుధృతి, సుధృతికి నరుండును, నరునకుఁ గేవలుఁడును, గేవలునకు బిందుమంతుఁడు, వానికి వేగవంతుడును, వేగవంతునకు బిందువును, బిందువునకుఁ దృణబిందువును, నుద్భవించిరి. ఆ తృణబిందువు మహారాజులలో వాసికెక్కెను. అతఁడు భజనీయములగు గుణములుగలవాఁడు. అతని గుణములకు సంతసించి యలంబుస యనునొక యచ్చరమిన్న యతని స్వయముగా వరించెను. వాని కామెయందుఁ గొండఱు పుత్త్రులును, ఇలబిలయనుకన్యయుఁ గలిగిరి. ఆ యిలబిలను విశ్రవుఁడు పెండ్లాడి యొకకుమారునిఁగాంచెను. అతఁడే కుబేరుఁ

డనునామముతో నుత్తరదిక్పాలకుఁడయ్యె. మఱియు నతఁడు యోగీశ్వరుఁడును, దండ్రియగువిశ్రవసువలన నంతర్ధానరూప మగువిద్యనుబొందె. ఆతృణబిందుపుత్రులు, విశాలుఁడు, శూన్యబంధుఁడు, ధూమ్రకేతువు నాఁబడు పేరులు గలవారు. అందువిశాలుఁడు వంశకర్తయై వైశాలీపురమును నిర్మించెను. ఆవిశాలునకు హేమచంద్రుఁడును, హేమచంద్రునకు ధూమ్రాక్షుఁడును, ధూమ్రాక్షునకు సహదేవుఁడును, సహదేవునకుఁ గృశాశ్వుఁడును, గృశాశ్వునకు సోమదత్తుఁడను నుద్భవించిరి. ఆ సోమదత్తుఁడు పెక్కశ్వమేధములచేఁ బరమపురుషు నారాధించి ముక్తిఁగాంచెను. ఆతనికి సుమతియు, జనమేజయుఁడును సంభవించిరి. కూటస్థుఁ డగుతృణబిందువుని కీర్తిని వర్ధించు నీ రాజులు వైశాలురని ఖ్యాతిఁగాంచిరి.ఇది రెండవయధ్యాయము.

---

{ చ్యవనుఁడు సుకన్యను బరిగ్రహించుట.
చ్యవనుఁ డశ్విదేవతల సోమపీథులం జేయుట. }

మనుపుత్రుఁ డగుశర్యాతికి వేదార్థజ్ఞాన మెక్కుడుగాఁ గలదు; శ్రౌతమందు మిక్కిలి నేర్పరి. కావుననే యంగిరసుఁ డొనరించు సత్రయాగమున రెండవదినమునఁ జేయవలసిన క్రియావిధానమును జక్కఁగా నుపదేశింపఁగల్గెను. కమలదళములవలె విశాలము లగునేత్రములుగల సుకన్యయను కన్యక యొకతె యతనికిఁ గలదు. ఒకప్పు డారాజు తన కుమారికతోఁ గూడ వనమున కేఁగి యచ్చటికి సమీపమున నున్న చ్యవనాశ్రమమునకుఁ బోయెను. అప్పుడు సుకన్య చెలికత్తెలతోఁ గూడ నాయాశ్రమవృక్షములను జూచుచుఁ జరించుచుండఁగా నొకచో

నొకపుట్ట గానవచ్చెను. దానికన్నములలో సూర్యుని మించిన కాంతి గన్పట్టుచుండెను. ఆ బాల యవివేకవంతురాలై దైవ వశమున ముండ్లతో నా కన్నములను బొడిచెను. తోడనే వానినుండి రక్తము ప్రవహింపఁజొచ్చెను. అంత శర్యాతిసైని కుల కండఱకును మలమూత్ర నిరోధము కలిగెను. రాజాయుప ద్రవమును జూచి యచ్చెరువడి వారలకిట్లనియె. "ఓ సైనికు లారా! ఇది మహానుభావుఁడగు చ్యవనుని యాశ్రమము. మీలో నెవ్వరయిన నతనికపకారము చేయుచున్నారా? అతని యాశ్రమమున కేమయిన హానిఁగల్గించియున్నారా? ఏదో యిట్టి దుష్కార్యము మీవలన జరిగియుండవలెను. లేనిచో నట్టి యుపద్రవము సంభవింప"దని యడుగుచుండెను. అంత సుకన్యక భయపడి తండ్రిని సమీపించి యిట్లనియె. "ఓ జనకా! నేనొక యమంగళకార్య మాచరించితిని. ఒక పుట్ట కన్నములలోనుండి దివ్యతేజస్సుగానరాఁగా నదేమోయనుకొని ముండ్లతోఁ బొడిచి తిని. అదేమిచిత్రమోకాని యందుండి రక్తము ప్రవహింపఁ జొచ్చెను. ఆలోచింప నా కాంతివిశేషములు పుట్టలోనుండి తపస్సుచేయుచున్న చ్యవనుని దేహమును సంబంధించినవేమో" యని పలుకవిని శర్యాతి మిగుల భీతుఁడై యచ్చటికేఁగి పుట్టలో నుండి తప మొనర్చుచున్న చ్యవనునికి మ్రొక్కి స్తోత్రముచేసి ప్రసన్నునిఁగావించుకొనెను. అనంతరము శర్యాతి చ్యవనునకు తన కూఁతును వరింపఁ దలంపున్నట్లు గ్రహించి యామె నతని కర్పించి యతనియనుజ్ఞవడసి యతికష్టముచేఁ బుత్త్రికావియోగ మును సైఁచి యనుచరులతోఁ దనపురమున కేఁగెను. ఆచ్యవ నుఁడు ముక్కోపి,ముసలివాఁడు.అయినను సుకన్యక యతనిఁబతిగా

వరించి జాగరూకతతో నతనితలంపుఁ దెలిసికొని ప్రవర్తించుచుఁ దనమంచినడవడిచే నతని సంతసింపఁజేసెను. ఇట్లుండ నొకనాఁ డశ్వీదేవతలు తన యాశ్రమమునకు రాఁగాఁ జ్యవనుఁడు వారినాదరించి పూజించి సంతసింపఁజేసి 'ఓమహానుభావులారా! నన్ననుగ్రహించి స్త్రీలకు మనోహరమగు యౌవనమును సౌందర్యమును నా కొసంగుఁడు. మీరట్లు సేసినచో యాగములందు సోమపానరహితు లగుమీకు సోమపానమును గల్పించెదను" అని పలికెను. వైద్యశ్రేష్ఠు లగునా యశ్వికుమారు లతని వచనములు విని సంతసించి యంగీకరించి "సిద్ధరసముచేఁ బూరిత మగునీ హ్రదమున మునుఁగుము. నీకోర్కి దీరు" నని చెప్పి ముసలివాఁడును, ముడుతలతోను, బైకిఁగానవచ్చు నాడులచేతను నెఱసిన వెండ్రుకలచేతను వికృత మయిన దేహము గలవాఁడును నగుచ్యవనుని వెంటఁబెట్టుకొని యా హ్రదములోఁ బ్రవేశించిరి. అనంతరము గొంత సేపటి కందుండి మనోహరమగునాకృతులతోను, బద్మమాలికలతోను బ్రకాశించుచుఁ, గుండలాద్యలంకారములను దాల్చి సుందరవస్త్రములనుగట్టి పరస్పరమును వేఱుసేయఁ దరముకాని రూపములుగల ముప్వురుపురుషులు వెడలి వచ్చిరి. సూర్యునివంటి తేజస్సు గల యా ముప్వురలోను దనభర్త యెవఁడో తెలిసికోలేక సుకన్యక తనభర్తను దనకొసంగవలెనని యశ్వీదేవతల శరణుఁజొచ్చెను. వారామె పాతివ్రత్యమునకు సంతసించి యామెకుఁ బతినిజూపి మునిని వీడ్కొని దివమునకుఁ బోయిరి. కొంతకాలము చన్న తర్వాత శర్యాతి యాగము చేయుతలంపుతోఁ జ్యవనాశ్రమమునకుఁ బోయి తనకుమారికను దత్పార్శ్వమున సూర్యునివలెఁ

ప్రకాశించుచున్న పురుషునిఁ గాంచి తన యల్లు నానవాలు పట్ట లేక తనకూఁతు రేదో దుష్కార్యము చేసినదని విచారించుచుఁ దన పాదములకు నమస్కరించిన దానికి దీవన లొసఁగక కోప ముతో నిట్లనియె, "ఓ పుత్రీ! నీవిట్టిపని యేల చేసితివి? ఆ చ్యవన ముని లోకమున కెల్ల వందనీయుఁడు. అతని నీవు వంచించితివా? ఓదుర్మార్గురాలా! అతఁడు ముసలివాఁడనియుఁ గురూపియనియుఁ దలంచి యతనిని విడిచి సుందరుఁడగు వేఱొకని భర్తనుగాఁ జే కొంటివా? సత్కులమందుఁ బుట్టిన నీమనస్సిట్లు విపరీతముగాఁ బరిణ మించుచున్న దేమి? నీవు చేసినపని కులమున కతినింద దెచ్చు చున్నది. నీవు సిగ్గుమాలి యొక జారుని వరించితి వన్నదుష్కీర్తి నీతండ్రికులమును, నీమగనికులమును మలినముగావించి యధో గతిపాలు చేయుచున్నది" అని పలుకు చున్న తండ్రినిగాంచి సుకన్య మందహాసము సేయుచు నచ్చెరువుతో నిట్లనియె. 'ఓజన కా! ఇతఁడు నీజామాత; భృగుకుమారుఁ డయిన చ్యవనముని. ఇతని కశ్విదేవతల యనుగ్రహమున నిట్టివయస్సు లభించినది. ఇతఁడన్యుఁడు కాఁ"డని యావృత్తాంతమునంతను దెల్పఁగా శర్యాతి యాశ్చర్యము చెంది మిక్కిలి ప్రీతుఁడై కుమారిని కౌఁగి లించుకొనెను. అనంతరము చ్యవనుఁడు శర్యాతిచే సోమయాగ మును జేయించెను. ఆయాగమందు చ్యవనుఁడు తన తపోబలముచే సోమపానరహితులయినను నశ్విదేవతల కదిగల్పించెను. తమ్ము విడిచి సోమము చే నాశ్వినులను బూజించుచున్న శర్యాతినిగాంచి యింద్రుఁడు కోపించి యతనిఁ జంప వజ్రాయుధ మెత్తెను. కాని చ్యవ నుఁడు వజ్రహస్తము గునింద్రుని చేతిని స్తంభింపఁ జేసెను. ఓ రాజేం ద్రా! అశ్వినులు వైద్యులనియు వారికి సోమపానము లేదనియు

మొదట నిరాకరించిరి కానియది మొదలుయాజకులందఱు నాశ్వినులకు సోమగ్రహమునొసంగనంగీకరించిరి. ఇది సుకన్యక చరిత్రము.
శర్యాతి కాకన్యక కాక యుత్తానబర్హి యనియు, నానర్తుఁడనియు, భూరిషేణుఁడనియు ముగ్గురు కొడుకులు గలరు. అందానర్తునకు రైవతుఁడు జనించె. అతఁడు సముద్రమధ్యమునఁ గుశస్థలీనగరమును నిర్మించి యందు నివసించి యానర్తదేశములను బరిపాలించె. ఆ కుశస్థలియే పిమ్మట ద్వారకాపురమని పేరుగాంచెను. అతనికి నూర్వురు కొడుకులు పుట్టిరి. వారిలోఁ గకుద్మియను వాఁడు పెద్దవాఁడు. వీరుగాక రైవతునకు రేవతి యనునొక కూతుఁను గలిగెను. ఆ రాజా కన్యకను వెంటఁబెట్టుకొని యామెకుఁ దగిన వరుఁడెవఁడో తెలిసికొనన నిరాటంకముగా బ్రహ్మలోకమున కేఁగెను. ఇతఁడచ్చటికిఁ బోవునప్పటికి గంధర్వులు గానము చేయుచుండిరి. అందుచేఁ దన కవకాశము గలుగమి క్షణకాలము వేచియుండెను. గానసభ ముగిసెను. రైవతుఁడు బ్రహ్మకు నమస్కరించి "యీమెకుఁదగినభర్తయెవఁ"డని యడిగెను. అతనిపలుకులు విని నవ్వి బ్రహ్మ రైవతున కిట్లనియె. "ఓరాజా! ఇక్కడనొక క్షణకాలము గతించిన భూలోకమునఁ బెద్దకాలము వ్యతిక్రమించియుండును. నీవిచట క్షణకాలమున్నాఁడవు. ఈ కాలములోనే మానవులకు నాలుగుయుగములు నిరువదియేడు పర్యాయములు గడచెను. నీవు వచ్చునప్పుడు నీకూఁతున కెవని భర్తగా నిశ్చయించుకొని వచ్చితివో వాఁడిప్పుడు లేఁడు. నీ వెఱిగిన వారిప్పుడు భూలోకమున లేరు. వారందఱును గాలముచే సంహరింపఁబడిరి. వారుగాని, వారిపౌత్రులుగాని వారి గోత్రములుగాని యిప్పుడు వినఁబడవు. కావున నీ విప్పుడు భూలోకమున కరుగుము. నారా

యంశాంశసంభూతుఁ డగుబలరాముఁ డనునొక మహాబలుఁ డున్నాఁడు. అతని కీకన్యారత్నము నిచ్చి పెండ్లిచేయుము. అతని సామాన్యునిఁగా నెంచకుము. అతఁడు భూభారమును హరింపఁ గోరి నిజాంశముచే భూమిలో నవతరించిన నారాయణుఁడే. పుణ్యప్రద మగుకీర్తి గలవాఁడు" అని యిట్లు పలుక విని సంతసించి బ్రహ్మకు నమస్కరించి దక్కులందుండి భూపరిపాలన మొనర్చుచున్న కకుద్మి మొదలగువారిచే. చేవిడువఁబడియున్న యా కుశస్థలిని జేరెను. అప్పు డాపురము యాదవులచేఁ బరిపాలింపఁ బడుచుండెను. రైవతుఁడు దానినిజొచ్చి సుందరాంగియగు తన కూఁతును బలరామునకిచ్చి పెండ్లిచేసి తప మొనరింప బదరికావనమున కరిగెను. ఇది మూఁడవయధ్యాయము.

---

## అంబరీషోపాఖ్యానము.

ఓ రాజేంద్రా! ఇఁక మనుపుత్త్రుఁ డగునభగునిచరిత్రమును జెప్పెదను వినుము. ఆ నభగునకుఁ బెక్కురు కొమరులు గలరు. అందులో నాభాగుఁడనువాఁడు కనిష్ఠుఁడు. అతఁడు చిరకాలము గురుకులమందుండి విద్యాభ్యాసముచేసి జ్ఞానవంతుఁ డయ్యెను. అతని సోదరులు నాభాగుఁడు బ్రహ్మచారి యనియు జ్ఞాని కావున నైహికసుఖములం దాశ లేనివాఁడనియు నిశ్చయించి పిత్రార్జితమగు దానిలోనతనిభాగము వేఱుపఱుపక తమలోఁ దాము పంచుకొనిరి. అనంతర మతఁడువచ్చి తనభాగము తనకిండని సోదరులనడిగెను. పంచుకొనునప్పుడు నిన్ను మఱచితిమి. ఇప్పుడు పంచియిచ్చుటకు మాకవకాశము లేదు. తండ్రియొద్దకుఁ బోపుదము. అతఁడు భాగమీవలసినదని చెప్పినని చ్చెదము" అనిపల్క

నతఁ డందుల కంగీకరించి జనకుపాలికరిగి సోదరులు తనకుఁ బాలీ యకుండఁ బంచికొనిరనియు, నది యన్యాయము గావున దనకుఁ గూడ నందులో భాగ మిప్పింపుమనియుఁ గోరెను. జనకుఁ డది విని కుమారుంజూచి యిట్లనియె. "పుత్రా! నీసోదరులు వంచించి పుచ్చుకొనిరి. వంచిత మగుధనమును నీవాశింపకుము. నాకు జీవనోపాధి యెట్లందువేని చెప్పెదను వినుము. ఇదిగో, ఈసమీప ముననే మేధావంతులగు నాంగిరసులు సత్రయాగమును జేయు చున్నారు. అది పండ్రెండుదినముల పరిమితి గలది. ఆంగిరసులు బుద్ధిమంతులయ్యు నాఱవదినమునఁ జేయవలసిన క్రియా కలాపమునకుఁగల క్రమమును దెలియఁజాలక తడఁబడుచుం దురు. నాఁడు రెండుసూక్తములు చెప్పవలయును. ఆంగిరసుల కా సూక్తములు రెండును రావు. అవివచ్చినఁగాని క్రియా విధానము తెలియదు. నీవిపు డచ్చటికిఁబోయి సమయమువేచి "మహాత్ములకు నేను జెప్పనా" యని సందేహింపక యా సూక్త ములను నీవు చెప్పుము. కర్మసమాప్తియైనతోడనే వారు స్వర్గ మునకుఁ బోవుదురు. కాన నప్పుడు నీయుపకారమునకుఁ బ్రత్యు పకారముగా మిగిలిన యాగధనమును నీకొసంగుదురు. అదినీజీవ నోపాధికి జాలును. నీవిప్పు డచ్చటి కరుగుము" అని తండ్రి చెప్ప విని సంతసించి నాభాగుఁ డట్లొనరించెను. సత్రయాగమున మిగి లిన ద్రవ్యమంతయు నాభాగునకిచ్చి యాంగిరసులు స్వర్గమున కరిగిరి. పిమ్మట నాభాగుఁడు యాగావశిష్టధనమును స్వీకరించు చుండ నల్లని యాకారముగల యొకపురుషుఁ డచ్చటికివచ్చి యడలించి యా ద్రవ్యమంతయుఁ దనకుఁ జెందవలెనని చెప్పి యడ్డ గించెను. మును లా ద్రవ్యమును దనకిచ్చెనని నాభాగుఁడనియె.

దాని కాపురుషుఁడు సమ్మతింపక "ఓయీ! దీనికి వివాద మేల? నీజనకున కీవివాదాంశమును దెలుపుము. అతఁడు చెప్పి నట్లు మన మిరువుర మొప్పుకొందము" అని పల్కెను. నాభాగుఁ డందుల కంగీకరించి తండ్రిని సమీపించి యావివాదమును దెలి పెను. అతఁడు కొంచెము యోజించి "కుమారా! ఆ వచ్చిన వాఁడు రుద్రుఁడు. ఒకప్పుడు దక్షాధ్వరమున ఋషులంద ఱేకీ భవించి 'యాగశిష్ట మగుద్రవ్యమంతయు శంకరుని భాగము; అతనికిఁ జెందవలయు'నని నిర్ణయించిరి. యజ్ఞసంబంధి యగునా వస్తుజాతమంతయు నతనికే చెందవలె" నని తీర్పుచేసెను. నాభా గుఁడదివిని యావస్తుజాతమును దాను గ్రహింపఁ దగినయుపా యము నరయఁజాలక రుద్రుని సమీపించి నమస్కరించి యి ట్లనియె 'ఓశంకరా! మిగిలిన యజ్ఞధనమంతయు నీకే చెందవలయు నని మాజనకుఁడు చెప్పియున్నాఁడు. అదంతయునీదే. అయినను నీవు నన్ననుగ్రహించి యా ద్రవ్యము నొసంగ వేఁడెదను. నీకు వందన మాచరించెదను," అని పల్కుచు నతని పాదముల పయిఁబడెను. రుద్రుఁ డతనిఁ గరుణించి యి ట్లనియె. "ఓ నాభాగా! నీతండ్రి ధర్మముగాఁ దీర్చెను. నీవును సత్యమును బలికి తివి. సంతసించితిని. మంత్రద్రష్ట వగునీకు బ్రహ్మవిషయక మగు జ్ఞాన ముపదేశించెదను. గొప్ప యాపద సంభవించినను నీవెన్న డప్పుడును గల్లలాడకుము; సత్యమునే పలుకుము. దానివలన నేను సంతసించెదను. నీవు నాకుఁ బ్రియుఁడ వగుదువు. యజ్ఞపరి శేషితమగుద్రవ్యమును నీకిచ్చితిని. పుచ్చుకొనుము" అనిపల్కి సత్యవత్సలుఁ డయినశివుం డచ్చటనే యంతర్ధానము చెందెను. ఓరాజా! ఎవఁడీచరిత్రము నుదయసాయంకాలములందు నిశ్చల

మనస్సుతో స్మరించునో వాఁడు జ్ఞానవంతుఁ డగును ; మంత్ర విదుఁ డగును; జీవాత్మ పరమాత్మల తత్త్వమును దెలిసినవాఁ డగును. ఆనాభాగున కంబరీషుఁ డుదయించెను. అతఁడు పుణ్యాత్ముఁడు. మహాభక్తుఁడు. అమోఘమగు బ్రాహ్మణశాపమయి నను నతని స్పృశింపలేకపోయెను" అని పలికిన శుకునింజూచి రాజు "ఓమునీంద్రా! రాజర్షియు బుద్ధిమంతుఁడు నగునంబరీషుని చరిత్రమువిన మనస్సు వేడుకపడుచున్నది. త్రిప్పఁ దరముకాని బ్రహ్మశాపముగూడ నతని బాధింపఁజాలకపోయె ననిచెప్పితివి. అదియద్భుతముగానున్నది. చెప్పు"మనివేఁడగాశుకమునీంద్రుఁ డతని కిట్లనియె. "పుణ్యాత్ముఁ డగునంబరీషునకు సప్తద్వీపపరిమిత మగు భూమండలముగలదు. నాశములేని సంపదలుగలవు. ఇతరులకు లభింపనియుత్తమభోగ్యవస్తువులు కలవు. అయిననతఁడవి యన్నియుఁ గలలోఁ గానవచ్చిన పదార్థములవలె నశ్వరముల నియు వాని నమ్మి చరించినచోఁ బురుషుఁడు నరకము నొందు ననియు నిశ్చయించెను. అతఁ డిట్లు కేవలము విరక్తుఁడగుటయే కాక భగవంతుఁ డగువాసుదేవునియందును, సాధువులగుతద్భక్తులందును మిక్కిలి భక్తినిజూపుచు, నీ విశ్వమంతయుఁ జిల్లిగవ్వవలె గ్రహింపఁదగినదికాదని తలంచెను. ఎల్లప్పు డతని చిత్తము కృష్ణుని పాదపద్మములనే ధ్యానించుచుండును. అతని వాక్కు వైకుంఠుని గుణగణములనే వర్ణించుచుండును. అతని చేతులు శ్రీహరిమందిరముల శుభ్రపఱచుచునే యుండును. అతని చెవు లెప్పుడును హరికథలనే వినుచుండును. అతని నేత్రములు సతతమా ముకుందుని విగ్రహములను, నాలయములను మాత్రమే దర్శించుచుండు. అతని త్వగింద్రియము సర్వదా హరి

భక్తుల శరీరములను మాత్రమే స్పృశించుచుండును. అతని నాసిక భగవంతుని పాదపద్మపరిమళముగల తులసీదళములను మాత్రమే మూర్కొనుచుండును. అతని జిహ్వా పరమేశ్వరునికి నివేదితమగుపదార్థములమాత్రమే రుచిచూచుచుండును. అతని పాదము లెప్పుడు పుణ్యక్షేత్రమార్గములందే చరించుచుండు. అతని శిరస్సు సంతతము హరికి నమస్కరించుచు నిర్మాల్యమును స్వీకరించుచు నేయుండును. అతఁడు సర్వదా భగవద్భక్తులతోఁ గలసి యిట్లవయవములను, నింద్రియములను, గాలమును సద్వి నియోగము చేయుచుండును, ఇట్లమ్మహారాజు మనోవాక్కాయ ములచే నొనర్చు కర్మముల నన్నింటిని యజ్ఞనిర్వాహకుఁ డయినవిష్ణువునకు సమర్పించుచు భగవద్భక్తు లగువసిష్ఠాదిమహా మునుల యాలోచనము ననుసరించి భూమినిబాలించుచుండెను. అతఁడు వసిష్ఠుఁడు, అసితుఁడు, గౌతముఁడు మొదలగు మునుల సాయమునుబడసి తనసంపదలచే మహాదక్షిణలు గలయశ్వమేధ యాగములొనర్చి వాని చేహరినారాధించెను. అతఁడునదీప్రవాహ మున కభిముఖముగానుండి యాగము చేయుతలంపుతో నామరు ప్రదేశమును విడిచి సరస్వతీనది కేఁగెను. అతని యశ్వమేధము లందుసభ్యులును, ఋత్విజులును, జూడవచ్చినజనులును నలంకా రాదులచే దేవతులతోఁదుల్యరూపులయి కానవచ్చిరఁట! ఇంద్రాది దేవతలును శుభ్రవస్త్రములను, మనోహరము లగువిభూషణ ములను దాల్చి ప్రత్యక్షముగాఁ గనఁబడిరఁట! ఆయంబరీషుఁడు తన జనులచే హరికథలను గానముచేయించుచుండును. ఆ కథ లను భక్తితో వినునట్లు చేయుచుండును. అతఁడతని జనులకు స్వర్గసుఖమును మించిన సుఖమును భూలోకమందే కలిగించు

చుండుటచే స్వర్గమపేక్షించువాఁ డొక్కఁడును లేఁడు. అతని జనులే స్వర్గమును గోరనప్పు డతనిమాట చెప్పనేల! ఇట్లారాజు తన జనులను గేవలము వస్త్రాలంకారాదులచేతనే దేవసములుగాఁ జేయుటకాక సుఖమందుఁగూడఁ దత్సములఁగాఁ జేసెను. మఱియు సమస్తము బ్రహ్మాత్మకమని తలంచుచు నాత్మానంద మనుభవించుచు సర్వదా ముకుందునిఁ దమతమ హృదయముల దర్శించు చున్నయా జనులను యోగీశ్వరులకు దుర్లభము లగునణిమాదిసిద్ధులే సంతసింపఁజేయలేవు. ఇఁక స్వర్గాదుల చెప్పనేల? ఆ మహారాజు స్వకులమునకుఁ దగినవియు సంగరహితములు నగుకర్మముల నాచరించుచు భక్తియోగముచే హరిని సంతసింపఁజేయుచుఁ గ్రమముగా సకలసంగములను వదలెను. అతఁడు సుందరము లగుగృహములను, భార్యలను, కుమారులను, బంధువులను, నుత్తమగజములును, రథములను, గుఱ్ఱములను నమితము లగువస్త్రములను, వెలలేని యలంకారములను, నాయుధములను హేయములఁగాను, నశ్వరములఁగాను జూచుచుండువాఁడు. అతని నిశ్చలభక్తియోగమునకు హరి ప్రీతుఁడై విపక్షులకు భయంకరమై, భీతులను రక్షింపఁజాలిన తన చక్రము నతని కొసంగెను. ఆ యంబరీషుఁడు భగవంతు నారాధింపఁదలంచితనకన్నివిధముల చేతనుసాటివచ్చు భార్యతోఁ గూడియొకసంవత్సరముతో ముగిసెడుద్వాదశీ వ్రతము చేసెను. ఆవ్రతాంతమునఁ గార్తికమాసమందు మూఁడుదినము లుపవాసముచేసి నాల్గవదినమగు ద్వాదశినాఁడు యమునలోఁ దాన మాడిమధువనమును బ్రవేశించిగంధపుష్పధూపాదులగు సమస్త పూజాద్రవ్యములను సమకూర్చి హరిని బ్రతిష్ఠించి సహస్ర

ఘటములచే నభిషేకముఁగావించి శ్రేష్ఠములగు నాభరణముల చేతను, గంధములచేతను, బూలదండలచేతను, బుష్పముల చేతను భక్తితోఁ బూజించెను. కేవలము విష్ణువునుదనమనమున నిల్పిమహాత్ములగు బ్రాహ్మణులను, సిద్ధులనుగూడ నొప్పిదముగఁ బూజించె. బంగారుకొమ్ములును, వెండిడెక్కలును, సుంద రము లగువస్త్రములనుదాల్చి చాలినంత పాల నిచ్చుచు మంచి స్వభావముగల్గి శృంగాద్యవయవసౌష్ఠవముగల్గి క్రొత్తగా నీని వత్ససహితములై యున్న గోవుల నఱువదికోట్లను దోహనపాత్ర ములతోఁగూడ బ్రాహ్మణులకు దానముచేసి బ్రాహ్మణోత్తము లకు ముందుగా షడ్రసోపేతమగు భోజనమిడి దక్షిణలనిచ్చి వారియనుజ్ఞ వడసి పారణచేయుసిద్ధుఁడై యుండెను. అంత దైవవశ మున భగవంతుఁ డగుదుర్వాసుఁ డచ్చటి కేతెంచెను. అదివిని యమ్మహారాజతని కెదురుగఁ బోయి కొనివచ్చి యర్ఘ్యాదులిచ్చి యతిథిసత్కారము చేసి యతని పాదములపైఁబడి నమస్కరించి తనయింట భుజింపవలయునని వేఁడెను. దుర్వాసుఁ డతనిప్రార్థన మంగీకరించి మాధ్యాహ్నికకృత్యములు నెఱవేర్చికొని వచ్చెద నని చెప్పి యమునానదికిఁ బోయి పరబ్రహ్మమును ధ్యానించుచు నందు స్నానముచేసికొనెను. ఆముని త్వరగా రాకపోవుటచేతను, ద్వాదశి యప్పటి కొక యరగడియమాత్రమే మిగిలియుండుట చేతను, దాను పారణచేసినఁగాని వ్రతము దక్కదనియు, బ్రాహ్మ ణోత్తముఁ డగు నతిథిని నిరాకరించి పారణచేయుట ధర్మము గాదనియుఁ బ్రాహ్మణులతోఁ జెప్పి యేమిచేసిన తనకు మేలుగలు గునో, యెట్లయినఁ దన్నధర్మము చుట్టుకొనదో యోజింపవల యునని కొంచె మాలోచించి, “ఓ బ్రాహ్మణులారా! కేవలము

జలముచే వ్రతమున కంగ మగుపారణను చేసెదను. ఉదక పానముభుజించుటయుఁగాదు;భుజింపకపోవుటయుఁగాదు.కావున వ్రతభంగముగాని యతిథినిరాకరణముగాని కానేర"దనిపలికి యంబరీషుఁడు మనమున హరిని జింతించుచు జలపానముచేసి ముని యాగమనమును నిరీక్షించుచుండెను. అట దుర్వాసుఁడు యమునాతీరమున మాధ్యాహ్నికకృత్యములఁ దీర్చి యచ్చటికి వచ్చి దివ్యజ్ఞానముచే నంబరీషుఁడు చేసినపనిని దెలిసికొని కోపాతిశయముచే నోడలు కంపింప, బొమముడిచే మొగము భీతి గొలుపనాఁకలి యొకమూలబాధింపనొర్వజాలనివాఁడై దోసిలి పట్టి యున్నయంబరీషునిగుఱించి యిట్లనియె. "ఓ జనులారా! ఈరాజు క్రూరస్వభావుఁడు. ఇతఁ డైశ్వర్యముచే నెంత మదించెనో చూచితిరా! విష్ణువునకు భక్తుఁడు కాక యే విష్ణుభక్తుఁడ ననెడియభిమానము వహించినవాఁడు. వీఁ డెట్లు ధర్మవిరుద్ధముగాఁ బ్రవర్తించెనో చూచితిరా! వీఁడు తన యాతిథ్యము కొనుటకు నన్ను రమ్మని పిలిచి తుదకు నా కీయకుండఁగాఁ దాను భుజించెను. ఈ ధర్మవ్యతిక్రమమునకుఁ బ్రతిఫలమును ద్వరలోనే పొందుఁగాక.ఇదిగో నాశక్తిని జూపెదను" అని పలుకుచు నాముని కోపముచేఁ బ్రకాశించుచున్న జడ నొకదానిని బెఱికి దానితో నంబరీషునిఁ జంపఁదలంచి కాలాగ్నితుల్య మగు శక్తిని నిర్మించెను. అంతట నాశక్తి ఖడ్గహస్తయై పాదములచే భూమిని గంపింపఁజేయుచు నంబరీషున కెదురుగాఁబోఁగా నతఁడు చూచి రవంతేనియు భయమందక నిశ్చలుఁడై హరిని స్మరించుచు నిలువఁబడెను. ఆసమయమున భక్తవత్సలుఁ డైనపరమేశ్వరుఁడు తన భక్తుని రక్షింపఁ జక్రము నాజ్ఞాపింప నదివచ్చి

కోపోద్దీపిత మగుసర్పమును దావాగ్నికరణి నా శక్తిని దహించెను. అనంతర మది యమ్మునిక భిముఖముగాఁ బోవుచుండెను. ఆముని యదిచూచి తన ప్రయాసము వ్యర్థమైనందులకు విచారించి భీతుఁడై తనప్రాణములను గాచుకొను తలంపుతోఁ బర్విడఁ జొచ్చెను. ప్రకాశించు మంటలు గలదావాగ్ని సర్పమును వలె నాచక్ర మతని వెంబడించెను. చక్రము తన్నుఁ దఱుము కొని వచ్చుచున్నదని తెలిసికొని ముని మేరుపర్వతగుహాలో దాఁగవలెనని పరువెత్తెను. ఆచక్ర మచ్చటికిఁ బోయెను. అంత దుర్వాసుఁ డటనుండి దిక్కుల కేఁగెను. అంతరిక్షమున కెగిరెను. అతలాదిలోకములకుఁ బోయెను. సముద్రమున డాఁగెను. స్వర్గలోకమునకుఁ బోయెను. వేయేల! తన రక్షకై మూఁడు లోకములందును దిరుగఁజొచ్చెను. అతఁ డెచ్చటికిఁ బోయినను నాచక్రము వదలక దుస్సహమగు కాంతితో బాధించుచునే యుండెను. రక్షణోపాయ మెచ్చటనుదొరకలేదు. అందుచే నతనికి భీతి హెచ్చఁజొచ్చెను. తుద కతఁడు తన్ను రక్షించువానిఁగూర్చి వెదకుచు సత్యలోకమునకుఁ బోయి బ్రహ్మను గాంచి "ఓ చతుర్ముఖా! యీభగవచ్చక్రమునుండి నన్నుఁ గాపాడుము" అని మనవిచేసెను. అదివిని బ్రహ్మ యతని కిట్లనియె. "ఓయీ! ఈ విశ్వము భగవంతునికిఁ గ్రీడాసాధనము. క్రీడావసానమునఁ గ్రీడాసాధన మగువిశ్వము నెట్లు సంహరించునో యట్లె నాస్థానమునుగూడ నశింపఁజేయును. నాస్థానము రెండు పరార్థముల కాలముతరువాత నుండఁజాలదు. ఆపరమేశ్వరుఁడెప్పుడీవిశ్వమునుంబోలెనాస్థానమును నయితమునుబొమముడిచేతనేదహింపఁ జాలినవాఁడు. కాలశరీరకుఁడయిన యమ్మహాత్ముని చక్రమును

మరలించునంత శక్తిమంతుఁడను గాను. ఆ తేజమును మరలింప నేనే యశక్తుఁడనుగాను. శంకరుఁడు, దక్షుఁడు, భృగువు మొదలగు ప్రజాపతులు, ఏకాదశరుద్రులు, దేవేంద్రాదులు గూడనసమర్థులే. మేమందఱ మతని యాజ్ఞను శిరసావహించి లోకయాత్రను నడపుచున్నాము, మే మతని సేవకులము. నిన్ను రక్షింప మాతరముగాదు. ఆపరమేశ్వరునే శరణొందుము" అని బ్రహ్మ నిరాకరింపఁగా దుర్వాసుఁడు విష్ణుచక్ర సంతాపమును సహింపలేక శంకరుని మఱుఁగు సొచ్చుటకై కైలాసమున కరిగెను. శంకరుఁ డతనిఁ గాంచి యిట్లనియె. "వత్సా! మావంటి వారికి సేవింపఁదగు నా పరమేశ్వరునియందును, నతనిచే సృష్టమగు బ్రహ్మాండమందును, లోకేశుల మనెడియహంకారముతో మేము పురువులవలెఁ దిరుగుచున్నాము. అతఁడు సృజింపఁదలఁచినకాలమందు బ్రహ్మాదు లగుజీవు లందఱును బుట్టుచున్నారు. అతఁడు సంహరింపఁ దలఁచినకాలమున నశించు చున్నారు. సనత్కుమారుఁడు, నారదుఁడు, చతుర్ముఖుఁడు, కపిలాచార్యుఁడు, దేవలుఁడు, ధర్ముఁడు, ఆసురి, మరీచి మొదలగువారు, సర్వజ్ఞులగు తక్కిన సిద్ధులు, నేను, మేమందఱ మతని మాయచే నావృతులమై యతని చేష్ట నెఱుఁగఁజాలము. ఆ మహాత్ముఁడు దాల్చు చక్రమిది. దీని సహింప మాతరముగాదు. నీ వాచక్రధరుని మఱుఁగుసొచ్చితివేని సుఖము గల్గును" అని పలుక విని దుర్వాసుఁడు నిరాశ చేసికొని, శ్రీమహాలక్ష్మితోఁగూడ శ్రీహరి సర్వకాలములందును నివసించియుండు వైకుంఠమునకుఁబోయె. చక్రవహ్నిచే దహింపఁబడు నాముని యిట్లరిగి హరినిదర్శించి యతనిపాదములపైఁ బడి భయకంపితుఁ డై యిట్లనియె.

"ఓనారాయణా! నీవుఆశ్రితులను విడువనివాఁడవు; నీమహిమకు హద్దులేదు. నీవు భక్తులకు మిక్కిలి ప్రియుఁడవు. ఓ జగత్కారణా!నీవుకరుణించి యపరాధి నగునన్ను రక్షింపుము. ఓ దేవా! నేను నీమహిమ నెఱుఁగజాలక నీభక్తుఁ డగు నంబరీషున కపరాధము గావించితిని.ఆ నాయపరాధమును మన్నించి నన్ను రక్షింపుము. ఆలోచింప నీ నామోచ్చారణమే నరకప్రాప్తిని గల్గించు పాపముల నైతము తూలించుచుండ నీ నాపాపమును దొలంగించుట నీ కేపాటిపని?'' అని ప్రార్థించు చున్నమునిని గాంచి పరమేశ్వరుఁ డి ట్లనియె. "ఓ మునీంద్రా ! అస్వతంత్రుఁ డగు రాజసేవకునివలె నేను నా భక్తుల కధీనుఁడను. 'రాజసేవకుఁడు కర్మాధీనుఁడు కాన తన ప్రభువునకు వశ్యుఁడగుట సముచితమే. కాని నిఖిలదోషహరుఁడవును, గల్యాణగుణాకరుఁడవును, గర్మాతీతుఁడవునునగునీవుభక్తులకధీనుఁడవగుట హేయకార్యమే!' యని తలంపకుము. ఆశ్రిత వాత్సల్యముచే వివశుఁడనైన నాకు భక్తాధీనత హేయము కాదు. నాభక్తు లన్నివిధములచేతను నా కుపకారము చేయుచు నాహృదయమును దమయధీనము గావించుకొనిరి. లోకములోఁబురుషుఁడుతనచిత్తమునను సరించి నాచిత్తము ననుసరించుట నాకువిధి. నేను నాభక్తులయిష్టము చొప్పున నడువవలయును. భక్తులు నాకుఁ బ్రియులగుటయే కాక నేను నాభక్తులకుఁగూడఁ బ్రియుఁడ నై యుందును. ఓబ్రాహ్మణ శ్రేష్ఠా ! * భక్తప్రియుఁడనగు నాకు నాశరీరము గాని, యెప్పుడును నన్ననుసరించు లక్ష్మిగాని నా భక్తులకంటె

* ఇట లక్ష్మినిభక్తులవలెనెవిష్ణువునకుఁ బ్రీతివిషయురాలైయుండ, లక్ష్మిని నైతము గోరనని చెప్పుట యసంగతమే. అయినను నారాయణుఁడు లక్ష్మి

నాకధికప్రియులుగారు. శరీరలక్ష్మలనైన విడుతునుగాని భక్తులను విడువఁజాలను. ఆలోచింప భార్యలను, గృహములను, బుత్త్రులను, నాప్తులను, ధనమును, నీలోకమును, బరలోకమును, వేయేల! ప్రాణములను గూడవిడిచి నన్ను శరణుసొచ్చుచున్న భక్తజనుల నెట్లు విడువఁ గలుగుదును? భక్తులు తమ చిత్తములను నాయందు నిశ్చలముగా నిలిపి సమస్తమును నాస్వరూపముగానే యెంచుచుఁ బతివ్రతలు తమ భర్తలనుం బోలె నన్నుభక్తిచే వశగతునిఁ గావించుచున్నారు. ఆభక్తులు నాభక్తిచే నిండిన వారై నన్ను సేవించుటవలన గలుగుసాలోక్యము, సామీప్యము, సాయుజ్యము, సారూప్యము అను నాల్గు విధములగు ముక్తిని సైత మపేక్షింపరు. అట్లుండఁ గాలముచే నశించు నైశ్వర్యాదులను గోరరని వేఱ చెప్పవలయునా? వేయేల? సాధువులు నాహృదయము ననుసరింతురు. నేను సాధుహృదయముల ననుసరింతును. సాధువులకు నన్నుమించిన ప్రియవస్తువు లేదు. నాకు భక్తులను మించిన ప్రియవస్తువు లేదు. నేను దేనినైన సహింపఁగలను; కాని భక్తులకుఁ జేసిన యపరాధమును సహింపజాలను. అయినను నీవు శరణుసొచ్చితివి కావున నీకుఁ బ్రాణరక్షణోపాయమును దెలిపెదను. నీ వెవని కపరాధము గావించితివో యాయంబరీషునిఁ జేరి ప్రార్థింపుము. లోకములో సాధువుల బాధింపవలెనన్న తలంపుతోఁ జేసిన క్రూరకృత్యము తుదకుఁదన్నే బాధించును. నీవంబరీషునిఁ జంపఁదలంపుతోఁ జేసిన యపకారము నిన్నే చెందినది. తపస్సువిద్యయు నీ రెండునువినీతుఁ

కంటెను భక్తులు తన కధికప్రియులని చెప్పుట భక్తులకాధిక్యము తేవలెనన్న తలంపుతో నన్నది కాని వాస్తవము కాదని గ్రహింపవలయును.



1527. అంబరీషుని పాదములను దూర్వాసుఁడు పట్టుకొని క్షమాపన మడుగుట.

డయిన బ్రాహ్మణునకుఁ బురుషార్థములను సాధించును. దుర్వి
నీతున కవి రెండును ననర్థదాయకము లగును. నీతపోవిద్య లిట్లు
విపరీతముగాఁ బరిణమించినందులకు విచారించెదను. పో నిమ్ము.
గతమునకు విచారింపక యంబరీషునియొద్దకుఁ బోయి క్షమా
పణము కోరుకొనుము. అతని వలన నీకుఁ దప్పక భద్రముక లు
గును. పోయిరమ్ము" అనెను. ఇది నాల్గవ యధ్యాయము.

---

అంబరీషోపాఖ్యానము.

అని యిట్లు భగవంతుఁ డుపదేశింపఁగా దుర్వాసుఁడు
చక్రాగ్నిచేఁ దప్తుఁడగుచు దుఃఖితుఁడై చేయునది లేక వేగ
ముగాఁ బోయి యంబరీషుని పాదములు పట్టుకొని రక్షింపుమని
ప్రార్థించెను.అంత నంబరీషుఁడు బ్రాహ్మణుఁడువచ్చి తనపాదములు
పట్టుకొన్నందులకు సిగ్గుపడి,యతని దుఃఖమునుగాంచి జాలిపడి
విష్ణుచక్రము నిట్లు నుతించెను. "ఓయాయుధరాజమా! *నీవే
యగ్నివి; నీవే సూర్యుఁడవు; నీవే నక్షత్రాధిపతి యగుచంద్రుఁ
డవు; నీవేజలమవు; నీవేభూమివి; నీవేయాకాశమవు; నీవేవాయు
వవు; గంధాది తన్మాత్రలును, ఇంద్రియములును నీకంటె వే

* ఈప్రకరణమునఁ జక్రము సకలతేజస్సులకుఁ గారణమనియు,సర్వా
త్మక మనియు వర్ణింపఁబడినది. ఆలోచింపఁగా "ఐతదాత్మ్యమిదం సర్వం"
"సర్వం ఖల్విదంబ్రహ్మ" "నతత్రభాతి సూర్యోనచంద్రతారకమ్" మొదలగు
శ్రుతులవలన నారాయణుఁడే సర్వాత్మకుఁడనియు,సకలతేజస్సులకుఁ గారణుఁ
డనియు, నాతేజస్సులను గప్పిపుచ్చువాఁ డనియు, సూర్యాది తేజస్సుల
ననుగ్రహించి ప్రకాశింపఁజేయువాఁడనియుఁ దెలియఁబడుచున్నది ; కాని
యతఁ డాయుధముగాఁ దాల్చు చక్ర మట్టి గుణములు గలదని చెప్పఁబడ

త్రైనవికావు. ఓసుదర్శనమా ! నీవు వేయంచులచే బ్రకాశించు దానవు. నీవు విష్ణువునకుఁ బ్రియమైన దానవు. అట్టి నీకు నమస్కారము. నీవెట్టి యస్త్రములనైన నవలీలఁద్రుంపఁగలవు.శరణాగతులను రక్షింతువు. నీవు జగమును బాలించుదానవు. జగత్పాలకమవగు నీకు శరణాగత రక్షణము యుక్తమైనది. కావున నీ వీబ్రాహ్మణునిఁ గరుణించి మంగళరూపమునుదాల్చి యితనికి సుఖముఁలొసంగుము. నీవు ధర్మములను గాతువు. ధైర్యము నొసంగుదువు. నీవు శాశ్వతముగానుందువు. నీవు యజ్ఞములచే నారాధింపఁబడి వానిని నాంతముగా నిర్వహింతువు. నీవు పురుషుని తేజమవు. నీవు సర్వరూపివి. ఓసునాభమా ! నీవు సకలాధర్మశీలురగు రాక్షసులపాలిటఁ దోఁకచుక్కవు. నీవు ముల్లోకములఁ గాచుదానవు. నిర్మలమగు కాంతిగలదానవు.నీవధికమగు మనోజవముచే నొప్పుచు నద్భుతకార్యముల నొనర్చుదానవు. అట్టి నీకు నమస్కారము.ధర్మములను వర్ధించుచున్న నీ తేజస్సుచే మహాత్ముల దృష్టికిఁగానవచ్చు చీఁకటి నిరసింపఁబడినది. నీ మహిమమెట్టివారికిఁదెలియఁదరముకాదు.స్థూలములును,సూక్ష్ములును నగుచిదచిత్తులచేఁ బరిణమించిన విశ్వమంతయు నీకంటె భిన్నమైనది కాదు. నిరంజనుఁడగు పరమపురుషుఁ డాజ్ఞాపించి నప్పుడు నీవు బలశాలురయిన దైత్యదానవ సైన్యములను జొచ్చి సులభముగా వారి బాహువులను, జఠరములను, దొడలను, బాదములను,గంఠములను,సర్వదాఖండించుచు మిక్కిలి ప్రకా

---

లేదు. అయినను దక్కిన ప్రపంచమువలెఁ జక్రముగూడ భగవంతునకు శరీరభూతమే! కనుక చక్రమునుగూర్చి చేసిన స్తోత్రము శరీర శరీరిన్యాయముచేఁ జక్రశరీరకుఁడగుపరమపురుషునందేపర్యవసన్నమగుచున్నదని తెలియఁదగును.

శించుచుందువు. సాధుజనులను రక్షించుటకును, దుష్టుల శిక్షించుటకును నిన్నుఁ బరమపురుషుఁడు నియమించి యున్నాఁడు. నీవు శరణాగతుల యపరాధములనెల్ల సహించుదానవు. కావున శరణాగతుఁ డయిన యీవిప్రుని రక్షించి నాకులము నిలువఁ బెట్టుము. లేనిచో బ్రహ్మహత్యాదోషముచే నావంశము నశించి పోవును. ఈవిప్రునిఁ గావుము. ఇతనిఁ గాచుట మాయందు దయ చూపుటయే. నేఁ జేసినదానము, నే నాచరించిన యాగాదులు, నేనడుపుచున్న వర్ణాశ్రమ ధర్మములు, పరమపుషుని సంతసింపఁ జేయఁజాలునేని, నావంశము బ్రాహ్మణులనే దైవముగాభావించు చుండెనేని, యీబ్రాహ్మణుఁడు బాధారహితుఁడై సుఖించుఁగాక. సకలకల్యాణ గుణములకును నిలయుఁడయిన పరమేశ్వరుఁడు నేను జేయుచున్న బ్రహ్మోపాసనచే సంతుష్టి చెందెనేని, యీవిప్రుఁడు దుఃఖమునువిడిచి సుఖించుఁగాక." అని యిట్లు నుతింప నాచక్ర మతనికిఁ బ్రసన్నమై శాంతించి యంబరీషుని యనుమతిచే నతని విడిచిపెట్టెను. అంత దుర్వాసుఁడు చక్రతాపము తొలంగుటచే సుఖియై యారాజును దీవించుచు నిట్లు స్తోత్రముచేసెను. "ఓరాజేంద్రా! అయారే! విష్ణుభక్తులమహిమ నిప్పుడుచూచితిని. నీకు నేనపరాధముచేసినను నాకు నీవుపకారముచేసి నీయౌదార్యమును వెల్లడించితివి. భక్తప్రియుఁడును, నాశ్రితార్తిహరుఁడు నగుహరిని వశము గావించుకొన్న సాధువుల కసాధ్యకార్య మేదిగలదు? వారలకు విడువరానిదేదికలదు? నారాయణుని నామమును విన్నంతమాత్రనే పురుషుఁడు పాపరహితుఁడగుచున్నాఁడు. అతని పాదము లోకపావనియగు గంగానదికి జన్మస్థానము. అట్టి పరమపురుషుని భక్తులరగు మీకు నలభ్య

మగున దేది కలదు ? ఓరాజా ! మిక్కిలి దయాళుఁడవై నీవు నన్ననుగ్రహించితివి. నాయపరాధమును లెక్కగొనక నాప్రాణములనిచ్చి కాపాడితివి” అని పొగడుచున్న దుర్వాసునిఁగాంచి సంతసించి నిరాహారుఁడైన రాజతని పాదముల పైఁబడి ప్రసన్నునిగాఁ జేసి భుజింపఁజేసెను. అనంతరము దుర్వాసుఁడు రాజాదరముతో నిచ్చిన షడ్రసోపేతమగు నాహారమును గొని సంతుష్టచిత్తుఁడై యతని దీవించి యిట్లనియె. “ఓరాజా! భగవద్భక్తుఁడనగు నీవలనఁ బ్రీతుఁడనైతి. అనుగ్రహింపఁబడితిని. నిన్నుఁ జూచుటచేతను, నిన్నుఁ దాఁకుటచేతను, నీమృదులాలాపముల చేతను కృతార్థుఁడనైతిని. నీవిచ్చిన యాతిథ్యముచేఁ దృప్తి నొందితిని. నీవొనర్చిన యీ పుణ్యకార్యము స్వర్గలోకమున దేవతాస్త్రీలు గానము చేయఁగలరు. నీకీర్తిని భూలోకవాసులందఱు నుతింపఁగలరు” అని యిట్లు నుతించి యామునిరాజు ననుమతివడసి యాకాశమార్గమున సత్యలోకమున కేఁగెను. ఆముని యంబరీషుని యొద్దకువచ్చినది మొదలు చక్రభీతుఁడై దిక్కులందు దిరిగి మగిడివచ్చుట కొకసంవత్సరకాలముపట్టెను. అయిన నంబరీషుఁ డాహారమును గొనక కేవల ముదకమును మాత్రము గ్రోలుచు నతనిరాకను గోరుచునుండెను. దుర్వాసుఁడు భుజించిపోయిన పిమ్మటఁ దదుచ్ఛిష్టశేషమునుదిని చక్రము వలన నామునికి దుఃఖము గల్గుటయు, దొలఁగుటయు, దన కాసమయమున నట్టి ధైర్యాదులు గలుగుటయుఁ బరమాత్మ ప్రభావమువలననే యని తలంచుచుండెను. ఓనరేంద్రా! సుగుణపుంజ మనఁదగిన యంబరీషుఁడు బరమాత్మయగు వాసుదేవుని యందు నిశ్చల భక్తిని నిలిపి దానిచే సత్యలోక పర్యంతము

గల సుఖములన్నింటిని నరకతుల్యములుఁగా భావించెను. పిమ్మట నంబరీషుఁడు సత్ప్రవర్తనమునఁ దనతోఁ దుల్యులగు కుమారులకు రాజ్యమిచ్చి యింద్రియములఁ జయించి యాశను బాఱఁదోలి వనమునకుఁబోయి వాసుదేవునియందుఁ జిత్తమును నిశ్చలముగానుంచి సంసారమునువిడిచి ముక్తుఁడయ్యెను. ఈ యంబరీషుని పుణ్యచరిత్రమును సంతతమును బొగడుచు ధ్యానించుచున్నవాఁడు తప్పక భక్తుఁడగును. ఇది యైదవయధ్యాయము.

---

{అంబరీషుని వంశవర్ణనము; శశాదుని చరిత్రము; సౌభరి చరిత్రము.}

ఓరాజా! ఆయంబరీషునకు విరూపుఁడనియుఁ గేతుమంతుఁడనియు శంభుఁడనియు ముగ్గురుపుత్త్రులు గల్గిరి. వారిలో విరూపునికిఁ బృషదశ్వుఁడు కలిగె. వానికి రథీతరుఁడు జన్మించె. సంతానము లేకపోవుటచే నతఁడు విచారించుచు నంగిరసునిఁ బ్రార్థింప నతఁడా రథీతరుని భార్యయందు బ్రహ్మవర్చసోపేతులగు సుతులను బుట్టించెను. వారు రథీతరుని క్షేత్రమందుఁ బుట్టుటచే రథీతరగోత్రులనియు,నంగిరసునిబీజమువలనజన్మించుటం జేసియాంగిరసులనియుఁ జెప్పఁబడిరి. కావుననే రథీతరపుత్త్రుల సంతానము వారి ప్రవరలో బ్రాహ్మణులును, క్షత్త్రియులును గలిసి యుండిరి. ఓరాజేంద్రా! ఇఁక నిక్ష్వాకుని వంశమును వర్ణించెదను. వైవస్వతమనువు తుమ్మఁగా నతనిముక్కువలన నిక్ష్వాకుఁడను ప్రసిద్ధపుత్త్రుఁడు గలిగె. అతనికి నూర్వురు తనయులు గల్గిరి. వారిలో వికుక్షి, నిమి, దండకుఁడు నను వారు పెద్దవారు. ఈముగ్గురును ఆర్యావర్తమునకుఁ బ్రభువులైరి. తక్కినవారిలో

నిరువదియైదుగురారార్యావర్తమునకుఁ దూర్పున సముద్రము వఱకుఁ గల్గిన భూమికిఁ బ్రభువులైరి. అట్లె యార్యావర్తమునకుఁ బడమటనున్న భూమి కిరువది యైదుగురురాజులైరి. ఇఁక మిగిలినవారు దక్షిణోత్తర భాగముల నేలఁ దొడఁగిరి. అందఱిలోను బెద్దవాఁడగు వికుక్షి యొకప్పుడు జనకాజ్ఞ చేనష్టకశ్రాద్ధము నిమిత్తము మాంసమును దెచ్చుటకై యడవి కేఁగి శ్రాద్ధమునకుఁ దగిన మృగములనుజంపి యాయాసముచేతను, నాఁకలి చేతను మిక్కిలి బడలి శ్రాద్ధార్థము సంపాదింపఁబడినవానిఁదినఁ గూడ దనుజ్ఞానము లేక వానిలో నొకశశమును దిని తక్కిన వానిని దండ్రి కిచ్చెను. అనంతర మిక్ష్వాకువు వసిష్ఠునిఁ గాంచి "ప్రోక్షణచే మాంసమును సంస్కరింపు" మని పల్కనతఁ డది యుచ్ఛిష్టమనియు శ్రాద్ధమునకుఁ దగదనియుఁ జెప్పెను. ఇక్ష్వాకుఁడు గురువువలనఁ దనకుమారుఁడు చేసిన దుష్కర్మమును దెలిసికొనినియమము నతిక్రమించిన వికుక్షినిగోపించితనదేశము నుండి తఱిమివేసెను. పిమ్మట నిక్ష్వాకుఁడు తపముచేయుచు గురుసహితుఁడై భగవంతుని సద్గుణముల ననువదించుచు దాని వలన విరక్తుఁడై ప్రారబ్ధావసానమునఁ గళేబరమును విడిచి ముక్తుఁ డయ్యె. తండ్రి ముక్తిచెందుటఁ దెలిసికొని వికుక్షి మరలి వచ్చి యీ భూమండలమునుఁ బాలించుచుఁ బరమేశ్వర ప్రీతికై యజ్ఞము లొనర్చి శ్రాద్ధముకొఱకుఁ దెచ్చిన శశమును భక్షించుటంజేసి శశాదుఁడను నామమును వహించి సుప్రసిద్ధుఁ డయ్యె. ఆ వికుక్షికిఁ బురంజయుఁ డనుకుమారుఁ డుదయించె. పూర్వము సురాసురులకు సమరము సంభవించెను. అందు రాక్షసులు ప్రబలురయి దేవతలను బరాభవించి తఱిమిరి. విశ్వేశ్వరుఁ

డయిన విష్ణు వదిచూచి పురంజయుని సురలకు సహాయునిఁగాఁ బంపె. అంత నతఁడు వృషభరూపముఁ దాల్చిన యింద్రునిపైఁ గూర్చుండి దేవతలచే సన్నుతుఁడై కవచమును దొడిగి దివ్య చాపమును, నిశితశరములను ధరించి విష్ణువు తేజస్సుచే వర్ధితుఁడై సురలతోఁ గూడి పడమటిదిక్కున కరిగి దైత్యులపురముల నరికట్టెను. అచ్చట నా పురవాసులకును బురంజయునకును దలఁచిన భయము గల్గింపఁజాలు ఘోరయుద్ధ మయ్యెను. పురంజయుఁడు మహాశౌర్యముతోఁ బోరాడి పెక్కండ్రను జంపెను. తక్కిన దైత్యులు ప్రళయ కాలాగ్నివలెదుస్సహుఁడైనపురంజయునిబాణఘాతములకోర్వఁజాలక పర్విడి పాతాళమున దాఁగిరి.ఇట్లు పురంజయుఁడు దైత్యులను జయించి వారి పురములను, ధనములను గొనివచ్చి యింద్రున కర్పించెను.ఆ రాజు పురములనుజయించుటచేఁ బురంజయుఁడనియు, నింద్రుని వాహనముగాఁ జేసికొనుటచే నింద్ర వాహనుఁడనియు, వృషభముయొక్క కకుత్తు (మూఁపురము) నందుఁ గూర్చుండుటం జేసికకుత్థ్సుఁడనియునామముల చేఁ బిలువఁబడెను. ఆపురంజయునకు అనేనసుఁ డనుకుమారుఁడుగలిగెను. వానికిఁ బృథువును, బృథువునకు విశ్వగంధుఁడును, నతనికిఁ జంద్రుఁడును,నాయనకు యువనాశ్వుఁడును,నతనికి శాబస్తియు నుదయించిరి.అతఁడు శాబస్తి యనుపురమును నిర్మించి ప్రసిద్ధి గాంచెను. ఆ శాబస్తికిఁ బృహదశ్వుఁడు, నతనికిఁ గువలయాశ్వుఁడును జనించిరి. బలవంతుఁడగు కువలయాశ్వుఁ డిరువదియొకవేగు రగు తనపుత్త్రులతోఁ గలిసి యుదంకమునికిఁ బ్రియముగా ధుంధుఁ డనుదైత్యునితో యుద్ధముచేసి చంపెను.

కాన నతనికి ధుంధుమారుఁ డను నామాంతరముగల్గినది. ఆయు ద్ధమున నతని కుమారులలో ముగ్గురు తప్పఁ దక్కినవా రంద ఱును ధుంధుని ముఖాగ్ని కాహుతులైరి. ఆ మిగిలినవారు, దృఢాశ్వుఁ డనియు, గపిలాశ్వుఁ డనియు, భద్రాశ్వుఁ డనియు, నామములు గలవారు. అందు దృఢాశ్వునకు హర్యశ్వుఁడును, అతనికినిఁ గుంభుఁడును వానికి బర్హిణాశ్వుఁడును వానికిఁ గృశా శ్వుఁడును, వానికి సేనజిత్తును, వానికి యువనాశ్వుఁడును నుద యించిరి. ఆ యువనాశ్వుఁడు సంతానము లేనందున మిక్కిలి విచారము నందుచుఁ దననూర్వురు భార్యలతోను వనమున కరి గెను. అచ్చటిమును లతనివిచారమును జూచి జాలిపడి సమా హితచిత్తులై యతనిచే నింద్రదేవతాకమగు పుత్త్రకామేష్టిని జేయించిరి. ఆ యాగకాలమున నొకనాటిరాత్రి రాజు మిక్కిలి దప్పిగొని యజ్ఞశాలను బ్రవేశించి యచ్చట శయనించియున్న విప్రులను జూచి పలుకరింపక భార్యత్రావఁదగిన మంత్రజల మును దానే పానముచేసెను. పిమ్మట మునులు లేచి మంత్రజల ములేని కలశమునుజూచివిచారించుచు రాజునొద్దకేఁగి "ఓ రాజా! ఎవఁ డీపని చేసెను? పుత్త్రోత్పత్తికిఁ గారణమగు నీమంత్ర జలము నెవఁడు త్రావెను?" అని యడిగి దైవవశమున రాజే యాపని గావించెనని యెఱిఁగి దైవబలము ముఖ్యమైనదియుఁ బురుషబల మెందుకును బనికిరాదనియుఁ దలంచి భగవంతునకు నమస్కరించిరి. కొంతకాల మేగునప్పటికి యువనాశ్వుని దక్షిణ కుక్షిని భేదించుకొని యొకమహాపురుషుఁ డుదయించెను. అట్లు పుట్టినపిల్లఁ డాకలికోర్వఁ జాలక యేడ్చుచుండ మునులు గాంచి "చనుఁబాలులేక పోవుటంజేసి వీఁడిట్లేడ్చుచున్నాఁడు. వీఁడిక నేమి

పానముచేసిజీవించు" నని పలుకఁగాఁ బుత్త్రకామేష్టిచేనారాధితుఁ
డగు నింద్రుఁడు వచ్చి "నన్నుఁ బానముచేయు" నని చెప్పి
యమృతమును స్రవించుచున్న చూపుడువ్రేలిని గుడువఁబెట్టెను.
కావున* మాంధాతయను నామ మతనికిఁ గల్గె. కుమారుఁడు కడుపు
భేదించుకొని పుట్టినను యువనాశ్వుఁడు విప్రుల దయగలవాఁ
డగుటచేతను మృతినొందలేదు. కాని యనంతరమతఁ డచ్చటనే
తపస్సుచేసి ముక్తిచెందెను. ఓ పరీక్షిన్నరేంద్రా! ఆ మాంధాత
రావణాసురుఁడు మొదలగు దొంగలకు భయము పుట్టించిన
వాఁ డగుటచే నతనికి త్రసద్దస్యుఁడను బిరుదనామము నింద్రుఁ
డొసఁగెను. యువనాశ్వకుమారుఁ డగుమాంధాత సమర్థుఁడై
చక్రవర్తియై సప్తద్వీపాత్మకమగు భూవలయము నిరంకుశముగా
మొక్కవోని పరాక్రమముచేఁ బరిపాలించెను. ఆత్మజ్ఞాన
సంపన్నుఁడయిన మాంధాత బహు దక్షిణలుగల యజ్ఞములను
జేసి సర్వదేవమయుఁడును, దన తేజస్సుచేతనే ప్రకాశించు
వాఁడును, సర్వమునకంతరాత్మయునగు నారాయణుని సంతసింపఁ
జేసెను. మఱియుఁ బురోడాశాది ద్రవ్యము, మంత్రములు, విధా
నము, కర్తయు ఋత్విజులును, ధర్మములును, దేశమును, గాల
మును, నీ సమస్తమెవనిస్వరూపమో యట్టి పరమేశ్వరుఁ డతని
యాగములకు సంతసించెను. యౌవనాశ్వుఁడు పాలించినభూమం
డలము చక్రవాళ పర్యంతము వ్యాపించియున్నదని చెప్పుదురు.
ఆ మాంధాత శతబిందుని కుమారిక బిందుమతిని వరించి పురు

*మాంధాత, ధాత యనఁగాఁ బానముచే యువాఁడని యర్థము. "మాం" అనఁగా "నన్ను" అని యర్థము. ఇంద్రుఁడు "నన్నుఁ బానముచేయు" నను నర్థముగల "మాంధాతా" యనుపదమును జెప్పుటచే నతనికా పేరు గల్గినది.

కుత్సుఁడు మొదలగు కుమారులను నేఁబండ్రఁ గూఁతులను బడ సెను. ఆకూఁతులందఱును సౌభరియను మహర్షిని వెండ్లాడిరి. ఆ వృత్తాంతమును జెప్పెద వినుము. ఆ సౌభరి యొకనాఁడు యమునానదిలో మునిఁగి తప మొనర్చుచు నందు పెద్దమత్స్యము పొందుచున్న మైథున ధర్మ సుఖమును జూచి యట్టి సుఖము తానునుభవింపవలెనని యపేక్షించి మాంధాతను సమీపించి నీ కుమారికలలో నొకదాని నాకిచ్చి పెండ్లిచేయుమని వేఁడెను. మాంధాతవాని ముదుసలి రూపమును జూచి రోసియుఁ దాను నిరాకరింపక "ఓ మునీంద్రా! నా కన్యలకు స్వయంవర మహోత్సవము గావించెదను. అందు వారిలో నీయిష్టమగుదాని వరింపవచ్చు" నని పలికెను. సౌభరి రాజుమాట విని "ఈ రాజు స్త్రీల కసహ్యమగు నారూపమును, ముడుతలు వడియున్న, నా శరీరమును, వడఁకుచున్న నాశిరస్సును చూచి, ఇట్టివానికి నాకూతు నెట్లిచ్చెద" నని యూహించి నన్నుఁ దిరస్కరించెను. కానిమ్ము. దేవతా స్త్రీలకుఁగూడఁ గోరఁదగిన రూపమును నాతపః ప్రభా వమున సంపాదింపఁగలను. ఇట్లుండ మానవ కన్యలకుఁ గాంక్ష ణీయమగు వాని సంపాదించుటలో వింత యేమున్నది?" అని నిశ్చయించుకొని రాజాజ్ఞను బడసి యంతఃపురమును బ్రవేశిం చెను. ఆ కన్యకలు యోగవశమున మహాసౌందర్యవంతుఁడగు నతనిఁ జూచి "నేనే యితని వరించెదను. నాకే యితఁడు తగిన వాఁడుకాని నీకుఁ గాఁడు" అని యిట్లు ప్రతి కన్యకయు బలు కుచుఁ బరస్పరము కలహించుకొనుచుఁ దుదకందఱు నతనివరిం చిరి. సౌభరి వారలనందఱను బెండ్లాడి తన యాశ్రమమునకుఁ గొనిపోయి తనతపశ్శక్తిచే వారిలో నొక్కొక్కదాని కొక్కొక

దివ్యభవనమును నొక్క యుద్యానవనమును, నిర్మలోదకము లును గమలములును గల యొక్క సరస్సును నిర్మించెను. ఆగృహములు చక్కఁగా నలంకరించుకొనిన స్త్రీపురుషులచేతను మధురముగా గానము చేయుచున్న శుకశారికాది పక్షులచేతను, తుమ్మెదలచేతను, వందులచేతను, అమూల్యమైన శయ్యలచేతను, రత్నమయములగు నాసనములచేతను, మనోహరములగు వస్త్ర భూషణములచేతను, పానద్రవ్యములచేతను, దివ్యమగు చందనా దులచేతను, భోజన పదార్థములచేతను, పుష్పమాలికలచేతను, ప్రకాశించుచుండెను. సార్వభౌములకుఁ గూడ లభింపని భోగ్య వస్తువులతో నిండియున్న యతని గృహములనుగాంచి సామ్రా జ్యాధిపుఁడై యేడుద్వీపములు గలభూమినేలుచున్న మాంధాత యచ్చెరువడి తనగర్వమును విడిచిపెట్టెను. ఆ సౌభరి యిట్లు గృహస్థాశ్రమ మవలంబించి నానావిధములగు నింద్రియసుఖము లనుభవించుచుండియు నేతిచుక్కలచే నగ్నిహోత్రుఁడుఁ బోలె నాసుఖములచేఁదృప్తినొందలేదు. ఆమహాముని యొకనాఁ డొకచోఁ గూర్చుండి యమునానదియందు మత్స్యములఁ జూచుటచేఁదనకుఁగల్గిన విషయచాపల్యమును దెలిసికొని తనలో నిట్లనుకొనియె. "జనులారా! తపశ్శాలియగు నీ సౌభరి తనంతఁ దాను బొందించుకొన్నయాత్మనాశనమును జూడుఁడు. వీఁడు మిక్కిలి బుద్ధిహీనుఁడు. కానిచో నదిలో విహరించుచున్న చేఁప లను జూచినంతమాత్రమునఁ జలించి విషయసుఖముల కాశ పడి చిరకాలమునుండి ధ్యానించుచున్న పరబ్రహ్మమును విడు చునా? కావున మోక్షమపేక్షించువారు గృహస్థుల సంబంధ మును విడువవలయును. సర్వ విధములచేతను దనయింద్రియ

ములను శబ్దాదివిషయముల చెంతకుఁ బోనీయరాదు. ఒంటిగానే తపమొనర్పవలెను. రహస్యస్థలమందుండియే యపరిచ్ఛిన్నుఁడగు భగవంతునియందు మనస్సును గూర్పవలెను. ఒకప్పుడును సంగము నంగీకరింపరాదు. ఒకప్పుడు సంగము చేసినచో సాధుజనులతోను, మునులతోను మాత్రమే చేయవలెను. ఇదిగో నాదురవస్థను జూడుఁడు. మొదట నేనొక్కఁడనే తపము
కొనుచుంటిని. నీటిలో విహరించు మత్స్యములఁ జూచి విషయాభిలాషకు లోనై యేఁబదిమంది భార్యలను బెండ్లియాడి వారలం దయిదువేలకొడుకులను గాంచియు మనస్సు విషయసుఖములందుఁ దృప్తి వహింపకున్నది. నామనస్సు మోహాదులచే నావృతమై సంతతమును మిథునకర్మమునందే సక్తమగుచున్నది. శబ్దాదివిషయములే పురుషార్థము లని తలంచుచున్నది. ఏ యనర్థము సంభవించినదో చూడుఁడు. కావున ముముక్షువులందఱును సంగమును బరిత్యజింపవలెను" అని తలపోయుచు నామునీంద్రుఁడు కొంతకాలము గృహ
ననుండి వైరాగ్యముచెంది కామ్యకర్మములను త్యజించి వనమున కరిగెను. పతివ్రతలగు నాతనిభార్యలందఱు నాతని వెంబడించి పోయిరి. అట సౌభరి మనస్సు బ్రహ్మమునందుఁ జేర్చి శరీరము కృశించునట్లుగ్ర మగుతపం బొనర్చుచు నాహవనీయాదులగు నగ్నులతోఁ గూడఁ బరమాత్మయం దనుసంధానము చేసెను. అనంతర మతని భార్యలు ముక్తుఁడయిన తమభర్తను గాంచి తామునుబరమాత్మోపాసన చేసి తమపతి యనుగ్రహము చేతను, భగవదుపాసన ప్రభావముచేతను, శాంతించినయగ్ని

యందు మంటలవలె లీనతఁజెంది ముక్తులైరి. ఇది యాఱవ యధ్యాయము.

---

## మాంధాతృ వంశపరంపరను వర్ణించుట

ఓ రాజా ! మాంధాతపుత్రులైన పురుకుత్సాదులలో నంబరీషుఁ డనువానిని బితామహుఁడయిన యువనాశ్వుఁడు పుత్రునిఁగా స్వీకరించెను. ఆ కారణమున నంబరీషుని కుమారుఁడు తాత పేరును వహించి, యువనాశ్వుఁడని ప్రఖ్యాతి చెందెను. ఆ రెండవ యువనాశ్వునకు హారితుఁ డనుకుమారుఁడు గల్గెను. అంబరీషుఁడును, యువనాశ్వుఁడును, హారితుఁడును మాంధాతృ ప్రవరకుఁ జేరినవారు. ఇఁకఁ బురుకుత్సుని సంతతిని జెప్పెదను వినుము. పురుకుత్సుఁడు నాగకన్యకయగు నర్మదను బెండ్లాడెను. ఆ నర్మద భర్తృప్రేమను సంపాదించుకొని, తన సోదరులగు సర్పరాజుల కోర్కిపైని, తాను భర్తను బాతాళమునకుఁ గొనిపోయెను. అక్కడ విష్ణుబలసంపన్నుఁడైన పురుకుత్సుఁడు వధింప శక్యముగాని గంధర్వుల నవలీలఁ జంపి సర్పములవలన భయము లేకుండునట్లు వరము గాంచెను. ఈవృత్తాంతమును విన్నవారికిని జదివినవారికిని సర్పభయమొంత మాత్రమును లేదు. ఆ పురుకుత్సునికి త్రసద్దస్యువును, వానికి నరణ్యుఁడును, నతనికి హర్యశ్వుఁడును, వానికిఁ ద్ర్యరుణుఁడును సంభవించిరి. ఆ త్ర్యరుణునకుఁ ద్రిబంధురుఁ డుదయించె. వానికి సత్యవ్రతుఁడు గలిగె. వానికిఁ ద్రిశంకుఁ డుద్భవించె. ఆత్రిశంకుఁడే గురువగు వసిష్ఠుని శాపమునఁ జండాలుఁడై పిమ్మట విశ్వామిత్రుని తపఃప్రభావముచేఁ బొందతోఁగూడ స్వర్గమున

కేఁగి యిప్పటికిని నక్షత్రరూపుఁడై చూపట్టుచున్నాఁడు. చండాలుఁడైన త్రిశంకుఁడు స్వర్గలోకమునకుఁదగనివాఁడని దేవతలతనిఁ గ్రిందికిఁ ద్రోసివేయఁగాఁ దలక్రిందై శరణు శరణని వేఁడుచు వచ్చుచున్న యతనిఁ గాంచి విశ్వామిత్రుఁడు దయాళువై తన తపఃప్రభావముచే స్వర్గాంతరమును గల్పించి యందతని నుంచి క్రిందఁ బడకుండఁ జేసెను. అతని కుమారుఁడు హరిశ్చంద్రుఁడు. ఆహరిశ్చంద్రుని నిమిత్తమే విశ్వామిత్రుఁడును వసిష్ఠుఁడును * బకరూపములనొంది యనేకసంవత్సరములు పోరాడిరి. అతనికి సంతానము లేకపోయెను. అందుచే నతఁడు మిక్కిలి దుఃఖితుఁడై నారదుని యుపదేశము వలన వరుణుని శరణొంది తనకు వీరుఁడగు పుత్త్రునిచ్చినచో నందులకుఁ బ్రతిఫలముగా నాపురుషునిఁబశువునుగాఁజేసి 'నీకుఁ బ్రీతిగలుగునట్లుయాగమును చేసెద' నని పలికెను. దానికి వరుణుఁడు సమ్మతించెను. వరుణుని యనుగ్రహమువలన హరిశ్చంద్రునకు రోహితుఁడను కుమారుఁడు కలిగెను. పిమ్మట వరుణుఁడువచ్చి హరిశ్చంద్రునిఁజూచి "నీకుఁ గుమారుఁడు కలిగెను. నీవతనిఁ బశువునుగాఁజేసి మత్ప్రీతిగా యాగమును జేయు"మనియెను. దానికిహరిశ్చంద్రుఁడు "పదిదినములు గతించినఁగాని యాగయోగ్యుఁడు కాఁ"డనెను. వరుణుఁడందులకు సమ్మతించి మరలిపోయి పది దినములు గతించిన తరు

---

* విశ్వామిత్రుఁ డింద్రునియొద్దఁ దాఁ జేసినప్రతిజ్ఞను జెల్లించుకొనసెంచి రాజసూయ దక్షిణమను నెపమున నా రాజుసర్వస్వమునుహరించినానాబాధలను బెట్టెను. వసిష్ఠుఁ డది తెలిసికొని విశ్వామిత్రునిఁ "బకత్వము పొందు" మని శపించెను. విశ్వామిత్రుఁడు నట్లె యతనిశపించెను. అంతనాయిర్వురును బకులయి బహుకాలము పోరిరని పురాణ ప్రసిద్ధి.

వాత వచ్చి యజ్ఞము చేయుమని యడిగెను. దాని కా రాజు బాలునికి దంతములు వచ్చినఁగాని సవనమునకు యోగ్యుఁడు కాఁడనెను. దంతములు వచ్చిన తరువాత వరుణుఁడు వచ్చి యాగము చేయు మనెను. దాని కతఁడు పాలదంతము లూడినఁ గాని క్రతుయోగ్యుఁడు గాఁడనెను. దానికి వరుణుఁడు సమ్మతించి కొంత కాలము చన్న పిమ్మట వచ్చి "ఇదిగో నీ బాలుని దంతము లూడినవి. యజ్ఞమొనర్పు" మనియెను. పిమ్మట హరిశ్చంద్రుఁడు బాలునికి మరల దంతములు వచ్చినఁగాని యాగపశువగుటకుఁ దగఁడని పల్కెను. వరుణుఁ డప్పటికి మరలి పోయి దంతములు వచ్చుటను జూచి యాగము చేయుమని హరిశ్చంద్రు నడిగెను. దాని కతఁడు బాలుఁడు యుద్ధయోగ్యుఁ డయినప్పుడు కాని యర్హుఁడు కాఁడనెను. ఓ పరీక్షిన్నరేంద్రా! హరిశ్చంద్రుఁ డిట్లుపుత్త్రప్రేమచేఁగాలముగడుపుచుండుటను జూచి తానును దత్కాలమును నిరీక్షించుచుండెను. అంతలో రోహితుఁడుతనతండ్రి తన్నుయాగపశువునుగాఁ జేయునని తెలిసికొని ప్రాణములఁగాచుకొను తలంపుతో విలునమ్ములు దాల్చి యరణ్యమునకుఁ బాఱిపోయెను. దానికి వరుణుఁడు కోపించి కుక్షిరోగరూపమునహరిశ్చంద్రునిబాధింపఁ దొడంగెను. ఆకడుపు మిక్కిలి పెరుఁగుటచే నారాజు పలుబాము లనుభవించుచుండెను. రోహితాశ్వుఁడు తండ్రికి సంభవించిన యాపదను దెలిసికొని చూడవలెనని తన పురమునకుఁ బోఁదలంచెను. కాని యింద్రుఁ డతనికిఁ గానవచ్చి "ఓయీ! నీవిప్పుడు మీపురమునకుఁ బోవలదు. అసత్య మాడినందున మీతండ్రికిఁ గుక్షిరోగము సంభవించినది. నీవు భూమండల

మున సంచరించి పుణ్యక్షేత్రముల సేవించుచు నా పుణ్యముచే నీజనకుని కుక్షిరోగమును మరలింపు "మని బోధించెను. రోహితుఁ డందులకు సమ్మతించి కొన్ని వత్సరములు భూపర్యటనము సలిపి పుణ్యక్షేత్రముల సేవించెను. అతఁడు ప్రతివత్సరమును దన పురమునకుఁ బోవ సిద్ధమగుచుండెను; కాని యింద్రుఁడు తొంటియట్లు చెప్పి వారించుచుండెను. ఇట్లతఁడయిదేండ్లు గడపెను. ఆఱవ వత్సరమును గూడఁ గడపి భృగువంశ సంభూతుఁడైన యొక బ్రాహ్మణ కుమారునిఁ గొనితన పురమునకు వచ్చి తండ్రిం గాంచి యతని కా బాలు నర్పించి తనకు బదులుగా నాతనిఁ బశువునుగాఁ జేసి వరుణప్రీతిగా యాగము చేయుమనెను. అనంతరము మహాయశుఁడైన హరిశ్చంద్రుఁడు వరుణప్రీతిగాఁ బురుష మేధమును జేసి రోగవిముక్తుఁడయ్యె. ఆపురుష మేధమున విశ్వామిత్రుఁడు హోత; భృగువంశసంభూతుఁడైన జమదగ్ని యధ్వర్యుఁడు; వసిష్ఠుఁడు బ్రహ్మ; అయాస్యుఁడు ఉద్గాత; ఇట్టి మహాపురుషులను గూర్చికొని చేసిన యాగమున కింద్రుఁడు మిక్కిలి సంతసించి హరిశ్చంద్రునకు సువర్ణరథము నిచ్చెను. ఓ రాజా ! యాగపశువయిన శునశ్శేఫుఁడను ముని కుమారుని వృత్తాంతమును బిమ్మటఁ జెప్పెదను. ఆ హరిశ్చంద్రునియు నతని భార్యయు సత్యమును, ధైర్యమును, జూడఁ గాంచి విశ్వామిత్రుఁడు సంతోషించి యాత్మజ్ఞానము నుపదేశించెను. హరిశ్చంద్రుఁ డాజ్ఞానబలముచే మనస్సును బృథ్వియందుఁ జేర్చి యా పృథివిని జలముతోను, జలమును దేజస్సుతోను, దేజస్సును వాయువుతోను, వాయువును గగనముతోను మిళితముగాఁ జేసి, యాగగనమును దామసాహంకారమందును,

దానిని మహత్తత్త్వమందును, దానినిఁ బ్రధానమందును జేర్చి దానియందున్న జీవకల యగు విద్యను ధ్యానించి దానిచే నజ్ఞానమును దొలఁగించుకొని సమస్తబంధనములను విడిచి నామరూపములచే నిర్దేశింపఁ దరముకాని స్వస్వరూపమును గాంచెను. ఇది యేడవయధ్యాయము.

---

హరిశ్చంద్రుని వంశ వివరణము; సగరుని చరిత్రము.

హరిశ్చంద్రుని సుతుఁడగు రోహితునకుహారితుఁడును, వానికిఁ జంపుఁడును గలిగిరి. ఆచంపునిచేఁ జంపాపురి నిర్మింపఁబడెను. ఆచంపునకు సుదేవుఁడు గలిగెను. వానికి విజయుఁడు సంభవించె. వానికి భేరుకుఁ డుద్భవించె. వానికి వృకుఁడుజనించె. వానికి బాహుకుఁడు పుట్టె. ఆబాహుకుఁడు కొంతకాలము రాజ్యమేలి శత్రువులు బలీయులై తనరాజ్యము నపహరించినందున విచారించుచు నేమియుఁ జేయఁజాలక భార్యతో వనమున కేఁగెను. బాహుకుఁడట చిరకాలముండి ముదుసలివాఁడై కాలధర్మము నొందెను. అతని భార్య భర్తృవియోగమును సహింపఁజాలక చావ యత్నించుచుండ నౌర్వుఁడను మునివచ్చి "గర్భిణివగు నీవిట్లు చావరా" దని వారించెను. అనంతర మామె గర్భము దాల్చినదని తెలిసికొని దాని సవతులు మిక్కిలి సహింపఁజాలక యన్నముతోఁ గలపి విషమును బెట్టిరి. ఆ విషమువలన శిశువు గాని యామెగాని మృతినొందలేదు.కొంతకాలమునకు సవతులు పెట్టిన గరముతోఁ గూడఁ బుట్టినందున సగరుఁడను పేరిని వహించి యొకబాలుఁ డుద్భవించె. ఆసగరుఁడు భూమండలము నేకచ్ఛత్రాధికారముతోఁ బాలించెను. అతని కుమారులచేఁ

ద్రవ్వఁబడి సముద్రము సాగరమని చెప్పఁబడుచున్నది. అతఁడు తాళజంఘులను పేరుగల యవనులు శకులు బర్బరులు మొదలగు వారిని జయించెను. అయినను దన గురువగు నౌర్వుని వచనము చొప్పున వారినిఁజంపక వికారవంతులఁగాఁ జేసి విడిచెను. వారిలోఁ గొందఱకుఁబూర్తిగా ముండనముచేసి శ్మశ్రువుల మాత్రమే మిగిల్చెను. గొందఱ నర్ధముండితులఁగా నొనర్చెను. కొందఱకుఁ గట్టు వస్త్రముమాత్రమే యుండునట్లు చేసెను. మఱికొందఱకు జైవస్త్రము మాత్రమే మిగిల్చెను. అతఁ డౌర్వుని యుపదేశము ననుసరించి సకలవేదస్వరూపుఁడును, సకలదేవతాస్వరూపుఁడు నగుశ్రీహరి నశ్వమేధములచే నారాధింప నారంభించెను. పెక్కుయాగములు పూర్తి చేసెను. అతఁడు నూఱవ యజ్ఞము చేయుచుండఁగా, నింద్రుఁడు దానికి సహింపఁజాలక యాగాశ్వము నపహరించి రసాతలమునఁ దప మొనర్చుచున్న కపిలమహాముని చెంత నుంచి వెడలిపోయెను. ఆ సగరునకు సుమతి యనియుఁ, గేశిని యనియు నిరువురు భార్యలు గలరు. వారిలో సుమతి కఱువది వేవురు కొమరులు గలరు. సగరుఁడు వారిని హయమును వెదకఁ బంపెను. బలగర్వితులైన యా సగరసుతులు జనకుని శాసనమును దలఁదాల్చి భూమండలమునంతటిని గాలించి కానక, తుదకు భూమిని ద్రవ్వి రసాతలమును బ్రవేశించి యీశానదిక్కున కేఁగి తపమొనర్చుచున్న కపిలుని సమీపమున సంచరించుచున్న యాగాశ్వమునుగాంచి "ఇదిగో, వీఁడే మనయశ్వము నపహరించినవాఁడు. ఇక్కడ దాఁగియుండి మనరాక నెఱిఁగి యేమియు నెఱుఁగనివానివలెఁ గనులుమూసికపటతపమున కారంభించెను.

వీఁడు పాపాత్ముఁడు, చంపుఁడు, చంపుఁడు" అని పలుకుచు నాయుధములఁదాల్చి యతనికభిముఖముగాఁబోయిరి. ఆసమయమునఁ గపిలుఁడు కన్నులువిప్పెను. ఇంద్రునిచే వంచితచిత్తులై మహాత్ముఁడగు కపిలునకపరాధముచేయ నెంచినవారందఱును క్షణకాలములోఁ దమశరీరమందున్న యగ్ని కాహుతులై భస్మమైరి. కొందఱు సగరసుతులు కపిలునికోపాగ్నిచే భస్మీభూతులైరని చెప్పుదురు; కాని యదిమంచివాదముకాదు. కేవలము శుద్ధసత్వగుణమునకు నిలయుఁడై జగములకుఁ బరిశుద్ధిగల్గించుచు వర్తించు కపిలమహామునియందుఁ గోపరూపమగుతమోగుణము సంభవించుటెట్లు? భూసంబంధియగుపరాగమాకసమునకు సంభవించునా? సంభవింపదు. ఆకాశమెప్పుడును వాస్తవముగాఁ బరాగమున కాశ్రయము కాదే! మఱియు నెవనిముఖమునుండి యుదయించి సాంఖ్యము, పెద్దపడవకసాటియై మృత్యుభయమును గల్గించునదియు దుర్లంఘ్యమైనదియు నగుసంసారసముద్రమునుండి ముముక్షువులఁ దరింపఁజేయుచున్నదో, యట్టిమహానుభావుఁడును, సర్వజ్ఞుఁడును, బరమాత్మయు నగు కపిలునకు శత్రుమిత్రభావము సంభవించుటెట్లు? కావున వెనుకటివాద మాదరింపఁదగినదికాదు. ఆసగరునకుఁ గేశినియను రెండవభార్యయందు అసమంజసుఁడను నొకకొమరుఁడుండెను. అతని కంశుమంతుఁ డనుసుతుఁడు గలఁడు. ఆ యసమంజసుఁడు పూర్వజన్మమున మహాయోగియై సంగదోషమువలన యోగభ్రష్టుఁడై యీ జన్మమొందెను. పూర్వజన్మమందలియోగప్రభావముచేఁ దనజన్మమును స్మరించుకొని యతఁడు తనకుసంగదోషము సంభవింపకుండుటకై

తానయోగ్యుఁడైనట్లు లోకమునకుఁ జూపఁదలఁచి జ్ఞాతుల కప కారమొనర్చుచు జనుల నడలింపఁజేయుచు నాడుకొనుచున్న బాలురను గొనిపోయి సరయూనదిలోఁ బాఱవైచుచుండెను. అది తండ్రి తెలిసికొని పుత్రప్రేమను ఛేదించి వానిని బురము నుండి తఱిమివేసెను; దాని కసమంజసుఁడు సంతసించి యోగి ప్రభావముచే సరయువులోఁ బాఱవైచిన బాలకులను దెచ్చి వారికర్పించి యటనుండి కదలిపోయెను. అయోధ్యావాసులం దఱు మరల బ్రదికివచ్చిన బాలురనుజూచి యాశ్చర్యమందిరి. పిమ్మట సగరుఁడుకూడఁ దనకుమారుని ప్రభావమెఱుఁగ కుండఁ దఱిమినందులకుఁ బశ్చాత్తాపము నొందెను. ఆ యసమంజసుని కుమారుఁడయినయంశుమంతుఁడు తాతయాజ్ఞను శిరసావహించి హయమును వెదకఁబోయి తనతండ్రులు వెడలినమార్గము నను సరించి పాతాళమును బ్రవేశించి యెదుటఁ బెద్దబూదికుప్పను, నాసమీపమున హయమును, నచ్చటనే యాసీనుఁడై భగవద వతారమైయున్న కపిలమహామునినిజూచియతనినిసమీపించి నమ స్కరించి దోసిలివట్టి నిశ్చలచిత్తుఁడై యిట్లునుతించె "ఓదేవా! యోగిజనులైనను సమాధిమొదలగు నుపాయముల నవలం బించి పరమాత్మవగునీతత్త్వమును స్పష్టముగా నెఱుంగజాలరు. ఇట్లుండఁ దక్కినమావంటి జనులెట్లు తెలిసికొనఁ గలరు? ఇంతియ కాదు. నీచేసృజింపఁబడిన బ్రహ్మాదులే నీతత్త్వమెఱుఁగఁజాలరు. తక్కినవారిసంగతి చెప్పనేల? సామాన్యముగా శరీరులు నీసం బంధియగు మాయచే మోహితులయి ప్రపంచమునఁగానవచ్చు శబ్దాది విషయములను దాని ననుభవించు తమశరీరమును మాత్ర మెఱుఁగుదురు; కాని పరమార్థమును దెలిసికొనలేరు.

ఓమహనీయా! అట్టియనంతమహిమగలిగి యానందాత్మకమగు జ్ఞానమునకు నిలయమై, స్వభావముచేతనే మాయాగుణముల నంటక యోగీశ్వరులగు సనకాదులకుఁగూడఁ గానరానినిన్ను మూఢుఁడ నగునేనెట్లు భావింపఁగల్గుదు? మాయాగుణములను విసర్జించి, కర్మాధీనమగు దేహమును దాల్పక, నామరూపభేదము లేనివాఁడవై, చేతనధర్మములఁగాని యచేతనధర్మములనుగాని పొందక, కేవలము జ్ఞానోపదేశమునిమిత్తమే యిచ్ఛాధీనమగు శరీరమును దాల్చియున్న పురాణపురుషుఁడవగునీకు నమస్కారము గావించెదను. ప్రజలు కామమునకును, బేరాసకును, అసహనమునకును, జిత్తవికారమునకును, లోఁబడి, యొవనిమాయచే సృజింపఁబడినగృహాదులనుజూచి భోగ్యస్థానములనుబుద్ధివహించి తిరుగుచున్నారో యట్టి నీకు నమస్కారము. ఓదేవా! సర్వాంతరాత్ముఁడ వగునీ సందర్శనమువలన విషయాభిలాషమునశించినది. పుణ్యాపుణ్యకర్మములు నశించినవి. దేహాత్మభ్రాంతి రూపమగు మోహ మడుగంటినది. దృఢ మయినదైనను మోహపాశము విచ్ఛిన్నమైనది. కృతార్థుఁడనైతి" నని యిట్లు భక్తిపరవశుఁడై నుతించుచున్న యంశుమంతు ననుగ్రహించి కపిలాచార్యుఁ డిట్లనియె. "ఓ వత్సా! నీ తాత యొనర్చు యాగమునకుఁబశువగు గుఱ్ఱమిదియే. దీనిఁ గొనిపొమ్ము. నీ తండ్రులందఱు నిదిగో నిచ్చటనే భస్మమై పడియున్నారు. వారిని దరింపఁ జేయునది గంగోదకము తప్ప వేఱొకటి లేదు.'' అని పలికిన కపిలునివాక్యమును శ్రద్ధతో విని యతనికి నమస్కరించి యా యశ్వమును గొనివచ్చి తాత కీయఁగా నతఁడు సంతసించి తన యాగమును బూర్తిచేసెను. అనంతరము సగరుఁడు రాజ్యము నంశుమంతుని

కిచ్చి, దేహమందును, దదనుబంధులగు భార్యాదులందును, స్పృహవిడిచి సంసారబంధమును వీడి యార్యుఁ డుపదేశించిన జ్ఞానమార్గ మవలంబించి ముక్తిఁ జెందెను. ఇది యెనిమిదవ యధ్యాయము.



## గంగావతరణ కథ. కల్మాషపాద ఖట్వాంగచరిత్రములు.

అంశుమంతుఁ డెట్లయినను గంగను దెచ్చి తన తండ్రులను దరింపఁజేయ యత్నించి పెద్దకాలము తపమొనర్చెను; కాని కార్యము నెఱవేర్పకయె మృతినొందెను. పిమ్మట నతని కుమారుఁడు దిలీపుఁడును దండ్రివలెనే గంగను గొని వచ్చుటకై తపమాచరించి యందుల కసమర్థుఁడై కాలధర్మ మొందెను. అనంతర మతని కుమారుఁడు భగీరథుఁడు దృఢమనస్కుఁడై తండ్రితాతలు దలంచిన కార్యమును గొనసాగింపనెంచి మిక్కిలి యుగ్రమగు తపమొనర్చెను. అతని తపమునకు సంతసించి గంగాదేవి యతనికిఁ బ్రత్యక్షమై “ఓయీ ! నీకిష్టమగు వరమును వేఁడుమిచ్చెద” నని పల్కఁగా భగీరథుఁ డామెకు నమస్కరించి యభిప్రాయమును వెల్లడించెను. అదివిని గంగాదేవి యిట్లనియె. “ఓయీ ! నేను భూతలమున కవతరించునపుడు నా వేగమును సహించువా రెవరు? అట్టి వాఁడెవఁడైనను లేనిచో నేను భూతలమును భేదించి పాతాళమున కరుగవలసి వచ్చును. ఇంతియకాక భూలోకమునఁ బ్రజలు తమ పాపములను నాయందుఁ గడుగుకొందురు. ఆ నరులు నాకుఁ గల్గించు పాపమును నే నెట్లు తొలఁగించుకొనఁగలుగుదు? కావున నేను భూమియందుఁ బ్రవహింప నిష్టపడను. దీనికిఁ దగిన యుపాయ

మాలోచింపుము.” అనిన విని భగీరథుఁ డిట్లనియె. “ఓ తల్లీ! భూమిలోఁ గేవలము పాపాత్ములే లేరు. కామ్యకర్మములను విడిచి యింద్రియములను జయించి బ్రహ్మోపాసకులును నగు బ్రాహ్మణ శ్రేష్ఠులు పెక్కురు గలరు. వారు లోకములనుబవిత్రములఁ జేయఁ జాలినవారు. వారు వచ్చి నీలోఁ దానమాడుటచే మానవుల వలన నీకుఁ గల్గినపాపములను స్వీకరింతురు. భగవంతుఁడు పాప హారుఁడు; కాన యా సాధువులం దెల్లప్పుడును నివసించి యాపాప ములను హరించును. కావున దీనికి నీవు విచారింప వలసిన పని లేదు. తంతువులందుఁ బటమువలె నెవనియం దీవిశ్వమంతయు వ్యాపించినదో, యెవఁడు బ్రహ్మ మొదలుకొని తృణమువఱకుఁగల శరీరుల కంతరాత్మయై యున్నాఁడో, రుద్రశరీరకుఁ డగు నాపర మాత్మ నీ వేగమును ధరింపఁ గల్గును” అనిన భగీరథు వచన ములు విని గంగ వానికి వెండియు నిట్లనియె. “వత్సా! నీ చెప్పిన యుపాయమునకు సంతసించితిని. నాయుదకములు ధరించు నిమి త్తము శంకరునిఁ బ్రసన్నునిఁగా జేసికొనుము” అనిన విని సంతసించి యారాజ చట్టుగదలి యొక పవిత్రస్థలమును జేరి శంకరునిఁదపంబున నారాధించెను. దానికతఁడు స్వల్పకాలము లోనే ప్రసన్నుఁడయ్యెను. భగీరథుఁడు తన మనోరథమును విన్న వింప శంకరుం డిదివఱకే “లోకహితముకై గంగానదినిదాల్చెద” ననిశపథము చేసియున్నవాఁడు; కావున నతని కోర్కెకి మాఱు చెప్పక సమ్మతించి విష్ణుపాదమునుండి వెడలినదగుటచే పవిత్ర మైన గంగానదిని ధరించెను. అనంతరము భగీరథుఁడు లోక పావనియగు గంగను తన పితరుల దేహములు భస్మమై పడిన స్థలమునకుఁ దీసికొనిపో నిశ్చయించి వాయువేగముతోఁ దనరథ

మాను నడిపింపఁగా గంగ దానిననుసరించెను. ఇట్లు గంగ దేశ ములనుండి పాతివానిని దడుపుచుఁ బవిత్రముగాఁ జేయుచుఁ బోయిదగ్ధులయిన సగరకుమారులను దడిపెను. ఆసగరసుతులు బ్రాహ్మణున కపరాధము చేయుటచే భస్మమైనను దమ దేహ భస్మములకు గంగాజలస్పర్శములభించుటచేనందఱునుస్వర్గమును జెందిరి. ఓరాజా! భస్మీభూతములగు శరీరములచేతనే గంగను దాఁకి సగరసుతులు ముక్తిచెందిరని చెప్పవలసినపుడు దృఢనియ మముతో శ్రద్ధతో గంగానదిలోఁ దానమాడు వారికి స్వర్గము లభించునని వేఱ చెప్పవలయునా? సంసారచ్ఛేదకుఁడగు హరి పాదకమలమునఁ బుట్టిన గంగానదిజలస్పర్శమునం దింత ప్రభావ మున్నదని యాశ్చర్యపడ నవసరము లేదు. ఆయనంతుని పాద కమలములందుఁ శ్రద్ధతోఁదమ మనస్సులను నిల్పినమునీశ్వరులు రాగాదిదోషవర్జితులై విడువఁదరముకాని ప్రకృతి సంబంధమును విడిచి తత్కాలమునందేముక్తిఁ జెందుచుండ దీనికాశ్చర్యమేల? ఓరాజా! ఆ భగీరథునకు శ్రుతుఁడను కుమారుఁడు కలి గెను. అతనికి నాభావరుఁడు జన్మించెను. వానికి సింధుద్వీపుఁ డుదయించె. అతనికయుతాయువుసంభవించె. అతనికిఋతుపర్ణుఁడు పుట్టె అతఁడే నలునికి మిత్రుఁడై యతనికి ద్యూత శాస్త్ర రహస్యమును దెలిపి యతనివలననశ్వవిద్యనుసంపాదించె. అతనికి సర్వకాముఁ డుదయించెను. సర్వకామునకు సుదాసుఁడు ప్రభవించె. అతనికి మదయంతీపతి సంభవించె. ఓనృపా! అతని నే మిత్రసహుఁడనియు మఱికొందఱు కల్మాషపాదుఁడనియుఁ జెప్పుదురు. ఆకల్మాష పాదుఁడే వసిష్ఠుని శాపమువలన సంతాన రహితుఁడాయెను" అని పలుకు శుకునిఁజూచి "మహాత్ముఁడగు

సౌదాసునకు శాపము సంభవించుటకుఁ గారణమేమో తెలుపఁదగినచోఁ దెలుపు" మనియడుగఁగా నతనికి శుకుం డిట్లనియె. "ఓ నరపాలా! సౌదాసుఁ డొకప్పు డడవికివేఁటాడఁబోయియట నొకరాక్షసుని సంహరించి వాని సోదరునిఁజంపకుండ విడిచెను. ఆదురాత్ముఁడు తన సోదరునిఁ జంపినందులకా రాజునకుఁ దగిన ప్రత్యపకారము చేయఁ దలంచియతని గృహమునకు వంటవాని వేషముతోఁ జని యనుజ్ఞవడసి పాకాదు లొనర్చుచునుండెను. ఒకపుడువసిష్ఠుఁడురాజు గృహమునకుభుజింపరాఁగా నీవంటవాఁ డతనికి నరమాంసము వండిపెట్టెను. వడ్డించుచున్న యా మాంసమును జూచినసిష్ఠుఁడు త్వరగాఁదెలిసికొని కోపముతోరాజును జూచి"నీ విట్లు నరమాంసమును నాకుఁబెట్టించితివి కాన రాక్షసుఁడవగు"మని శపించి తరువాత నాయపరాధము వంటవానిదికాని రాజుదికాదని తెలిసికొని యాశాపమును బండ్రెండు సంవత్సరములు మాత్రమే యనుభవింపఁదగిన దని యవధియేర్పఱిచెను. అంతసౌదాసుఁడు నిష్కారణముగాఁదన్ను శపించినవసిష్ఠునిపైఁ గోపముంచి మాఱుశాప మీయనెంచి చేతితో నీళ్లు పట్టుకొనెను. కాని యతని భార్యయగు మదయంతి వలదని వారించుటచే నాయుద్యమమును మాని యా జలమును జీవులతో నిండిన భూమ్యాకాశములం దెచ్చటఁ బోసినను జీవుల కపాయము సంభవించునని యెంచి యా జలమును దన పాదములపై విడిచెను. తీవ్రములగు నాయుదకములతాఁకుడుచేఁ బాదములు కమలి నల్లవడియెను. నైల్యమనఁ గల్మాషమే. కల్మాషము పాదములందు గల్గిన కారణమున నతఁడు కల్మాషపాదుఁడని పేరు గాంచెను. అతఁడు రాక్షసుఁడై యడవిలోఁ దిరుగుచు మిక్కిలి

యాఁకలిగొని యొకచోట మునిదంపతులు వానరరూపముల నొంది క్రీడించుచుండగాఁ జూచి యందుఁ బురుష వానరమును భక్షింపఁ బట్టుకొనెను. అపుడాముని పత్ని రతియందుఁ దనపతి తృప్తిచెందినట్లు కానక యా రాక్షసునిఁ జూచి యిట్లనియె. "ఓయీ ! నీవు రాక్షసుఁడవు కావు; ఇక్ష్వాకు సంతతికిఁ జెందిన మహాత్ముఁడవు; మదయంతికి భర్తవు. ఇట్టి యోగ్యుఁడవు కావున నీవు బ్రాహ్మణునిఁ జంపుట యుక్తము కాదు. నేను సంతాన మపేక్షించి యితనితోఁ గ్రీడించు చుంటిని. నాయందితఁ డింకను దృప్తి చెందలేదు. ఇట్టి సమయమునఁ జంపుట మహా పాతకమండ్రు. ఇంతియకాక మానుష దేహము జీవుని కన్ని పురుషార్థములను సంపాదించును. అట్టి మానవ శరీరమును నీవు రక్షించినచోఁ బురుషార్థముల నన్నింటిని నశింపఁ జేయుటవలనఁ గల్గిన పాపములను బొందవలసి వచ్చును. మఱియు, నితఁడు విద్వాంసుఁడు, తపశ్శాలి, సత్ప్రవర్తనుఁడు, సద్గుణవంతుఁడు. మహాపురుషుఁడును సర్వజ్ఞత్వాది గుణములతోఁ గూడ సకల భూతములందు నంతరాత్మయై యున్నవాఁడు నగు పరమాత్మ నుపాసింపనున్నాఁడు. ఇట్టి బ్రహ్మర్షిని రాజర్షి శ్రేష్ఠుఁడవును, రాజ్యపాలకుఁడవును నగు నీవు తండ్రి కొడుకునువలెఁ జంపుట ధర్మమా ? మఱియు సజ్జనహితుఁడవగు నీవు సాధువును బాప రహితుఁడును బ్రహ్మవాదియు సూత్రాదులను జదివినవాఁడును నగు నీ బ్రాహ్మణునిఁ జంపుట న్యాయమా ! గోవధవలెనే బ్రహ్మ వధయును విడువఁదగినదియే. కావున నితని విడువుము. నా ప్రార్థనము వినక యన్నివిధములచేత నితని భక్షింప నిశ్చయించితేని నన్ను ముందుగాఁదిని పిమ్మట నాభర్తను దినుము. జీవరహితమగు

దేహమువలె నితఁడులేని నేను క్షణకాలమైనను జీవింపలేను" అని యిట్లాబ్రాహ్మణి దీనముగాఁబ్రార్థించుచు,దిక్కుమాలిన దానివలె విలపించుచున్నను శాపమోహితుఁడగుటచే సౌదాసుఁడు వినక పులి పశువునువలె నాబ్రాహ్మణుని భక్షించెను.అనంతరము రాక్షసునిచే భక్షితుఁడయిన భర్తనుజూచి బ్రాహ్మణితనదుర్దశను గూర్చి దుఃఖించుచుఁ దుదకుఁ గోపోద్దీపితయై సౌదాసునిఁజూచి "కామార్తనగు నాప్రార్థనమువినక నిరపరాధుఁడయిననాభర్తను భక్షించితివి. కావున నీవు శాపార్హుఁడవు. నీవు స్త్రీతో సంగమించితివేని మరణ మందుదువు గాక" యని శపించి సహగమనముఁ జేయనెంచి భర్త యెముకలను నేరి చితిపైఁ బెట్టి ప్రజ్వలింపఁజేసి తన దేహము నందువైచి భర్త పొందినలోకమునే చెందెను. సౌదాసుఁడు పండ్రెండు వత్సరములు గడపి శాపవిముక్తుఁడై పురము చేరియొకనాఁడు భార్యయగుమదయంతితోఁ గ్రీడింప యత్నింప నామె బ్రాహ్మణశాపమును తెలిపి నివారించెను.అదిమొదలు సౌదాసుఁడుమృత్యువునకు భయపడి స్త్రీసంగమును విడిచెను. ఆకారణమున నతనికిఁ దనకుఁ గల్గిన సంతానము లేదయ్యె. అనంతరము, సౌదాసుఁడు తన భార్యకు సంతాన మిమ్మని వసిష్ఠునిఁ గోరఁగా నతఁ డందులకు సమ్మతించి యట్లు చేసెను.మదయంతి గర్భముఁదాల్చెను. కాని యేడు వత్సరములు గతించినను బ్రసవము కాలేదు. అప్పు డామె ఱాతితో గడుపును గొట్టుకొనఁగా నొక పుత్త్రుఁడుకలిగెను. అశ్మఘాతము వలనఁ గల్గుటంబట్టి యాసుతున కశ్మకుఁ డనునామము గల్గె. ఆ యశ్మకున కొకకుమారుఁ డుదయించె. పరశురాముఁడు క్షత్త్రియులసంహారింప భూమిని దిరుగుచున్నప్పుడతఁడు స్త్రీలచే

రక్షింపఁబడి జీవించి పిమ్మట క్షత్రియవంశమునకు మూల భూతుఁ డయ్యెను. నారీజనముచే రక్షింపఁబడుటచే నారీకవచుఁ డనియు, క్షత్రియవంశమునకు మూల మగుటవలన మూలకుఁ డనియుఁ బేరొందెను. అతనికి దశరథుఁ డనువాఁ డుదయించె. అతనికి నైలబిలుఁడు సంభవించె. వానికివిశ్వసహుఁడు ప్రభవించె. అతనికిఖట్వాంగుఁడుఁగలిగె. అతఁడు చక్రవర్తియైభూమినిపాలిం చుచు నొకప్పుడు దేవతల ప్రార్థనముచొప్పున వారికి సహాయుఁడు గాఁ బోయి యుద్ధమున దుర్జయులగు దైత్యులను సంహ రించెను. దానికి దేవతలు సంతసించి "వరము కోరుకొ" మ్మనిరి. అతఁడు తన యాయు వింక నెంతకాల మున్నదో తెలుపుఁ డని సురలను వేఁడెను. వారింకొక రెండుగడియలకాల మున్న దని చెప్పఁగాఁ దన పురమునకు మరలి యతఁ డిట్లు నిశ్చయిం చుకొనెను. "నాకు బ్రాహ్మణకులముకంటెఁ బ్రాణములు ప్రియ ములుకావు. కులదైవమే నాకుఁ బ్రియమైనది; కాని కొడుకు లును, సంపదలును, భూమియు, రాజ్యమును, భార్య, జనమును నాకుఁ బ్రేమింపఁ దగినవికావు. చిన్నతనమునుండియు నామన స్సధర్మమార్గమునఁ జరింపలేదు. ఉత్తమశ్లోకుఁ డయినభగవం తునికంటె వేఱయిన వస్తువు విశ్వమం దున్నద నిభావింపలేదు. ముల్లోకములకధిపతు లగుదేవతలునాకుఁ గావలసిన వరమిచ్చెద మనిరి. అయినను భగవంతుని సంతతమును సేవించెడి నేను దానిని నిరసించితిని. దేవతలును దేహాత్మాభిమానముగలవారై సర్వదా తమ హృదయముల నంతరాత్మరూపముగా నున్నపర మేశ్వరునిఁ జూచి సర్వోత్తమవస్తువుఁగా భావింపఁజాలక సామా న్యము లగు విషయసుఖములనే పరవస్తువుఁగా భావింతురు.

దేవతలే యట్లు వర్తించుచున్నప్పుడు తక్కినవారి సంగతి చెప్ప నేల? అయినను దేవతావరముగానిస్వర్గముగాని భగవత్ప్రాప్తి కడ్డుగల్గించునని విసర్జించితిని. కావున నీలోకమున భగవన్మాయచే నిర్మితములై గంధర్వనగరములవలె ననిత్యములై యున్నశబ్దాది విషయములందును బ్రకృతిపరిణామాత్మక మగుశరీరమందును, సంగమును విడిచి పరమేశ్వరుని భక్తితో శరణొందెదను'' అని నిశ్చయించుకొని భక్తులందఱును దేనిని ప్రమాణసిద్ధమును హేయగుణరహితమును, కల్యాణగుణ నిలయమును, దురూహ మును నగు, పరబ్రహ్మమునుగాఁ జెప్పుదురో, యా పరవస్తువు నందు మనస్సు నిలిపి దేహమును విడిచి గుణాష్టక రూప మగు స్వస్వరూపము నొందెను. ఇది తొమ్మిదవ యధ్యాయము.

---

## శ్రీ రా మ చ రి త్ర ము.

ఓరాజా! ఆ ఖట్వాంగునకు దీర్ఘబాహువును, వానికి మహా కీర్తియగు రఘుమహారాజును, వాని కజుఁడును, వానికి దశరథుఁ డును సంభవించిరి. వేదమయుఁ డయినవిష్ణు వంశాంశములచే నాల్గువిధములయి సురల ప్రార్థనము చొప్పున నా దశరథునకుఁ బుత్త్రచతుష్టయమై జన్మించెను. ఆ నలువురును గ్రమముగా రాముఁడనియు లక్ష్మణుఁడనియు భరతుఁడనియు, శత్రుఘ్నుఁడ నియు నామములను దాల్చిరి. ఓరాజేంద్రా! సీతాపతి శ్రీరాముని చరితమును దత్త్వదర్శు లగువాల్మీకాదిమునులు విపుల ముగా వర్ణించిరి. నీవుగూడ ననేకపర్యాయము లాచరిత్రమును విని యున్నావు. తండ్రి సత్యవాక్యమును బరిపాలించుటకై రాజ్యమువిడిచియడవి కేఁగి ప్రియురాలగుసీతకరస్పర్శముననై నను

సహింపఁజాలని సుకుమారము లగు పాదపద్మములతో నందుఁ గ్రుమ్మరుచు, సుగ్రీవలక్ష్మణుల యనునయవచనములచే మార్గాయాసమును దొలగించుకొనుచు రాఁగా, శూర్పణఖనువిరూపనుగాఁ జేయుటచేఁగుపితుఁ డై నరావణుఁడు సీతను గొనిపోవఁగాఁ దదీయవిరహమువలనఁ గోపోద్దీపితుఁడై బొమముడి మాత్రము చేత భయపడిన సముద్రుని బంధించి రావణాదు లనెడి మహాటవికి దావానలమువంటివాఁడైన శ్రీరాముఁడుమము రక్షించుఁ గాక" అని శ్రీశుకుఁడు ధ్యానించి వెండియు రాజున కిట్లనియె. "ఓరాజేంద్రా! రాముఁడు చిన్నతనమునందు విశ్వామిత్రుని యాగమును సంరక్షింపలక్ష్మణునితోఁ బోయియునతనిసాయ మక్కఱ లేకయే మారీచాది రాక్షసులను దునుమాడెను. అనంతరము రాముఁడు విదేహదేశములకరిగి సీతాస్వయంవరసమయమున వీరాధివీరులు చూచుచుండఁగా మున్నూఱుగురు బలవంతులు గొనివచ్చినదియుఁ గఠోరమైనదియు నగుశివధనుస్సును సులభముగా నెక్కిడి యేనుఁగుగున్న చెఱకునువలె ముక్కలు చేసెను. ఇట్లు విఱిచి సౌందర్యము చేతను గుణములచేతను సుస్వభావము చేతను ప్రాయముచేతను దనకు సరివచ్చుచు, సీతానామమును దాల్చి పూర్వజన్మమున లక్ష్మీనామముతోఁదనవక్షస్స్థలముననివసించిన యాకన్యామణిని వశము గావించుకొని మరలి తనపురమునకు వచ్చుచు, మార్గమధ్యమున నిరువదియొక్కమాఱు భూమండలమునసంచరించిరాజులనెల్లఁబొలియించినపరశురాముని యెదుర్కొని యతనిగర్వమునుబూర్ణముగా నశింపఁజేసెను. తరువాత నతఁడయోధ్య చేరి సీతతోసుఖముగాఁగాలము గడుపుచుఁ దన తండ్రి యగుదశరథుఁడుసత్యపాశబద్ధుఁడై పూర్వము కైక



1556. సీతావివాహము.

కొసంగిన వరములఁ దీర్ప నిశ్చయించి యడవి కేఁగు మనఁగా దానికి సంతసించి యోగీశ్వరుఁడు ప్రాణములవలెనే రాజ్యసంపదలను మిత్రులను గృహములను దల్లిని సంతోష పూర్వకముగా విడిచి యరణ్యమున కరిగెను. కొంతకాల మట సంచరించుచు నొకచోట రావణుని చెల్లెలును గామాతురయు నగుశూర్పణఖను విరూపనుగాఁ జేసికోదండపాణియై వనవాసమున మిక్కిలి కృశించినవాఁడైనను నొక్కఁడే దాని బాంధవులగు ఖరదూషణులు త్రిశిరుఁడు మొదలగు పదునాల్గువేల రక్కసులను సంహరించెను. సీతావృత్తాంతమును శూర్పణఖవలన విని రావణుఁడు కామాంధుఁడై తనంతఁ దాను సీతను గొనిపోవ జంకి మారీచుని తోడుగై కొనెను. మారీచుఁడు కనకమృగమై సీతారాములకు మోహముఁగల్గించిరాముని నాశ్రమమునుండి మిక్కిలిదూరము గొనిపోఁగా నంత నతఁడు దాని మాయనుగనుఁగొని సంహరించి మగిడి వచ్చుచుండెను; కాని రామలక్ష్మణు లిరువురు నాశ్రమమందు లేకుండుటఁజూచిరావణుఁడుతోఁడేలివలెఁబొంచి యుండి సీతను గొనిపోయి లంకలో నుంచెను. బ్రహ్మరుద్రాదులచేఁ బూజితము లగుపాదపద్మములు గల రాముఁడు భార్యావియోగము నొంది స్త్రీసంగము గలవారిట్లే దుఃఖభాక్కులగుదు రనునది నల్వురకుఁ దెలియఁజేయుచుఁ గృపణునివలె దుఃఖించుచుఁ దమ్మునితోఁ గూడ వనమందుఁ జరించుచు, సీతను విడిపించుటకై రావణునితోఁ బోరి చచ్చిన జటాయువనుగృధ్రమున కుత్తరక్రియలు సలిపి, కబంధునిఁ దెగటార్చి, వానరులతో మైత్రి చేసికొని, వాలినిజంపి,సుగ్రీవునికిఁబట్టముకట్టి వానరులవలన సీత జాడ తెలిసికొని వనచరసమూహములతోఁ

గూడి సముద్రతీరమునవిడిసెను. అతఁడక్కడ మూఁడుదినములు దీక్షితుఁడై సముద్రునుపాసించెను; కాని యతండు ప్రసన్నుఁడు కాలేదు. అందులకు రాముఁడుకుపితుఁడై నిప్పులరాల్చుకడ కంటితో సాగరమును జూడనారంభించెను. దానికోర్వఁజాలక జల జంతువులు దిరుగుడు పడఁజొచ్చెను. తోడనే సముద్రుఁడు భయ ముచే స్తంభీభూతుఁడై పూజాద్రవ్యములఁ దాల్చి మూర్తి మంతుఁడై వచ్చి యతనిపాదారవిందముల శరణుసొచ్చి యి ట్లనియె. "ఓరామా! నిర్వికారుఁడవునులోకాధిపతివి యు నాది పురుషుఁడవునునగునిన్ను జడుడనగు నేనెట్లు తెలిసికోఁగలను. అయి నను నీ సందర్శనమువలన జ్ఞానవంతుఁడనై నీ కధీనములైన త్రిగుణములలో సత్త్వమువలన సురగణములును రజస్సువలనఁ బ్రజాపతులును దమంబువలన రుద్రాదులును జనించిరనియు, సత్త్వాదులకు నీవు నియంతవనియు నిప్పుడు తెలిసికొంటిని. ఓ దేవా! నా జలమును బంధించి స్వేచ్ఛగా నరుగుము. విశ్ర వసుని కుమారుని రావణుని జయింపుము. సీతను గొనిరమ్ము. ఆలోచింప నాజలమును నీకుఁ బ్రతిబంధకము గాదు. అయి నను దిగ్విజయు లగురాజులందఱును నీయొనర్చిన మహాకార్య మును జూచి యచ్చెరువడి నీ కీర్తిని గానముచేయునట్లుగా నాపై సేతువును బంధింపుము." అని పలికిన సముద్రుని వచన ములు విని రాముఁడు సంతసించి కపీంద్రులు కొనివచ్చిన వృక్షములచేతను బర్వతశిఖరములచేతను సేతువును బంధించి, సుగ్రీవుఁడు, నలుఁడు, హనుమంతుఁడు మొదలగు వానరవరు లతో సముద్రమునుదాఁటి విభీషణుఁడు చూపుచున్నమార్గము ననుసరించి పూర్వము హనుమంతునిచే భస్మీభూతము



1558. విభీషణుఁడు శ్రీరాముని శరణుఁ జొచ్చుట.

గావింపఁబడిన లంకను జొచ్చెను. వానరవీరులు లెక్క కెక్కు-వయి తన్ను నిరోధించి క్రీడాస్థానములను గోపురములను సభామండపములను, ధాన్యాగారములను, ధనగృహములను, ద్వారములను, గృహములను, ప్రాసాదములను, గవాక్షపాలికలను, వేదికాదులను, ధ్వజములను, హేమకుంభములను, శృంగాటకములను, ధ్వంసము సేయఁగాఁబాడువడిన లంకాపురి, యేనుఁగు కదుపులచేఁ గలఁచఁబడిన నదివలెనే ఘూర్ణిల్లసాగెను. రావణుఁడు వానరులు చేయు ఘోరకృత్యములకు సహింపఁజాలక నికుంభుఁడు, కుంభుఁడు, ధూమ్రాక్షుఁడు, దుర్ముఖుఁడు, దేవాంతకుఁడు, నరాంతకుఁడు. ఇంద్రజిత్తు, ప్రహస్తుఁడు, కుంభకర్ణుఁడు మొదలగు వీరులను బ్రత్యేకముగా వానివాని సైన్యములతోఁ గూడ యుద్ధమునకుఁ బంపెను. శూలములు, కత్తులు, చాపములు, శరములు, ప్రాసములు, తోమరములు, భిండివాలములు, పట్టిసములు మొదలగు నాయుధములఁ దాల్చి యారాక్షససైన్యములు విజృంభించి వచ్చుచుండెను. అది రాముఁడుచూచి సుగ్రీవుఁడు, లక్ష్మణుఁడు, హనుమంతుఁడు, గంధమాదనుఁడు, నీలుఁడు, అంగదుఁడు, ఋక్షుఁడు, పనసుఁడు మొదలగు వానరవీరులతోఁ గదలిపోయి దైత్యసైన్యముల నెదుర్కొని పోరనారంభించెను. అందు రాముని సేనానాయకు లగునంగదాదులు రావణుని గజములతోను, రథములతోను, గుఱ్ఱములతోను, బదాతులతోను, గలసికొని వృక్షములచేతను, బర్వతముల చేతను, బాణములచేతను, గదలచేతను మోదిరి. ఘోరయుద్ధము జరిగెను. దానిలో రావణుని బలమంతయుఁ గూలెను. తన బలమంతయు యుద్ధమునఁ గూలుట చూచి రావణుఁడు కుపి

తుఁడై విమానమెక్కి రాముని నెదుర్కొనెను. అంత రాముఁడు మాతలియుత మగునింద్రరథము సూర్యునివలెఁ బ్రకాశించుచు దన నిమిత్తము రాఁగా దాని నధిష్ఠించి మిక్కిలి విరాజిలుచుండెను. రావణుఁడు చూచి సహింపలేక వెంటనే యతి నిశితము లగుబాణములచే రామునిఁ గొట్టెను. రాముఁ డా బాణములను గూల్చుచు వానిఁ జూచి యిట్లనియె. "ఓరీ రాక్షసాధమా! కుక్క చాటుచాటున నిల్లు సొచ్చి వస్తువును దస్కరించికొనిపోయినట్లు మేము లేనట్టిసమయమున మాయాశ్రమమును బ్రవేశించి నా భార్యను బతివ్రత నపహరించితివి. లజ్జాకర మయినకార్యము చేసియు నీవు లజ్జింపకున్నావు. యముని వలె మహాబలుఁడనగు నేను నీ వొనర్చిన యా చెడుపనికిఁ దగిన ఫలము నిప్పుడే యందించెదను." అని పలికి యంత వింట శరమును సంధించి ప్రయోగించెను. అది వజ్రాయుధమువలెఁ ననివార్యమై పోయి రావణుని హృదయమును భేదించెను. తోడనే వాఁడు పదిముఖములచే రక్తము గ్రక్కుచు క్షీణపుణ్యుఁ డగువాఁడు స్వర్గమునుండి భూమిపై బడినట్లు విమానము నుండి క్రిందఁబడి ప్రాణములు విడిచెను. అప్పుడు మండోదరి మొదలగు రాక్షసస్త్రీలు వడివడి రావణు సమీపమున కరిగిరి. అక్కడ శత్రుబాణములచే నిహతు లైనతమ తమ బంధువులను కౌఁగిలించుకొనుచు గుండెలు బాదుకొనుచు దీనురాండ్రయి యెలుగెత్తి యిట్లు విలపింప నారంభించిరి. "ఓనాథా! ఓలోకరావణా! మేము హతప్రాయుల మయితిమి. ఇప్పుడు శత్రువులచేఁ బీడితయగు లంకాపురి నీవు లేక పోవుటచే శోభారహిత మైయున్నది. ఇఁక లంకాపురజను లెవని

శరణుఁజొత్తురు. ఓనాథా! నీవు కామాంధుఁడవై సీతాదేవి ప్రభావము నెఱుఁగక యపకార మొనర్చితివి. అందుచేత నేఁడా నీ కిట్టి దుర్దశ సంప్రాప్తమైనది. ఓ కులవర్ధనా! పతివ్రత యగు సీత కపకారము చేయుటచేత నే యీ లంకాపురి మావలె విధవ యైనది. నీ దేహము గ్రద్దల కాహార మైనది. నీ యాత్మ నరక మనుభవింపఁ బోయినది.'' అని యిట్లు విలపించుచుండ విభీషణుఁడు రామాజ్ఞనుబొంది వారి నోదార్చి రావణాదులకు యథావిధిగాఁ బ్రేతకర్మము లొనర్చెను. పిమ్మట శ్రీరాముఁ డశోకవనమున నొక శింశుపామూలము నాశ్రయించి తన యెడఁబాటునకు మిగులఁ దపించుచుఁ గృశించి తన సందర్శనమున వికసించిన ముఖపద్మముఁ గల్గి యున్న తన ప్రియురాలిని సీతను గరుణించి యామె నోదార్చి పుష్పక మెక్కించి విభీషణుని లంకాధిపతినిఁగా నొనర్చి కల్పాంతమునఱకుఁ బ్రదికియుండునట్లు వరమిచ్చి సుగ్రీవ విభీషణులతోను, హనుమంతునితోడను, నందుఁ గూర్చుండి మార్గమధ్యమున లోకపాలు రిచ్చుచున్న పూజలను గైకొనుచు బ్రహ్మాదులు తన యద్భుతచరిత్రముల నుతించుచుండఁగా నయోధ్యాపురమునకుఁ బోయెను. అక్కడ భరతుఁడు వల్కలాంబరములను జటలను దాల్చి గోమూత్రసహిత మగుయవాన్నమును మాత్రమే భుజించుచు దర్భలపై శయనించుచు, నున్నట్టువిని కరుణాశాలి యగు రాముఁడు మిక్కిలిపరితపించెను. అట భరతుఁడు శ్రీరాముని రాకను విని సంతసించి పురజనులతోను, మంత్రులతోను, బురోహితులతోను గూడి పాదుకలను శిరమునఁ దాల్చి మంగళవాద్యములు మ్రోఁగుచుండఁగా, బ్రాహ్మణులు గొంతెత్తి స్వస్తివచనములను బఠించుచుండఁగా,

నందిగ్రామమునుండి రాము నెదుర్కొనఁబోయెను. ఆసమయ
మున సరిగంచు పతాకలచే వెలయు రథములపైఁ గొంద
ఱును, నుత్తమాశ్వములపైఁ గొందఱును, బయలు వెడలిరి.
స్వర్ణకవచములను దాల్చిన భటులు గొందఱు బారులుదీర్చి
నడవఁజొచ్చిరి. వారాంగనలు తాంబూలాదులను ధరించి
పోఁజొచ్చిరి.పురజను లందఱును మహారాజునకర్హము లగు ఛత్ర
చామరాదు లగుకానుకలఁ బట్టికొని యెదురు చనిరి. ఇట్లు
మహాపరివారముతో భరతుఁ డన్న నెదుర్కొని ప్రేమచే
హృదయము ద్రవింపఁ గన్నులు బాష్పముచే నిండ భక్తితోఁ
బాదుకలను ముందుంచుకొని దోసిలిగట్టి నిలుచుండెను. అంత
శ్రీరాముఁడు తమ్ముని భరతుని గట్టిగా నాలింగనముచేసికొని
యానందబాష్పములచే నతనిఁ దడుపుచు, భ్రాతృప్రేమను వెలి
పుచ్చుచుఁ బ్రజలొసంగు నమస్కృతు లొందుచు నమస్కార
యోగ్యులగు కులవృద్ధులకెల్ల సీతాలక్ష్మణులతోఁగూడ నమస్క
రించెను. ఉత్తరకోసలవాసు లగుజను లందఱును జిరకాలమునకు
వచ్చిన ప్రభువును జూచి పుష్పములు జల్లుచు నుత్తరీయములను
గదల్చుచు సంతసముతో నృత్యముసేయ నారంభించిరి. అనంత
రము రాముఁ డయోధ్యాభిముఖుఁడై యరిగెను. అప్పుడు భర
తుఁడు పాదుకలను దాల్చెను. సుగ్రీవవిభీషణులు చామర
ములు వీచుచుండిరి. ఆంజనేయుఁడు శ్వేతాతపత్రము పట్టెను.
ధనుస్సును, తూణీరములును శత్రుఘ్నుఁడు ధరించెను. సీతతీర్థ
కమండలువును బట్టుకొనెను. అంగదుఁడు ఖడ్గము స్వీకరించెను.
జాంబవంతుఁడు బంగారుడాలును ధరించెను. శ్రీరాముఁ డిట్లు
సేవింపఁబడుచుఁ బుష్పకాసీనుఁడై స్త్రీలచేఁ బరివేష్టితుఁడై



1563. శ్రీరామ పట్టాభిషేకము.

వందిమాగధులచే నుతింగాంచుచు, నప్పుడే యుపయించి గురు శుక్రాది గ్రహములతోఁ బ్రకాశించు చంద్రుని సరిపోలుచు భరతాదుల యనుమతిని బడసి మహావైభవముతో నయోధ్యను బ్రవేశించి రాజభవనమున కేఁగి కైక మొదలగు సవతితల్లులకును, జనతల్లియగు కౌసల్యకును, వసిష్ఠాదిమహాత్ములకును, స్నేహితులకును, కులీనులకును, ననుచరులకును,యథార్హముగాఁ బూజలొనర్చి యాదరించి వారి యాదరమునకుఁ బాత్రుఁడయ్యె. సీతాలక్ష్మణులుగూడ నచ్చటివారి నందఱను యథోచితముగాఁ బూజించి వారిచ్చు పూజల నందుచు రాజభవనముఁ జొచ్చిరి. కౌసల్యాదులు తమ పుత్రులను జెంది, పోయిన ప్రాణములు వచ్చినట్లు సంతసించి,తొడలపైఁగూర్చుండఁబెట్టుకొని యానంద బాష్పములచే స్నానము చేయించుచు దుఃఖములను విడిచిరి. అంత వసిష్ఠుఁడు కులవృద్ధులతోఁ గూడి రాముని జటలను విప్పించి చతుస్సముద్రములనుండి యుదకము తెప్పించి యథావిధిగా శ్రీరాముని రాజ్యమున నభిషిక్తునిఁజేసెను. రాముఁడిట్లభిషిక్తుఁడై సుందరవస్త్రములను దాల్చి చక్కఁగ నలంకృతుఁడై యా యలంకారములతోను, భార్యతోను, సోదరుల తోను మిక్కిలి ప్రకాశించెను. తరువాత భరతుఁడు పాదములపైఁబడి నమస్కరించి ప్రార్థింపఁగా సింహాసనమునఁగూర్చుండి ప్రజాపాలనభారము వహించెను. ప్రజలందఱును దమతమ ధర్మములను యథావిధిగా నాచరింప మొదలిడిరి. రాముఁడు తండ్రి పుత్రులనువలెఁ బ్రజలను గాపాడెను. ప్రజలు రామునిఁ దమతండ్రినిగా భావించిరి. అది త్రేతాయుగమైనను ధర్మము నాల్గుపాదములను బ్రవర్తించుటంజేసి కృతయుగమువలెఁ జూ

పట్టెను. సర్వభూతముల సుఖమును గాంక్షించువాఁడును ధర్మజ్ఞుఁడును నగు రాముఁడు రాజ్యము చేయుచుండఁగా వనములును, నదులును, బర్వతములును, రమ్యకాదివర్షములును, సింహళాదిద్వీపములును, సముద్రములును, బ్రజలు కోరిన వస్తువులనెల్ల నొసంగుచుండెను. ఓ పరీక్షిన్నరేంద్రా! రాముని రాజ్యమునఁ బ్రజల కాధిగాని వ్యాధులుగాని లేవు. ఎవనికిని ముదుసలితనము రాలేదు. ఆఁకొన్నవాఁడుగాని, దప్పిఁగొన్నవాఁడుగాని దుఃఖితుఁడుగాని భీతుఁడుగాని కష్టవంతుఁడుగాని మచ్చునకైనను గానరాలేదు. మృత్యువు తనంతఁ దావచ్చి యొక్కనినైనను గొనిపోలేదు. రాముఁడేక పత్నీవ్రతము నవలంబించి రాజర్షివలె నలరారుచు, రాగద్వేషాదులను బాఱఁద్రోలి ప్రజలకు విహితధర్మముల నేర్పుచు స్వయముగా వర్ణాశ్రమధర్మములను యథావిధిగా నాచరించెను. సీత వినయావనతయై ప్రేమచేతను బరిచర్యచేతను సుస్వభావముచేతను భయముచేతను సిగ్గుచేతను రాముని మనస్సును హరించి యతని ప్రేమ కాస్పదురా లయ్యె. ఇది పదియవ యధ్యాయము.

---

## శ్రీ రామ చరితము.

అనంతరము శ్రీరాముఁడు వసిష్ఠాదుల సాయమునఁ బెక్కు యాగములొనర్చి సర్వదేవమయుఁ డయినతన్ను నారాధించుకొనెను. ఇట్లు యాగములొనర్చి హోతకుఁ బ్రాగ్దిక్కును, బ్రహ్మకు దక్షిణమును, అధ్వర్యునకుఁ బశ్చిమదిక్కును, ఉద్గాత కుత్తరమును, నాదిశ కంతరమున నున్న భూమండలము నంతటి నాచార్యునకును దక్షిణగా నొసంగెను. ఇంతియకాక సకల వస్తువు

లందును నిస్పృహుఁడై సమస్తమును బ్రతిగ్రహింపబ్రాహ్మ ణులుతగుదురనితలంచితనయొడలనున్నయలంకారములనన్నిటిని విప్రుల కొసంగి కట్టుబట్టలతో మిగిలెను.సీత భర్త యభిప్రాయ మెఱిఁగి తన యలంకారములనెల్ల బీదల కిచ్చి మంగళసూత్రము మాత్రముమిగిల్చికొనెను. హోతమొదలగుబ్రాహ్మణులురాముని బ్రాహ్మణభక్తికిని సత్పురుషులందుఁ జూపు చున్నయతని యతి వాత్సల్యమునకును మిక్కిలి మెచ్చుకొని దయార్ద్రచిత్తులై యత నికిఁ బ్రాగాదిదిశల నర్పించి యిట్లు సంభాషించిరి. "ఓ భగ వంతా! ఓరామచంద్రా! నీవు సమస్తకామములచేతను సంపూ ర్ణుఁడవు. అట్టి నీకు వీనితో నేమి ప్రయోజనము? మఱియును మాహృదయమునఁ బ్రవేశించి స్వప్రకాశముచే నజ్ఞానమును దొలఁగించి నిరతిశయపురుషార్థమగుమోక్షమునే యిచ్చుచున్న నీ కీప్రాగాదిదిక్కుల నిచ్చుటయనఁగా నెంత ? నీవు బ్రహ్మ కులము నాదరించువాఁడవు. స్వీయతేజముచే సర్వదా వెలుఁ గొందువాఁడవు.నీవెప్పుడును సంకోచము నొందని యపరిచ్ఛిన్న జ్ఞానము గలవాఁడవు.ఉత్తమశ్లోకులలో ముఖ్యుఁడవు.మునీంద్రు లచే సేవింపఁబడు పాదపద్మములు గలవాఁడవు. అట్టి నీకు నమ స్కార" మనిపల్కి వెడలిపోయిరి. పిమ్మట రాముఁడు సీతతోఁ బదివేలవత్సరములు * సుఖముగా రాజ్యము సల్పి, యొకనాఁడు

* ఇందులకు మూలము. "త్రయోదశాబ్దసాహస్ర మగ్నిహోత్ర మఖండితమ్" అని యున్నది. "దశవర్షసహస్రాణి దశవర్షశతానిచ" అని రాముఁడు పదివేలవత్సరములు సీతతోఁ గలిసియున్నట్టును బదివందల వత్సర ములు సీతా వియోగానంతరమం దున్నట్టును నీశ్లోకమునఁగల పృథగ్వాక్య ములచేతనే తెలియుచున్నది. ఆలోచింపఁబై రెండిటికి విరోధము సంభ

లోకవృత్తాంతములను దెలిసికొన గూఢవేషముఁ దాల్చి యొరులకుఁ దెలియకుండఁ బురమున నచ్చటచ్చట సంచరించుచు నొకచోభార్యనుద్దేశించి జరుగుచున్న వాక్కలహమునువినెను. ఒక పురుషుఁడు పరుని యింటికి వెళ్లి వచ్చుటచేఁ దన భార్య వ్యభిచారిణి యనియు, దాని నేలుకొనననియుఁ దన చుట్టములతో వాదించుచుండెను. దానికి వారు "పరునియింట నున్న సీతను రాముఁ డేలుకొనలేదా?అంతకంటె నీవు ఘనుఁడవా?" యని పల్క వాఁడదివిని "రాముడు స్త్రీకిఁ బరవశుఁ డయ్యెఁ గావున సీతను దెచ్చుకొనెను. నేనట్టివాఁడను గాను. నే దానినొల్లనని" ప్రత్యుత్తర మిచ్చెను. రామున కిది చెవిని బడినతోడ నేమిక్కిలివిచారించినానాముఖముల లోకమునవ్యాపించుచున్నయపవాదమునకు భయపడి గర్భిణి యగుసీతను రహస్యముగా నడవిలో విడిచిపెట్టెను. అంత జానకి మృగములవాతఁ బడక భాగ్యవశమున వాల్మీకిమహాముని యాశ్రమమునకుఁ బోయి యతనిచే నాదరింపఁబడి ప్రసవకాలము రాఁగానేకవల పిల్లలను గాంచెను. వారు కుశలవులని వాసిఁగాంచిరి. వాల్మీకి యాకుమారులకు జాతకర్మాది క్రియల నొనర్చెను. ఇట లక్ష్మణున కంగదుఁడుచంద్రకేతుఁడుననువారును,భరతునకు దక్షుఁడు పుష్కలుఁడు ననువారును, శత్రుఘ్నునకు సుబాహుశ్రుతసేను

---

వించుచున్నది. అయినను రామావతార స్థితి పదునొకండువేలని ప్రసిద్ధి కావునఁ దదనుగుణముగా నీ సంఖ్యను సరిపుచ్చుకొనవలెను. ఎట్లన సీతా వియోగము నొందిన రాముఁడు వేయివత్సరములే కడపినను, నావియోగ కాలము మిక్కిలి దుస్సహమై, నూఱువత్సరముల కాల మొక వేయివత్సరముల కాలముకంటె నెక్కుడుగాఁ జూపట్టుచున్నదని యేదో యభిప్రాయము కల్పించుకొనవలెను.

లనువారును నిర్వ్రశేసి కొమరులు గల్గిరి. భరతుఁడు దిగ్విజయ మొనర్చుచుఁ గోట్లకొలఁది గంధర్వుల జయించి వారి సర్వధనమును గొనివచ్చి రామున కర్పించెను. శత్రుఘ్నుండును మధు రాక్షసుని కుమారుఁ డగు లవణాసురుని మధువనమునఁ జంపి యట మధురాపురిని నిర్మించెను. అట సీత తనకుమారులను వాల్మీకి కప్పగించి ప్రియవిరహమును సైఁపలేక యుతని పాదకమలమును ధ్యానించుచు భూవివరమును బ్రవేశించెను. శ్రీరాముఁ డదివిని సతత మామెగుణములనే స్మరించుకొనుచు జ్ఞానముచే దుఃఖము నరికట్ట నశక్తుఁ డయ్యెను. ఓరాజా! పురుషునకు స్త్రీసాంగత్యము మిక్కిలి చెఱుపు గల్గించును. అది ప్రతివానికిని దుఃఖము గల్గించు. భగవదవతారమగు రాముఁడే యాశోకము నడఁపఁజాలక పోయెను. గృహస్థులగు గ్రామ్యజనుల సంగతి చెప్పనేల? శ్రీరాముఁ డనంతరమున వేఱొక భార్యను బరిగ్రహింపక బ్రహ్మచర్యము సలుపుచునే పదుమూఁడువేల వత్సరంబు లగ్నిహోత్రము నఖండితముగా వేల్చెను. అనంతరము రాముఁడు దండకారణ్యమునఁ దిరుగుటచేఁ గంటక విద్ధములైన తనపాదములను బ్రజలు సంతతము తలంచుకొన్నట్లుచేసి జ్యోతిర్మయమయిన పరమపదమున కరిగెను. ఓరాజా! రాముఁడు దేవతల కోర్కిదీర్ప భూమియం దవతరించిన నారాయణుఁడే. లోకమున నతనికి సములుగాని యధికులుగాని లేరు. అట్టిమహాప్రభావముగల శ్రీరామునకు సముద్రబంధనము, రావణాది వధయు,సమరమునవానరులు తోడుచూపుటయు నివియన్నియు లీలామాత్రములని యెఱుంగుము. సంకల్ప మాత్రముచేతనే లోకముల సృజింపఁజాలిన రఘుపతి కిట్టి కార్యములవలన నేపాటి

కీర్తికలుగును? దిగంతములవఱకు వ్యాపించిన యెవనికీర్తిని గీర్తిధను లైన ధర్మరాజాదిరాజులు తమ సభలలో నుతించుచున్నారో, మార్కండేయాది మునులు దేనిని గానముచేయుచున్నారో, యెవని పాదపద్మములు పాపహరములై దేవతలయు రాజాధిరాజులయు శిరస్సుల కలంకారప్రాయములగునో, యట్టి శ్రీ రాముని శరణుసొచ్చెదను. కోసల దేశవాసులలో నెవరు రాముని సేవించిరో, యెవ్వరు సందర్శించిరో, యెవ రనుసరించిరో, వారందఱును గర్మవర్జితులై యోగీశ్వరులు పొందు నుత్తమ పదమును బొందిరి. ఓ రాజా! శాంతిసిద్ధుఁడగు పురుషుఁడు వీనుల విందుగా రామచరితమును విన్నచో వాఁడు సంసారహేతువులగు కర్మబంధములను వదలి ముక్తుఁ డగుచున్నాఁడు" అనిన విని రాజు శుకునిగాంచి "ఓ మునీంద్రా! రాముఁడు దేశవాసులను, సోదరులను, పౌరులను నెట్లు ప్రేమించి వర్తించెను? వారందఱును రాము నెట్లుప్రేమించి సేవించిరి? ఆ వృత్తాంతమును వివరముగాఁ జెప్పు"మనఁగా మునీంద్రుఁ డతని కిట్లనియె. త్రిభువనేశ్వరుఁడగు రాముఁడుసింహాసనమును స్వీకరించి తమ్ములనుదిశాపాలనమందు నియోగించి తాను దల్లులచెంతనుండి యనుచరులతోఁగూడ నయోధ్యను బాలింపఁ దొడఁగెను. రాముఁడు రాజయినప్పుడు వీథులన్నియుఁ జందనోదకములచేతను, మదపుటేనుఁగుల మదశీకరములచేతను దడుపఁ బడుచుండెను. ప్రజలు సంతోషభరితులై మేడలను, గోపురములను, సభా భవనములను, రథ్యాస్థలములను, దేవాలయములను, బంగారు కలశలములతోను, పతాకలతోను, పూగవృక్షములతోను, రంభాస్తంభములతోను, జిత్రతరములగువస్త్రములతోను, నద్దములతోను,

బూలదండలతోను, దోరణములతోను, నిరంతర మలంకరించి కన్నులపండువుగాఁ జేయుచుండిరి. ఇంతియకాక పౌరులు పూజా సాధనముల ధరించి రాముని దర్శించి పూజించి "ఓ దేవా! పూర్వము వరాహావతారమున నీ వుద్ధరించిన భూమండలము నిపుడు పరిపాలింపు" మని వేఁడుచు నాశీర్వదించుచుండిరి. చిర కాలమునకువచ్చిన శ్రీరాముని సందర్శింపవేడుక పడుచు స్త్రీలును, బురుషులును బిల్లలును దమతమ గృహములనువిడిచి మేడల నెక్కి కన్నులారఁ జూచియుఁ దనివిసెందక పుష్పవర్షములను గురియించిరి. రాముఁడు రాజమందిరమును బ్రవేశించెను. అది యిక్ష్వాకుఁడు మొదలగువారిచే సేవింపఁబడినది. అది నిరవధిక ములగు రత్నరాసులకునిలయమై యమూల్యములగు వస్తువులచే నొప్పుచు, పగడముల గడపలుగల ద్వారములచేతను, వైడూ ర్యమయములగు స్తంభపంక్తులచేతను, నిర్మలములగు నింద్రనీల ములు గూర్చిన ప్రదేశములచేతను, దళతళ మెఱయు స్ఫటికశిల లతోఁ గట్టిన గోడలచేతను, జిత్రవర్ణములగు పూలదండలచేతను, బతాకలచేతను, నానావిధములగు వస్త్రసమూహములచేతను, మణిచయములచేతను, ముత్యములచేతను, భోగ్యవస్తువులచేతను నలంకృతమై ప్రాణవంతమైనట్లుకానవచ్చుచుండెను. అందెక్కడఁ జూచినను బరిమళ ద్రవ్యముల ధూపములు నెగడుచుండెను. ఏవంకఁ జూచినను బుష్పసంతతులు వెలయుచుండెను. ఏతట్టు చూచినను దేహమునిండ నగలుదాల్చి దేవతలతో సమానులగు స్త్రీపురుషులు సంచరించుచుండిరి. అట్టి మందిరమును బ్రవేశించి యాత్మారాములగు మునిజనులకు నాయకుఁడయిన శ్రీరాముఁడు తనకు నిరంతరమును బ్రియచేష్టలుచేయుచు నిరతిశయమగునను

రాగముతో సీతాదేవి తన్ను సేవించుచుండ, నామెతోఁ జిర కాలముసుఖము లనుభవించెను. ఇట్లు శ్రీరాముఁడు చిత కాలము లందు సుఖము లనుభవించుచు, వర్ణాశ్రమధర్మముల యథా విధిగా నాచరించుచుఁ, బ్రజలచే ధ్యానింపఁబడు పాదపద్మములు గలవాఁడై చిరకాలము రాజ్యమేలెను. ఇది పదునొకండవ యధ్యాయము.

---

ఇక్ష్వాకువంశానుక్రమము.

శ్రీరామునకుఁ గుశుండును, గుశున కతిథియు, నతనికి నిష ధుఁడును, వానికి నభుఁడును, వానికిఁ బుండరీకుఁడును, వానికి క్షేత్రధన్వుఁడును గలిగిరి. అతనికి దేవానీకుఁ డుదయించెను. వానికి హీనుఁడుగలిగె. వానికిఁ బారియాత్రుఁడుద్భవించె. వానికి బలుఁడు సంభవించె. వానికిఁ జలుండును, వానికి వజ్రనాభుఁ డును గలిగిరి. ఆవజ్రనాభుఁడే సూర్యాంశమువలన నుద్భవించె. వానికి ఖగణుండును, వానికి విధృతియు, నతనికి హిరణ్యనాభుఁ డును గల్గిరి. ఆహిరణ్యనాభుఁడే యోగాచార్యుఁడైన జైమినికి శిష్యుఁడై యోగశాస్త్రమభ్యసించి మహాభ్యుదయము గల్గించు నదియు, నజ్ఞాన నివారకమునగునాశాస్త్రమును యాజ్ఞవల్క్య మహర్షికినేర్పెను.అతనికిఁబుష్యుఁడును, వానికిధ్రువసంధియు, నత నికి సుదర్శనుఁడును, నతని కగ్నివర్ణుఁడును, నతనికి శీఘ్రుఁడును, నతనికి మరుత్తును నుదయించిరి. అతఁడు యోగముచే మృత్యు వును జయించి కలాపమనెడి గ్రామము నాశ్రయించి యుండి కలియుగాంతమున నశించిన సూర్యవంశమును బుత్రపౌత్రాది పరంపరచే మరలఁ బ్రవర్తింపఁ జేయఁగలడు. ఆమరుత్తునకుఁ

బ్రస్నుఁడును, నతనికి సంధియు, వానికి మర్షణుఁడును, వానికి సుమహత్తును, వానికి విశ్వసాహ్వుఁడును, వానికి బహ్వృద్బలుఁడును సంభవించిరి. అతఁడే నీజనకుఁ డగునభిమన్యునిచే సమరమున మడిసె. ఇక్ష్వాకువంశమునఁ బుట్టి గతించినవారు వీరె! ఇఁక నుద్భవించువారిని జెప్పెదవినుము. బృహద్బలునికి బృహద్రణుఁడును, వాని కురుక్షతుఁడును, వానికి వత్సప్రీతుఁడును, వానికిఁ బ్రతివ్యోముఁడును, వానికి భానుండును, వానికి దేవాకుఁడునుసంభవింతురు. వాఁడే వాహినీపతియని వాసిఁగాంచును. వానికి సహదేవుఁడును, వానికి బృహదశ్వుఁడును, వానికి భానుమంతుఁడును. వానికిఁ బ్రతీకాశ్వుఁడును, వానికి సుప్రతీకుఁడును, వానికి మరుదేవుఁడును, వానికి సురక్షత్రుఁడును, వానికి ఋక్షకుఁడును, వాని కంతరిక్షుఁడును, వానికి సుతపుఁడును, వాని కమిత్రజిత్తును, వానికి బృహద్వాజుఁడును, వానికి బర్హియు, వానికి ధనంజయుఁడును, వానికి రణంజయుఁడును, వానికి సృంజయుఁడును జనింతురు. సృంజయునికి శౌక్యుఁ డుదయించు. వానికి శుద్ధోదుఁడు జన్మించు. వానికి లాంగలుఁడుద్భవించు. వానికిఁ బ్రసేనజిత్తుజనించు. వానికిక్షుద్రకుఁడు పుట్టును. వానికిఁ గుణకుఁడు గలుగును. వానికి సురథుఁ డుత్పత్తిఁజెందు. అతనికి సుమిత్రుఁడు సంభవించు. ఇతఁడే యీవంశమునకుఁ గడపటివాఁడు. ఈచెప్పినవా రందఱును బృహద్బలుని వంశమున ముందు జన్మించువారలు. ఇక్ష్వాకురాజులవంశము కలియుగమున సుమిత్రునివఱకు నిలిచి యతనితో నంతరించును. ఇది పండ్రెండవయధ్యాయము.

---

### మిథిల వంశానుక్రమము

ఓ రాజా! ఇక్ష్వాకు కుమారులలో వికుక్షివంశమును వర్ణించి చెప్పితిని. ఇఁక నిమి వంశమును వివరించెద వినుము. ఇక్ష్వాకు కుమారుఁ డయిన నిమి గురువగు వసిష్ఠుని చెంతకేఁగి తానొనర్చు సత్రయాగమునకతని ఋత్విక్కుగానుండ వేఁడెను. అతఁ డింతకుఁ బూర్వమే నే నింద్రునకు ఋత్విక్కుగా నుండుటకు నిశ్చయించుకొంటిని. ముందుగా నింద్రుని యాగముచేయించి వచ్చి నీయాగము నెఱవేర్చెద. అంతవఱకు నిరీక్షించియుండు'' మని చెప్పెను. దానికినిమిమాఱుపల్కలేదు. వసిష్ఠుఁడుశక్రునియాగము నిర్వహింపఁబోయెను. అంతట విద్వాంసుఁడగు నిమి జీవితము చంచల మనియుఁ దలంచినసత్కార్యము వెంటనే నెఱవేర్ప వలెననియునిశ్చయించి వసిష్ఠుఁడువచ్చునందాఁకనిరీక్షింపక మఱికొందఱు మునులను ఋత్విజులఁగావరించి యాగమారంభించెను. వసిష్ఠుఁ డట నింద్రుని యాగమును నిర్వర్తించి వచ్చి శిష్యుని వ్యతిక్రమమునుజూచి కోపించి "పండితమానివగు నీవు దేహము విడుతువుగాక'' యని శపించెను. అది నిమివిని "ధనాశచే ధర్మమెఱుంగకవర్తించుచు నకారణముగా నన్ను శపించితివి కావున నీవుగూడ దేహమును విడుతువుగాక'' యని ప్రతిశాపమిచ్చెను. ఇట్లు శపించి నిమి దేహమును విడిచెను. మా ప్రపితామహుఁడగు వసిష్ఠుఁడుగూడ దేహమును విడిచి యూర్వశినిజూచి మోహము చెందిన మిత్రావరుణులకుఁ గుమారుఁడై జన్మించెను. అట ఋత్విజులు మృతినొందిన నిమిదేహమును బరిమళద్రవ్యములందుంచి కాపాడి సత్రయాగమును నిర్వర్తించి యచ్చటికివచ్చిన దేవతలనుగాంచి " మీరు నిమిని బ్రతికింప శక్తు లగుదురేని

దయయుంచి బ్రతికింపుఁ"డని కోరఁగా వా రట్లు చేయసమ్మతిం చిరి. కాని వారింజూచి" మహాత్ములారా! నాకు దేహసంబంధము వలదు. మరల వియోగదుఃఖమునకుఁ గారణమగునని భయపడి మునీశ్వరు లాసంబంధమును గోరక హరియందుఁ జిత్తమును జేర్చి తత్పాదపద్మములను సేవించు చుందురు. కావునదుఃఖమున కును, మోహమునకును, భయమునకుఁగారణముగు దేహమును గ్రహింప నిష్టపడను. ఒకవేళ దేహసంబంధ మున్నచో జలముల లోని చేఁపలకుంబోలె దానె యెప్పుడును మృత్యు వనుసరించు చుండును " అని పల్కెను. దేవత లది విని " నీ వీ స్థూల దేహము మాని సూక్ష్మదేహము నాశ్రయించి శరీరుల నేత్రములందు నిమేషోన్మేషములచేఁ జూడఁబడుచు స్వేచ్ఛగా నుండు" మనిపల్కి వెడలిపోయిరి. దానికతఁడిష్టపడెను. అప్పుడు మునీశ్వరులు దేశమరాజకమగుటవలన సంభవించుచున్నయుప ద్రవములనుజూచి నిమి దేహమును మథింపఁగా నొక కుమా రుఁడు జన్మించెను. ఆబాలుఁడు సామాన్యముగానితరులకు లభిం పని జననముగలవాఁడగుటచే జనకుఁడనియు, జీవరహితమగు దేహమునం బొడముటచే విదేహుఁడనియు, మథించుటంజేసి పుట్టెను గాన మిథిలుఁడనియుఁ బ్రఖ్యాతిఁగాంచెను. మిథిలుఁ డొకపురమును నిర్మించెను. అది యతనిపేర మిథిలాపురమని పిలువఁబడియె. ఆమిథిలునకు ఉదావసు వుదయించెను. అతనికి నందివర్ధనుఁడు సంభవించె. అతనికి సుకేతుఁడుగలిగె. అతనికి దేవరాతుఁ డుదయించె. వానికిబృహద్రథుఁడు జన్మించె. వానికి మహావీర్యుఁడువొడమె. వానికి సుధృతుగలిగె. వానికి ధృష్ట కేతు వుదయించె. వానికి హర్యశ్వుఁడుద్భవించె.వానికి మరుఁ డు

పుట్టె. అతనికిఁ బ్రతింధకుఁడుగలిగె. వానికిఁ గృతరథుఁడుజనించె. అతనికి దేవమీఢుఁడు జన్మించె. అతనికి విధృతియు, నత నికి మహాధృతియు, వానికిఁ గృతరాతుఁడును, వానికి మహా రోముఁడును, వానికి స్వర్ణరోముఁడును, వానికి హ్రస్వరోముఁ డును సంభవించిరి. ఆహ్రస్వరోముఁడు యజ్ఞభూమిని దున్ను చుండఁగా నతని సీరాగ్రమువలన సీత బయటికివచ్చెను. కావున నతనికి సీరధ్వజుఁడని నామముగల్గెను. ఆసీరధ్వజునకుఁ గుశధ్వజుఁ డును నతనికి ధర్మధ్వజుఁడును సంభవించిరి. అతనికిఁ గృతధ్వజు డనియు, మితధ్వజుఁడనియు నిరువురు కొమరులుకల్గిరి. అందుఁ గృతధ్వజునకుఁ గేశిధ్వజుఁడును, మితధ్వజునకు ఖాండిక్యుఁడును గలిగిరి. ఓరాజా ! కేశిధ్వజుఁడు బ్రహ్మవిద్యయందు నిపుణుఁడు. ఖాండిక్యుఁడుకర్మయోగమునందు నేర్పరి. వాఁడు కేశిధ్వజునివలన భయపడి యెచ్చటికో పాఱిపోయెను. ఆకేశిధ్వజునకు భాను మంతుఁ డుదయించె. వానికి శతద్యుమ్నుం డుద్భవించె. అతనికి శుచియు, వానికి సనద్వాజుఁడును, వాని కూర్ధ్వకేతుఁడును, వాని కజుఁడు, వానికిఁ బురుజిత్తును, వాని కరిష్టనేమియు, వానికి శ్రుతాయువును, వానికిఁ బార్శ్వగుఁడును, వానికిఁ జిత్రరథుఁ డును, వానికి క్షేమాద్రియు, వానికి హేమరథుఁడును, వానికిఁ గృత్యరథుఁడును, వాని కుపగురువును, వానికగ్న్యంశసంభూతుఁ డగు నుపగుప్తుఁడును, వానికి శ్వసనుఁడును, వానికి సువర్చసుఁ డును, వానికి సుభాషణుఁడును, వానికి శ్రుతుఁడును, వానికి జయుఁడును, జయునకు విజయుఁడును, విజయునకు ధృతుఁడును, ధృతునకు శునకుఁడును, శునకునకు వీతిహవ్యుఁడును, వానికి ధృతియు, ధృతికి విపులాశ్వుఁడును, వానికిఁ గృతియుఁ, గృతికి

మహావశియు సంభవించిరి. ఓరాజా! వీరుమిథిలుని సంతతివారు. వీరందఱు నాత్మవిద్యయందు విశారదులై భగవత్ప్రసాదము వలన గృహస్థులై యుండియు సుఖదుఃఖాదులఁ బొరయక విముక్తులైరి. ఇది పదుమూడవ యధ్యాయము.

---

## చంద్రవంశ చరిత్రము.

ఓరాజా! దేనియందుఁ బుణ్యయశులయిన పురూరవాదులు జనించిరో పావనమగు నా చంద్రవంశమును వివరించెదవినుము. అనిరుద్ధరూపియగు పరమపురుషుఁ డుదకముల శయనించి యుండఁగా నతని నాభివలన జగత్పద్మముదయించె. దాననుండి చతుర్ముఖుఁడు జన్మించె. అతని కత్రిమహాముని సంభవించెను. అతఁడు సకలగుణములచేతను దండ్రికెనవచ్చుచుండెను. అతని యానంద బాష్పములవలనఁ జంద్రుఁడు పొడమె. కావున నే యతఁడమృతమయుఁడయ్యె. బ్రహ్మ,బ్రాహ్మణులకును,గలువలకును,నోషధులకును నతని నధిపతిగానొనర్చె. ఆచంద్రుఁడు త్రిభువనములను జయించి రాజసూయయాగ మొనర్చెను. అతఁడు బృహస్పతి భార్యయగు తారను బలాత్కారమునహరించెను. బృహస్పతివచ్చి తనభార్య నిమ్మని చంద్రునిఁ బెక్కునారులు యాచించెను; కానియతఁడామె నొసంగలేదు. దానికై దేవాసురులకు ఘోర యుద్ధము సంభవించె. బృహస్పతిపైఁగోపముచే శుక్రుఁడుతన శిష్యులగు దైత్యవర్గముతోఁ జంద్రపక్షమవలంబించెను. రుద్రుఁడు బృహస్పతియందలి స్నేహముచే భూతగణములతో నతనికి సాయమొనర్చెను. సకలదేవగణములతో నింద్రుఁడుగూడ గురువునకుఁ తోడయ్యెను. ఇట్లు దేవాసురులు రెండుపక్షములై తార

నిమిత్తము మహాసమర మొనర్చిరి. రెండు పక్షములందును బెక్కురు చచ్చిరి. అప్పుడు బృహస్పతి జనకుఁడగు నంగిరసుని ప్రార్థనముచొప్పున బ్రహ్మవచ్చి చంద్రుని నిందించి తార నిచ్చి పుచ్చుమని నిష్ఠురముగాఁజెప్పెను. చంద్రుఁడు బ్రహ్మకుభయపడి గర్భిణియగు తారను బృహస్పతి కర్పించెను. గురుఁడు దానిస్వీక రించి గర్భమును దాల్చినట్లు తెలిసికొని, 'ఓతుచ్ఛురాలా! నాక్షే త్రమగు నీయందుఁబరులుంచినగర్భముండరాదు. దానిని వెంటనే విడిచిపెట్టుము. లేదేని నిన్నుభస్మముగావించెద'' నని పలికెను. దానికిఁ దార భయమందు చుండెను. బృహస్పతి మరల దానిం జూచి వంశకరుఁడయిన కుమారుఁడు నీగర్భమందు లేనిచో భస్మముగావింతును. ఉన్నచోక్షమించెదను''అనిపల్కెను అంతఁ దార లజ్జితయై చంద్రునితో సమానుఁడగు పుత్రునిఁగనెను. బృహస్పతి కడు సుందరుఁడగు బాలునిఁజూచి తానుదీసికొనవలె నని నిశ్చయించెను. చంద్రుఁడుగూడ నట్లేతలంచెను. అందుచే "వీఁడు నాకొడుకుగాని నీకొడుకుగాఁ''డని చంద్ర బృహస్పతులు వాదించుకొనుచుండిరి. దేవతలును మునులును, తారనుజూచి "యీపుత్రుఁడెవ్వరికిఁగలిగె'' ననియడిగిరి. ఆమెసిగ్గుచే మాటాడ లేదు. అంత బాలుఁడు తల్లినిజూచి కోపించి "ఓదుష్టవర్తను రాలా ! వ్యర్థమగు సిగ్గుతో నిపుడు మాటాడవేమి? నేనెవరికి జనించితినో నాకుఁజెప్పుము నీలోపమును దాఁపకు''మనితల్లిని నిందించుచుండెను. ఇట్లు తల్లిని నిందించుచున్న బాలునిఁజూచి బ్రహ్మ తారను రహస్యస్థలమునకుఁ బిలచిమంచిమాటలచే నను నయించి "వీఁడెవని సుతుఁ''డని యడిగెను. ఆమె సిగ్గుతో "చంద్రునివాఁ''డనిమెల్లగాఁబలికెను. అంతబ్రహ్మ యాబాలునిఁ

జంద్రునకిప్పించెను. "ఈ బాలుఁడు గంభీరమగు బుద్ధిచేఁజంద్రునకానందము కలిగించుటంజేసి యతఁడుబుధుఁడను నామముఁదాల్చు"నని చెప్పిబ్రహ్మ వెడలిపోయెను. ఆబుధుఁడుస్త్రీరూపము దాల్చిన సుద్యుమ్నునియందుఁ బురూరవునిఁగాంచెను. అతఁడూర్వశిని జేపట్టి యాయువు మొదలగు పుత్త్రులను బడసెను. దేవకాంతయగు నూర్వశి నితఁడెట్లు వరింపఁగల్గెనో చెప్పెదను వినుము. ఒకప్పుడునారదుఁడుసురలోకమునఁ బురూరవునిసౌందర్యమును, గుణములను, నౌదార్యమును సత్ప్రవర్తనమును, ధనమును, బరాక్రమమును వర్ణించుచుండ నూర్వశి విని కామాతురయైమిత్రావరుణులిచ్చినశాపముచేమనుష్యభావమును బొంది రెండవ మన్మథునివలె నున్నయతనిఁ గాంచి మనస్సు దిట్టపఱిచికొని సమీపించెను. పురూరవుఁ డాసుందరినిజూచి సంతోషముచే నేత్రములు వికసింపఁ బులకితగాత్రుఁడై మృదువచనములతో నామె కిట్లనియె. "ఓసుందరీ ! నీవు సుఖముగా వచ్చితివా ! కూర్చుండుము. నీదాసుఁడను. నీకుఁగా వలసినకార్యమొనర్చువాఁడను. నాతోసఖ్యము చేయుము. మనమిరువురము పెక్కేండ్లు సుఖముఁగా వర్తింతము" అనవిని యూర్వశి వానిం జూచి "ఓసుందరా ! సౌందర్యవంతుఁడ వయిననిన్ను వీక్షించిన యేస్త్రీమనోదృష్టులు నీయందు సక్తములు గావు? రమింపఁదలంపుతో నీవక్షమును బొందినస్త్రీ మఱియెప్పటికిని దాని విడువనోపదు. ఓరాజా! నేనీమేషములనుముద్దుతోఁ బెంచుచున్నాను. ఇవి నాకుఁ గుమారులవంటివి. వీనిని నీవు కాపాడుచుండుము.నీవువీనినిరక్షించినంతకాలమును స్త్రీలనుత్తమవరుఁడవయిన నీతోఁ గ్రీడింతును. నేను ఘృతమునుదప్ప వేఱొకదాని

నాహారముగా స్వీకరింపను.సంభోగకాలమునందుఁ దప్పఁదదితర
సమయములందు నీవు దిగంబరుఁడవై కానరాఁగూడదు.ఒకవేళ
నీవు కనఁబడినచో వెంటనే నిన్ను విడిచిపోవుదును. దీనికి నీవం
గీకరించితి వేని నీయభిలాషము నెఱవేర్తును'' అని పలికెను.
పురూరవుఁ డదివిని దాని సమయమునకుసమ్మతించి "ఓసుందరీ!
అయారే! నీసౌందర్యము నిరుపమానమైనది. నీ భావముగూడ
శ్లాఘ్యమైనది.ఈరెండును నరలోకమునంతనుమోహింపఁజేయ
జాలినవి.నీయంతట నీవు ప్రేమతోఁ జేరవచ్చుచున్నని న్నేమను
ష్యుఁడు వరింపఁడు?''అనిపల్కి పద్మగంధము గల్గినయామెతోఁ
గూడి చైత్రరథము, నందనము మొదలగు నుద్యానవనము
లందు విహరించుచు యథేష్టముగాఁ గ్రీడించుచు నామెముఖ
పరిమళమునవశ్యుఁడై పెక్కుసంవత్సరము లానందించెను.అంత
సురలోకమున నొక నాఁ డింద్రుఁడు కొలువుదీర్చి యూర్వశి
లేకుండుటచేఁ దనసభ ప్రకాశింపలేదని విచారించి యామెను
గొనివచ్చుట కిరువుర గంధర్వుల నియమించెను. అంతవా రిరు
రువును మధ్యరాత్రియందుఁగటికిచీకటిలో మెల్లమెల్లగాఁబోయి
రాజు రక్షించుచున్న మేషములను హరించిరి. అంత నూర్వశి
కొనిపోఁబడుచున్న మేషముల యఱపునువిని " అయ్యో! చచ్చి
తిని. కుత్సితనాథుఁడవును, నపుంసకుఁడవును, వీరంమన్యుడవును
నగు నీచేఁ జంపఁబడితిని. విశ్వాసముచేఁ బిల్లలవంటి మేషముల
నీయొద్ద దాఁచుకొంటిని. వానినిప్పుడు దొంగలు హరించిరి.
నాపిల్లలుపోవుటచే నే నిఁక మృతప్రాయను.ఆఁడుది భయపడి
శయనించునట్లుగా నీవెప్పుడును రాత్రి శయనించియే యుందువు.
నాశరీరమును బెనఁచిన బాహుపాశమునువిడువు. పొమ్ము.నన్ను

విడుచుటకు భయపడి యెల్లప్పుడును గౌఁగిలించికొనియె యుందువు" అని ములుకులవంటి పలుకులతో నొప్పింప గజవర మంకుశఘాతమును సహింపఁజాలనియట్లు పురూరవుఁడు త్వరపడి లేచిఖడ్గమునుదాల్చి కోపముతో నారాత్రిసమయమునవస్త్రము ధరింపకయే మేషములను దెచ్చుటకుఁబర్వెత్తెను. ఆగంధర్వులు పురూరవుఁడు వచ్చుటను దెలిసికొని తమకార్యము సఫలమైనం దులకు సంతసించి వానినచ్చట వదలి పాఱిపోయిరి. ఆ రాజు వానిని దీసికొని వచ్చుచుండఁగా దిగంబరుఁడయిన భర్తనూర్వశి చూచి సమయభంగ మగుటచే నటనుండి కదలిపోయెను. పురూరవుఁడు వచ్చి తల్పమందు భార్యలేకుండుటను జూచి దుఃఖితుఁడై యామె నేసంతతమునుజింతించుచు వెఱ్ఱియెత్తినవాని వలెఁ జూపట్టుచుభూమండలమునఁ బరిభ్రమించుచుఁ గురుక్షేత్ర మున సరస్వతీతీరమున నైదుగురుచెలికత్తెలతోఁగూడియున్న యూర్వశిని జూచి సంతుష్టహృదయుఁడై మృదువుగా నిట్లు పల్కె. "ఓ ప్రియురాలా ! నిలువుము,నిలువుము. ఈ ఘోరదుఃఖ మున నన్నుఁ బడవేయ నుచితముకాదు. ఏకాంతమున మనము చేయవలసిన గోష్ఠియింకను మిగిలియున్నది. మనము సల్లాపము సల్పుదము రమ్ము. ఓ దేవీ ! నిన్ను వెదకుచుఁ జాలదూరము వచ్చి తిని. నీవు కరుణింపనిచోఁ గమనీయమగు నా దేహము నిచ్చట విడువవలసి వచ్చును. నీయనుగ్రహమునకుఁ బాత్రమైనయీ నా శరీరమును దోఁడేళ్లును, గ్రద్దలునుదినును. ఇంతకంటె హేయము గలదా?" అని దీనాతిదీనముగాఁ బ్రార్థింప నాయూర్వశి యతనికిట్లనియె. "ఓయీ! నీప్రతిజ్ఞను వ్యర్థ చేయక ధీరుఁడవుకమ్ము. నీవు మరణింపవలదు. నీశరీరముతోఁడేళ్లకు భక్ష్యముకాకుండుఁ

గాక. ఓరాజా! ఆలోచింప నెక్కడను స్త్రీసఖ్యము స్థిరమై యుండదు. తోఁడేళ్లహృదయమువలె స్త్రీహృదయము మిక్కిలి క్రూరము. స్త్రీలకుదయయుండదు వారిస్వభావముక్రూరము. వారి కోర్పునున్న. వారు తమప్రియమును సాధింప నెంతటిసాహసము నైనఁ జేయుదురు. ఒకప్పుడు వారు స్వల్ప ప్రయోజనము నిమిత్తము విశ్వాసార్హుఁడయిన భర్తనైనను, సోదరునైనను జంపుదురు. కొందఱు స్త్రీలు భర్తలందుఁ గపట విశ్వాసముంచి యభిప్రాయములను దెలియ నీయక, వాని యందు మనస్సు నిల్పక వేఱొక క్రొత్తపురుషునిఁ గోరుచు జారిణులై యథేష్టముగాఁ బ్రవర్తింతురు. కావున మావంటివారి స్నేహమును విడువుము. ఓహృదయేశ్వరా! నీవిప్పటికొక సంవత్సరమైనపిమ్మట నాతోనొకరాత్రి వసింపఁగలవు. అప్పుడు నీకుమఱియొక పుత్త్రుఁడు గలుగును" అని పలుక రాజు దానివచనములవలన నామె యిప్పుడు గర్భిణియై యున్నట్లు తెలిసికొనితనపురమునకరిగెను. సంవత్సరాంతమునఁ బుత్త్రునితోఁగూడ నూర్వశిపురూరవుని చెంతకు వచ్చెను. అతఁడు దానిఁజూచియానందించి యామెతో నా రాత్రి నివసించెను. నిశాంతమునందుఁ దన విరహమునుసహింప లేని రాజునుజూచి యూర్వశి "ఓరాజా! నీవీ గంధర్వులను నుతించి ప్రసన్నులఁగాఁ జేసికొనుము. వారు నాలోకమునకుఁ దగినసాధనమును దెలిపి నన్ను నీకొసంగుదురు" అని పల్కెను. పురూరవుఁడుగంధర్వులనుతించెను. వారతనిఁగరుణించియగ్నిస్థాపనము చేసికొనఁదగిన పాత్ర మొకదాని నిచ్చిరి. రాజాయగ్నిస్థాలినిబుచ్చుకొనియది యూర్వశీప్రాప్తికి సాధనమనినిశ్చయించి యొకపుడు వనమున సంచరించుచు నొకచో దానినుఱిచి

యింటికిఁబోయి యారాత్రి యచ్చటఁ గడపెను. అంత త్రేతాయుగ ప్రారంభము కాఁగాఁ బురూరవునిమనస్సున వేదమావిర్భవించెను. దానివలననతఁడు శిఖగర్భమగునశ్వత్థకాష్ఠములవలన నగ్నిని మథింపవచ్చు నని తెలిసికొని, వానిని సంపాదించి మంథనకాష్ఠములఁగాఁ జేసి యూర్వశీలోకమును బొందఁదలంపుతో మంత్రపూర్వకముగాఁ గ్రిందికాష్ఠము నూర్వశిగాను.మీఁదికాష్ఠమును దన్నుఁగాను వానిరాపిడివలనఁ గల్గినద్రవ్యమును బుత్త్రునిఁగానుదలంచుచు మథించె. అట్లు మథించుటవలన నగ్ని జనించెను. ఆయగ్నినివేదోక్తములగుత్రివిధసంస్కారముచేతను మూఁడురూపములగా నొనర్చి పురూరవుఁడు పుణ్యలోకమును గల్గించువారగుటచే వారిని బుత్త్రులనుగా నిశ్చయించెను. అనంతరము పురూరవుఁ డూర్వశీలోకమునుగోరుచు, నాయగ్నులచే సర్వదేవతాశరీరుఁడును, యజ్ఞఫలదాయకుఁడును,నాశ్రితార్తిహరుఁడును నగుభగవంతు నారాధించెను ఓరాజా! కృతయుగమున సకలవాక్కులకును బీజభూతమై యోంకార మొక్కటియై యుండెను. అపుడు వేద మొక్కటియె. నారాయణుఁడొక్కఁడే దేవుఁడుకాని వేఱొకఁడు లేఁడు. అగ్నియు నేకవిధమే యుండెను. హంసమను పేరితో వర్ణముగూడ నొక్కటియె యుండెను. త్రేతాయుగమున కాదియందుఁ బురూరవుని వలన వేదముమూఁడువిధములయ్యె. ఆవిభాగముచేత నేకర్మమార్గము స్పష్టమయ్యె. ఆపురూరవుఁ డగ్నిరూపపుత్త్రుని కారణమున గంధర్వలోకమును బొందెను. ఇది పదునాల్గవయధ్యాయము.

## పురూరవవంశము.

ఓరాజా ! పురూరవున కూర్వశియందు ఆయువు, శ్రుతాయువు, సత్యాయువు, రయుఁడు, జయుఁడు, విజయుఁడు ననునాఱుగురుకొమరులుగల్గిరి. అందు శ్రుతాయువునకు వసుమంతుఁడు గలిగె. సత్యాయువునకు శ్రుతంజయుఁ డుద్భవించె. రయున కేకుఁడనువాఁ డుదయించె. జయున కమితుఁ డుదయించె. విజయునకు భీముఁడుసంభవించెను. భీమునకుఁ గాంచనుఁడుగలిగె. వానికిహోత్రకుఁడు వొడమె. వానికి జహ్నువుదయించె. అతఁడు గంగానదినిబుక్కిటంబట్టివిడుచుటచేతనే గంగకుజాహ్నవియను నామము గల్గినది. ఆజహ్నుఁడుపూరునిఁగాంచెను. వాఁడు బలాకునిఁగనియె. వాఁ డజకునిఁబుట్టించె. ఆయజకునికిఁ గుశుఁడుదయించె. వానికిఁ గుశాంబుఁడుధూర్తయుఁడువసువు కుశనాభుఁడు నను నల్వురు కొమరులుఁ గల్గిరి. అందుఁ గుశాంబునకు గాధియుదయించె. అతనికి సత్యవతియను కూఁతురుగలిగె. ఆకన్యను దన కీయవలయునని భృగువంశజాతుఁడగు ఋచీకుఁడను నొక బ్రాహ్మణుఁ డడుగఁగా గాధితనకన్య కతఁడుతగినవాఁడు కాఁడని నిశ్చయించి యతనికిట్లనియె. "ఓవిప్రవర్యా !ఒకచెవిమాత్రము నలుపును, దక్కిన శరీరమంతయుఁ జంద్రునంత తెలుపును గల గుఱ్ఱముల వేయింటిని నాకన్యకు శుల్కముగా నీయవలయును. ఆలోచింపఁ గుశికుని వంశమునఁబుట్టిన యీకన్యకదియుఁ జాల దనియేతలంచెదను. అయిన నీవువానిఁదెచ్చియిచ్చితేనినాకన్యక నిత్తు"ననఁగా ఋచికుఁ డాతనియభిప్రాయమును గనిపెట్టి వరుణుని సమీపమునకరిగి యతనియాచించి గుఱ్ఱములను దెచ్చి గాధికొసంగి యాసత్యవతినిఁబెండ్లాడెను. ఒకప్పుఁడుభార్యయు,

సత్త్రియును వచ్చి తమకుఁ బుత్త్రసంతానముగల్గింపవలె నని గోరఁగా నాముని బ్రహ్మమంత్రములతో నొకచరువును, క్షత్త్రమంత్రములతో వేఱొక దానినిసిద్ధముచేసి స్నానమునకరిగెను. అతఁడు స్నానముచేసి వచ్చునంతలో నతనియత్తగారు తన యల్లుఁడు తనపుత్త్రిపైనున్న ప్రేమచే నామెనిమిత్తమై శ్రేష్ఠమైన చరువును గల్పించియుండుననితలంచి తన కాచరువునీయవలయు నని సత్యవతినిఁ గోరఁగా నామె తల్లికోర్కె వృథసేయఁజాలక తన చరువు నామెకిచ్చి యామెచరువును దాను దీసికొని భక్షించెను. అంత మునిమరలివచ్చి యావృత్తాంతమును దెలిసికొని భార్యనుజూచి "ఓయవివేకురాలా ! మిక్కిలి తెలివితక్కువ పని చేసితివి. నీకుఁ గల్గెడుపుత్త్రుఁడు క్షత్త్రధర్మము నవలంబించి యుద్ధాదులందు నిపుణుఁడగును. నీసోదరుఁడు బ్రహ్మవిద్యావిదుఁడగును. ఇది నీబుద్ధిహీనతవలనఁ గల్గినది"అనెను. సత్యవతి మిక్కిలివిచారించి తనతప్పునుమన్నించి తనకు యోగ్యుఁడగు సుతుఁడు జనించునట్లు చేయుమని భర్తనుబ్రార్థింప నతఁడనుగ్రహించి యామె కొమరుఁడు శాంతుఁడగునట్టును, మనుమఁడు క్రూరుఁడగునట్టును జేసెను. కావున సత్యవతికి శాంతుఁడును, దపోనిష్ఠుఁడు నగు జమదగ్ని యుదయించెను. ఆసత్యవతి లోకపావనియగునదియై ప్రవహించె. అదియే కౌశికీయనివాసిగాంచె. ఆజమదగ్ని రేణుకను బరిణయమయ్యెను. అతని కామెయందు వసుమనుఁడు మొదలగుకొమరులుపుట్టిరి. వారిలోఁ గడపటివాఁడు రాముఁడని ప్రఖ్యాతిఁగాంచెను. ఆరాముఁడే భగవదంశావతారమని చెప్పుదురు. అతఁడు హైహయవంశము నంతరింపఁ జేయుటయే కాక యిరువదియొకమాఱు భూమిని చరించి క్షత్త్రియ

బీజము లేకుండఁ జేసెను. గర్వించి పుడమికిభారమునుగల్గించుచు రజస్తమోగుణములకు నిలయమై ధర్మమార్గమునువదలి చరించుచు, బ్రాహ్మణులకు విపరీతమైవర్తించుచుక్షత్రియులను స్వల్పమగునపరాధముచేసి పూర్ణముగా నశించెను. అనిన శుకుంగాంచి నరేంద్రుఁడు "ఓమునీంద్రా! దురాత్ములగు రాజులొనర్చినయపరాధ మెట్టిది? ఆయపరాధముచే క్షత్రియవంశములన్నియుఁ బూర్ణముగానశింపఁ గారణమేమి?" అని యడుగ శుకుండిట్లనియె. "ఓరాజా! పూర్వము కార్తవీర్యార్జునుఁడనునొకనృపశ్రేష్ఠుఁడు హైహయదేశములను పాలించుచుండెను. అతఁడు నారాయణాంశసంభూతుఁడైన దత్తాత్రేయునిసేవించి యారాధించి తదనుగ్రహముచే బాహుసహస్రమును శత్రువులకు దుస్సహమగు పరాక్రమమును బుద్ధిబలమును, తేజమును, నింద్రియబలమును, కీర్తిని, శరీరబలమును, నణిమాదులగు యోగసిద్ధులను బడసి వాయువువలె లోకములందనర్గళుఁడై సంచరింపఁ దొడఁగెను. అతఁడొకనాఁడుమదోద్రిక్తుఁడై వైజయంతియనుపుష్పమాలచే నొప్పుచుఁ దనభార్యలతోఁగూడ రేవానదియందుజలక్రీడ సల్పుచుఁదనభుజములచే నానదిని బంధించెను. తోడనే నదీజలము పొంగి, కార్తవీర్యుని జయింపవచ్చి సైన్యములతో నానదీతీరమున విడిసియున్న రావణుని శిబిరమును ముంచెను. రావణుఁడు దానికిసహింపఁజాలక క్రీడించుచున్న కార్తవీర్యునిఁబరాభవింప సరభసమునఁ జనఁగానదియతఁడుగ్రహించి స్త్రీలందఱునుజూచి నవ్వుచుండ రావణుని వాలివలె సులభముగాబంధించి కొంతకాలము కారాగారమునసుంచి గర్వముతొలఁగించివిడిచెను. మహాబలుఁడైన యాయర్జునుఁ డొకనాఁడువేఁటకుఁజని యథేచ్ఛగా

సంచరించుచు జమదగ్ని యాశ్రమమునకుఁ బోయెను. అంత జమదగ్ని యా రాజునకును వానిపరివారమునకు నుచిత మర్యాదలుగావించి కామధేనువును రప్పించి వారలకందఱకును నతిథి సత్కారము లొనర్చెను. ఆ యర్జునుఁడు తన యైశ్వర్యముకంటె నధికమయిన యీముని సామర్థ్యమును జూచి సహింపక యాతఁ డిచ్చినపూజలనుస్వీకరింపక కామధేనువునుబట్టి తేవలయునని భటుల నాజ్ఞాపించెను. భటులునిరంకుశులై దీనముగా నఱచుచున్నను వదలక సవత్సయగు నా ధేనువును మాహిష్మతికిఁ గొనిపోయిరి. కార్తవీర్యుఁ డి ట్లపకారము చేసిపోయిన కొంత సేపటి కెక్కడకో పోయిన పరశురాముఁడు మరలి తనతండ్రి యాశ్రమమునకు వచ్చి యారాజు దౌర్జన్యమును విని దండ తాడితమగు సర్పమువలెఁ గుపితుఁడై భయంకరమగు పరశువును, విలు నమ్ములను, నమ్ములపొదులను దాల్చి, కవచముఁదొడిగి, శత్రువులకు దుర్ధర్షుఁడై, గజరాజును సింహమువలె, నారాజు నను సరించి పోయెను. ధనువును, బాణములను, బరశువునుధరించి లేడిచర్మ మంబరముగాఁ దాల్చి సూర్యకాంతివలె జటాకలాపము ప్రకాశింపఁ బరాక్రమ మతిశయింపఁగా నతి త్వరిత గమనమునవచ్చు పరశురామునిఁగాంచికార్తవీర్యుఁడు తనసైన్యముల నతనివధింప నాజ్ఞాపించి పురము ప్రవేశించెను. రాజాను మతిని బడసి పదునే డక్షౌహిణుల పరిమితిగల యా చతురంగ సైన్యములును విజృంభించి కత్తులను, గదలను, బాణములను, శతఘ్నులను, శక్తులను దాల్చివచ్చి యెదిరింపఁగా రాముఁ డొకఁడేవానిని సంహరించెను. అగ్నివంటి ప్రతాపముగలిగిశత్రు సైన్యముల సంహరించు భృగురాముఁడు శత్రుసైన్యములు విక్ర

మించుచున్న స్థలములందెల్లఁ దన పరశువును ద్రిప్పికొట్టఁగా నట రిపులబాహువులును, దొడలును, మెడలును, దెగిపడుటయే కాక వీరులు, సూతులు, వాహనములుగూడఁ గుప్పకుప్పలుగాఁ గూలుచుండిరి. ఇట్లు రాముని కుఠారముచేతను, బాణములచేతను, గవచములును, ధ్వజములును, విండ్లును, శరీరములును, రక్తసిక్తములై యుద్ధభూమిని బడుచున్న తన సైన్యములఁ జూచి కార్తవీర్యుఁడు మిక్కిలి కోపముతో నడినడి నట కరుదెంచి యేనూఱుచేతులతో విండ్లువట్టి మిగిలినకరములతో బాణములనుదీసి సంధించి రామునిపై బ్రయోగించెను. కాని యస్త్రవిద్యాకుశలుఁడయినరాము డొక్కవింటితోనే యాశరములనన్నింటి నొక్కటఁ ద్రుంచెను. అందుల కర్జునుఁడు క్రుద్ధుడై తనహస్తములతోఁ బర్వతములను వృక్షములను బెఱికి రామునిపైకిఁ జిమ్మెను. అట్లు యుద్ధమున విజృంభించినచ్చుచున్న యర్జునునిఁ బరిహాసము చేయుచు రాముఁడు తీవ్రధారగల కుఠారముచే వానిభుజములను బలాత్కరించి ఛేదించెను. అంతతో నూరకుండక వెంటనే పర్వతశృంగమునువలె వాని శిరమును గూడ భూమిని గూలనేసెను. ఇట్లర్జునుఁడు మడిసినతోడనే వాని పుత్త్రులు పదువేవురునుభయపడినవత్సముతోఁగూడహోమధేనువును గొనివచ్చి రామునికర్పించి పర్విడిపోయిరి. అంత రాముఁడు తనయాశ్రమమునకు మరలి యలఁతనొందియున్న యాధేనువును దండ్రికర్పించి తానొనర్చిన పనినిసోదరులకును దండ్రికిని వర్ణించిచెప్పెను. అదివిని జమదగ్ని విచారించుచు రాముం జూచి "ఓరామా! రాజనఁగా సర్వదేవమయుఁడు. నీవు వ్యర్థముగాఁ గోపమూని యట్టిరాజనుజంపి మహాపాప మొనర్చితివి.

తండ్రీ! మనము బ్రాహ్మణులము. రాజసకర్మముల నొనరింపఁ దగము. మనకు శాంతియే ముఖ్యము. అది గలవారమగుట చేతనే మనము లోకమునఁ బూజ్యులమగుచున్నారము. క్షమను బోలినది వేఱొకటి లేదు. లోకగురువగు బ్రహ్మ దానివలననే మహోత్కృష్టమగు పదమును గాంచెను. సూర్యుని కాంతివలె బ్రాహ్మణుని శమదమాదిసంపద ప్రకాశించుచు. భగవంతుఁడగు శ్రీహరి యట్టిశమాదిసంపన్నునకే వేగముగాఁ బ్రసన్నుఁడగును. మూర్ధాభిషిక్తుఁడగు రాజును జంపుట బ్రహ్మహత్యకంటెను మహత్తరపాపము. అట్టిపాపము నిన్నావరించినది. కావున నీవిఁక గంగాదిపుణ్యతీర్థములను సేవించి యా పాపమును దొలఁగించుకొనుము.'' అని యుపదేశించెను. ఇది పదునేనవయధ్యాయము.



## పరశురాముఁడు జనన్యాదుల జంపుట.

ఓ కురు నందనా! తండ్రి యుపదేశమును విని యొకసంవత్సరము తీర్థములను సేవించి మరలి యాశ్రమమునకు వచ్చెను. ఒకప్పుడు పరశురాముని జనని రేణుక జలము దెచ్చుటకై గంగానదికేఁగి పద్మమాలఁ దాల్చి యందచ్చరలతోఁ గ్రీడించుచున్న చిత్రరథుఁడను గంధర్వరాజును జూచి యతనియందు స్పృహయాళువై హోమకాలమును మఱచి యచ్చట నుండెను; కాని కొంతసేపటికి కట్టకేలకుఁ గాలాతిక్రమమును దెలిసికొని భర్త తన్ను శపించు నేమోయని భయమందుచు రేణుక యమందగతిం జని జలకుంభమును బతిసన్నిధినుంచి బద్ధాంజలియై నిలువఁబడెను. అంత జమదగ్ని తన భార్య మనశ్చాంచల్యమును దెలిసికొని కోపించి కుమారులను బిలిచి "కుమారులారా! పాపాత్మురాలైన మీ

తల్లిని జంపుఁ"డనియానతిచ్చెను. కానివారు మాతృవధకుజంకి జనకాజ్ఞ నిరసించిరి. అందులకు ముని మండిపడి రామునిఁజూచి "ఓయీ! పాపులయిన నీసోదరులను, దల్లిని జంపుము" అని యాజ్ఞాపింపనతనితపః ప్రభావమునుసమాధినిబూర్ణముగా నెఱిఁగినవాఁడు కావున రాముఁడుజంకక వారల నొక్కపెట్టునఖండించెను. కుమారునిపనికి మిక్కిలి సంతసించి జమదగ్ని వానిఁజూచి "వలయువరము వేఁడు"మన రాముఁడు తనజననీసోదరుల జీవనములనిమ్మనిప్రార్థించెను. జమదగ్ని యిచ్చెను.తోడనే రామునితల్లియు, సోదరులును, నిద్రపోయిలేచినట్లు లేచిరి. ఓరాజేంద్రా! రాముఁడు జనకుని తపోబలమును జ్ఞానాతిశయమును నెఱిఁగినవాఁడు కావుననే మరలఁ దనవారలను బ్రదికింపవచ్చునని నిశ్చయించి యనుచితకార్యము నొనర్చెను గాని, లేనిచో నట్లొనర్చునా? కార్తవీర్యునికుమారులు రాముని ప్రతాపమునకు భీతిల్లి పలాయితులై తమతండ్రిమరణమును సర్వదా స్మరించుకొనుచు నొకప్పుడును గొంచెమైననుసుఖము చెందలేకపోయిరి.ఒకప్పుడు రాముఁడు సోదరులతోఁగూడ వనాంతరమున కరిగియుండుటఁ గాంచి హైహయులు తమపగ సాధింప నిశ్చయించుకొని జమదగ్ని యాశ్రమముసొచ్చియగ్నిహోత్రశాలయందుఁ గూర్చుండి భగవంతునియందు మనస్సుఁజేర్చి మైమఱచియున్న జమదగ్నిం గాంచి పాపనిశ్చయులై రేణుక వలదువలదని దీనాతిదీనముగాఁ బ్రార్థించు చున్నను కఠినచిత్తులై వినక యతనిశిరమును నఱికికొనిపోయిరి. రేణుక పతిమరణమును గన్నులారఁజూచి మానసికక్లేశముచేతను, శోకముచేతను, బీడితయై గుండె బాదుకొనుచు "ఓరామా! రామా! రమ్ము, రమ్ము." అని యెలుఁగెత్తి

పిలిచెను. అంతఁ బరశురాముఁడును సతనిసోదరులును దూరమున నుండియె "హా రామా" యను నార్తస్వరమును విని త్వరతో నాశ్రమమునకు వచ్చి మృతినొందిన జనకునిఁగాంచి దుఃఖముచేతను, క్రోధముచేతను, దైన్యముచేతను, రోదనముచేతను, మోహితులై "హా జనకా! హా సజ్జనవరా! హా ధర్మిష్ఠా! మమ్మనాథులఁ జేసి పోయితివా" యని కొంతవడి విలపించిరి. పిమ్మట రాముఁడు ధైర్య మవలంబించి తమ పితృదేహమును రక్షింప సోదరులనియోగించి పరశువును గేలఁగీలించి క్షత్త్రకులనాశము చేయ నిశ్చయించి బ్రహ్మహంతకులకు నిలయమగుటచే శోభ చెడియున్న మాహిష్మతిని జేరి హైహయులను జంపి వారిశిరములను గొండలవలెఁ బ్రోవులు పెట్టెను. మఱియుఁ గ్రూరులు భీతిల్లునట్లు వారల రక్తమును మహానదిగా నొనర్చెను. అయిననమంగళకార్య మొనర్చిన క్షత్త్రకులమునఁ గసిదీఱక యిరువదియొకమాఱు భూవలయమునఁ దిరిగి క్షత్త్రియులఁ బూర్ణముగా సంహరించి శమంతపంచకమను ప్రదేశమున శోణితోదకములగు నైదుహ్రదములందుఁ బితృతర్పణముగావించి కోపము చల్లార్చుకొనెను. అనంతరము రాముఁడు తనజనకుని శిరమును గొని వచ్చి కాయముతో నదికి యాగములచే సర్వదేవమయుఁడైన పరమేశ్వరు నారాధించెను. పిమ్మట యజ్ఞదక్షిణగా హోతకుఁ దూర్పుదిశనిచ్చెను. దక్షిణదిశను బ్రహ్మకును, బడమటి దిక్కు నధ్వర్యునకును, ఉత్తరము నుద్గాతకును నొసంగెను. విదిక్కులను దక్కిన బ్రాహ్మణుల కర్పించి మధ్యభాగమును గాశ్యపున కిచ్చి యందులో నార్యావర్తము నుపద్రష్టకు సమర్పించె. పిమ్మట రాముఁ డవభృథస్నానముచేసి సమస్తపాపములను దొలఁగించు

కొని మేఘమండలమును బాసిన సూర్యునిచందమున సరస్వతీ నదిచెంతఁ బ్రకాశించెను. జమదగ్ని స్మృతి చిహ్నమైన నిజ దేహమునుబొంది రామునివలనఁ బూజలనంది నక్షత్రరూప మొంది సప్తర్షులలోను గడపటివాఁడై యాకసమునఁబొల్చు చుండెను. భగవంతునియావేశావతారమును, బద్మనేత్రుఁడు నగు రాముఁడురాఁబోవు మన్వంతరమునబృహద్వేదమును బ్రవర్తింపఁజేసి సప్తర్షులలో నొకఁడు కాఁగలఁడు. ఇప్పు డతఁడు క్షత్రియవధమాని శాంతుఁడై సిద్ధాదులచేఁ బొగడ్తఁగాంచుచు మహేంద్రపర్వతమున నున్నాఁడు. ఓరాజా! విశ్వాత్ముఁడగు శ్రీహరి యిట్లుభృగువంశమున నవతరించి భూమికిభారము గల్గించు క్షత్రియుల ననేక పర్యాయములు సంహరించి భూభారమును హరించెను. ఓరాజా! సత్యవతి తల్లి బ్రహ్మ మంత్రపూత మగు చరువును భక్షించి విశ్వామిత్రుఁ డనుకుమారునిఁ గాంచెను. అతఁడు వహ్నివలె తేజశ్శాలియై మహాఘోరతప మొనర్చి క్షత్రియత్వమును వదలి బ్రహ్మర్షియయ్యె. క్షత్రియజుఁడయ్యు బ్రాహ్మణుఁడగుటకుఁ గారణ మితని బ్రహ్మమంత్రపూతమగుచరువును భక్షించుటయె. అతనికి నూఱ్ఱురు కొమరులు గలిగిరి. వారిలో మధ్యముఁడు మధుచ్ఛందుఁ డనువాఁడు. అతని నామమునుబట్టి యతనికి జ్యేష్ఠులును గనిష్ఠులునుగూడ మధుచ్ఛందులనునామమును దాల్చినవారు. ఆకాలమున భృగువంశజుఁడగు నజీగర్తి యనునొక బ్రాహ్మణునకుశునశ్శేపుఁ డనుకుమారుఁడుండెను. వాఁడు హరిశ్చంద్రుని యాగమునఁ బశువుగా నమ్మఁబడిపురోహితుని వెంటఁబోవుచుమార్గమధ్యమునవిశ్వామిత్రునిఁ గలిసికొని తనవృత్తాంతమునుజెప్పి శరణుసొచ్చెను.విశ్వామిత్రుఁ

షతనిఁ గరుణించి యతనిఁ బుత్త్రునిఁగా స్వీకరించి మధుచ్ఛందుని కంటె జ్యేష్ఠులగువారిని బిలిచి "యీతని మీలో జ్యేష్ఠునిఁగా నెంచుకొనుఁ"డని చెప్పెను. కానివారందులకంగీకరింపరైరి; గాన కోపముతో వారిని మ్లేచ్ఛులుగా శపించి మధుచ్ఛందునికంటె చిన్నలగు నేఁబండ్రనుబిలిచి తనయభిప్రాయమును దెలిపెను. వారు తండ్రికిభయపడి శునశ్శేఫుని జ్యేష్ఠునిఁగాఁబరిగ్రహించిరి. ఆశునశ్శేఫుఁడు హరిశ్చంద్రయూపబద్ధుఁడయి విశ్వామిత్త్రుఁడుపదేశించిన మంత్రముచే దేవతలను బ్రసన్నులనుగాఁ జేసికొనిపాశవిముక్తుఁడై వారివలనఁ దనప్రాణములరక్షించుకొనియె. అతఁడావరుణయాగమున దేవతలచే దత్తమగు ప్రాణములు గలవాఁడు కావున దేవరాతుఁ డనునామమును వహించెను. దేవరాతుఁడు మంలిరాఁగా విశ్వామిత్త్రునిపుత్త్రులు మధుచ్ఛందుఁడు మొదలగువా రతని జ్యేష్ఠునిఁగాను మంత్రద్రష్టునిగాను నొనర్చిరి. ముని, తనయాజ్ఞనుమన్నించినందులకుసంతసించి మధుచ్ఛందుఁడు మొదలగువారిని జూచి "ఓ తనయులారా! మీరు నా యానతి ననుసరించి దేవరాతుని జ్యేష్ఠునిఁగాఁ బరిగ్రహించి నన్నుఁ బుత్త్రవంతునిఁగాఁ జేసితిరి. కావున మీరును బుత్త్రవంతులై వర్ధిల్లుఁడు. ఓ కౌశికులారా! ఈదేవరాతుఁడు మీ కౌశికులలో నొకఁడు. మీరీతని ననుసరింపు" డని పల్కెను. విశ్వామిత్త్రునకు వీరలేకాక యష్టకుఁడు, హారీతుఁడు, జయంతుఁడు సుమదుఁడు మొదలగు మఱికొందఱు కొమరులు గల్గిరి. ఇట్లు విశ్వామిత్త్రుని కుమారులలోఁ గొందఱు శపింపఁబడుటచేతను, గొంద ఱనుగ్రహింపఁబడుటచేతను, బరునిఁగుమారునిఁగా స్వీకరించుటచేతను గౌశికగోత్రము నానావిధములయినది. అన్యుఁ

డగు దేవరాతుఁడు కౌశికులలో జ్యేష్ఠుఁడై ప్రవరలోఁ జేరుటచే వారి ప్రవరయును మార్పుసెందెను. ఇది పదాఱవ యధ్యాయము.

---

## ఆయు వంశాదికము.

ఓరాజా ! పురూరవుని కుమారులలో నేవురవంశములను వర్ణించితిని. ఇఁక మొదటివాఁడగు నాయువు వంశమును వర్ణింతు వినుము. ఆయువునకు నహుషుఁడు, క్షత్రవృద్ధుఁడు, రజియు, రంభుఁడు, వీర్యవంతుం డను నేవురు తనయులుగల్గిరి. వారిలో క్షత్రవృద్ధుని వంశమును ముందుగా వర్ణించెదను. క్షత్రవృద్ధునికి సుహోత్రుఁడుజన్మించె.అతనికిఁగాశ్యుఁడు,కుశుఁడు,గృత్సమదుఁడనుముప్పురుకొమరులు గల్గిరి.వారిలోఁగృత్సమదునకు శునకుఁ డుదయించె. వానికి శౌనకుఁడుగల్గె. అతఁడే బహ్వృచులలోఁ బ్రధానుఁడయ్యె. కాశ్యునకుఁ గాశిరాజును, గాశిరాజునకు దీర్ఘతముఁడును,దీర్ఘతమునకు ధన్వంతరియుజనించిరి. అతఁడే యాయుర్వేదమును బ్రవర్తింపఁ జేసెను. వాసుదేవాంశమువలన నవతరించి దేవతలతోఁబాటు యాగభాగమునుబొంది నామస్మరణచేతనే రోగములను దూలించు ధన్వంతరికంటె భిన్నుఁడై నను,నీతఁడును భగవదంశసంభూతుఁడే. ఈధన్వంతరికిఁ గేతుమంతుఁడును, గేతుమంతునకు భీమరథుఁడును, భీమరథునకు ద్యుమంతుఁడును జన్మించిరి.ఆద్యుమంతునకే దివోదాసుఁడనునామాంతరము గలదు. వానికిఁ బ్రతర్దనుఁడు సంభవించె. అతనికి శత్రుజిత్తుగలిగె.అతనికి ఋతుధ్వజుఁడుద్భవించె. వానికే కువలయాశ్వుఁ డను వేఱొక నామముగలదు. ఆకువలయాశ్వున

కలర్కుఁడు మొదలగువా రుదయించిరి. వారిలో నలర్కుఁడు యౌవనవంతుఁడై యుండియే యఱువదియాఱువేలవత్సరములు భూమినిబాలించెను. వానివలె యౌవనవంతుఁడై యంతకాలము నేలఁబాలించిన రాజువేఱొకఁడులేఁడు. ఆయలర్కునకు సన్నతియు, సన్నతికి సుకేతుఁడు, సుకేతునకు సుకేతనుఁడును, వానికి ధర్మకేతువును, ధర్మకేతువునకు సత్యకేతువును, సత్యకేతునకు ధృష్టకేతువును, ధృష్టకేతువునకు సుకుమారుఁడును, సుకుమారునికి వీతిహోత్రుఁడును, వానికిభర్గుఁడును, భర్గునకు భర్గభూమియు జనించిరి. ఓరాజా! ఈ చెప్పినరాజులు క్షత్రవృద్ధుని సంతతివారు. ఇఁక రంభునివంశమును వినుము. రంభునకు రభసుఁడును, రభసునికి గంభీరుఁడును, వానికిఁ గ్రతువును సంభవించిరి. ఆక్రతువునకు బ్రాహ్మణకుల ముద్భవించెను. ఆయువు కొమరులలోఁ గడపటివాఁడగు వీర్యవంతునకు అనేనసుఁడు, వానికి శుద్ధుఁడును, శుద్ధునకు శుచియు, శుచికి ధర్మసారథి యనునామాంతరముగల త్రికకుప్పును, త్రికకుప్పునకు శాంతరయుఁడును జన్మించిరి. ఆశాంతరయుఁడు జ్ఞానయోగ మవలంబించి ముక్తుఁడయ్యె; కాని పుత్త్రులఁగనలేదు. ఆయువుకుమారుఁడగు రజి కమితతేజస్కులగు నేనూఱుకొమరులు గల్గిరి. ఆరజి దేవతల ప్రార్థన మంగీకరించి దైత్యులను సంహరించి వా రపహరించిన స్వర్గలోకము సాధించి యింద్రున కర్పించెను. అయినను దేవేంద్రుఁడు ప్రహ్లాదునకు భయపడి స్వర్గలోకము నారజికే వెండియునర్పించి తన రక్షాభరమునంత నాతనిపై నుంచెను. కొంతకాలమునరజి దేహమును దొఱంగెను. వానికొడుకులు స్వర్గరాజ్యమును వశము గావించుకొని యజ్ఞభాగములను స్వీకరించి యింద్రుఁడువచ్చి

యాచించినను నొసంగలేదు. ఇంద్రుఁడు బృహస్పతితో నాలో చించెను. అంత నతఁ డాభిచారహోమమును జేసి యా రజి తనయుల కింద్రాధిపత్యమున కనుకూల మగుబుద్ధి లేకుండఁ జేసెను. తోడనే యింద్రుఁడు మార్గభ్రష్టులగు వారి నంద అను సంహరించెను. ఒక్కనిని విడువలేదు. ఓరాజా! క్షత్ర వృద్ధుని మనుమఁడగు కుశునకుఁ బ్రీతియుఁ బ్రీతికి సంజయుఁ డును, సంజయునకు జయుఁడును, జయునకుఁ గృతుఁడును. గృతు నకు హర్యశ్వకుఁడును, వానికి సహదేవుఁడును, సహదేవునకు భీముఁడును, భీమునకు జయసేనుఁడును, జయసేనునకు సంకృ తియుఁ బొడమిరి. ఆసంకృతి క్షత్రధర్మపరుఁడై మహాశూరుఁడై వాసిగాంచెను. ఓరాజా! క్షత్రవృద్ధవంశజులగు రాజులు వీరె. ఇఁక నహుషుని సంతతివారిని వివరింతు వినుము. ఇది పదునేడవయధ్యాయము.

---

## నహుషవంశము.

ఓనరేంద్రా! దేహి కింద్రియములవలె నహుషునకు యతి, యయాతి, సంయాతి, ఆయతి, వియతి, కృతియనెడి యార్గురు కొమరులుగల్గిరి. వారిలోఁ బెద్దయగు యతి రాజ్యము దుఃఖకర మనియు, రాజాధికారమువలనఁ బురుషునకుఁ దన్నెఱుఁగనంత మత్తత సంభవించుననియుఁ దెలిసికొని తండ్రి యిచ్చెదనన్నను రాజ్యమునుస్వీకరింపలేదు. నహుషుఁ డింద్రాధిపత్యము వహించి కామాంధుఁడై శచీదేవి పొందుగోరి ఆమెకోర్కెచొప్పున బ్రాహ్మణవాహన మెక్కి త్వరగా నడువుఁడని వారలను దన్ని వారిశాపమునకుఁ బాత్రుఁడై పెనుఁబామై నేలఁగూలిన యనం

తరము యయాతిరాజ్యమును స్వీకరించి తనసోదరుల నల్వురను నాల్గుదిశలను బాలింప నియమించి తాను శుక్రునికూఁతును దేవయానిని, వృషపర్వునికూఁతును శర్మిష్ఠను బెండ్లియాడివారితో సుఖముగా భూమిని బాలింపఁ దొడఁగెను. అనిన విని రాజు మునీంద్రుఁజూచి "మహాత్మా! శుక్రుఁడు భృగువంశసంభూతుఁడగు బ్రహ్మర్షిగదా! యయాతి క్షత్త్రియుఁడు. యయాతి బ్రాహ్మణకన్యక నెట్లు పెండ్లాడఁగలిగె? వీరికిసంబంధ మెట్లుపొసఁగెను?. ఇట్టి విపరీతవివాహ మెందయినఁగలదా!" యని ప్రశ్నింప శుకుండతని కిట్లనియె. "ఓరాజా! వృషపర్వుని కుమారిక శర్మిష్ఠ యొకనాఁడు వేగురు చెలికత్తెలు కొలిచివచ్చుచుండఁగా గురుపుత్త్రియగు దేవయానితోఁగూడి పుష్పద్రుమములచేతను, మధుకరముల మధురగానములచేతను మనోహరమగు నుద్యానవనమున విహరించెను. అనంతరము వారొక సరస్సును సమీపించి కట్టుపుట్టములఁ దీరముననుంచి దానిలోఁజొచ్చి యొకరిపై నొకరు నీళ్లు జల్లుకొనుచుఁ గ్రీడించుచుండిరి. ఆసమయమున శంకరుఁడు పార్వతీసహితుఁడై వృషభము నధిష్ఠించి యాప్రాంతమునకు వచ్చుచుండఁగాఁజూచి యాబాలిక లందఱును సిగ్గుపడి త్వరగాఁ దీరమును జేరివసనములను ధరించిరి. ఆత్వరలోఁ దెలియక శర్మిష్ఠ దేవయానివస్త్రమును దాల్చెను. దేవయాని యదిచూచి శర్మిష్ఠ కట్టినపుట్టము తనదని తెలిసికొని మిక్కిలి కోపించి యిట్లనియె. "అయారే! యీదాసియగుశర్మిష్ఠ చేసినయయుక్తకార్యమును జూడుఁడు. వివేకములేకుండ మేము ధరింపఁదగిన వసనమును ధరించినది. యజ్ఞమందలి హవిస్సును కుక్కవలె మావసనము ధరింప నిది యర్హురాలుకాదు. అన్నిజాతులలోను బ్రాహ్మణు

లుత్తములు. వారు తపస్సుచేఁ బరమపురుషునకు ముఖమైరి: ఆబ్రాహ్మణులు జ్యోతిస్స్వరూప మగుబ్రహ్మము నుపాసించెదరు. లోకమున మంగళకరమగు వైదికమార్గ ముపదేశించినవారు వారేకదా ! వారికిఁ బావనమూర్తియు సర్వాంతర్యామియు శ్రీనివాసుఁడు నగుభగవంతుఁడే నమస్కరించును. తక్కినవారు నమస్కరింతు రని వేఱ చెప్పవలయునా ? ఈకారణములచే బ్రాహ్మణులుత్తములు.వారిలో భృగువంశజులుత్తమోత్తములు. ఈశర్మిష్ఠతండ్రి వృషపర్వుఁడు మాకు శిష్యుఁడు. ఇట్లుండ మేము దాల్పవలసిన వస్త్రమిదిదాల్పనర్హురా లగునా? శూద్రుఁడువేద మును బఠింప నెట్లర్హుఁ డగును?" అని నిందించిన దేవయానిని శర్మిష్ఠ చూచి యామె కఠోరవచనములకుఁ దాళఁజాలక కోప ముచే భుజంగివలె రోఁజుచుఁ బెదవి గొఱుకుచు నిట్లనియె. "ఓ భిక్షుకీ! నీవృత్తము తెలిసికొనక నోటికివచ్చి నట్లెల్ల వదరెద వేల? ఎందుల కాత్మస్తవ మొనర్చుకొనెదవు? మీరు కాకుల వలె నాహారాదుల నిమిత్తము మాగృహములఁ గాచికొని యుండియు నిప్పు డీప్రగల్భములేల ?" అని పరుష వచనముల నిందించి యంతఁ గోపము పట్టఁజాలక దేవయానికట్టువస్త్రము నొలిచి దిగంబరనుగాఁ జేసి నూతిలోఁద్రోయించి తనయింటికిఁ బోయెను. అంత యయాతి మృగయార్థమై యటసంచరించుచు దప్పిగొని జలపానమునకై యాకూపమును సమీపించి దిగంబర యగు దానింజూచి తన యుత్తరీయమును గట్టనిచ్చి దయతోఁ దనపాణిచే నామెపాణిని స్వీకరించి పైకిఁదీసెను. ఇట్లు తన్నుద్ధ రించిన వీరుని యయాతినిజూచి ప్రేమపూర్ణములగు వాక్కు లతో ని ట్లనియె. "ఓరాజా! ఓపురంజయా ! నీవు నాపాణిని

గ్రహించితివి. నీచే గృహీతమగునాపాణిని బరుఁడు గ్రహింపఁ దగదు నన్నుఁ బెండ్లాడుము. బ్రాహ్మణకన్యకనురాజెట్లుపరిగ్రహింప నగునని సందేహమువలదు. మనకు దాంపత్యరూప మగుసంబంధము కేవలమీశ్వరకృతముకాని మానవకృతముగాదు. కానిచో నీరూపమునఁగూలి యెప్పుడునుదలంపనినాకు నీసందర్శనము లభింపనేల? ఇదియే యీశ్వర కృతమనుటకు నిదర్శనము. ఇంతే కాదు. పూర్వముబృహస్పతికుమారుఁడు కచుఁడునన్ను శపించెను. దానివలన నాకు బ్రాహ్మణుఁడు భర్తకాఁగూడదు. క్షత్రియుఁడే కావలెను. నా హస్తమునుబట్టినవాఁడేనాకు భర్త' యనిపలుక యయాతివిని శాస్త్రవిరుద్ధమగుటచేఁ దన కిష్టములేకపోయినను, దైవమువలన లభించుటచేతను దనమనస్సామెయందు లగ్నమగుటచేతను,దదీయవచనమున కంగీకరించివెడలిపోయెను. అంత దేవయాని యేడ్చుచు జనకునిసమీపించిశర్మిష్ఠచేసిన దుష్టకృత్యమును నివేదించెను. అది విన్నతోడనే శుక్రుఁడు విమనస్కుఁడై యీపౌరోహిత్యముకన్న బిచ్చమే మేలని నిశ్చయించి, కుమారీ సహితుఁడై వృషపర్వుని పురమునువిడిచిపోవుచుండెను. అంత వృషపర్వుఁడు తనశత్రువులగు దేవతలతోనేకీభవింప వెడలిపోవుచున్నట్టు గ్రహించియతెనివెంబడిఁజనిమార్గమధ్యమునఁగలిసికొని యతనిపాదములపైఁబడి మిగులఁ బ్రార్థించి ప్రసన్నునిఁగాఁ జేసికొనెను. శుక్రుఁడు కోపమును విడిచి వృషపర్వునిఁజూచి "ఓయీ! నాకు దేవయాని ముద్దుకూఁతురు. ఆమెనువిడిచి నే నుండలేను. ఆమె యేమికోరునో దాని నొసంగుము. అట్లయిన మరలివచ్చెదను" అని పలికెను. వృషపర్వుఁ డందులకు సమ్మతించి దేవయానినిగోరుమనఁగా నామె "నీకూతురు,సఖీ జనముతోఁగూడ

నన్ను సేవించుచు నేనెచ్చటికేఁగిన నచ్చటికిరావలయును ఇదియే నాకోర్కి" అని పల్కఁగా నతఁ డట్లొనర్చెను. అంత శర్మిష్ఠ శుక్రునివలనఁ దనజనకాదులకు సంభవించెడునర్థమును జూచి కార్యగౌరవమును దెలిసికొని మా తాడక చెలికత్తియలతోఁ గూడ దేవయానికి దాసియయి కొల్చుచుండెను. అనంతరము శుక్రుఁడు యయాతినిబిలిపించి తనకూఁతును శర్మిష్ఠతోఁగూడ నర్పించి యొకప్పుడును శర్మిష్ఠతో సంగమింపఁగూడదని కఠినముగాఁ జెప్పెను. అతఁ డందులకంగీకరించి వారిఁదోడ్కొని పోయెను. కొంతకాలమునకు దేవయానికుమారునిఁగనిసంతసించుచుండ నది శర్మిష్ఠగాంచి తానుగూడసంతానమును గాంచవలె నని తలంచి తన ఋతుకాలమున యయాతినిఁబతిగావరించెను. ధర్మవిదుఁడగు యయాతి సంతానార్థము ఋతుకాలమున సంగమింపఁ గోరుచున్న కాంతనువిడుచుటధర్మముగాదని నిశ్చయించి శుక్రుని యాజ్ఞావచనముబంధించుచున్నను సరకుగొనకయామె యభిలాషమును దీర్చెను. దేవయానికి యదువును, దుర్వసువు నను నిర్వురు సుతులుగల్గిరి. శర్మిష్ఠకు ద్రుహ్యుఁడు, అనువు, పూరుఁడునను ముప్వురుతినయులు గల్గిరి. అభిమానవంతురాలగు దేవయాని తనభర్తవలననే శర్మిష్ఠ సంతానవంతురాలయ్యెనని యెఱిఁగి క్రోధమూర్ఛితయై యలిగిపుట్టింటికిఁబోయెను. కాముకుఁడైన యయాతి ప్రియురాలి ననుసరించి పాదములపైఁబడి సాంత్వవచనములచేఁ బ్రతిమాలియు నామెను బ్రసన్నురాలినిగాఁ జేయలేకపోయెను. అంత శుక్రుఁ డదితెలిసికొని యయాతి కార్యమునకుఁ గోపించి "ఓరీ మందబుద్ధీ! ఓరీ కాముకా! ఓరీ యనృతరూపా! నరులను వికృతరూపులనుగాఁ జేయు ముదు

సలితనము నిన్నావేశించుఁగాక" యని శపించెను. ఇట్లు శపింపఁబడి యయాతి యతనిఁగాంచి "ఓ బ్రాహ్మణోత్తమా ! నన్నను గ్రహింపుము. నీ కుమారికవలన నాకుఁ గామములం దింకను దృప్తిలేదుకావుననన్నెప్పటియవస్థలోనుంపు"మనిబతిమాలెను. దానిని విని కరుణించి "నాశాపముతప్పదు. అయిన నీకామము దీఱనిచో నీవార్ధకమును వేఱొకనికిచ్చి వానియౌవనమును నీవు దీసికొను"మని బదులుచెప్పెను. ఇట్లు యయాతి వ్యవస్థచేసికొని పురమునకువచ్చి జ్యేష్ఠకుమారుఁడగుయదువునుబిలిచి "కుమారా! నీమాతామహుఁడగు శుక్రుఁడు నాకీజరావస్థనుగల్గించె. నాకు విషయసుఖములం దింకను దృప్తిలేదు. కావున నాజరావస్థను దీసికొని నీయౌవనావస్థ నిమ్ము. కొన్నివత్సరములు క్రీడించి నీయౌవనము నీకిచ్చెద"నని పలుకఁగా యదు వతని కిట్లనియె. "ఓజనకా! పురుషుఁడు విషయసుఖములనుభవింపకుండ వైరాగ్య మందఁజాలఁడు. నేనిదివఱకు విషయసుఖము నుంతే ననుభవింపలేదు. చిరకాలముసుఖమనుభవించిననీవేయిట్లుశాంతినిబడయఁ జాలనిచో నామాట చెప్పనేల? కావున ముదుసలివాఁడనై యుండఁజాలను"అని పల్కవిని యయాతి తుర్వసునిఁబిలిచి తన యభిప్రాయము తెల్పెను. అతఁడును నిరాకరించెను. పిమ్మట ద్రుహ్యుని,ననువునుబిలిచి యడుగ వారును నశ్వరమగు దేహమున స్థిరత్వబుద్ధినుంచి తండ్రికోర్కినిదిరస్కరించిరి. అనంతరమురాజు వయస్సుచేఁబిన్నయయ్యును గుణములచేఁ బెద్దయగు పూరువును బిలిచి "ఓ వత్సా! నీవు నాకోర్కిదీర్పుము. నీవు నీయన్నల వలెనేనన్ను నిరాకరింపఁదగవు" అనిపలుకవిని యతండతని కిట్లనియె. "ఓ మానవేంద్రా! జనకుని దేహమునఁ బుట్టిన పురుషుఁ

డెవ్వఁడు లోకమునఁ బితృవాక్యమును నిరసింపఁగలఁడు? పిత్రనుగ్రహమువలనఁదప్పకుండ నైహికసుఖమేకాకయాముష్మికసుఖముగూడఁలభించును. జనకునికోర్కి మనమునం దుండఁగనే తెలిసికొని చేయువాఁడుత్తముఁడు. చెప్పినపిమ్మటఁ జేయువాఁడు మధ్యముఁడు. జనకాజ్ఞయం దశ్రద్ధపూని తుద కొనర్చువాఁడధముఁడు. అశ్రద్ధవహించియుఁ జేయనివాఁడధమాధముఁడు" అని పలికి సంతోషపూర్వకముగానే తన తండ్రి జరావస్థను ప్రతిగ్రహించెను. ఆయయాతిపుత్త్రుఁడిచ్చినవయస్సుచే విషయసుఖముల యథేష్టముగా ననుభవించుచు సప్తద్వీపపరిమితయగుభూమిని బాలించుచుఁ దండ్రి పిల్లలనువలెఁ బ్రజల ధర్మయుక్తముగాఁ బోషించుచుండెను. ఓరాజా! అతఁడిట్లు యథాప్రీతిగా నింద్రియ సుఖము లనుభవించుచున్నను నింద్రియపటుత్వము సుంతేనియుఁ దఱుఁగలేదు. దేవయాని ప్రతిదినమును మనోవాక్క్రియలచే భర్తను సేవించి యేకాంతమునఁ గూడనతనికి మిక్కిలి ప్రియురాలయ్యెను. ఎవఁడు సర్వదేవతామయుఁడో, యెవఁడారాధకులయార్తి నిరోలఁగించునో, యెవఁడు యాగములం దారాధితుఁడై తత్ఫలము నొసంగునో, ఆకాశమున మేఘపంక్తివలెనెవనియందుఁ జిదచిదాత్మకమును, స్వప్నసమానమును, మాయామనోరథతుల్యమును నగుప్రపంచమొకప్పుడు గానవచ్చి వేఱొకప్పుడంతర్ధానము నెందుచు మఱొకప్పుడు నానావిధమై చూపట్టునో, యెవఁడు హృదయకుహరములందు శయనించునో, యెవఁడు సూక్ష్మవస్తువులలోనెల్ల సూక్ష్మవస్తువో, యెవఁడు జీవసమూహమునకుఁ బ్రాప్యుఁడును బ్రాపకుండు నాధారుండు నగుచున్నాఁడో, యట్టి పరమేశ్వరునిఁ దన

హృదయమున నిలిపి ఫలాభిలాష లేకయే పెక్కుయాగములు చేసి పరమపురుషుని సంతసింపఁజేసెను; కాని సార్వభౌముఁడగు యయాతి కుత్సితము లగు నింద్రియములచే వేయువత్సరములు విషయసుఖము లనుభవించియుఁ దృప్తి చెందలేకపోయెను. ఇది పదునెనిమిదవ యధ్యాయము.

---

## * యయాతి బస్తోపాఖ్యానము చెప్పుట.

ఓ రాజా! యయాతి స్త్రీలోలుఁడై చిరకాలము విషయసుఖము లనుభవించి యొకప్పుడు తన యజ్ఞానమును దెలిసికొని నిర్వేదమునంది ప్రియురాలగు దేవయానికిఁ దనవర్తన మనుకరించు నొక యుపాఖ్యానము చెప్పఁదలంచి యిట్లనియె. "ఓ భార్గవీ! భూమిలో నన్నివిధముల చేతను నాచరిత్రమును బోలిన యొక యితిహాసమును జెప్పెదను. వినుము. అకటా! నావర్తనము తుచ్ఛమైనది. జితేంద్రియులై వనమందు సంచరించుచున్న పండితులందఱును నావర్తనమునుగూర్చి దుఃఖించుచున్నారు. పూర్వమొకవనములో నొక మేష మసహాయమై తనకుఁ బ్రియమగు దాని వెదకుచు నందంద తిరిగితిరిగి యొకచోఁ గర్మవశమున నూతిలోఁబడి యున్నయొక యాఁడుమేఁకను గాంచి కామించి దాని నుద్ధరించుటకుఁ దగినయుపాయ మరయుచుండెను; కాని యాఁడు

* ఈ యితిహాసమును యయాతి తనచరిత్రమును దెలుపనెంచి యన్యాపదేశముగాఁ జెప్పుచుండెను. ఇందు మేషము యయాతియనియు, వనమే సంసారమనియుఁ, బ్రియవస్తువే విషయసుఖములనియుఁ, గూపమునఁ బడిన యామేషి దేవయానియనియు గ్రహింపవలయు. మేషము నూతియందలి మేషి నుద్ధరించుటకు యత్నించుట యయాతి దేవయాని నుద్ధరించుటతోఁ బోలునని యెఱుఁగునది.

తోఁష లేదు. *తుట్టతుద కామేషము శృంగములచే నొడ్డును ద్రవ్వి మన్ను దీసివైచి యుత్తారణమార్గము నేర్పఱిచి పైకిఁదీసెను. తోడనే యామేషి కూపమువలన నిర్గమించివచ్చి యామేషమును బతిగా వరించెను. ఆమేషమును దానిని బత్నిగా గ్రహించెను. ఆమేషితోఁగూడి పరిపుష్టసర్వావయవమై, రతిసమర్థమై, రేతస్సేక్తమై, మైథునసమర్థమై యున్న యామేషమును జూచి, మఱికొన్ని యాఁడుమేఁక †లచ్చటికివచ్చి కామించినవి. ‡ఆపురుషమేషము కామగ్రస్తమై తనస్త్రీలతో సర్వదా రమించుచుఁ దన్నుఁదా మఱచెను. ఆమేషీచయములో నొకటి దానికిఁ బ్రియురాలయ్యెను. § శ్రేష్ఠమగు దానితోఁ గ్రీడించుచుండఁ బూర్వము కూపమునుండి నిర్గమించి వచ్చినది దానిఁజూచి సహింపక పోయెను. తోడనే యది దుర్హృదయమును, బ్రియమువలెఁ గానవచ్చునదియుఁ, గామియు, నింద్రియాధీనమును నగు నా పురుషమేషమును విడిచిపోయెను. స్త్రీలోలమయిన యాబస్తము దీనమై తన భార్యకోపమును దీర్పనెంచి బిడాలిని బిడాలమువలె దాని వెంబడించిపోయి మార్గమధ్యమునఁ బ్రార్థించియు దాని కోపమును బోకార్పలేక పోయెను. అంత నొక ద్విజుఁడువచ్చి యాబస్తము వృషణము ఛేదించి మగుడ నది ప్రార్థింపఁ గరుణించి యదికెను. ఇట్లాబస్తముఁ దిరిగి యండకోశమునుబొంది కూపలబ్ధ

* దీనివలన యయాతి దేవయాని నుద్ధరించుట తెలియవచ్చుచున్నది.

† దీనివలన శర్మిష్ఠాదులు యయాతిని వరించుట తెల్లము.

‡ దీనంజేసి యయాతి కామగ్రస్తుఁడై యాత్మను మఱచుట స్పష్టము.

§ ఇది శర్మిష్ఠను యయాతి ప్రేమించుటను, దానికి దేవయాని సహింపకుండుటను దెలుపుచున్నది.

యగు మేషితోఁగూడి చిరకాలము కామ మనుభవించియుఁ బరితృప్తి చెందలేకపోయెను. ఓసుభ్రూ! నేనాబస్తమువలెనీప్రేమ యను యంత్రమునకు వశ్యుఁడనై నీవిభ్రమాదులచే మోహితుఁడనై నన్ను నేమఱచి వర్తించుచుంటిని. కామము లనుభవించుటవలన శాంతినొందవు. భూమండలమం దున్న ధాన్యాదులుగాని బంగారుగాని, పశువులుగాని స్త్రీరత్నములుగాని కామాసక్తునికి మనఃప్రీతిని గల్గింపఁజాలవు. ఇంకను మఱింత కోర్కెని బుట్టించును. హవిస్సుచే నగ్ని చల్లారక వర్ధిల్లినట్లు, అనుభవించుటచేఁ గామము మఱింత వర్ధిల్లునుగాని శాంతింపదు. అట్టి కామ మెట్లు శాంతించునో చెప్పెదనువినుము. పురుషుఁడెప్పుడు సర్వభూతములందును రాగద్వేషాదులఁ జూపక సమదృష్టి గలడేని, వాఁడెచ్చటికేఁగిన మిక్కిలి సుఖించును. వానికి దిక్కులన్నియు సుఖమయములుగాఁ గన్పించును. ఆలోచింప విషయాభిలాషము మిక్కిలిచెడ్డది. దుర్మతులు దాని నెప్పటికిని విడువఁజాలరు. పురుషుఁడు ముసలితనముచే జీర్ణించినను నది జీర్ణింపదు. ఇది సకల దుఃఖములనుగూర్చును. సుఖము నపేక్షించువాఁడైనచోఁదప్పక యాతృష్ణను విడువవలెను. పురుషుఁడెప్పుడును, దల్లితోఁగాని, దోఁబుట్టువుతోఁగాని, కూఁతుతోఁగాని రహస్యమున నేకాసనమునఁ గూర్చుండరాదు. బలిష్ఠములగునింద్రియములు విద్వాంసునైన నాకర్షింపక మానవు. నేను నీతోఁగూడి వేయుసంవత్సరములు విషయసుఖము లనుభవించితిని. అయిన విషయాభిలాషము క్రమముగా హెచ్చుచున్నది గాని తరుగలేదు. కావున నే నీతృష్ణను విడిచి బ్రహ్మమును జిత్తమునఁ జేర్చి శీతోష్ణాది ద్వంద్వములను దిరస్కరించి దేహాత్మభ్రాంతిని బాఱఁదోలిమృగ

ములతోఁగలసి చరింప వనమున కేఁగెదను. ఐహికసుఖములను గాని, యాముష్మికసుఖములనుగాని,విద్వాంసుఁ డాసింపరాదు. అట్లుచేసినచో నాతనికిసంసారమును,దానివలన స్థావరమాటయు సంభవింపక మానదు. కావున నెవఁడు వాని నాసింపక నిరతిశయమగు నానందరూపమునఁ బొల్చు పరమాత్మతత్త్వముఁ దెలిసికొనునో, వానికి విషయాభిలాషము స్వయముగానే నివర్తించును'' అని దేవయానితోఁ జెప్పి తనవయస్సును బూరున కిచ్చి యతనివలన జరావస్థను స్వీకరించి యాగ్నేయమునకు ద్రుహ్యుని, దక్షిణమునకు యదువును, ప్రతీచికిఁ దుర్వసుని, నుత్తరమునకు అనువును, బ్రభువులనుగాఁ జేసి భూమండలమంతకును యోగ్యుఁడగుపూరువు నభిషేకించి యన్నలనందఱను నతని కధీనులఁగా జేసి తాను వనమున కరిగెను. అక్కడ నతఁడు, పెక్కు సంవత్సరము లనుభవించినను దఱుగని యింద్రియసుఖములను ఱెక్కలువచ్చినపక్షి గూఁటినివలె,క్షణమాత్రమునవిడిచి సమస్తసంగములను వదల్చుకొని బ్రహ్మోపాసనచే గుణకార్యములను నశింపఁజేసి పొందఁదగిన పరమపదము నొందెను. ఆట దేవయాని భర్త చెప్పినకథ విని స్త్రీపురుషుల పరస్పరస్నేహముచేఁ గల్గిన వికారమును బరిహసించుటకుఁ జెప్పినను గేవలము తన్ను గేలిచేయుటకే యని నిశ్చయించి పానశాలయందలి పాంథులసంబంధమువలె నీశ్వరాధీనులయినపతిపుత్రాదులసంబంధము భగవన్మాయావిరచిత మని తెలిసికొని దేహముతోను, దదనుబంధులతోను, వేయేల యందఱతోను, దనకుఁగల సంబంధము స్వప్నమువలె ననిత్యమని నిశ్చయించి భగవంతుని ధ్యానించి లింగదేహమును విడిచెను'' అని చెప్పి శుకుఁడు “జగ

త్స్రష్టయు,సర్వభూతములకాధారభూతుఁడును శాంతాత్ముఁడు నగువాసుదేవునకు నమస్కార మొనర్చెదను" అని నమస్కరించి వేఁడియునిట్లనియె. ఇది పందొమ్మిదవ యధ్యాయము.

---

పూరుని వంశము.

ఓరాజా! దేనియందు నీవు జన్మించితివో, దేనియందు వంశవర్ధను లగుబ్రాహ్మణులును, రాజర్షులు నుదయించిరో, యాపూరువంశమును వర్ణించెదను; వినుము. పూరునకు జనమేజయుఁడును, జనమేజయునకుఁ బ్రచిన్వుఁడును, ప్రచిన్వునకుఁ బ్రవీరోధుఁడును, ప్రవీరోధునకు నమస్యుఁడును, నమస్యునకుఁ జారుఁడును, చారునకు సుద్యుఁడును, సుద్యునకు బహుగవుఁడును, బహుగవునకు శర్యాతియు, శర్యాతికి సంయాతియు, సంయాతికి అహంయాతియు, వానికి రౌద్రాతియు, రౌద్రాతికి ఘృతాచి యనునచ్చరయందు భగవంతుని దశేంద్రియములవలె ఋతేపువు, కక్షేపువు, స్థలేపువు, కృతేపువు, జలేపువు, సన్నతేపువు, ధర్మేపువు, సత్యేపువు, వ్రతేపు వనుపదుగురుపుత్త్రులును, బుట్టిరి. ఆఋతేపున కంతిసారుఁడును వానికి సుమతియు, ధ్రువుండు,నప్రతిరథుండు నను ముప్వురుకుమారులునుగల్గిరి. వారిలోన ప్రతిరథునకుఁగణ్వుఁడును, గణ్వునకు మేధాతిథియు, మేధాతిథికిఁ బ్రస్కణ్వుఁడు మొదలగు బ్రాహ్మణులును బుట్టిరి. అంతిసారసుతుఁడైనసుమతికి రైభ్యుఁడును, వానికి దుష్యంతుఁడును గలిగిరి. ఆదుష్యంతుఁ డొప్పుడు వేఁటాడ నరణ్యమున సంచరించుచు నటకు సమీపమున నున్న కణ్వాశ్రమమున కరిగి యచ్చటఁ గూర్చుండి లక్ష్మివలెనే స్వీయ కాంతులచేఁ దన్ను నలంకరించుకొనుచు జగన్మోహినివలెఁ గాన

వచ్చుచున్న శకుంతలయను యువతినిజూచి మోహమంది తదీయ దర్శనమునకు మిగుల సంతసించి మృగయాప్రయాస మంతయు దొలంగఁ గామపీడితుఁడై మందహాసము చేయుచు మృదుమధురముగా నిట్లనియె. "ఓ యువతీ! ఇంత సుందరాకారముతోఁ బోల్చుచున్న నీ వెవతెవు? నీ వెవనికూతురవు? ఏమిచేయుటకై నీ వీనిర్జనవనమునకు వచ్చితివి? ఓసుమధ్యా! నీవు తప్పక రాజపుత్రివై యుండవలయును. కావుననే నామనస్సు నీవంకకుఁ బర్వెత్తుచున్నది. నీ వట్లు కానిచో పూరు వంశసంభూతుఁడ నగు నామన స్సధర్మమార్గమున నేల ప్రవర్తించును?" అనిన విని శకుంతల యి ట్లనియె. "ఓ నరేంద్రా! నేను విశ్వామిత్రునకు మేనకయందుఁ బుట్టినదానను. నాతల్లి స్వర్గమునకుఁ బోవుచు నను వనమున డించిపోయెను. నాచరిత్రము కణ్వమహామునికిఁ దెలియును. దాని కేమి? అది యటుండనిండు. మీకు మేమేమి చేయవలయును? రండు. కూర్చుండుఁడు. మాయిచ్చుపూజలస్వీకరింపుఁడు. ఇచ్చట నివరధాన్యమున్నది. ఇష్టమువచ్చినచో భుజింపవచ్చును. మీకిష్టమున్నచో నిట నివసింపవచ్చును." అని మధురముగా నుడివిన విని రాజామెనుజూచి "సుందరీ! కుశికవంశమునఁ బొడమిన నీ కీ వినయాదు లెంతయుఁ దగియున్నవి. లోకమున రాజకన్యకలు స్వయముగానే భర్తలను స్వీకరింతురు. నీవు రాజకన్యకవు గావున దయయుంచి నన్ను వరింపుము" అనిన నామెయందుల కంగీకరించెను. దేశకాల విభాగ మెఱిఁగినదుష్యంతుఁడు వెంటనే యామెను గాంధర్వవిధిచేఁ బరిణయమయి యా రాత్రి యామెతోఁ గ్రీడించి తెల్లవాఱినతోడనే తనపురమునకుఁ బోయెను. శకుంతల గర్భముఁదాల్చి కొలఁదికాలములో నొక

కుమారునిఁ గనియెను. కణ్వుఁ డందులకు సంతసించి వనమందే బాలునకుజాతకర్మాదిక్రియల నొనర్చెను. అ బాలుఁడుక్రమముగా వర్ధిల్లి స్వీయబలముచే నొకసింహమునుఁబట్టుకొని దానితో నాడుకొనుచుండెను. భగవంతుని యంశాంశమువలన జనించి యపారవిక్రముఁడైన కుమారునిఁ దీసికొని శకుంతల భర్తగృహమున కేఁగెను. కానిరాజు భార్యాపుత్రులు నిర్దుష్టులైనను లోకాపవాదమునకు జడిసి స్వీకరింప లేదు. అంతట సర్వభూతములును వినుచుండ "ఓ రాజా! సంతతివిషయమై తల్లి చర్మమయపాత్రమువలె నాధారమాత్రమే కాని ప్రధానురాలుకాదు. పుత్రోత్పత్తికిఁ దండ్రియే ముఖ్యుఁడు. ఈపిల్లఁడు నీకుమారుఁడు. శకుంతల నీభార్య. తప్పక భరింపుము. భరింపుము. శకుంతల నవమానింపకుము. ఈబాలుఁడు వంశకర్తయగును. వంశకర్తయగు కొమరుఁడు తండ్రిని నరకమునుండి రక్షించును. శకుంతలావచనము సత్యము. ఈ పిల్లఁడు నీవలననే కలిగెను. వాసుదేవాంశసంభవుఁడును, బ్రహ్మణ్యుఁడును, సత్యసంధుఁడను, గుణగ్రాహియు, కీర్తివర్ధనుఁడును, కృతజ్ఞుఁడును, మహోత్సాహియు, స్థూలవక్షుఁ డునగు నీకుమారుని స్వీకరింపు" మని పల్కెను. అది విని దుష్యంతుఁడు సంతసించి భార్యాపుత్రులను స్వీకరించెను. దుష్యంతుని యనంతరమున భరతుఁడు చక్రవర్తియై మహాకీర్తిని సంపాదించెను. వాసుదేవాంశసంభూతుఁడైన యాభరతునిమహిమ భూమి నెల్లెడలను నుతింపఁబడుచున్నది. ఆ భరతుని చేతియందు విష్ణువునకువలెఁ జక్రాది రేఖలును, పాదములందుఁ బద్మరేఖలును గలవు. అతఁడు చక్రవర్తిగా నభిషిక్తుఁడై నపిమ్మట గంగాతీరమున నిన్నూట యేఁబది యశ్వమేధ

వీఁడు ద్వాజుఁ డనఁబడును. వీనిని నీవు భరింపకతీఱదని'' పల్కెను. అదవిని తారామమత "ఓ బృహస్పతీ! ఈ ద్వాజుని నీవే భరింపు" మని పల్కి వెడలిపోయెను. ఆ బృహస్పతియు నిర్దయుఁడై యాబాలుని విడిచిపోయెను. ద్వాజుని నీవేభరింపుమని యొండొరులతో వివదించుకొని విడిచిపోయిరి. కాన యాబాలుఁడు భరద్వాజుఁ డను నామము దాల్చెను. దేవతలు వానిఁగొనివచ్చి భరతునకొసంగిరి. ఆ బాలుఁడు వితథమైన భరతవంశమునకు దత్తుఁడగుటవలన వితథుఁడను వేఱొక నామమును దాల్చెను. ఇది యిరువదవ యధ్యాయము.

## గర్గరంతిదేవపంశాదులు.

ఓరాజా! ఆవితథునకు మన్యువును, మన్యువునకు బృహత్క్షత్త్రుఁడు, జయుఁడు, మహావీర్యుఁడు, నరుఁడు, గర్గుండు నను నేవురు కుమారులును, గల్గిరి. వారిలో నరునకు సంకృతియు, సంకృతికి గర్గ, రంతిదేవు లనునిద్దఱుకొమరులును సంభవించిరి. ఓరాజా! వారిలో రంతిదేవుని కీర్తి భూలోకమును స్వర్గలోకమునుగూడ నావరించెను. ఆ రంతిదేవుఁడు తన సంచితార్థమంతయు నర్థులకుఁ బంచిపెట్టి నిర్ధనుఁడై దైవ ప్రాప్త మగువస్తువులచే నాఁకటిఁ బుచ్చుచు, ధైర్యము చెడనీక కుటుంబముతోఁగూడఁ గృశించి జలపానము నైనఁ జేయక నలువదియెనిమిది దినములనుగడపెను. అంత నాఁటియుదయమున దైవవశమువలన ఘృతపాయసము లును, నన్నపానములును బ్రాప్తింపఁగాక్షుత్పిపాసలచే వడకుచుఁ దనకుటుంబముతోఁ గూడఁదినుటకు సంసిద్ధుఁడైన రాజుండ నొకయతిథి వచ్చె. ఆ రంతిదేవుఁడు వచ్చినయతిథి నాదరించి

శ్రద్ధాళువై సకలభూతములును భగవదాత్మకములే యని నిశ్చయించి యా యాహారములోఁ గొంతభాగ మతనికి నొసఁగ నతఁడు భుజించి సంతసించి వెడలిపోయెను. తక్కిన యాహారమును గుటుంబమునకు విభజించి తిన యత్నించుచుండ క్షుత్పీడితుఁడగు నొకవృషలుఁ డేతెంచెను. వాఁడు దానమున కనర్హుఁడైనను లేదనక యున్నయన్నములో నొకభాగ మతనికిచ్చి వాఁడు సంతుష్టుఁడై చన్నపిమ్మట రంతిదేవుఁడు తన కుటుంబముతోనున్న దాని నారగింప దొరకొనుచుండఁగాఁ గుక్కలతోఁ గూడ వేఱొక యతిథివచ్చి "ఓరాజా! నేనును, నా కుక్కలును మిక్కిలి యాకలిగొని యున్నారము. ఆ యాహారమును మాకర్పింపు"మనియాచించెను. అంతట రంతిదేవుఁడాతని నాదరించి గౌరవ పూర్వకముగా నవశిష్టమిచ్చి వానిభగవంతునిఁగా భావించి నమస్కరించెను. ఇఁక జలముమాత్రము మిగిలి యుండెను. అద్దైన నొక్కరికిమాత్ర మేసరిపడును. దానిని ద్రావ సిద్ధపడి యుండ నొకచండాలుఁడు వచ్చి "ఓమానవనాథా! నేను జండాలుఁడను. మిక్కిలి దప్పిగొని యున్నవాఁడను. ఆయుదకము లిచ్చిరక్షింపు" మనిప్రార్థించెను. ఆ రంతిదేవుఁడు దీనములయి శ్రమకరములైన వానివచనములు విని మిక్కిలి జాలిపడి యమృత తుల్యము లగుమాటలతో నిట్లనియె. "ఓ పుల్కసా! నేను బ్రహ్మలోకాదుల నపేక్షింపను. మోక్షమును వాంఛింపను; కాని, క్షుత్పిపాసలచేఁ బీడితులయినశరీరుల మనోదుఃఖములునన్నుఁ బొందుఁగాక"యని కోరుచున్నాను. మఱియు జీవింపఁదలంపుగొన్న వారి జీవములు నిలుచునట్లు జలాదుల నొసంగినవాని కాఁకలి, దప్పి, శ్రమము, గాత్రకంపము, దైన్యము,

క్లమము శోకము, విచారము, మోహము మొదలగు వికారములలో నొకటేనియుఁ గలుగఁజాలవు. కావున యాచకులకు నా ప్రాణమీవలసివచ్చిన నిచ్చెద''ననిపల్కి దయాళువై పిపాసచేఁ జావసిద్ధుఁడైన యా చండాలున కా పానీయ మర్పించెను. అంత బ్రహ్మాది దేవతలు రంతిదేవుని సద్గుణములకు సంతసించి యతనికిఁ బ్రత్యక్షమై, ''నీసద్గుణములను బరీక్షించుటకై విష్ణుమాయయే వృషలాది రూపముగా వచ్చినది'' యని చెప్పి ప్రకృతి పురుష వివేకము నొసంగిన, రంతిదేవుఁడు భక్తితో స్వీకరించి, వారలకు నమస్కరించి, దేహమందును, దదనుబంధులయందును, మమత్వమును విడిచి యైహిక సుఖములందుఁ గాని యాముష్మిక సుఖములందుఁ గాని మనస్సును జొప్పింపక కేవలము వాసుదేవుని యందుఁ జేర్చెను. అన్యఫల మపేక్షింపకుండఁ జిత్తము వాసుదేవుని యందుఁ జేర్చుటచే రంతిదేవునకుఁ ద్రిగుణాత్మకయగు మాయ, స్వప్నమువలెనగోచరమయ్యెను. ఓ రాజా! ఆ రంతిదేవుని ప్రభావమునకు మెచ్చుకొని యతని ననుసరించిన యోగులెల్ల నారాయణభక్తులై ముక్తిఁ జెందుచుండ నతఁడు ముక్తుఁడయ్యెనని వేఱె చెప్పవలయునా? ఇఁక గర్గుని వంశమును వినుము. గర్గునకు శినియు, శినికి గార్గ్యుండును గల్గిరి. అతనివలన బ్రాహ్మణకుల మేర్పడియె. మహావీర్యునకు దురితక్షయుండును, దురితక్షయునకుఁ ద్రయ్యారుణియుఁ గవియుఁ బుష్కరారుణియు, నను మువ్వురు కొమరులును గల్గిరి. వారును బ్రాహ్మణులయిరి. బృహత్క్షత్రునకు సుహోత్రుఁడును, సుహోత్రునకు హస్తియు సంభవించిరి. ఆ హస్తియే తన పేర హాస్తినపురమును నిర్మించెను. అతనికి అజమీఢుఁడు, ద్విమీఢుఁడు, పురుమీఢుఁ డను మువ్వురు

ప్రభవించిరి. వారిలో నజమీఢుని సంతతివారగు ప్రియమేధాదులు బ్రాహ్మణులైరి. అజమీఢునకు బృహదిషుఁడను మఱియొక కొమరుఁడు గలఁడు. ఆబృహదిషునకు బృహద్ధనువును, బృహద్ధనువునకు బృహత్కాయుఁడును, వానికి బృహద్రథుఁడును, వానికి విశదుఁడును, విశదునకు ఫేనజిత్తును, ఫేనజిత్తునకు రుచిరాశ్వుఁడు, దృఢహనువు, గాశ్యుఁడు, వత్సుఁడు ననునలువురు కొమరులును సంభవించిరి. వారిలో రుచిరాశ్వునకుఁ బ్రాజ్ఞుఁడును, బ్రాజ్ఞునకుఁ బృథుసేనుఁడును, వానికిఁ బారుఁడును, బారునకు నీపుఁడును జన్మించిరి. ఆనీపునకు నూఱ్వురు కొమరులు జనించిరి. ఇంతియకాక నీపుఁడు* శ్రీశుకుని కన్యకయగు కృతిని జేపట్టి యామెయందు బ్రహ్మదత్తునిఁ గనియె. బ్రహ్మదత్తుఁడు సరస్వతియను భార్యయందు విష్వక్సేనునిఁ గనెను. అతఁడు జైగీషుని యుపదేశమును బొంది యోగశాస్త్రమును రచించెను. ఆ విష్వక్సేనునకు నుదక్సేనుఁడును, వానికి భల్లాదుఁడును జనించిరి. వీరు బార్హదీషవులను రాజులైరి. ద్విమీఢునకు యవీనరుఁడును, వానికిఁ గృతిమంతుఁడును, గృతిమంతునకు సత్యధృతియు వానికి

---

*ఇట శ్రీశుకుని కుమారియని చెప్పుటచే శ్రీశుకునకు సంతానముగలదని చెప్పఁబడినది. ఈసంగతియే హరివంశాదులందుఁగూడఁ జెప్పఁబడినది. "పారాశరసుతోత్పన్నశ్శుకోనామ మహాయశాః। వ్యాసాదరణ్యాం సంభూతో విధూమాగ్నిరివ జ్వలన్। సతస్యాంపితృకన్యాయా పరిణ్యాంజనయిష్యతి। కృష్ణం గౌరం ప్రభుం శంభుం తథాభూతశ్రుతం జయం। కన్యాం కీర్తిమతీం షష్ఠీం యోగినీం యోగమాతరం। బ్రహ్మదత్తస్య జననీం మానుషీమ్॥" అని యున్నది. దీని యోజింప శుకమహాముని గూడ నొకప్పుడు గార్హస్థ్య మవలంబించెనని తెలియఁదగినది.

దృఢనేమియు దృఢనేమికి సుపార్శ్వుఁడును, సుపార్శ్వునకు సుమతియు, సుమతికి సన్నతిమంతుఁడును,సన్నతిమంతునకుఁ గృతియు జనించిరి. ఆకృతియె హిరణ్యనాభునివలన యోగమును, నాలు విధములగు సామసంహితలను బఠించి ప్రవర్తింపఁజేసెను. అతని కుగ్రాయుధుఁడును, వానికి క్షేమ్యుఁడును, క్షేమ్యునకు సువీరుఁడును, సువీరునకు రిపుంజయుఁడును, వానికి బహురథుఁడును జన్మించిరి.హస్తికొడుకగుపురుమీఢునికిసంతతిలేదయ్యె. అజమీఢుఁడు నళినియను భార్యయందు నీలునిఁ గనియె. నీలునికి శాంతియు, శాంతికి సుశాంతియు, సుశాంతికిఁ బురుజుండును,బురుజునకు నర్కుఁడును, నర్కునకు భర్మ్యాశ్వుఁడును, భర్మ్యాశ్వునకు ముద్గలుఁడు యవీనరుఁడు, బృహదిషువు, కాంపిల్యుఁడు, సృంజయుఁడు నను నేవురు సుతులు నుదయించిరి. భర్మ్యాశ్వుఁడు వారినిజూచి "సుతులారా! మీరు నాపంచదేశములను బాలింపఁజాలుదు" రని చెప్పెను. అందుచే వారు పంచాలు రనునామమును ధరించిరి. ముద్గలునివలల బ్రహ్మవంశము ప్రబలెను.దాన జనించినవారుమౌద్గల్యులని పేరొందిరి. దానిని సంగ్రహముగా వివరింతును.వినుము. భర్మ్యాశ్వపుత్రుఁడైన ముద్గలునకు దివోదానుఁ డనుకుమారుఁడును, నహల్య యను కూఁతురునుజనించిరి. అం దహల్యను గౌతముఁడు పెండ్లాడి శతానందునిఁ గాంచెను.శతానందునకు సత్యధృతియుదయించె. వాఁడు ధనుర్వేదవిశారదుఁడయ్యె. అతనికి శరద్వంతుఁ డుదయించె. అతఁ డొకనాఁ డూర్వశిని జూడ రేతస్సు స్ఖలితమై శరస్తంబమునఁ బడియె. దానివలన నొక బాలుఁడు బాలికయుఁ బొడమిరి. శంతనుఁడు మృగయార్థము వనమున సంచరించుచు

వారిఁగని కృపతోఁ దెచ్చి కృపుఁడనియు, గృపియనియుఁ బేరు పెట్టెను. అందుఁ గృపి ద్రోణాచార్యునకుఁ బత్ని యయ్యె. ఇది యిరువదియొకటవ యధ్యాయము.

---

చంద్రవంశానుక్రమము.

ఓరాజేంద్రా! దివోదాసునకు మిత్రాయువును, మిత్రాయువునకుఁ జ్యవనుఁడు, సుదాసుఁడు, సహదేవుఁడు, సోమకుఁడు నను నల్వురు సుతులునుబొడముకురి. వారిలోఁ గనిష్ఠుఁడగు సోమకునకు జంతుఁడు మొదలగు నూఱ్ఱురు జనించిరి. వారిలోఁ బృషదుడు కనిష్ఠుఁడు. వానికి ద్రుపదుఁడును, వానికి ధృష్టద్యుమ్నాది సుతులును, ద్రౌపది యనుసుతయు జన్మించిరి. అందు ధృష్టద్యుమ్నునకు ధృష్టకేతు వుదయించె. వీరు పంచాలురలోఁ జేరిన ముద్గలుని సంతతివారగుటంజేసి పాంచాలురని వాసికెక్కిరి. అజమీఢునకు ఋక్షుఁడనువేఱొక కొమరుఁడుగలఁడు. వానికి సంవరణుఁడును, వానికిఁ దపతి యనుసూర్యపుత్రియందుఁ గురురాజు నుదయించిరి. ఆతనిఁబట్టియె కురుక్షేత్రమను నామము గలిగె. ఆ కురువునకుఁ బరీక్షిత్తు, సుధనువు, జహ్నువు, నిషధుఁడు నను నలువురుపుట్టిరి. వారిలో సుధనువునకు సుహోత్రుఁడును, సుహోత్రునకుఁ జ్యవనుఁడును, వానికిఁ గృతియుఁ, గృతికి ఉపరిచరుఁ డగువసువును, వానికి బృహద్రథుఁడును, కుసుంభుఁడును, మత్స్యుఁడును, ప్రత్యగ్రుఁడును జేదిపుఁడు నను కొమరులును జన్మించిరి. వారిలో బృహద్రథునకుఁ గుశాగ్రుఁడును, వానికి ఋషభుఁడును, వానికిఁ బుష్పవంతుఁడును, పుష్పవంతునకు హితుఁడును, హితునకు జహువును సంభవించిరి.

ఆ బృహద్రథునకు వేఱొకభార్యయందు రెండుశిశుఖండము లుదయించెను. తల్లి వానిని బాఱవైవఁగా జరయను రాక్షసి వానితో నాడుకొనుచు సంధించి "జీవింపు. జీవింపు" మని పల్కనవి బాలుఁడై జీవించి జరాసంధుఁడను నామము దాల్చెను. ఆ జరాసంధునకు సహదేవుఁడును, వానికి సోమాపియు, వానికి శ్రుతశ్రవుఁడును గలిగిరి. కురుపుత్రుఁడైన పరీక్షిత్తునకు సంతానము లేదు. వానితమ్ముఁడగు జహ్నువునకు సురథుఁడును, సురథునకు విదూరథుఁడును, వానికి సార్వభౌముఁడును, వానికి జయత్సేనుఁడును, వానికి రాధికుఁడును, రాధికునకు ద్యుమంతుఁడును, వానికిఁ గ్రోధనుఁడును, గ్రోధనునకు దేవాతిథియు, వానికి ఋక్షుఁడును, ఋక్షునకు దిలీపుఁడును, దిలీపునకుఁ బ్రతీపుఁడును బ్రతీపునకు దేవాపి, శంతనుఁడు, బాహ్లికుఁడు ననుమువ్వురు తనయులు వొడమిరి. వారిలో దేవాపి రాజ్యమొల్లక తపమొనర్ప నడవికేఁగెను. శంతనుఁడు రాజయ్యె. అతఁడే పూర్వజన్మమున మహాభిషుఁ డనుపేరనొప్పె. అతఁ డీజన్మమున వృద్ధులను స్పృశించి వారికి యౌవన మలవడఁజేసి శాంతిని గల్గించి సుఖము విస్తారముగాఁ గూర్చుటంజేసి శంతనుఁడను నామమును సార్థకము చేసికొనియె. శంతనుఁడు రాజ్యమును బాలించుచుండఁగా ద్వాదశవర్షక్షామము సంభవించె. అతఁడు విప్రులనుబిలిచి దాని కారణమడుగ "జ్యేష్ఠుఁడు, భార్యను నగ్నిహోత్రమును స్వీకరింపకుండఁ జిన్నవాఁడు స్వీకరించినఁ బరివేత్తయనఁబడు. నీవట్లొనరించుటంజేసిపరివేత్తవైతివి: ఇంతియ కాక నీవు రాజ్యమునకుఁ దగవు. నీ విప్పుడు మీయన్నకు రాజ్య మొసఁగితి వేని యనావృష్టిదోషంబు తొలంగు" నని

చెప్పిరి. శంతనుఁ డడివిని వనమునకేఁగి యన్నకు నమస్కరించి రాజ్య మేలుకొమ్మ ని ప్రార్థించెను. కాని, యంతకుఁ బూర్వమే శంతనునిమంత్రి యశ్మరాదుఁ డనువాఁడు బ్రాహ్మణులను బిలిచి యడవిలోనున్న దేవాపికిఁ బాషండమత ముపదేశింపుఁ డని పంచెను. వారట్లుచేసిరి. దేవాపిపాషండమతమునాశ్రయించి వేదములనిందించి యా పాపముచే రాజ్యమున కనర్హుఁడయ్యె. అది శంతనుఁడు దెలిసికొని పురమునకు మరలివచ్చె. ఇప్పుడు శంతనుఁడుదోషభాక్కు గానందున వర్షము గురిసె. ఆదేవాపి యోగమాశ్రయించి కలాపమనుగ్రామమున నివసించియుండి కలియుగాంతమున నశించిన చంద్రవంశమును కృతయుగాది యందు మరల విస్తరింపఁజేయును. బాహ్లీకునకు సోమదత్తుఁడును, సోమదత్తునకు భూరియు, భూరిశ్రవుఁడు, శలుఁడనువారు ముగ్గురుదయించిరి. శంతనుఁడుబ్రహ్మశాపవశమున మానుషత్వముదాల్చిన గంగనువరించి భీష్మునిఁగాంచెను. అతఁడు బ్రహ్మజ్ఞాని. అతఁడు ధర్మవిదులలోఁ బ్రధానుఁడు; పరమభాగవతోత్తముఁడు; వీరాగ్రగణ్యుఁడు; పరశురామునిఁగూడ యుద్ధమున నోర్చిన జోదు. అతఁడు మహాపురుషుఁడని తెలియుము. శంతనుఁడు గంగాదేవియంతర్ధానము చెందినపిమ్మటదాశకన్యకయగు సత్యవతిని వరించి చిత్రాంగదవిచిత్రవీర్యు లనునిరువురఁగనియె. వారిలోఁ జిత్రాంగదుఁడు గంధర్వరాజుచే నిహతుఁడయ్యె. ఓ రాజేంద్రా! ఆసత్యవతియందే పరాశరుని తేజంబున నారాయణాంశసంభూతుఁ డగుకృష్ణద్వైపాయనుఁ డుదయించి వేదములను విభజించి వ్యాసుఁడని ప్రఖ్యాతిఁగాంచెను. ఆమహాముని పైలాదు లగు తనశిష్యులనెల్లమాని పుత్త్రుఁడ నైననాకుఁ బరమ

గుహ్యమైన యీభాగవతపురాణ ముపదేశించెను. భీష్ముఁడు విక్రమముచే స్వయంవరమునుండి కాశీరాజుకుమారికలగు నంబికనునంబాలికను గొనివచ్చి విచిత్రవీర్యునకుఁ బెండ్లిచేసెను. అతఁడు మిక్కిలి కామియై సర్వదా వారితో విహరించుచుక్షయ రోగగ్రస్తుఁడై మృతుఁడయ్యె. అంత సత్యవతి యుపదేశమున వ్యాసుఁడు తనసోదరునిభార్యలతో సంగమించియంబికయందు ధృతరాష్ట్రుని, నంబాలికయందుఁ బాండుని, దాసియందువిదురునిఁ బుట్టించెను. అందు ధృతరాష్ట్రునకు గాంధారియందు నూర్వురు తనయులును దుశ్శల యనుకూఁతురును గల్గిరి. వారిలో దుర్యోధనుఁడు జ్యేష్ఠుఁడు. పాండుఁ డరణ్యమున మృగరూపములఁ దాల్చి క్రీడించు చున్నమునిదంపతులలో మునినిజంపి శపింపఁబడి సంతానముగల్గింపననర్హుఁడై యుండఁ గుంతియుతనియనుమతిచొప్పున ధర్మానిలేంద్రుల నుపాసించి వారియనుగ్రహమున ధర్మజభీమార్జునులఁ బడసెను. అనంతరము మాద్రియు నశ్విదేవతల ప్రసాదమువలన నకులసహదేవులను గనియెను. పంచపాండవులకును ద్రౌపదియం దొక్కొకపుత్రుఁడుజన్మించెను. కాని వా రంద అపుత్రకులై భారతయుద్ధాంతమున నశ్వత్థామచే హతులైరి. వారు క్రమముగాఁ బ్రతివింధ్యుఁడనియు, శ్రుతసేనుఁడనియు, శ్రుతకీర్తియనియు, శతానీకుఁడనియుశ్రుతకర్మయనియుఁ బిలువఁ బడిరి. ధర్మరాజునకుఁ బౌరవియను భార్యయందు దేవకుఁడు జన్మించెను. భీమునకు హిడింబయందు ఘటోత్కచుఁడు, గాళి యను భార్యయందు సర్వగతుఁడును గలిగిరి. సహదేవునకు విజయయందు సుహోత్రుండుగలిగె. నకులునకుఁ గరేణుమతియందు నిరమిత్రుఁ డుదయించె. అర్జునున కులూపియం దిరావంతుఁ

డును, చిత్రాంగదయందు బభ్రువాహనుఁడును, సుభద్రయందు నీతండ్రియగు నభిమన్యుఁడును సంభవించిరి. మహాపరాక్రమ శాలియగు నభిమన్యున కుత్తరయందు నీవు జన్మించితివి. నీవు తల్లిగర్భములో నున్నప్పుడు కుటిలుఁడైన యశ్వత్థామయస్త్రాగ్నిచే దహింపఁబడియుఁ గృష్ణుని మహిమంబున బ్రదికితివి.నీకు జనమేజయుఁడు, శ్రుతసేనుఁడు,భీమసేనుఁడు, ఉగ్రసేనుఁడు నను సుతులుసంభవించిరి.వీరిలో జనమేజయుఁడు నీవు తక్షకునివలన మృతిఁగాంచితి వని తెలిసికొని కోపించి సర్పయాగమొనర్చిసకల సర్పములను సంహరించును. పిమ్మట నతఁడు కావషేయుఁబురోహితునిఁగాఁ జేకొని సకలదిశలను జయించి యశ్వమేధము లాచరించును.అతనిసుతుఁడు శతానీకుఁడుయాజ్ఞవల్క్యునివలన వేదములను,కృపాచార్యునివలన నస్త్రవిద్యను, శౌనకునివలననాత్మజ్ఞానమును నభ్యసించును. ఆశతానీకునికి సహస్రానీకుఁడు సంభవించు. వాని కశ్వమేధజుఁడును,వాని కసీమకృష్ణుఁడును, వానికి నిచక్రుఁడును సంభవింతురు.హస్తినపురముగంగానదిచే నష్టముకాఁగా నిచక్రుఁడు కౌశాంబిని రాజధానిఁగాఁ జేసికొని పాలించు. ఆనిచక్రునకు ఉక్తుఁడును, వానికిఁ జిత్రరథుఁడును, వానికి శుచిరథుఁడును,శుచిరథునకు వృష్టిమంతుఁడును, వానికి సుషేణుఁడును,సుషేణునకు సునీథుఁడును, సునీథునకు నృచక్షువును,వానికి సుఖీనలుఁడును,సుఖీనలునకుఁ బరిప్లవుఁడును, వానికి మేధావియు, మేధావికి సునయుఁడును, వానికి నృపంజయుఁడును,వానికూర్వుఁడునువానికి నిమియు, నిమికిబృహద్రథుఁడును వానికి సుదాసుఁడును, సుదాసునకు శతానీకుఁడును, వానికి దుర్దమనుఁడును, దుర్దమనునకు విహీనరుఁడును, వానికి దండ

పాణియు,వానికి నిధియు,నిధికి క్షేమకుఁడును, క్షేమకునకు బ్రహ్మ క్షత్త్రుఁడును సంభవింతురు. వాఁడపుత్త్రకుఁడయి దేవతల యనుగ్రహమున క్షేమకుఁడను సుతునిఁగాంచును; కాని వానితోఁడ వంశమంతరించును. ఇఁక ముందుసంభవించెడి మాగధరాజులను గూర్చి చెప్పెదను వినుము. జరాసంధునకు సహదేవుఁడును వానికి మార్జాలియు,మార్జాలికి శ్రుతశ్రవుఁడును,వానికయుతాయువును, వానికినిరమిత్త్రుఁడును, నిరమిత్త్రునకు సునక్షత్త్రుఁడును, వానికి బృహత్సేనుఁడును, బృహత్సేనునకుఁ గర్మజిత్తును, గర్మజిత్తునకు శ్రుతంజయుఁడును,వానికిశుచియుజన్మింతురు.ఆశుచియే విప్రుఁడగును.ఆశుచికి క్షేముఁడును, క్షేమునకు సువ్రతుఁడును, సువ్రతునకుధర్మనేత్త్రుఁడును,ధర్మనేత్త్రునకుదృఢసేనుఁడును, వానికి సుమతియు, సుమతికి సుబలుఁడును, సుబలునకు సునీథుఁడును సునీథునకు సత్యజిత్తును,సత్యజిత్తునకు విశ్వజిత్తును, వానికిఁబురంజయుఁడును బ్రభవింతురు. వీరు బార్హద్రథులని వాసిగాంతురు. వీరివంశ మింకొక వేయువత్సరముల పర్యంతమును నిలిచి తరువాత నాశన మందును. ఇది యిరువదిరెండవ యధ్యాయము.

---

పూరునిపుత్త్రుండైన అనునివంశము; యదువంశవర్ణనము.

ఓరాజేంద్రా! యయాతి చతుర్థ సుతుఁ డగుననునకు సభానరుఁడు, చక్షువు, పరోక్షుఁ డనుమువ్వురు పొడమిరి. వారిలో సభానరునకుఁ గాలనాభుఁడును, వానికి సృంజయుఁడును,సృంజయునకు జనమేజయుఁడును, వానికి మహాశాలుఁడును, వానికి మహామనుఁడును, వానికుశీనరుఁడు తితిక్షువునను నిరువురుపుత్త్రులునుజన్మించిరి.అందుశీనరునకు శిబి, వనుఁడు,క్రిమి, దర్పుఁడు

ననునలువురుగల్గిరి. వారిలోశిబికి వృషదర్భుఁడు,సువీరుఁడు, మద్రుఁడు, కేకయుఁడుననునల్వురు సుతులుగల్గిరి.ఉశీనరుని సోదరుఁడగు తితిక్షువునకు వృషద్రథుఁడును, వానికి హేముఁడును, హేమునకు సుతపుఁడును,సుతపునకు బలియు,వానికంగుఁడు, వంగుఁడు కళింగుఁడు, సింహుఁడు, పుండ్రుఁడు ఆంధ్రుఁడుననునార్వురును జనించిరి. వారిలోనంగునకు ఖనపానుఁడును, ఖనపానునకుహావిరథుఁడును, వానికి ధర్మరథుఁడు,వానికిఁ జిత్రరథుఁడును సంభవించిరి.ఆచిత్రరథునకేరోమపాదుఁ డనునామాంతరముగలదు. అతనికి మిత్రుఁ డగుదశరథుఁడు శాంతయనుకూఁతు సంతతిగా నిచ్చెను. రోమపాదుఁ డొకప్పుడు ద్వాదశవర్షక్షామము పట్టినపుడు విభాండకసుతుఁ డగునతనిఁ దెప్పించుటకు గణికల నంపఁగా వారుసంగీతముచేతనునృత్యముచేతనువాద్యవిశేషములచేతను నాలింగనాదులచేతనునతనివశ్యునిఁగాఁ జేసికొనివచ్చిరి. అతఁడే శాంతను వరించెను. ఆఋశ్యశృంగుని యనుగ్రహమున రోమపాదుఁడు పుత్రకామేష్టిచేసి సంతానమునొందెను. ఆ ఋశ్యశృంగుని యనుగ్రహమున దశరథుఁడుగూడఁ బుత్రులను బడసెను. ఆరోమపాదునకుఁ జతురంగుఁడు, వానికిఁ బృథులాక్షుఁడు,వానికిబృహద్రథుఁడు,బృహత్కర్ముఁడు,బృహద్భానుఁడను ముప్వురును జన్మించిరి. వారిలో బృహద్రథునకు బృహన్మనుఁడును, బృహన్మనునకు జయద్రథుఁడును, వానికి సంభూతియందు విజయుఁడును,విజయునకు ధృతియు,ధృతికి ధృతవ్రతుఁడును,వానికి సత్యకర్ముఁడును,సత్యకర్మునకు రథుఁడునుదయించిరి. ఆరథుఁడనపత్యుఁడై కుంతీదేవి చిన్నతనమున సూర్యునుపాసించి కొడుకునుగనిభయపడిపెట్టెలోఁబెట్టినదిలోవిడువఁగాఁ బ్రవాహ

వశమునఁగొట్టుకొనివచ్చి యొడ్డుచేరి బ్రతికియున్న యాబా లునిఁ గుమారునిగాఁ జేకొనియె. అతఁడుకర్ణుఁడనం బరఁగె. అత నికి వృషసేనుఁడు సంభవించె. ఓరాజా ! ఇఁక యయాతి తృతీయపుత్రుఁ డగుద్రుహ్యునిసంతతిని వినుము. ద్రుహ్యునకు బభ్రుఁడును, వానికి సేతుఁడును, సేతున కారబ్ధుఁడును, వానికి గాంధారుఁడును గాంధారునకు ఘర్మ్ముఁడును, ఘర్మ్మునకు ఘృతుఁ డును, ఘృతునకుదుర్మ్మదుఁడును, దుర్మ్మదునకుఁ బ్రచేతసుఁడును, వానికి నూర్వురు సుతులును జన్మించిరి. వారు త్తరదిక్కు నాశ్ర యించి మ్లేచ్ఛాధిపతు లైరి. యయాతి ద్వితీయపుత్రుఁ డగు తుర్వసునకు వహ్నియు, వహ్నికి భార్గుఁడును, భార్గునకు భాను మంతుఁడును, వానికి సుభానుఁడును, సుభానునకుఁ గరంధముఁ డును, గరంధమునకు మరుత్తును సంభవించిరి. అతఁడపుత్రకుఁడై పూరువంశజుఁ డయిన దుష్యంతునిఁ బుత్రునిఁగా స్వీకరించెను. అయిన నతఁడు రాజ్యకాముకుఁడై తుదకుఁ బూరువంశ మునకే చెందెను. ఓరాజా ! యయాతికి జ్యేష్ఠపుత్రుఁ డగు యదువు వంశమును వర్ణించెద వినుము. అది పుణ్యదాయక మైనది. విన్ననరుల పాపములను హరించును. యదువంశ మున భగవంతుడు కృష్ణుఁడై యవతరించుటంజేసి యాపుణ్య వంశమును గూర్చి విన్నవారు సకలపాపవిముక్తు లగుదురు. ఓరాజా ! యదువునకు సహస్రజిత్తును, క్రోష్టువు, నలుఁడు, రిపుఁడు ననునల్వురుదయించిరి. అందు సహస్రజిత్తునకు శత జిత్తును, వానికి మహాహయుఁడు, వేణుహయుఁడు, హేహయుఁడు నను ముప్వురు సుతులుగల్గిరి. వారిలో హేహయునకు ధర్మ్ముఁడును ధర్మ్మునకు నేత్రుఁడును గల్గిరి. ఆనేత్రునకుఁ గుంతియను నామాం

తరముగలదు. అతనికి సోహంజియు,సోహంజికి మహిష్మంతుఁడు, వానికి భద్రసేనకుఁడు, భద్రసేనునకుదుర్మద ధనకులనువిరువురుఁ గల్గిరి.వారిలో ధనకునకుఁ గృతవీర్యుఁడు,గృతాగ్నియుఁ, గృతవర్మయుఁ, గృతౌజుఁడు నను తనయులును సంభవించిరి.వారిలోఁ గృతవీర్యున కర్జునుఁడు జన్మించె. అతఁడు సప్తద్వీపాధిపతియై హర్యంశ సంభూతుఁ డగుదత్తాత్రేయునివలన నణిమాది సిద్ధులను బొందెను. ఓరాజా! యాగములను, దానములను, దపమునను; యోగముగను, వీర్యమునను,జయాదులను, నర్జునుని సాటి చెందురాజు వే ఱొకఁడు లేఁడు. అప్రతిహతబలుఁడయినకార్త వీర్యుఁడుప్రతిదినమును దత్తాత్రేయునిస్మరించు కొనుచు నెనుబది యైదు వేలవత్సరములురాజ్య మేలెను. ఆదత్తాత్రేయుని స్మరణమువలన సకలసంపదలను దులఁదూఁగుచు నింద్రియసుఖములను బూర్ణముగా ననుభవించెను. అతనికి వేగురుసుతులు జన్మించిరి. కాని వారిలో నైదుగురుదప్పఁ దక్కినవారందఱును యుద్ధమున బరశురామునిచే హతులైరి. అందు జీవించినవారు జయధ్వజుఁడు, శూరసేనుఁడు, వృషణుఁడు,మధుఁడు, ఊర్జితుఁడునను నామములుగలవారు. అందు జయధ్వజునకుఁ దాళజంఘుఁడును, వానికి నూర్వురుకొమరులును బ్రభవించిరి. వారందఱును నౌర్వుఁడనుముని తేజమున నశించిరి. వారిలో వీతిహోత్రుఁ డనువానికి మధువును, మధువునకు వృష్ణి మొదలగు నూర్వురుసుతులును జన్మించిరి. వారు మాధవులనియు,వృష్ణులనియు,యాదవులనియు వాసిఁగాంచిరి.యదుసుతుఁడు క్రోష్టు వనువానికి శ్వాహితుఁడును శ్వాహితున కురుశంకుఁడును,వానికిఁ జిత్రరథుఁడును, వానికి శశిబిందువును బుట్టిరి.ఆశశిబిందుఁడుమహాయోగియై గుణాధిక

డై యాయా *జాతులందుఁ బ్రసిద్ధము లగువస్తువులను బొంది చక్రవర్తియై దిగ్విజేతయై ప్రకాశించెను. అతనికిఁ బదివేవురు భార్యలు గలరు. వారియం దామహాయశునకుఁ బదివేలలక్షల కొమరులు సంభవించిరి. పృథుశ్రవుఁడు మొదలగువా రార్వురు ప్రధానులు. వారిలో ధర్ముఁ డనువానికుశనుఁడుదయించె. అతఁడు నూఱశ్వమేధముల నొనర్చెను. వానికి రుచకుఁడును, వానికిఁ బురుజిత్తు, రుక్ముఁడు, రుక్మేషుఁడు, పృథుఁడు జ్యామఘుఁడు నను నేవురను బుట్టిరి. వారిలో జ్యామఘునకు శైబ్యయను భార్య గలదు. అతనికామెయందు సంతానముగలుగ లేదు. భార్యకు భయపడి వేఱొక దానిఁ జేపట్టఁడయ్యె. ఇట్లుండనతఁ డొకప్పుడు శత్రువులను జయించివారియింటనుండియొక కన్యకను దెచ్చియుప భార్యగా వరించి రథముపై గూర్చుండఁబెట్టి తెచ్చుచుండెను. శైబ్య యాకన్యనుజూచి కోపముతో "ఓవంచకా! నాస్థానమున దీని నెట్లుచేర్చితి" వని పలికెను. అదివిని జ్యామఘుఁడు భయపడి "సుందరీ! ఇది నీకుఁగోడలుగానుండు" ననిన "గొడ్రాలనగు నాకుఁ గోడలగు టెట్లు?" ట్లని ప్రశ్నించెను. అదివిని రాజు "ప్రస్తుత మున లేకపోయినను ముందునీకుఁబుత్త్రుఁడు జనింపఁగలఁడనఁగా

---

* దీనికి మూలను "చతుర్దశ మహారత్న" అని యున్నది. అనఁగా గజములు, హయములు, రథములు, అస్త్రములు, బాణములు, నిధులు, మాలికలు వస్త్రములు, విద్రుమములు, శక్తులు, పాశములు, మణులు, ఛత్రములు, విమానములు అను నీ పదునాల్గువస్తువులందును శ్రేష్ఠములగునవికలవాఁడుచతుర్దశమహారత్నుఁ డని పిలువఁబడును. ఈయర్థమే మార్కండేయపురాణమునఁజూపఁబడినది. "గజవాజిరథాస్త్రేషు నిధిమాలాంబరద్రుమాః । శక్తిపాశమణి చ్ఛత్రవిమానాని చతుర్దశ"

నామె సంతసించెను. అంతఁ జిరకాలమునుండి యతనిచే నారా
ధితులగు విశ్వేదేవులును బితరులును నతనిఁగరుణించి పుత్త్రునను
గ్రహించిరి. కొంతకాలమునకు శైబ్య గర్భముదాల్చికుమారునిఁ
గనియె. అతఁడు విదర్భుఁ డనునామమునుధరించి యాకన్యను
వరించెను. ఇది యిరువదిమూడవ యధ్యాయము.

---

## వసుదేవుని వంశక్రమము.

ఓరాజా ! ఆవిదర్భున కాభామయందుఁగుశుఁడు, క్రథుఁడు,
రోమపాదుఁడు నను మువ్వురు సుతులుగల్గిరి. వారిలో రోమ
పాదునకుబభ్రువు, బభ్రువునకుఁ గ్రతువు, వానికిఁగుశికుఁడు, వానికిఁ
జేదియు, వానికిఁ జేద్యుఁడు మొదలగువారునుసంభవించిరి. విద
ర్భుని కొడుకగు క్రథునకుఁ గుంతియు, వానికి వృష్ణియు, వానికి
నిర్వృతియు, నిర్వృతికిదాశార్హుఁడును, వానికి వ్యోముఁడును.
వ్యోమునకు జీమూతుఁడును, జీమూతునకువికృతియు, వికృతికిఁ
దీవ్రరథుఁడును,వానికి నవరథుఁడును, నవరథునకుదశరథుఁడును,
వానికి శకునియు, శకునికిఁ గరంభుఁడును, గరంభునకు దేవ
రాతుఁడును, దేవరాతునకు దేవక్షత్త్రుఁడును. వానికి మధువును.
వానికిఁ గురువకుఁడును, గురువకునికిఁ బురుహోత్త్రుఁడును.బురు
హోత్త్రునికి సాత్వతుఁడును, సాత్వతునకు భజమానుఁడు, భజి,
దీప్తుఁడు. వృష్ణి, దేవావృధుఁడు, అంధకుఁడు, మహాభోజుఁడు
నను నేడ్వురును జన్మించిరి. వారిలో భజమానున కొకభార్య
యందు నిమ్రోచియుఁ, గంకణుఁడు,వృష్ణియు నను మువ్వురును,
వేఱొకభార్యయందు శతజిత్తు, సహస్రజిత్తు, అయుతజిత్తు
నను మువ్వురును సంభవించిరి. దేవావృధుఁ డనువానికి బభ్రువను

సుతుఁడు జన్మించె. ఆజనకపుత్త్రులమహిమను దెలుపుచునార్యులు శ్లోకములనుబఠింతురు. వానియర్థంబు దెలిపెదను వినుము. దేవా పృథు బభ్రువుల సుగుణసముదయముదూరమునం దెట్లు వినుచున్నామో, యట్లెసమీపమునకువచ్చి చూచుచున్నాము. వారిని బోలినవా రెచ్చటను లేరు. వారివంశమునం బుట్టినవారు బదునాల్గువేలయఱువదియేవురు. వారందఱును దేవావృథు బభ్రువుల మహిమవలన ముక్తిఁ జెందిరి. సాత్వతి కొడు కగు మహాభోజుఁ డతిధర్మాత్ముఁడు. అతనికి భోజు లనునృపులు పుట్టిరి. వృష్ణికి సుమిత్త్రయుధాజిత్తులను వా రుదయించిరి. వారిలో యుధాజిత్తునకు శినియు, ననమిత్త్రుఁడు ననువార లుదయించిరి. వారిలో ననమిత్త్రునకు నిఘ్నుఁడును, నిఘ్నునకు సత్రాజిత్తు, ప్రసేనుఁ డనువారును గల్గిరి. అనమిత్త్రునకు శినియను వేఱొక సుతుఁడు గలఁడు. ఆశినికి సత్యకుఁడను, వానికి యుయుధానుఁ డును, వానికి జయుఁడును, జయునకుఁ గుణియు వానికి యుగంధరుఁడును బ్రభవించిరి. అనమిత్త్రునకుఁ బృశ్నియను మఱి యొక తనయుఁడు గలఁడు. ఆపృశ్నికి గాందిని యను భార్య యందు శ్వఫల్గుఁడు, చిత్రకుఁడు ననునిరువురు సుతులు గల్గిరి. వారిలో శ్వఫల్గునకు అక్రూరుఁడు, అసంగుఁడు, సారమేయుఁడు, మృదురుఁడు, మృదువచ్ఛివుఁడు వర్ధదృక్కు, ధృష్టవర్ముఁడు, క్షత్త్రోపేక్షుఁడు, అరిమర్దనుఁడు, శత్రుఘ్నుఁడు, గంధమాదుఁడు, ప్రతిబాహుఁడు ననుపన్నిద్దఱుతనయులు సంభవించిరి. వారలకు సుసారయను నొకతోఁబుట్టువుకలదు. అందక్రూరునకు దేవవంతుఁడు, నుపదేవుఁడు ననుసుతు లిర్వురు సంభవించిరి. ఉరుశంకుని కుమారుఁ డగుచిత్రరథునకు శశిబిం

దుఁడుగాక పృథువు, విదూరథుఁడు మొదలగువారు పెక్కురు
గలరు. సాత్వతునిసుతుఁడగువృష్ణికిఁగుకురుఁడు, భజమానుఁడు,
శుచి, కంబలుఁడు నను వారుదయించిరి. వారిలోఁ గుకురునకుఁ
విలోముఁడును,విలోమునికిఁ గపోతరోముఁడును జన్మించిరి. ఆతని
నికిఁ దుంబురుఁడు హితుఁడయ్యె. సాత్వతుని సుతుఁ డగునంధకు
నకు దుందుభియు, వానికి దరిద్యోతుఁడును, దరిద్యోతునకుఁ
బునర్వసువు, నతని కాహుకుఁ డనుసుతుఁడును, నాహుకి యను
సుతయు నుద్భవించిరి. ఆహుకునకు దేవకుఁడు నుగ్రసేనుఁడు
నను తనయులు సంభవించిరి. అందు దేవకునకు దేవవంతుఁడు,
ఉపదేవుఁడు, సుదేవుఁడు, దేవవర్ధనుఁడు ననునలువురుసుతులు
గల్గిరి. వారికి ధృతిదేవయు, శాంతిదేవయు, నుపదేవయు,
శ్రీదేవయు, దేవరక్షితయు,సహదేవయు, దేవకియు నను నేడ్వురు
తోఁబుట్టువులు గలరు. వారిని వసుదేవుఁడు పరిగ్రహించె. ఉగ్ర
సేనునకుఁ గంసుఁడు, సునాముఁడు న్యగ్రోధుఁడు, కహ్వుఁడు,
శంకుఁడు, సుభువు, రాష్ట్రపాలుఁడు, విసృష్టుఁడు, తుష్టిమంతుఁడు
నను కొడుకులును, కంసయు, కంసవతియు, కంకయు, శూర
భువను, రాష్ట్రపాలికయు ననుకూఁతులును జన్మించిరి. వారిని
వసుదేవుని సోదరులు దేవభాగాదులు వరించిరి. చిత్రరథుని
తనూజుఁడగు విదూరథునకు, శూరుండును, శూరునకు ధ్వజ
మానుఁడును, వానికి శిమియు శిమికి స్వయంభోజుఁడును,వానికి
హృదీకుఁడు, వానికి దేవబాహుఁడు, శతధనువు, కృతవర్మ
యనుముప్వురు తనయులు నుదయించిరి. దేవమీఢుని సుతుఁ
డగుశూరునకు మారిష యనుభార్యయందు వసుదేవుండును,
దేవభాగుండును, దేవశ్రవుండును,నానకుండును,సృంజయుండును

శ్యామకుండును, గంకుడును. నసీకుండును, వత్సకుండును, వృకుండును నను పదుగురు పుత్రులును; బృథయు,శ్రుత దేవతయు శ్రుతకీర్తియు, శ్రుత శ్రవసయు, రాజాధి దేవియు నను కూఁతులేవురును బుట్టిరి. వారిలోఁ వసుదేవుఁడు పుట్టుసమయమున నానకములును, దుందుభులును మింటమ్రోసినవి. కావుననే యతఁ డానకదుందుభియని పిలువంబడు. వసుదేవుని జనకుఁడగు శూరుఁడు, తనచెలికాఁడగుకుంతిభోజుకుఁ డపుత్రకుఁడైనందున నతనికిఁ బృథను దత్తనుగాఁజేసె. కుంతిభోజున కీయ్యబడుట చేతనే పృథ కుంతియనునామమునొందె. ఆకుంతిదూర్వాసునిఁ బరిచరించి యతనియనుగ్రహమున దేవహూతి యనువిద్యను బొంది దానిఁబరీక్షించుటకై సూర్యునిఁబిలిచిన నతండు ప్రత్యక్షమయ్యె. ఆమె యతనిఁజూచి "ఓదేవా ! నేను మంత్రపరీక్షార్థము పిలిచితిని; కాని వేఱొండుగాదు. నన్నుక్షమించి మరలి పొమ్ము" అని ప్రార్థించిన సూర్యుఁడిట్లనియె "ఓసుందరీ ! దేవ సందర్శనమెప్పుడును వ్యర్థముకాదు. కావున దేవతుల్యుఁ డగు కుమారుని నీకుఁ గలిగించెదను. అయిననీకన్యాత్వము చెడకుండ వరమొసంగెద" ననిపలికి యామెకు గర్భమునుగల్గించి వెడలి పోయెను. తోడనే కుంతికి రెండవసూర్యునివలెఁబొల్చు నొక తనయుఁడు సంభవించె. అంతఁగుంతి లోకాపవాదమునకుజంకి యాసుతుని నదిలో విడిచెను. ఆకుంతినేనీప్రపితామహుఁడగు పాండురాజువ్వాహమయ్యె. కుంతిసోదరియగుశ్రుతదేవనుగరూష కుమారుఁడు వృద్ధశర్మచేపట్టె. మునిశాపమువలననాదంపతులకు దంతవక్త్రుఁడనుదైత్యుఁడుదయించె. దానిసోదరియగు శ్రుతకీర్తిని గేకయుండు వరించి దానియందు సంతర్దనుఁడు మొద

లగు నేవురుతనయులను గనియె. వారు కేకయునకుఁ బుట్టినవా రగుటచేఁ గైకయు లని పిలువఁబడిరి. రాజాధిదేవిని జయత్సేనుఁడు పెండ్లియాడి విందానువిందులను గనియె. దమఘోషుఁడనుచేదిరాజు శ్రుతశ్రవసను బరిణయమై దానియందు శిశుపాలునిఁగనియె. ఆశిశుపాలుని వృత్తాంతము నీకిదివఱకే తెలియఁ జెప్పితిని. వసుదేవుని సోదరుఁడగు దేవభాగునకుఁ గంసయందుఁ జిత్రకేతు బృహద్బలులను పుత్త్రులుసంభవించిరి. అట్లే దేవశ్రవునకుఁ గంసవతియందు సువీరుండు నిషుమంతుఁడును జన్మించిరి. వాని సోదరుఁడయినకంకునకుఁ గంకయను భార్యయందు, బకుండును, సత్యజిత్తును, బురుజిత్తును బ్రభవించిరి. వానిసోదరుఁడగు సృంజయునకు రాష్ట్రపాలికయందు వృష దుర్మర్షణాదులు జనించిరి. వాని సహజుఁడయినశ్యామకునకు శూరభు వనుభార్యయందు హరికేశుఁడు హిరణ్యాక్షుఁడును జన్మించిరి.వత్సకు మిత్రకేశియను నచ్చరయందు బకాదులు సంభవించిరి. వానిసోదరుఁడగు వృకునకు దూర్వాక్షి యనునాతియందుఁ దక్ష పుష్కరస్వాదులు జన్మించిరి. వాని యనుజుఁడగు ననీకుఁడు సుధామయందు సుమిత్రుఁడు, అనీకపాలుఁడు మొదలగు వారినిఁగనియె. వానితమ్ముఁడగునానకుఁ డుకర్ణికయనుదానియందుబుతధాముని జయునిఁ బుట్టించె. ఓరాజా! వసుదేవునికిఁ బౌరవి, రోహిణి, భద్ర, మదిర, రోచన, యిళ, దేవకి యనునేడ్వురు భార్యలు గలరు. వారిలో రోహిణియందు బలరాముండును, గదుండును, సారణుండును, దుర్మదుండును, విపులుండును, ధ్రువుండును, కృపుండును సంభవించిరి. పౌరవియందు సుభద్రుఁడును, భద్రబాహుండును, దుర్మదుండును, భద్రుండును, భూతాదులగు

మతికొందఱును బ్రభవించిరి. మదిరయందు నందుఁడును, నుప నందుఁడును, గృతకుఁడును, శూరుఁడు మొదలగువారును జన్మించిరి. భద్రకు వేశియనువాఁడుదయించె. రోచనయందుహస్తుఁడు, హేమాంగదుఁడు మొదలగువారు సంభవించిరి. ఇళయం దురువల్కాద్యులు ప్రభవించిరి. ఇంతియకాక, వసుదేవునకు ధృతదేవియనుభార్యయందుఁ ద్రిపృష్ఠుఁడును, శాంతిదేవయందుఁ బ్రశ్రముఁడు మొదలగువారును, ఉపదేవయందుఁ గల్పవర్షాదు లగు పదుగురు సుతులును, శ్రీదేవయందు వసుఁడు హంసుఁడు మొదలగు నార్వురుకుమారులును, దేవరక్షితయందు గదా దులగుతొమ్మండ్రుసుతులును, సహదేవయందుశ్రుతముఖాదులగు నెనమండ్రు తనయులును, దేవకియందుఁ గీర్తిమంతుఁడును సుషేణుఁడును, భద్రసేనుండును, ఋజువును, సమదనుండును, భద్రుండును, సంకర్షణుండును బుట్టిరి. వీరలేకాక యెనిమి కా దేవకియందు నారాయణావతారమగుకృష్ణుఁడును, మహాభాగ యగు సుభద్రయును జన్మించిరి. ఆసుభద్రయే నీకుఁబితామహి యయ్యె. ఓరాజా! ఎప్పుడు లోకమున ధర్మమునశించి యధర్మ మభివృద్ధిగాంచునో, యప్పుడెల్ల భగవంతుఁ డవతరించును. కావున నీయుగమున దుష్టశిక్షణమొనర్చుటకై భగవంతుఁడు కృష్ణుఁడై యవతరించె. ఆపరమేశ్వరుఁ డిట్లవతరించుటకును, దుష్టశిక్షణాదికర్మముల నొనర్చుటకును స్వీయసంకల్పముతప్ప వేఱొకకారణములేదు. భగవంతుడు జగమునకు సృష్టిస్థితిలయ ములు గలిగించు.అతఁడట్టి వ్యాపారములొనర్చుట జీవుల నను గ్రహించుటకేగాని వేఱుకాదు.అదియెట్లందువేని వినుము. పర మేశ్వరుఁడు లోకమునుఁబాలింప రామకృష్ణాద్యవతారములను

దాల్పగా జీవులు నిత్యమును వారిసందర్శనాదులనందిస్వర్గాది సుఖములనుగాక కేవలము మోక్షము నే పొందుదురు. కావునభగవంతుని చేష్టితములు జీవుల ననుగ్రహించుట కే; కాని స్వప్రయోజనార్థము కాదు. ఈయుగమున రాజాధములు పెక్కురు ప్రబలి రాక్షసతుల్యులై సేనాధిపతులై భూమికిభారముగల్గింప దానిఁ దొలంగించుటకై పరమేశ్వరుఁ డవతరించెను. బ్రహ్మాదుల కయినను దురూహములగు చేష్టితములనొనర్చుకృష్ణుఁడు బల రామసహితుఁడై పూతనా శిశుపాలాదులను సంహరించెను. కలియుగమున సంభవించు తనభక్తుల ననుగ్రహించుటకు దుఃఖహరమును బుణ్యావహమునగుకీర్తిని విస్తరింపఁ జేసెను. అతని కీర్తి కర్ణ పేయమై పుణ్యతీర్థమునలె నెల్లెడల నొప్పుచున్నది. భక్తులు తనుకర్ణములనునంజలులచే గ్రహించి స్పృశించినచో వారికర్మవాసన లన్నియు వెంటనే నశించును. ఆకృష్ణుఁడు భోజాంధక మధు శూరసేనదాశార్హులనువారి కే కాక కురుదేశస్థులకుఁగూడ నాశ్చర్యమొదవించు కర్మముల నొనర్చుచు, మందహాసముచేతను, గడకంటి చూపులచేతను, మృదువచనముల చేతను, గమనవిలాసములచేతను, మనోహరమగు నాకారము చేతను మానవలోకమును సంతసింపఁ జేసెను. మకరకుండలములచే సుందరములగు శ్రవణములచేతను, కపోలములచేతను, మిక్కిలి రమణీయమై, మందహాసశోభితమై, యున్నయాకృష్ణుని వదనారవిందమును నిత్యము సందర్శించియుండియు స్త్రీలును బురుషులును దనివిచెందక కన్నులకు నిమేషముఁగల్గించిన నిమిని మిక్కిలి నిందించుచుందురు. ఓరాజేంద్రా! ఆకృష్ణుఁడు లీలామానుషవిగ్రహమునుదాల్చి ప్రేపల్లెయందుఁ బెరుగుచుఁ

బూతనాదు లగువెక్కండ్రదుష్టులను సంహరించి వేలకొలఁది స్త్రీలనుబెండ్లాడి వారిలో నొక్కొక్కతయందు నూర్వురేసి తనయులను బడసి తన యాజ్ఞారూపమగువేదమును జనులందుఁ బ్రవర్తింపఁజేసి యందఱవలనను బూజలను గ్రహించె. ఇంతియ కాక యతఁడు కురుపాండవులకుసంభవించిన సమరమున దుష్ట పార్థివులను, వారిసైన్యములనుగూల్చి భూభారమును తగ్గించి యర్జునునకు జయమిచ్చి, యుద్ధవునకుఁ దత్త్వముపదేశించి వైకుంఠమున కరిగెను. ఇది యిరువదినాల్గవ యధ్యాయము.

ఇది శ్రీమత్కేతవరపు వేంకటశాస్త్రిప్రణీతమైన యాంధ్రవచన

భాగవతమున నవమస్కంధము సమాప్తము.

శ్రీకృష్ణార్పణ మస్తు.







## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA115B159 |
| పుస్తకం పేరు | మద్భాగవతము 05 |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 301 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | II,IV,1360,1376A,1394,1410,1474B, |
| లేని పేజీలు | 1 TO 1358 |
| తయారు చేసినది | Habeeba |
| పేజీలు విడదీసినది | Navya |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |

BLANK PAGES=1492A,1526A,1556B,1558B,1562A